# జిడ్డు కృష్ణమూర్తి

# నాకు తెలుసా?



నీలంరాజు లక్ష్మీప్రసాద్

**జిడ్డు కృష్ణమూర్తి నాకు తెలుసా?**



సంవత్సరం : 2013



కవర్‌పేజి : అన్వర్

**వెల : 150/-**

*సోల్ డిస్ట్రిబ్యూటర్స్ :*
**నవోదయ బుక్‌హౌస్**
ఆర్యసమాజ్ మందిర్ ఎదురు వీధి,
కాచిగూడ, హైదరాబాద్–27.
ఫోను : 24652337

అడ్రసు :
**నీలంరాజు లక్ష్మీప్రసాద్**
91/3 ఆర్.టి., విజయనగర్ కాలనీ,
హైదరాబాద్–500 057.
ఫోన్ : 23346115

ముద్రణ :
**అనుపమ ప్రింటర్స్**
గ్రీన్‌వ్యూ, 126, శాంతినగర్,
హైదరాబాద్–28.
ఫోన్ : 23391364, 23304194

# ముందుమాట

శ్రీ జిడ్డు కృష్ణమూర్తి ఎవరనేది తెలియకపోయినా, నష్టమేమీలేదు. కానీ ఆయన ఏమి చెప్తున్నాడో తెలుసుకోకపోతే, మన జీవితంలో చాలా కోల్పోతాం.

'తెలిసిన మేరకు' అనే భాగంలో, పలు పత్రికల్లో, ప్రచురణల్లో, నేను 1979 నుండి 2012 వరకూ, 'కృ'ను గురించి రాసిన వ్యాసాలు పొందుపరిచాను. వీటి ద్వారా ఆయన సందేశం తెలియజేశాను.

'జిడ్డు కృష్ణమూర్తిగారిని అర్థంచేసుకోగలిగిన వారు, ఆయన పుస్తకాలను ఇంగ్లీష్‌లోనే చదువుకుంటారు. ఆయన్ని తెనుగులోకి అనువదించి మీరు సాధించిందేమిటి?' అనే వారున్నారు. కానీ ఇంగ్లీష్‌లో నిష్ణాతులైనవారు, కృష్ణమూర్తిని చాలావరకు అర్థం చేసుకోగలిగిన వారు కూడా, నా తెనుగు అనువాదాలు, వ్యాసాలు చదివి, "మాతృభాషలో చదివినప్పుడు ఆ టీచింగ్ మరింత ఆత్మీయంగా, మరింత అవగాహన కలిగించేదిగా తోచిందండీ. కృష్ణమూర్తి తెనుగులో బోధించివుంటే, ఇలానే వుండేదేమో! పొద్దు కుంకేవేళ ఏ గ్రామంలోనో, నులకమంచం మీద కూచొని ఇలాగే బోధపర్చేవాడేమోననే భ్రమ కలిగేదండీ' అన్నవారున్నారు.

ఈ అనినవారికి నన్ను పొగడాల్సిన అవసరంలేదు. నేనేమీ వారికివ్వగలిగిలేను – ఈ కృష్ణమూర్తి అవగాహన తప్ప. కాబట్టి ముఖస్తుతి అయి వుండదు. కానీ ఇది నిజమే అయినట్లయితే, తెనుగువారికి ఈ పుస్తకం ద్వారా నే చేసే సేవకన్నా మరో సేవ వుండదు.

నీలంరాజు లక్ష్మీప్రసాద్

# కృతజ్ఞతలు

చిన్న ప్రింటు మీద దృష్టిసరిగా ఆనని ఈ వయస్సులో, కృష్ణమూర్తి టీచింగ్ అభిమాని అయిన శ్రీ మోచర్ల పార్థసారథి, ఈ పుస్తకం ప్రూఫ్ రీడింగ్ చేయడానికి సంతోషంగా అంగీకరించినందుకు నా కృతజ్ఞతలు. కృష్ణమూర్తిని అర్థంచేసుకున్నవారే ఈ పనిచేయగలరు.

కృష్ణమూర్తి పుస్తకం తయారుచేస్తున్నానంటే, శ్రీ పిడూరి రాజశేఖర్ (రిషి వాలీ) సలహా సంప్రదింపులు లేకుండా వుండవు; శ్రీ రాజశేఖర్‌కు కృతజ్ఞతలు.

పలు పత్రికల నుండి నా వ్యాసాలు తీసుకొని ఈ పుస్తకాన్ని ముద్రించాను. వారందరికీ, శ్రీ జిడ్డు కృష్ణమూర్తి సెంటర్, హైదరాబాద్ వారి సౌజన్యానికీ కృతజ్ఞతలు.

నా వద్దనున్న కృష్ణమూర్తి ఫోటోల సంచయం నుండి, ఎవిలిన్‌బ్లా, ఆసిత్ చంద్ మాల్ పుస్తకాల నుండి తీసినవి కానీ, చిన్న సైజులో, ఈ పుస్తకంలో చేర్చినందుకు, ఆ ఫోటోగ్రాఫర్లకందరికీ కృతజ్ఞుణ్ణి.

పుస్తకం కూర్పులోనూ, కవర్‌పేజి డిజైనింగులోనూ, ఆర్టిస్టు అన్వర్ హస్తాన్ని పాఠకులు గ్రహించే వుంటారు. అన్వర్‌కు కృతజ్ఞతలు.

పుస్తకాన్ని చక్కగా ముద్రించిన అనుపమ ప్రింటర్స్ వారికి కృతజ్ఞుణ్ణి.

**రచయిత**

# అంకితం

నా జీవితంలో జిడ్డు కృష్ణమూర్తిగారు
తటస్థపడడం గొప్ప అదృష్టం. ప్రేమ కానుకగా
ఈ పుస్తకాన్ని ఆయనకు అంకితమిస్తున్నాను.

*నీలంరాజు లక్ష్మీప్రసాద్*

# విషయసూచిక

# జిడ్డు కృష్ణమూర్తి నాకు తెలుసా?

శ్రీ జిడ్డు కృష్ణమూర్తిగారితో మీ పరిచయం గురించి వ్రాయమని అడిగినప్పుడు ఒకటి రెండుసార్లు వాయిదా వేశాను. 'కృష్ణమూర్తి తత్వాన్ని గురించి రెండు మూడు దశాబ్దాలుగా ఎంతో రాసినవాడికి ఈ సంకోచమేమిటి?' అని ఎవరికైనా అనిపించవచ్చు. కానీ ఆయనతో స్వయంగా నీకున్న పరిచయం తెలియజేయమనేసరికి, కాగితం మీద కలంపెడితే ముందరికి సాగడం కష్టమైపోయింది.

కృష్ణమూర్తి ఒక గొప్ప 'మిస్టరీ', ఓ నిగూఢ రహస్యం. ఆయన బోధించే విషయాన్ని ఎంతగా అధ్యయనం చేసినా, ఎంత విడమర్చి పదిమందికీ తెలియజేసినా, ఆయన లోతును మనం ఎన్నటికైనా కనుక్కోగలమా అనేది పెద్ద ప్రశ్న. ఆయన ప్రేరణతో మన లోతును మనం కనుక్కొంటున్నకొద్దీ, అంతమేరకు ఆయన మనకర్థమవుతాడు. మనలోకి మనం మరింత చొచ్చుకుపోయినప్పుడు ఆయన మనకు మరింతగా అర్థమవుతాడు. చిత్రంగా లేదూ? కానీ ఇదే నా అనుభవం.

చిన్నతనంలో నా చదువంతా మద్రాసులోనే జరిగినప్పటికీ, రాజకీయ సామాజిక కళారంగాల్లో మా తండ్రి నీలంరాజు వేంకట శేషయ్యగారి ధర్మమా అని అనేకమంది ప్రముఖులతో పరిచయాలు ఏర్పడ్డప్పటికీ, కృష్ణమూర్తి పేరు మాత్రం మా ఇంట్లో చర్చకు వచ్చింది కాదు. 1970 వరకూ ఎవరైనా ఆయనపేరు నా ముందు ఉదహరించినా, అద్వైత శిఖామణి స్వామి రామతీర్థ, వివేకానంద, అరవిందఘోష్, పరమహంస యోగానంద (యొగోడా) మొదలైనవారి ప్రవచనాలతో నిండిపోయిన నా మనసును కృష్ణమూర్తివైపు మళ్ళించాలనిపించలేదు.

కృష్ణమూర్తి నా జీవితంలో కాస్త ఆలస్యంగా అడుగుపెట్టాడు. ఒక విధంగా మంచికేననుకుంటాను. ఈలోగా ఆదిత్యహృదయాలు, హనుమాన్ చాలీసాలు, ఉపనిషద్వాక్యాలు, గీతాపఠనాలు, లోకంలోని ఇతర మతాల అధ్యయనాలు పూర్తయిపోయినై. అన్నీ కూడా ఉదాత్త భావనతో కూడిన ఆదర్శాలను ప్రసాదించావనే కానీ, సత్యానికి దోవ చూపించినట్లు కనిపించలేదు. అసలు విషయం వాటిలో లేదని

కాదు; కానీ జ్ఞానమార్జించడమంటే చదవడం, అర్థంచేసుకోడం, ఆచరించడం అనే మార్గాన్ని సూచిస్తుండేవి. ఏ ఒక్కరూ కూడా "చూడడం నేర్చుకో, నీలోన ఉన్నదంతా తుడిచెయ్. ఉన్నదానితో ఉండిపో, దాన్ని మార్చాలని ప్రయత్నించకు; తీక్షణమైన నిశ్చలమైన నీ చూపే దానిని పరిహరిస్తుంది" అని నేర్పిన వాళ్ళెవారూ లేరు.

చెప్పద్దూ? ఓం ప్రథమంలో కృష్ణమూర్తి పుస్తకం చదివినప్పుడు, అంతా అగమ్య గోచరమనిపించింది. అన్నింటికీ పరిష్కారం 'ప్రేమే'నని ఆయన అంటుంటే, అదేమిటో అర్థంకాక, నాకు తెలిసిన అర్థాన్ని దానికి ముడిపెట్టి, పిడుక్కూ బియ్యానికీ ఒకేమంత్రం అన్నట్లున్నదని తోసిపుచ్చాను.

చిన్నప్పటి నుంచి అనేక రకాలుగా సానబెట్టిన నా మెదడు మేల్కొన్నదే కానీ, హృదయం అప్పటికి తగినంతగా మేల్కొన లేదనుకుంటాను. 1970 ప్రాంతంలో లైబ్రరీ నుంచి 'కృ' పుస్తకం 'కామెంటరీస్ ఆన్ లివింగ్' తెచ్చి చదివాను. నిప్పురాజుకున్నది. ఇక ఆయన రాసిన పుస్తకం వెంబడి పుస్తకం, చదవడం మొదలైంది. హైదరాబాద్ లైబ్రరీలలో ఎక్కడి పుస్తకమైనా కృష్ణమూర్తి విరచితమైనది కానీ, ఆయన్ని గురించి ఆ తత్వాన్ని గురించి ఎవరు రాసింది కానీ, ఆయన్ని ప్రశంసిస్తూ రాసినా, తెగడుతూ రాసినా, తెచ్చి చదివేవాణ్ణి. రాత్రీ పగలూ అనే తేడా లేకుండా, ఆ పుస్తకం చదివి, నోట్స్ రాసుకొని, అర్థంచేసుకొని జీర్ణించుకుంటే గానీ, తోచేది కాదు. పిచ్చిపట్టినట్లుండేది. ఏదో ప్రేమలోపడి నిద్రాహారాలు కూడా పట్టించుకోనంత తీవ్రంగా, మనసును ఆక్రమించింది. పైకి సహజంగా ప్రవర్తిస్తున్నా, మది హృది రెండూ కూడా ఈయన టీచింగ్‌తో నిండిపోయినై.

1972లో కేంద్ర జనాభా లెక్కల శాఖకు డిప్యూటేషన్ మీద వెళ్ళి అక్కడ ఉద్యోగం చేస్తున్నప్పుడు ఆ శాఖ డైరెక్టరు, శ్రీ టి. వేదాంతం (IAS) వ్యక్తిగతంగా విద్యార్థి దశనుండి నాకు మిత్రుడై వుంటం మూలాన, "కృష్ణమూర్తిని ఇంతగా చదువుతున్నావు కదా? ఆయన డిసెంబర్‌లో రిషీవాలీ వస్తున్నాడు, వెళ్ళి చూసివస్తావా?" అంటే పరమానంద భరితుణ్ణయ్యాను. అసలు ఆయన ఏటా ఈ

దేశానికి వచ్చిపోతుంటాడనే విషయమే నాకు తెలియదు. అంతకుపూర్వమే తనకు పరిచితుడైన రిషీవాలీ ప్రిన్సిపల్ శ్రీ బాలసుందరంకు నేను అక్కడికి వచ్చినప్పుడు వసతి కల్పించమని కోరుతూ ఉత్తరం రాశాడు.

రిషీవాలీలో పదిరోజులున్నాను. అక్కడికి వెళ్ళిన రోజునే కృష్ణమూర్తిని కలవాలని ప్రయత్నం చేశాను. "అలా కుదరదు. ఎప్పుడు పడితే అప్పుడు ఆయన అలా కలవడు. సాయంత్రం పాత గెస్ట్‌హౌస్ గది నుండి, వాహ్యాళికై దిగివస్తాడు. అప్పుడు నిన్ను పరిచయం చేస్తాను" అని సలహా ఇచ్చాడు శ్రీ బాలసుందరం. సాయంత్రవేళ ఘలానిదారిన బయలు దేరతాడని తెలిసి ఓ చెట్టుకింద కాపు వేశాను.

కాసేపటికి శ్రీయుతులు కృష్ణమూర్తీ, బాలసుందరం ఇద్దరూ కిందికి వచ్చారు. ఎదురుపడి నమస్కరించాను. "ఇతడు హైదరాబాద్ నుండి వచ్చాడు" అని మెల్లగా ఆయనకు చెప్పాడు శ్రీ బాలసుందరం. డెబ్భై ఏడేళ్ళ వృద్ధుడైనా కృష్ణమూర్తిలో ఆనాటికి వృద్ధాప్యపు ఛాయలేవీలేవు. మా ముగ్గురిలోకి అతడే నిటారుగా కడ్డీలాగా వున్నాడు. కృష్ణమూర్తి, ప్రతి నమస్కారంచేసి నన్ను పరికిస్తున్నట్లు గమనించారు. ఏ మనిషిని ఆయనకు పరిచయం చేసినా, అతడి అంతస్తుతో నిమిత్తం లేకుండా, సంతోషంగా ఆసక్తితో ఆ వ్యక్తివంక అలా చూడడం ఆయన లక్షణం.

ఇక్కడ, ఆయన్ని గురించి నేనేవైనా భావాలు ప్రకటిస్తే, అవి నా ఊహాలో నుండి జనించినవే కానీ, ఆయన ఆంతర్యం నాకు తెలుసన్నట్లు మాట్లాడగలిగిలేను. ఆయన అలా మనిషివంక పరిశీలనగా చూడడాన్ని తలుచుకున్నప్పుడు నాకనిపించింది ఏమంటే, తనకు అలా తారసిల్లిన వారెవరైనా తన "పనికి" అక్కరకు వస్తాడా, తగిన అవగాహనతో ఆ 'పనికి' దోహదం చేస్తాడా, రాళ్ళ గుట్టలో విలువైన రాయికోసం వెతుకుతుంటాడని తోచింది. ఆయన "పని" ఏమిటో అందరికీ తెలిసిందే; మనుషులందరూ రెక్కలు మొలిపించుకొని, డేగలవలె స్వేచ్ఛాకాశంలో, ఆనందంతో అనంత తీరాలకు ఎగిరి పోవడమే. ఆ "పని" చేయడానికే ఆయన తన ముప్ఫై నాల్గవ ఏట "మనిషిని విముక్తుణ్ణి చేయడమే నా కర్తవ్యం" అని నిర్ద్వంద్వంగా ప్రకటించాడు.

"ఇవాళే వచ్చాను కాబట్టి, మిమ్మల్ని చూచిన తర్వాతనే నిద్రించాలని నిశ్చయించుకొని ఇప్పటికిప్పుడు మిమ్మల్ని చూచేందుకు వచ్చాను" అన్నాను. "హైదరాబాద్ ఇక్కడికి ఎంత దూరముంటుంది?" అని ఏదో ఒకటి రెండు ప్రశ్నలువేసి నమస్కరించి వెళ్ళిపోయాడు. మాటలకన్నా చూపు ద్వారానే ఆయన ఎక్కువ గ్రహించేవాడని నేననుకుంటూ వుంటాను.

మరికాసేటికి ఆ ప్రాంతంలో శ్రీమతి పుపుల్ జయకర్, శ్రీ అచ్యుత్ పట్వర్ధన్‌లు అటు నడుస్తూ వస్తుంటే వారికి ఎదురై నమస్కరించాను. యవ్వనంలో కాంగ్రెస్ సోషలిస్టు నాయకుల్ని ఆరాధిస్తూ వారిని గురించి వ్యాసాలు రాస్తుండేవాణ్ణి; ఆయన్ని గుర్తుపట్టి "42 ఆగస్టు ఉద్యమం గురించి, అందులో ఆయన పాత్రను గురించి, అవీ ఇవీ మాట్లాడుతూ నుంచున్నాను. "రేపు సాయంత్రం నా కాటేజ్ వద్ద కలువు" అని ఆహ్వానించి ముందుకు సాగిపోయాడు.

మర్నాడు పట్వర్ధన్ వద్దకు వెళ్ళినప్పుడు శ్రీమతి పుపుల్ కూడా అక్కడే సమావేశమై వున్నారు. "నువ్వు మెహర్‌బాబా, అరవిందుడు మొదలైన వారినెందరినో చదివానంటున్నావ్ కదా? మరి కృష్ణమూర్తి టీచింగ్‌లో నువ్వు చూసిందేమిటి?" అని అడిగారు శ్రీమతి పుపుల్ జయకర్." మిగతావారి బోధలు నన్ను చాలా ప్రభావితంచేసిన మాట నిజమే. కానీ ఈ కృష్ణమూర్తి కౌగిలింత భల్లూకం పట్టులాంటిది. అహం తుత్తునియలయ్యేంత వరకు రేయింబగళ్ళు, ఆయన మాటలు చెవుల్లో రింగుమని మోగుతూనే వుంటై. ఎటువైపు తిరిగినా, ఏ పనిచేస్తున్నా, ఆ ఘోష వినిపిస్తూనే వుంటుంది" అని ఉన్నమాట చెప్పాను. "భల్లూకం పట్టు" అనే ఉపమానం వింటూనే ఆమె కళ్ళు చెమర్చినై; ముఖం అవతలికి తిప్పేసుకున్నది. ఆమెను ఆ మాటలు కదిలించినట్లుంది. ఇలా కళ్ళల్లో నీరునిండడం దుఃఖంతోనూ కాదు. ఆనందంతోనూ కాదు; ఏదో తీవ్రమైన దీర్ఘకాలిక వ్యధ నుండి విడుదల పొందినప్పుడు కలిగే కృతజ్ఞతా భావం, ఇలా కళ్ళల్లో నీరు నింపుతుందనుకుంటాను.

అచ్యుత్‌కన్నా పుపుల్‌జీ కాస్త 'ఇమోషనల్'. సహజంగా ఈ మాటలవల్ల చలించి, "వచ్చే ఆదివారంనాడు లంచ్ భోజనానికి ఇతణ్ణి ఆహ్వానిద్దాం" అని అచ్యుత్‌జీతో అని, నా పేరు అడిగి కాగితంమీద రాసేసుకున్నది.

ఆదివారం “బఫేలంచ్”కి వెళ్ళాను. ఇరవై, పాతిక మంది ఉండుంటారు. అందులో ఎక్కువమంది ‘కృ’తోబాటు విదేశాల నుంచి వచ్చిన ఆయన పాశ్చాత్య మిత్రులు (శిష్యులనే మాట ఆయన ఇచ్ఛగించేవాడు కాదు); ఐదారుగురు ఉన్నత శ్రేణి భారతీయులు. కొద్దిపాటి హోదాలో వున్నవాణ్ణి నేనేననుకుంటాను.

పుపుల్‌జీ, పెద్దా చిన్నా ధనిక నిర్ధన భేదం లేకుండా అందర్నీ వరుసగా కృష్ణజీకి పరిచయం చేసిన మాట నిజమే. మర్యాదపూర్వకంగా ఆయన కొత్తవారిని పలకరించి, ఏదో ఒకటి రెండు మాటలు మాట్లాడిన మాటా నిజమే. కానీ నేను పరస్పర మర్యాదలకై ఆయన్ని కలవాలనుకోలేదు. మానవ హృదయం లోతుల్లోకి వెళ్ళి చర్చించాలనుకున్న విషయాలకున్నూ. ఈ లోక మర్యాదలు పాటించడానికీ  వున్న సంబంధమేమిటి? నాకు కావలసిందివేరు. నాకు అక్కడి హైసొసైటీ సంభాషణలు, లంచ్‌కి వడ్డించిన పిండివంటల మీద మనసులేదు. ఈ ‘కృ’ అనే వ్యక్తి ‘లోలోనికి’ ఎలా వెళ్ళాడు, ఏ దశలో ఏమి కనిపిస్తుందనేది, అది నాలాంటివాడు కూడా సాధించగలడా, అందుకు నేనేమి చేయాలి, ఎలా చేయాలి, నాలోని ఈ వెలితి ఏ విధంగా తీరుతుంది? ఇదే నా తహతహ. ఈ విషయాలు చర్చించడానికి నాకు కావలసింది ఆయనతో ఏకాంత సమావేశం. మాటల ద్వారా అందనిది, నేత్రాల ద్వారానైనా అందాలి; ఆయన తీరు, వైఖరి, హొయలు ద్వారానూ నేర్చుకోవాలి. మనసు దీనికై ఆరాటపడుతుంటే మర్యాదలేమి చేసుకోను. మధుర పదార్థాలేమి రుచిస్తై?

అటు తర్వాత శ్రీ బాలసుందరం కనిపించినప్పుడు, నా అవస్థ చెప్పుకున్నాను. “అరె, కాస్త ముందుగా చెప్పకపోతివే? నిన్నా మొన్నట్లో ‘కృ’తో జరిగిన చర్చా గోష్ఠిలో నిన్ను కూడా కలిపివుండేవాణ్ణి” అన్నాడు. అవకాశం ఎలాగూ చేయిజారి పోయింది. కానీ అది కూడా నన్ను సంతృప్తిపరచి వుండేది కాదేమో! ఆయన్ని విడిగా కలవాలి. కానీ అలాంటి అవకాశం లేదన్నారు కార్యకర్తలు. స్నేహపూర్వకంగా ‘కృ’తో లంచ్‌కి ఆహ్వానించిన పుపుల్‌జీని, అచ్యుత్‌ను అడగటానికి మొహమాటపడ్డాను.

మద్రాసు నుండి వచ్చిన శ్రీ బి.వి. సింగరాచార్య, మరి నలుగురు జర్నలిస్టులు ఒకరోజు ప్రొద్దున్నే ‘కృ’ను కలిసివచ్చారు. నేను ప్రభుత్వ ఉద్యోగం చేస్తున్నప్పటికీ,

చిన్నప్పటి నుంచీ పత్రికా రచయితల మధ్య పుట్టీ పెరిగినవాణ్ణి; ఎవరో చమత్కారంగా అన్నట్లు, నాలాంటి వాళ్ళ వొంట్లో రక్తం ప్రవహిస్తున్నదో 'ప్రింటర్స్ ఇంక్' ప్రవహిస్తున్నదో తెలియని వాళ్ళం. జర్నలిస్టు వృత్తిలో స్థిరపడిపోయినా, కృ...ను ఇట్టే కలిసుండేవాణ్ణి కదా అని చింతించాను.

1980 ఆఖరులో, సరిగ్గా అంతే జరిగింది. నా చిన్నతనం నుండి మిత్రుడైన శ్రీ పొత్తూరు వెంకటేశ్వరరావు, అంతకు కొద్దికాలం క్రితమే ఆంధ్రప్రభ వీక్లీ ఎడిటర్ బాధ్యతలు స్వీకరించారు. నాకు 'కృ' మీద అభిమానం మెండనీ, ఏటా మద్రాసుకో, బెంగుళూరుకో వెళ్ళి ఆయన ఉపన్యాసాలు విని వస్తుంటాననీ, ఆయన పుస్తకాలు అధ్యయనం చేస్తుంటా ననీ తెలుసు." ఈసారి మద్రాసు వెళ్ళినప్పుడు, జిడ్డు కృష్ణమూర్తిని ఇంటర్వ్యూచేసి మన వీక్లీలో ప్రచురిస్తే ఎలా వుంటుంది?" అని నాతో ప్రస్తావించడం జరిగింది. అలాంటి 'అయిడియా' ఆయనకు కలగడం, నా చిరకాల మనోరథం ఈడేరే సమయమాసన్న మవడం, నాకు అమిత ఆనందాన్ని కలిగించింది.

ఫలాని వారిని ఇంటర్వ్యూ కొరకై పంపిస్తున్నామని ఎడిటర్ చేత మద్రాసులోని కృష్ణమూర్తి ఫౌండేషన్ వారికి ఉత్తరం రాయించి, వెళ్ళాను. అంతకు మునుపే నాతోబాటు మద్రాసు వచ్చి ఆయన ఉపన్యాసాలు విన్న నా మూడోకూతురు చిరంజీవి పద్మప్రియ, ఆయన పుస్తకాలు చదవడం అలవాటవడం మూలాన, నాతోబాటు 'వసంత విహార్'కు వచ్చింది. 'ఇంటర్వ్యూ సమయంలో నువ్వు నాతో ఉండడం సాధ్యమవుతుందో కాదో' అనే సందేహం వెలిబుచ్చుతున్నప్పటికీ', 'ఫరవాలేదు' అంటూ తోటే వచ్చేసింది.

ఆ మొదటి ఇంటర్వ్యూ 12 జనవరి, 1981 నాడు. నాకిచ్చిన టైము సాయంత్రం నాలుగు గంటలు. 'వసంత విహార్' కాంపౌండ్ గేట్ వద్దకు ఐదు నిమిషాలు ముందుగానే వచ్చాము. కానీ భవనం వద్దకు నడుస్తూ వుంటే శ్రీ రాజశేఖరరెడ్డి అనే I.F.S. ఆఫీసర్ దోవలో పలకరించినందువల్ల కొద్దిగా ఆలస్యమయింది. 'అనుకున్నటైముకు రాలేదేమని' అచ్యుత్‌జీ, కృష్ణజీని పైమేడ మీదనే వదలి, కిందికి దిగి ఆఫీసు గదివద్దకొచ్చాడు. "నీ కోసం 'కృ' వేచి వున్నాడు. ఆయన నీకు కేటాయించింది ఇరవై నిమిషాలు. మరికాస్త టైమిస్తాడో ఏమో, నీ ఇంటర్వ్యూ నడిచే తీరునుబట్టి వుంటుంది" అన్నాడు. నన్ను

వెంట బెట్టుకొని బయలుదేరాడు. సహజంగా పద్మప్రియను ఆఫీసులోని కుర్చీలో కూచోనుండ మన్నాను. కానీ అప్పటికే కాలహరణమవడం మూలాన, ఇక వేచి వుండడం అనవసర మనుకున్న 'కృ' కూడా మేడమెట్లు దిగి వచ్చేశాడు. అచ్యుత్‌జీతో నేను ముందుకు నడుస్తూ వుంటే, ఆఫీస్ గది అవతలివైపున వున్న తలుపులో నుండి అక్కడ కూచున్న అమ్మాయిని చూచి, 'ఆమె ఎవరు?' అని అచ్యుత్‌ని అడిగాడు. నేను కలగజేసుకొని, 'నా కూతురు, నేను ఇంటర్వ్యూకి బయలుదేరుతుంటే, తోటే తానూ వస్తానని వచ్చింది' అన్నాను 'కృ'తో. 'అయితే ఆమెనూ రమ్మను' అన్నాడు. పద్మప్రియ మొహం విప్పారింది. ఆలస్యం అమృతం విషం, అంటారు; కానీ ఈ సందర్భంలో జరిగిన ఆలస్యం, ఈ అమ్మాయిని కృష్ణమూర్తి సమ్ముఖాన నిలబెట్టింది; చివరకు రిషీవాలీకి కట్టేసింది.

'ఇరవై నిమిషాల'న్న ఇంటర్వ్యూ యాభై నిమిషాలు కొనసాగింది. నాతోటే తెచ్చిన ప్రశ్నావళిని ఆయనచేత ఒక కాపీ వుంచి, నేనూ పద్మప్రియా చెరొక కాపీ దగ్గర వుంచుకొని ఆయన చెప్పే సమాధానాలు అమిత వేగంగా, ముక్కలు ముక్కలుగా రాసుకుంటూ కూచున్నాము. సమాధానాలు నవ్వుతూ చెప్తూవున్నా ఆయన దృష్టి అధికభాగం పద్మప్రియ మీదనే ఉంటూ వచ్చింది. ప్రారంభంలోని ప్రశ్నలన్నీ పూర్తిచేసి, చివరి ప్రశ్న వద్దకు వచ్చే ముందు ఆయనచేత పట్టుదలగా తెనుగులో అంకెలు చదివించడం ఓ ముచ్చట. అటు తర్వాత ఒకింత 'లోతైన' నా ప్రశ్న నొకదానిని చూచి, 'ఈ ప్రశ్న నీదేనా?' అని అడిగాడు కృ. స్వభావరీత్యా నాకున్న లక్షణంవల్ల, "నిస్సందేహంగా నాదే. మీ టీచింగ్‌ను నే అర్థం చేసుకున్నంతగా హైదరాబాద్‌లో మరెవ్వరూ అర్థంచేసుకొని, వుండరు" అని ఛటుక్కున అనేశారు. ఈ మాటలో కొంత నిజమున్నప్పటికీ, ఇలా మాట్లాడడం పొరపాటే. కానీ ఆయన నన్ను చేతితో తాకుతూ, 'నీదేనా అని అడిగాను. మరేమీలేదు' అంటూ అనునయంగా మాట్లాడాడు.

ఆ ప్రశ్న విషయంలో నే ప్రదర్శించిన వైఖరి కాని, అనుచితమే అయినప్పటికీ, నేను కేవలం ఆయన చేత ఏవో నాలుగు ముక్కలు చెప్పించుకొని అవి రాసుకుపోవడానికి, ప్రచురించడానికే వచ్చిన సాధారణ పత్రికా విలేకరిని కాదని, తాను చెప్పే విషయాన్ని

శ్రద్ధగా అధ్యయనంచేసి వచ్చిన వాణ్ణినీ ఆయన కనుక్కోవడం జరిగింది. తద్వారా మా యెడల ఆయన దృష్టి కొంత మారిందేమో?

మారినట్లే భావించాలి. ఇంటర్వ్యూ ముగియగానే, అచ్యుత్‌జీ నాతో, "ఇక మీరు వెళ్ళవచ్చు. నేను కృష్ణజీతో వేరే విషయం మాట్లాడాల్సి వుంది" అని చెప్తూ వుంటే, నేనూ పద్మప్రియా లేచి నుంచోబోతుండగా, నా మోకాలిమీద చేయి వుంచుతూ, కృ "వెళ్ళద్దు. ఆగండి" అంటూ, "నువ్వు చెప్పు" అన్నాడు అచ్యుత్‌జీతో. మమ్మల్నిద్దర్నీ అక్కడికక్కడే పంపించడంకాక, సరియైన వీడ్కోలు చెప్పాలని ఆయన ఉద్దేశమై వుండాలి. అచ్యుత్‌జీతో ఏదో మాట్లాడడం పూర్తయ్యాక నలుగురం లేచి కిందికి వచ్చాం. అవతలి హాలులో శ్రీమతి పుపుల్ జయకర్, సునందా గార్లు 'ఛాంటింగ్'కై కూచోనున్నారని అచ్యుత్ చెప్తూ వుంటే, 'నువ్వు వెళ్ళి ప్రారంభించు. నేను ఇప్పుడే వచ్చి జాయిన్ అవుతాను' అంటూ నన్నూ పద్మప్రియనూ పోర్టికో చివరి వరకూ అనుసరించి, నమస్కరిస్తున్న నా రెండు హస్తాలను తన రెండు చేతులలో పెట్టుకుంటూ "Whenever I am here, and whenever you are here, sir, you are always welcome to meet me' అని ఒక 'బ్లాంకెట్ పర్మిషన్' ఇచ్చేశాడు. ఈ మైత్రీభావం, ఈ ఔదార్యం నన్ను చాలా కదిలించేసింది. అప్రయత్నంగా నానోటి నుండి 'we are blessed (ధన్యులం) అనే పదాలు తోసుకు వచ్చినై. మూతపడిన కళ్ళతో ఆ మాటే రెండుసార్లు అనుంటాను. అన్న తర్వాత గుర్తుకొచ్చింది, ఆయనకిలాంటి సంప్రదాయ బద్ధమైన మాటలు అంత ఇష్టముండవని. కానీ నేను కళ్ళు తెరచి చూచేసరికి, నా మాటలు వింటున్నవారు, మరెవరైనా అక్కడ వున్నారా అని "కృ" అటూ ఇటూ చూస్తున్నట్లు గమనించాను. శ్రద్ధాసక్తులు అమితంగా వున్న వారి విషయంలో ఆయన మామూలుగా అవలంబించే విధానాలకు, కొన్ని మినహాయింపులు వుండి వుండవచ్చు!

రెండో ఇంటర్వ్యూకై 1981 డిసెంబరు 24న మద్రాసు వెళ్ళినప్పుడు, పద్మప్రియతో బాటు నా భార్య సౌ. దమయంతి కూడా వచ్చింది. 'ఆంధ్రప్రభ నుండి వచ్చిన ప్రతినిధి ఇంటర్వ్యూకు టైమడుగుతున్నాడు. ఏమిచెప్పమంటారు;' అని శ్రీమతి సునంద 'కృ'ను కలిసి అడిగినప్పుడు, "Is it that man with his daughter?" అని అడుగుతూ, ఆ రోజు

సాయంత్రం నాలుగింటికే రమ్మని ఆమెకు చెప్పాడు. నేను మా వాళ్లతో కాస్తముందే వెళ్ళి సునందాజీని కలిసినప్పుడు ఆమె నాతో హాస్యంగా "అందర్నీ జ్ఞాపకాలు వదిలించుకో మంటాడు కానీ, తనకు అవసరమనుకున్న విషయాలు బాగానే గుర్తుంచుకుంటాడని" నాతో నవ్వుతూ జరిగిన విషయం చెప్పింది. అటు తర్వాత నేను రిషీవాలీకి వెళ్ళి, ఆయనకు కబురందించాలంటే, శ్రీమతి రాధికా హెర్జ్‌బర్గర్‌తోనూ తదితరులతోనూ "కుమార్తెతో వచ్చే ఆ మనిషి వచ్చాడని చెప్పండి" అంటుండేవాణ్ణి. అప్పుడు ఆయనకు ఖాయంగా అర్థమయేది; నా పేరు ఆయనకేనాడూ గుర్తు వుండే అవకాశంలేదు. సర్ (Sir) అనే సంబోధనతో పేరు గుర్తుంచుకునే అవసరాన్ని వదిలించుకున్నాడు. ఈ లోకంలో ఎందరి పేర్లని గుర్తుంచుకుంటాడు?

రెండో ఇంటర్వ్యూ సమయంలో మేము ముగ్గురం వున్నందువల్ల, దమయంతికీ పద్మప్రియకూ చెరొక ప్రశ్నావళి కాపీ ఇచ్చి 'కృ' చెప్పే సమాధానాలు నేను రాసుకోవడమే కాక వీలైనంత వేగంగా వారినీ రాసుకోమని చెప్పాను. తాను చెప్పేదంతా నేను పూర్తిగా అర్థం చేసుకొని రాసుకుంటున్నానో లేదో అనే అనుమానం కొద్దీ, నా రాసే చేతిని పట్టుకొని, "ముందు అర్థం చేసుకో"మని నన్ను ఆటంకపరుస్తూ వుండడం నా మొదటి ఇంటర్వ్యూలోనే గమనించాను. నాకు ఆయన చెప్పే విషయం అర్థమవుతూనే వుండేది; కానీ నేను అర్థం కాకపోయినా ముక్కకు ముక్క రాసేసుకొని వెళ్ళి ప్రచురిస్తున్నానేమోనని ఆయనకు సందేహంగా వుంటుండేదనుకుంటాను. ఇలా నా చెయ్యి పట్టుకున్నప్పుడల్లా నా పక్కనే ఒకరికి ఇద్దరుండి, ఒకరు ఒక ముక్క రాయకపోయినా, రెండోవాళ్ళు రాసుకుంటారు గదా అనే ఉద్దేశంతో వారిద్దరినీ రాయమని చెప్పేవాణ్ణి. అంతా అయిపోయిం తర్వాత ముగ్గురి 'నోట్స్' కలేగలుపుకొని ఆయన చెప్పినదంతా సమగ్రంగా వ్రాసుకుంటుండేవాణ్ణి. కొన్ని సందర్భాల్లో ఒక్క ముఖ్యమైన మాట మార్జిన్‌లో రాసుకున్నా, నాకు ఆయన చెప్పినదంతా గుర్తుకొచ్చేది. ఇంటర్వ్యూ చేసిన రోజునే రాత్రి కూచొని ఎంత లేటైనా, 'చిత్తు' తయారు చేసుకునేవాణ్ణి.

ఇంత అవస్థ ఎందుకు పడాలి? టేప్ రికార్డర్ ఒకటి పక్కనే పెట్టుకుంటే సరి పోతుంది కదా అని ఎవరైనా అనవచ్చు. సహజంగా, ఆత్మీయంగా మా మధ్య జరిగే

ఈ సంభాషణ సమయంలో పక్కనే ఒక యంత్రం తిరుగుతూ, అదంతా రికార్డు చేస్తూ వుండడం, నాకెందుకో నచ్చలేదు. "నేనిక్కడ ఉండే కాలంలో, నువ్వెప్పుడు ఈవైపు వచ్చినా నన్ను కలవవచ్చు"నని, ఆ మర్యాద పురుషుడు నాతో అనగా 'బాగుబాగు' అనుకుంటూ నేను ప్రతిసారి, ఓ టేప్ రికార్డర్ పట్టుకొని ఆయన గదిలోకి వెళ్ళడం నాకు విపరీతంగా కనిపించింది. ఆధునిక యుగంలో బహుశా భగవంతుడు అనుగ్రహించడానికి వచ్చినా, "కాస్త ఉండండి, టేప్ సెట్ చేస్తాను' అనో, వీడియో వారికి కబురంపాను. ఐదు నిమిషాల్లో వచ్చేస్తారు" అనో, అంటామనుకుంటాను. నాకూ, నా కుటుంబీకులకూ ఆయనతో సమావేశమవడం అత్యంత ఆనందదాయకమైన విషయంకానీ, మరేదీ అంత ముఖ్యమని పించేదికాదు. 'ఇంటర్వ్యూ' అనేది రానురానూ మాకూ, కృష్ణమూర్తి గారికీ ఒక 'సాకు'గా పరిణమించింది అనుకుంటాను. అంతేగానీ వేలాదిమంది పృచ్ఛకులకు దశాబ్దాల తరబడి సమగ్ర సమాధానాలిచ్చిన ఆ మహానుభావుడ్ని నేను కొత్తగా అడిగేదేముంటుంది. ఆయన అంతకుమునుపు ఎవరికీ చెప్పని కొత్త విషయం నాకేమీ చెప్పేను? ఆయనతో ఏకాంత సమావేశమే 'పదివేలు'గా భావించిన మాకు ఈ టేప్ తిరుగుతుండే 'రొద' ఏమిటి?

అదీకాక ఈ సంభాషణ సమయంలో ఆయన కొందరు వ్యక్తుల్ని గురించీ, సంస్థల గురించీ, ఆఖరికి ఆయా ప్రభుత్వాల గురించీ స్వేచ్ఛగా తాను అనదల్చుకున్నది అంటుండే వాడు. తగినంత బాధ్యతలేని ఓ సామాన్య పత్రికా విలేఖరి 'టేప్'లోకి అవన్నీ వెళితే ఆయన చుట్టూ వున్నవారు ఎంత ఇబ్బందికి గురవుతారు? బాధ్యతా రహితమైన విలేఖరి వాటన్నిటినీ సంచలనాత్మక వార్తలుగా ప్రకటించవచ్చును కదా?

అందుకనే ఒకసారి ఆయన "నా వద్ద ఓ ఫస్ట్ క్లాస్ టేప్ రికార్డర్ ఉన్నది. కావాలనుకుంటే అది పెట్టుకో" అని సంభాషణ ప్రారంభంకాక పూర్వమే నాకు సూచించినా, "వద్దు. అలాంటివేవీ లేకుండా మీతో ఇలా సంభాషించడమే మాకు బాగుంటుంది" అన్నాను.

నన్ను "టేప్ పెట్టమంటావా?" అని అడిగిన 'కృ' మరో సందర్భంలో, ఫిలాసఫీ శాఖాధిపతియైన ఓ పాశ్చాత్య వనితను, ఆవిడతోటే తెచ్చుకున్న టేప్ రికార్డర్‌ను 'ఆన్'

చేయనివ్వకుండా అడ్డుతగులుతూ వుండడం, మనందరికీ నవ్వుకొల్పిస్తుంది. పదిమంది పెద్దలను ఇంటర్వ్యూ చేస్తూ, 'కృ'ను కూడా ఇంటర్వ్యూ చేసి, ఆ పుస్తకంలో ప్రచురిద్దామని ఆమె ఎంత ప్రయత్నించినా ఆయన పొడుగూతా ఆ టేప్‌ను 'స్విచ్ ఆఫ్' చేస్తూనే వచ్చాడు. "నువ్వు అర్థం చేసుకో. అది ముఖ్యం. నేను మాట్లాడేది శుద్ధ చెత్త అవచ్చుగాక. అయినప్పటికీ అది నాకు పరమ పవిత్రమైనది. అది తీసుకెళ్ళి నువ్వు పదిమందితో కలిపి ప్రచురించాలని నేను అనుకోడంలేదు." అని టేప్ పెట్టనివ్వలేదు. చివరకు ఆమె తన జ్ఞాపకశక్తి ఆధారంతోనే ఆయన సంభాషణను ఆ పుస్తకంలో ప్రచురించుకున్నది. "టేప్ ఆన్ చేయనివ్వకుండా ఆటంక పరిచాడే" అని సంభాషణ జరిగినంతసేపూ చింతిస్తూనే వుంది. మహాన్ పురుషులు, అందర్నీ సమానంగానే చూస్తారు అనేమాట నిజమే. కానీ తమవద్దకు వచ్చిన వారి వారి శ్రద్ధాసక్తులనుబట్టి, కొందర్ని మరింత ఎక్కువ సమానంగా చూస్తుంటారేమోనని, నా స్వానుభవాన్ని బట్టి కనుక్కున్నాను!

వసంత విహార్‌లోని రెండో ఇంటర్వ్యూను, ముగ్గురమూ రాసుకుంటున్నట్లు చూచి, అచ్యుత్ పట్వర్ధన్ సమక్షంలో 'కృ' ఇంటర్వ్యూ పూర్తయిన తర్వాత, సావధానంగా మావంక చూస్తూ, 'what do you think of all this stuff?" అని అడిగాడు. 'స్టఫ్' అనే పదం వాడి నందుకు నేను కాస్త ఉలిక్కిపడి, తన టీచింగ్ ఎంత ప్రశస్తమైనదో, అది ఎక్కడి నుండి పుట్టుకువస్తున్నదో తనకు తెలియకుండా ఉందా అనుకొని, "Is that a rhetorical question? (సమాధానం వేరే చెప్పాలా?) అనే ధోరణిలో అడిగాను. ఈ టీచింగ్‌ను నేను ఎంత ప్రాణప్రదంగా ఎంచుకుంటున్నానో ఈయనకింకా తెలియపోవడమేమిటి? అని నా అభిప్రాయం.

అందుకు కృ, "If I am not being personal and if you wish to answer the question you may. Even if you dont wish to answer, it does not matter" (వ్యక్తిగతంగా నిన్ను ఇబ్బంది పెట్టడం లేదనుకుంటేనూ. నీకు సమాధానం చెప్పాలని వుంటేనే చెప్పు. చెప్పక్కరలేదని నువ్వు అనుకున్నా మరేమీ ఫరవాలేదు) అన్నాడు. ఈలోగా అచ్యుత్‌జీ కలగజేసుకొని "కృష్ణజీ నిన్ను డైరెక్ట్‌గా వేస్తున్న ప్రశ్న. నీ ఇష్టమైతేనే సమాధానం చెప్పు. లేదంటే అక్కరలేదు." అన్నాడు. నేను 'కృ' వంక సూటిగా చూస్తూ "you fill

our thoughts" (మా ఆలోచనలన్నీ మీతోనే నిండివుంటై) అని, తరతమ భేదాలతో మా ముగ్గురి మానసిక స్థితినీ తెలియజేశారు.

నా స్వభావం కారణంగా ఆయన చిరాకుపడి, నన్ను ఎడంచేసినా, ఆయన టీటింగ్‌ను తలనిడి, బ్రతికున్నంతకాలం ఊరూరా తిరుగుతూ ప్రసంగిస్తూ ఉండగలనని నా విశ్వాసం. ఆయన తన చిన్నతనం నుండి ఎక్కడ ఏది మాట్లాడినా (ప్రచురించినవి) ఆ టీచింగ్‌లో ఎప్పటికప్పుడు వస్తున్న పరిణామక్రమాన్ని, నూతన పద ప్రయోగాన్ని నమోదు చేసుకుంటూ వుండడం, అప్పటికి ఓ దశాబ్దం పైగా నాకు నిత్య కార్యక్రమం. ఏకలవ్యుడిలాగా శ్రమించినవాణ్ణి. ఆయన నన్ను వదిలేసినా, నేను టీచింగ్‌ను వదలుతాననేది కల్ల. అందువల్లనే నిర్భయంగా నిస్సంకోచంగా అలా సాయిలా ఫాయిలాగా ఆయనతో మాట్లాడేవాణ్ణి అనుకుంటాను. కానీ ఆశ్చర్యమేమిటంటే, ఈ ప్రవర్తనకు ఆయన ఎన్నడూ కోపం తెచ్చుకోలేదు. బహుశా నా జీవితం ఆయన టీచింగ్‌తో ఎంత గాఢంగా పెనవేసుకుపోయిందో ఆయనకు చూచాయగా తెలిసిందేమో! తెలియకపోయినా, చింత లేదు. అక్కడ ఆ టీచింగ్, ఇక్కడ నేను, ఓపిక వున్నంతకాలం, పత్రికలు రాయనిచ్చినంత కాలం, రేడియోవారు చెప్పనిచ్చినంత కాలం, విన సిద్ధపడే శ్రోతలున్నంత కాలం, విరామం లేకుండా కృషి జరుగుతూనే వుంటుందని నాకు 1970 నుండే తెలుసు.

ఇంటర్వ్యూ అవగానే అందరం లేచి నుంచున్నప్పుడు, "You are leaving tonight, Sir?" (ఇవాళ రాత్రికే వెళ్తున్నావా?") అని అడిగాడు 'కృ'. అచ్యుత్ కలగజేసుకొని, "లేదు, టాక్స్" (కృ ప్రసంగాలు) వినడానికి వారాంతం వరకూ ఉంటున్నాడు" అన్నాడు 'కృ'తో. అయితే రేపు వీరందరినీ లంచ్‌కి ఆహ్వానిద్దాం" అన్నాడు 'కృ'. అందుకు అచ్యుత్. "Tomorrow (25th) is your day off. Twenty Sixth and twenty seventh are your days of talks" అని గుర్తుచేశాడు. 'Day off' అంటే 'కృ' పరిభాషలో మౌనం పాటించే రోజని. "టాక్స్" ఇవ్వాల్సిన రోజుల్లో 'కృ' లంచ్ తన గదికే తెప్పించుకుంటాడు. నలుగురి మధ్యా వచ్చి కూచొని లోకాభిరామాయణంలో పాల్గొనడు. "అయితే 'టాక్స్' అయిన మర్నాడే వెళ్ళిపోతున్నావా?" అని అడిగాడు. లేదండీ. 28న కూడా ఊళ్ళోనే

వుంటాను. నేనిక్కడ నుండి బయలుదేరడం 29న” అని చెప్పాను. "That's fine. Invite then for lunch on 28th". (అయితే ఇంకేం? 28 నాటికి పిలవండి) అంటూ, వీడ్కోలు సమయంలో, “మేమిక్కడ స్ట్రిక్ట్ వెజిటేరియన్స్ మండోయ్” అన్నాడు. నవ్వుతూ, “మేమూ అంతేలెండి” అన్నాను. లంచ్‌కి మమ్మల్ని ఆహ్వానించినందుకు పామాజీ, సునందాజీ (పామాజీ ఫౌండేషన్ సెక్రటరీ, సునందాజీ ఆయన సతి) కూడా చాలా సంతోషపడ్డారు.

సోమవారం ‘వసంత విహార్’ డైనింగ్ హాలులో ‘లంచ్’కని ఇటు రెండూ అటు రెండూ టేబిల్స్ అమర్చారు. ‘కృ’ కూచునే టేబిల్ వద్ద, ఆయన పక్కనే పద్మప్రియ కూచో డానికి, ఆయన ఎదురుగా నేను, శ్రీమతి సునందాతోబాటు మరి ఇద్దరు కూచోడానికి ఏర్పాటు చేశారు. సౌ. దమయంతి అవతలి టేబిల్ వద్ద కూచోడానికి ఏర్పాటు జరిగింది. అది చూచిన ‘కృ’ తనకు ఎదురుగా ఇంకో కుర్చీ వేయించి, దమయంతిని అక్కడ కూచోబెట్ట మన్నాడు, సునందాజీతో. అంతకుముందు నాలుగు రోజుల క్రింద జరిగిన ఇంటర్వ్యూలో “మీ జీవిత విధానం అప్పర్ మిడిల్ క్లాస్ వారి జీవితాలను పోలి వుంటుంది. ఇట్టి పరిస్థితిలో సామాన్యుడు మీ మాటనెలా పాటించాలి?” అని నేనడిగినందుకు, ఆ ప్రశ్నలోని ఎత్తిపొడుపును గుర్తుపెట్టుకొని ఆయన కుర్చీలో కూచుంటూ "Our lunches are also upper middle class style, Sir" అని నాకు వడ్డించాడు! (మా భోజనాలు కూడా అప్పర్ మిడిల్ క్లాస్ స్టయిలులోనే వుంటయ్యండోయ్) "That was an unexpected thrust" అంటూ నవ్వుతూ కుర్చీలో కూచున్నాను. మా ఇద్దరి మధ్యా ఒకింత ‘ఖడ్గాల ఖణఖణ’ ఎప్పుడూ సాగుతూనే వుండేది.

గురువారంనాడు మా ఇంటర్వ్యూ జరిగిన అనంతరం ఆయన ఏదో నిశ్చయాని కొచ్చినట్లుంది. కాసేపు ఆ మాటా ఈ మాటా అయిన తర్వాత, పద్మప్రియ వంకకు తిరిగి ‘కృ’, ‘నువ్వేం చదువుతున్నావు?’ అని అడిగాడు.

ప్రథమ ఇంటర్వ్యూ సమయంలో కూడా అడిగాడు. కానీ గుర్తు వుండుండదు. అప్పుడు బి.కాం. (ఆనర్సు) అని చెప్పినప్పుడు "What for, what for" అన్నాడు. అందుకు మేమేమీ సమాధానం చెప్పలేదు.

ఈసారి కూడా 'బి.కాం. ఆనర్స్' అని చెప్పింది. "ఆహా, కామర్స్ కదూ?' అంటూ ముఖం ఇటు త్రిప్పుకున్నట్లు నాకు కనిపించింది. "కామర్స్ అనగానే కృష్ణజీ తన కుర్చీని ఓ అంగుళం ఇవతలికి జరుపుకున్నట్లున్నది" అంటూ నవ్వాను.

"అదేంలేదు. నువ్వలా అనేట్లయితే ఇదుగో ఇప్పుడే అటు జరుపుకుంటున్నాను" అంటూ అంతటి మనిషీ లేచి, తన కుర్చీని ఓ అడుగు మేరకు పద్మప్రియ కుర్చీవైపు జరుపు కున్నాడు, "ఇప్పుడు సరిపోయనట్లేనా?" అని నా వైపు చూస్తూ.

పద్మ ప్రియ వంకకు తిరిగి "చదువు కాక నీ ఆసక్తి వేటిమీద?" అని అడిగాడు. "పెయింటింగ్, స్కెచ్చింగ్" అన్నది. "రిషీ వాలీకి వచ్చి పనిచేయాలని వుందా?" "I would love to" అన్నది. తన ఎదురుగా కూచున్న దమయంతి ముఖంలోకి చూస్తూ, "కృ" "of course if the mother has no objection" (తల్లికి అభ్యంతరం లేక పోతేనూ) అన్నాడు. ఈ పరిణామాలన్నీ ఊహించని దమయంతి క్షణంసేపు ఆశ్చర్యానికి గురయి అటు తర్వాత తలవంచుకుంటూ "No objection" అని మాత్రం అన్నది.

కాస్త అవతలగానున్న టేబిల్ వద్ద కూచున్న పామా పట్వర్ధన్‌తో "Patwardhan, we must bag her for Rishi Valley...Even when she came here last time. I wanted to ask her to come to Rishi valley" అంటూ ఇటు పద్మప్రియ వైపు తిరిగి "That offer holds. Any time, that offer holds" అన్నాడు.

రెండు నిమిషాల్లో ఇదంతా ముగించేసిన 'కృ'కి తన ఎదురుగానే కూచొని వున్న నన్ను ఈ విషయంలో ఒక్కమాటైనా అడగాలని అనిపించలేదు. బహుశా నా 'హనుమ లక్షణం' అప్పటికే పసిగట్టాడేమోననుకుంటాను; అడిగే ప్రసక్తే ఉదయించినట్లు లేదు. కానీ ఇప్పటికిప్పుడే ఈ అమ్మాయి చదువు పూర్తికాకుండా రిషీవాలీలో చేరిపోతే ఎలాగనే ఆలోచన నాకు కలిగి, "A long time back you stated that you would spend a long time in India. That you would stay here for a long, long time. Doesn't that offer hold? అని అడిగాను. 'కృ' మౌనంగా వుండిపోయాడు. కళ్ళు ఎటో చూస్తున్నై. తాను వచ్చి భారతదేశంలో తన మాట ప్రకారం స్థిరపడినట్లయితే, పద్మప్రియను తన వద్దకు పంపించడానికి నాకభ్యంతరం లేదన్నట్లు, దానికీ దీనికీ ముడిపెట్టాను.

'కృ'తో అప్పుడు నా విషయం కొంత చెప్పుకున్నాను. "మీ పుస్తకాలు నాకు దొరికినంత వరకూ చదివాను. ఏళ్ళక్రితం 1972లో మీతో రిషీవాలీలో 'బఫే'లంచిలో పాల్గొన్నాను. అప్పుడు చాలామంది విదేశీయులున్నారు. మీతో మాట్లాడే వీలుకలగలేదు. చాలా నిరాశ చెందాను.

మీతో మాట్లాడడమే నాకు ముఖ్యమనిపించేది. కార్యకర్తలు నాకు వీలు కలగుజేయ లేకపోయారు. వాయిదా వేస్తూ వచ్చారు. "నన్ను ఆయన్ని కలవనివ్వకుండా ఇలా ఆటంక పరుస్తుంటే చివరకు గోడ లెగబాకి, ఆయన గదిలోనికి జొఱపడతాను" అని అనాల్సి వచ్చింది."

'కృ' పక్కనే కూచున్నందువల్ల పద్మప్రియకు 'కృ' ఆమోదపూర్వకంగా అంటున్న 'good, good' అనే మాటలు వినిపించినై; ఆ విషయం తర్వాత నాతో చెప్పింది.

శ్రీమతి సునందా నాతో "ఎనిమిదేళ్ళ సుదీర్ఘ నిరీక్షణ అనంతరం, ఆయనతో కూచొని భోజనంచేస్తూ మాట్లాడే అవకాశం ఇప్పుడు దొరికిందంటావ్" అని నవ్వుతూ అన్నది.

లంచ్ పొడుగూతా, దమయంతికీ పద్మప్రియకూ వీలైనప్పుడల్లా "మరి కాస్త వేసుకో" మంటూ అక్కడి పళ్ళాల్లోని వస్తువులు, నెయ్యీ తానే వేస్తుండేవాడు. కృ. ట్రే ఎవరివైపు వెళ్లబోతున్నా, 'లేడీస్ ఫస్ట్' అని, వాటిని ముందు వీరివైపు తిప్పేవాడు.

వసంత విహార్ డైనింగ్ హాల్ నుండి ఇవతలికి మా ముగ్గురితో మాత్రం వచ్చి, "ఇక ఆ ఎండలోకి రాలేనయ్యా. ఇంతకు మునుపొకసారి ఆ పనిచేసినందువల్ల ఎండ దెబ్బ తగిలింది" అని మా నుండి సెలవుతీసుకున్నాడు. నేను పూర్వంలాగానే, అక్కడ ఎవరూ లేకుండడం చూచి, 'We are blessed' అన్నాను. సమాధానం లేదు, అభ్యంతరం లేదు. కేవలం హృదయంలోకి చొచ్చుకుపోయే ఆ చూపు మాత్రమే.

29న వసంత విహార్ గ్రౌండ్స్‌లో షామియానాలు వేసి, కృతో పొద్దున 7–30 గంటలకు చర్చా కార్యక్రమం పెట్టారు. చాలామంది సమావేశమై చర్చించారు. తొమ్మిది గంటలకు అయిపోయింది. తాను ఒక్కడే వసంతవిహార్ భవనంలోకి వెళ్తున్నాడు.

అటుగా వస్తున్న దమయంతి ఆయనకు ఒంటరిగా ఎదురుపడింది. నేనూ పద్మప్రియా ఇంకా వెనకనున్నాము. నమస్కరిస్తూన్న దమయంతి చేతులు పట్టుకొని "నిన్న మీరు వెళ్ళలేదా?" అని గుర్తుపెట్టుకొని 'కృ' అడుగుతున్నాడు. ఈలోగా మేమక్కడికి వచ్చాం. ఆరోజు సాయంత్రం బండికి వెళ్తున్నామని చెప్పాం. నమస్కరిస్తూ వెళ్ళిపోయాడు. అలా నడిచి వెళ్తున్న ఆయన్ని చూస్తుంటే భగవంతుడు తోడున్నాడు కాబట్టి కానీ, లేకపోతే ఎంత ఒంటరితనమో ననిపించింది.

'కృ'కు ఒకప్పుడు తన ఫోటో తీయడం ఇష్టముండేది కాదు. అటు తర్వాత నైపుణ్య మున్న ఫోటోగ్రాఫర్లు తీయవచ్చునని, కార్యకర్తలు ఆయన్ని ఒప్పించారు. కానీ ఏ కాలంలో కూడా ఎవరు పడితే వారు, అంటే కార్యకర్తల అనుమతి లేనిదే ఆయన ఫోటో తీయడానికి వీలులేదు. అదీకాక 'ఫ్లాష్' వాడితే ఆయనకు చాలా ఇబ్బంది కలుగుతుంది అని అచ్యుత్‌జీ నాతో ఓసారి అన్నాడు. ఇవన్నీ తెలసి కూడా మూడో ఇంటర్వ్యూకు రిషీవాలీ వెళుతూ మదనపల్లి నుండి ఓ ఫోటోగ్రాఫర్‌ను వెంటబెట్టుకుని వెళ్ళాను. పాత గెస్ట్ హౌస్‌లోని మేడ మీద మధ్యహాలులో కూచున్నాము. అచ్యుత్‌జీ, డాక్టర్ పర్చూరే కొంచెం అవతలగా కుర్చీల్లో కూచొని నిశ్శబ్దంగా వున్నారు. కొద్ది నిముషాల్లో కృష్ణజీ వచ్చి మా ముగ్గురితోబాటు కార్పెట్ మీద కూచున్నారు. "నీ చదువు ఇంకా కొనసాగుతూనే వుందా?" అని పద్మప్రియ వంక నవ్వుతూ చూశారు. "యమ్.బి.ఏ. కూడా చేయాలని ఉంది" అని మెల్లెగా అంటున్నది పద్మప్రియ తల్లి.

నేను నా ప్రశ్నాపత్రం ఆయన ముందుంచాను. "నా ఏన్యుయల్ పరీక్ష" అంటూ నవ్వాడు ఆయన. "కానీ మీరు సమాధానాలు తేలికగానే ఇచ్చేస్తారు. ఈ ప్రశ్నలు తయారు చేయడమే ఎక్కువ కష్టంగా వుంది." అని ఏదో నిస్సారమైన చమత్కారం ఒకటి ప్రయోగించాను. "నీ ఇష్టం, ఏదైనా అడుగు" అంటూ ఆ ప్రశ్నలన్నీ పూర్తి చేశాం. ఆయన మాటలు వినడానికి అచ్యుత్‌జీ, పర్చూరే గార్లు బాహ్య నిశ్శబ్దమే కాక మనసును కూడా నిశ్శబ్దంగా వుంచుకునేవారు. అప్పుడే 'కృ' మాట కర్ణంలోనికేగాక, అంతఃకరణం లోనికి కూడా చొచ్చుకుపోతుంది.



కృష్ణజీని ఒక ఫోటోకు ఒప్పించమని అచ్యుత్‌జీని అంతకుముందే అడిగి వున్నాను. 'కృ' లేచి బయలుదేర బోతుండగా 'మీతో ఒక ఫోటో తీయించుకోవాలని వున్నదిట' అని మెల్లగా చెప్పాడు అచ్యుత్. 'ఏమిటి' అన్నట్లు ఒక క్షణంచూచి "Yes, with the family" (ఆహా, కుటుంబంతో సహా) అన్నాడు కృ. సంధ్యాసమయం. ఫోటోగ్రాఫర్ ఫ్లాష్ వాడక తప్పలేదు. 'కృ' చిరాకు ప్రదర్శించకుండా ఓర్చుకున్నాడు. ఫోటోగ్రాఫర్ ఎవరు, కార్యకర్తలు అనుమతించిన వారేనా అనే ప్రశ్నలు ఉదయించలేదు. ఎన్నిటినైనా మన్నిస్తున్నట్లు కనిపించింది.

ఈ ఫోటోను నేను ఏ పత్రికలోనూ ప్రకటించుకోడానికి ప్రయత్నించలేదు. ఇంటర్వ్యూలు ప్రచురించేప్పుడు ఆయన ఫోటోలు ఎక్కడెక్కడివీ సేకరించి వేయించే వాణ్ణి కాని, ఈ కుటుంబం ఫోటో నావద్దనే ఉంచుకున్నాను. ఆ విధంగా ఏడేళ్ళకు పైగా దాచిన ఫోటోను, ఆయన మరణించిన అనంతరం, అమెరికాలో తియసాఫికల్ పబ్లిషింగ్ హౌస్ వారు 'కృష్ణమూర్తితో సంభాషణలు' (Conversation with Krishnamurti) అనే ఆంగ్ల పుస్తకం 1990లో ప్రచురించేటప్పుడు, అడిగితే వారి చేతికిచ్చాను. వారు ఆ ఫోటోను పేర్లూ వగైరా ఏమీ లేకుండా పుస్తకం పేజీల్లో ఒకచోట వేశారు. పుస్తకంలోని

సంభాషణలను బట్టి 'కృ'కు కుడివైపున నుంచున్న చిన్న వయసులో యువతి పద్మప్రియ అనీ, ఎడంవైపున నుంచున్నది నేనూ దమయంతీ అని, పాఠకులే గ్రహించవలసి వుంటుంది.

'కృ'కు మా కుటుంబీకులతో కలిసి భోజనంచేయాలనే కుతూహలం మెండుగానే వున్నట్లు కనిపించింది. ఐదవ ఇంటర్వ్యూ సందర్భంలో వసంత విహార్‌లో కలిసి, అది పూర్తయింతర్వాత ఆయనా, నా కుటుంబీకులూ నలుగురమూ కిందికి దిగివచ్చాము. అప్పటికి పద్మప్రియ రిషీవాలీ స్కూలులో టీచర్‌గా చేరివున్నది. దమయంతీ పద్మప్రియా కాస్తంత అవతలగా వెళ్ళినప్పుడు నేనింకా 'కృ'తో మాట్లాడుతూ నుంచున్నాను. "అయితే ఇక్కడ ఇంకా ఎన్నాళ్ళు వుంటావు?" అని అడిగాడు. "ఈసారి నాలుగైదు రోజులుండి వెళ్ళదలుచుకున్నాను" అన్నాను. "అలాగా, అయితే పామాజీని ఇట్లా పిలవండి" అని అక్కడ ఎవరితోనే అంటే, ఆయన ఆఫీసు గది నుండి 'కృ' పిలుస్తున్నాడని తెలిసి గబగబా వచ్చి వినయంగా నుంచున్నాడు. "పై నాలుగు రోజులు వీరందరినీ ఇక్కడే బ్రేక్‌ఫాస్ట్, ఇక్కడే లంచ్‌కి ఆహ్వానించండి" అని అనేశాడు 'కృ'. 'అలాగేనండి' అంటున్నాడు పామాజీ. చూచేవారికెవరికైనా ఇదంతా ఏదోగా వుంటుందని "మేమెక్కడో దూరంగా హోటల్‌లో దిగాము. రోజూ బయలుదేరి ఇంతదూరం రావాలంటే అంత సౌకర్యంగా వుండదు. మీరు మరోలా అనుకోకపోతే రేపొక్క రోజూ లంచ్‌కి వచ్చి వెళతాం" అన్నాను. "సరే, అలానే కానీ" అన్నాడు.

పామాజీ కాస్త వంగి ఆయన వద్ద సెలవు తీసుకొని 'లంచ్ ఇన్విటేషన్' టైప్ చేయించటానికి ఆఫీసు గదిలోకి వెళ్ళాడు. "నేనూ సెలవు తీసుకుంటానండి" అంటూ, అంతకుముందు పామాజీ ప్రభావం నామీద పడినందువల్ల, ఆ మహా పురుషునికి కొద్దిగా కొద్దిగా వంగి నమస్కరిస్తూ బయలుదేరాను. 'కృ' నావైపు తిరగకుండా అకాశం వంక చూస్తూనే "you need not show respect to me, sir We are old friends. If you want to show respect, you may do it elsewhere" (నువ్వు నాకు గౌరవం చూపించాల్సిన పనిలేదు. మనం పాత మిత్రులం. నీకు గౌరవం ప్రదర్శించాలని అంతగా వుంటే, మరెవరి వద్దనైనా ప్రదర్శించు") సహజంగానే, నాకా మాటలు అర్థం

కాలేదు. మామూలుగా నేను ఆయనతో చనువుగా, చతురోక్తులతో మాట్లాడుతూ వుండడం అలవాటు. అటువంటిది హఠాత్తుగా నేను ఇలా తన యెడల 'అతి గౌరవం' ప్రకటించడం ఆయనకు సమ్మతం కాలేదను కుంటాను. నన్ను 'తన మనిషిగా' భావించాడేమో నాకు తెలియదు. కానీ కొన్ని కొన్ని సందర్భాల్లో ఆయన ధోరణి అలాగే వుంటుండేది.

ఒకసారి రిషీవాలీలో 'లంచ్' భోజనమయిన తర్వాత, ఇద్దరమూ బయటికి వస్తుండగా 'కృ' అక్కడున్న మిగతా వారితో "He agrees with me so easily" (ఇతడు నాతో ఇట్టే ఏకీభవించేస్తాడండీ) అని నన్ను గురించి హాస్యంగా అన్నాడు. పైకి చూడడానికి "అన్నింటికీ అవునంటూ తల ఊపే రకం మనిషి" అని వేళాకోళంగా అన్నట్లు కనిపించి నప్పటికీ, మరేదైనా అర్థమున్నదేమో నాకు తెలియదు. కానీ నాకు మౌనంగా విని ఊరుకునే లక్షణం లేనందువల్ల, "All right sir, In future I will take the earliest opportunity to disagree with you" (అయితే కానివ్వండి; ఈసారి అవకాశం వచ్చీ రావడంతోటే మీరన్న దానికి నా అనంగీకారం తెలియజేస్తాను" అన్నాను. నవ్వుకున్నాడు.

అలాగే ఆనాటి ఓ మంత్రిని గురించి మాట్లాడుతూ నేను "ఏదో అంటాడు, ఏదో మాట్లాడుతాడు, ఎప్పటెప్పటి రాజవంశాల పేర్లో చెప్పి ప్రజలను మభ్య పెడుతుంటాడు. అంతా 'చారిత్రక వినోదం' (Historical entertainment) ప్రదర్శిస్తుంటాడు అన్నాను, 'కృ'తో. "Historical Entertainment. I like that word Historical Entertainment" అని వల్లె వేస్తున్నాడు.

అట్లానే ఒకసారి 'వసంతవిహార్‌లో ఒక ఇంటర్వ్యూ అయింతర్వాత, "నీ ప్రశ్నలు బాగున్నై. వీటికి నా సమాధానాలు జాగ్రత్తగా రాసి, పంపగలవా? ఇంగ్లీష్ నిర్దుష్టంగా ఉండాలి సుమా. ఎక్కడికి పంపిస్తావ్? నేనిక్కడ నుండి బొంబాయి వెళ్తున్నాను. కానీ అక్కడున్న ఆ కొద్ది కాలంలో పంపించలేవేమో "సానన్‌కు పంపిస్తే కవరు ఖాయంగా నాకందుతుందనే నమ్మకం లేదు. బ్రాక్‌వుడ్‌కు పంపించు. నీకూ తగినంత వ్యవధి వుంటుంది. నాకూ ఖాయంగా అందిస్తారు. ఇది పశ్చిమ దేశాల్లో పబ్లిష్ చేయిస్తాను" అన్నాడు. పామాజీ వద్ద నుండి బ్రాక్‌వుడ్ ఎడ్రెస్

తీసుకొని రెండు నెలల అనంతరం పంపించాను. ఏదో ఆటంకం వచ్చి వుంటుంది; బహుశ ఆయన అనుకున్నట్లు అక్కడ పబ్లిష్ అయి వుండదు. కానీ ఆయన సంకల్పం మరో విధంగా నెరవేరింది. మిగతా అన్ని ఇంటర్వ్యూలతోబాటు, ఆయన అడిగిన ఇంటర్వ్యూ ప్రతి కూడా పశ్చిమంలో చివరకు తియసాఫికల్ పబ్లిషింగ్‌హౌస్ వారు 'కాన్వర్జేషన్స్ విత్ కృష్ణమూర్తి' అనే పుస్తకంలో ప్రచురించారు. ఆ పుస్తకం తర్వాత ఇటాలియన్, ఫ్రెంచి స్పానిష్ భాషల్లోకి, మరికొన్ని యూరోపియన్ భాషల్లోకి అనువదింపబడింది.

నామీద ఆయనకేదో నిశ్చయమైన నమ్మకముండేదని అనుకుంటాను. ఒకసారి వసంత విహార్‌లో పద్మప్రియ 'మనిషిలోని ఈ అభద్రతా భావానికి కారణమేమిటంటారు?' అని ఆయన్ని అడిగితే, "ఇంటలిజన్స్ లేకపోవడం. ఒకసారి గనక ఆ 'ఇంటలిజన్స్'ను కనుగొన్నావంటే, ఇక ఆ తర్వాత, అభద్రత అనేది మనిషిని ముట్టుకోలేదు" అని అంటూ నా వంక తిరిగి "ఇంటలిజన్స్‌కు నేనిచ్చే ప్రత్యేకార్థం నీకు తెలుస్తూనే వుంది కదా?" అని అన్నాడు.

అలాగే ఒకసారి రిషీవాలీలో సంభాషణ ఒక దరికి వచ్చినప్పుడు, "అంటే మీ ఉద్దేశం One can only become God, but not see God అనేనా?' (మనిషి దైవమయ్యే వీలుంది కానీ, దైవాన్ని కంటితో చూడలేడు అనేనా?) అన్నాను. నేనలా అడిగింది నాకే అనుభవమూ వుండికాదు. భగవంతుడు Object కాదు కాబట్టి, అదో subjective అనుభూతే కాబట్టి. అది మనిషిలో ప్రదర్శితమైనప్పుడు, ఇతర్లు చూడగలరు; తానైనా మరొకరిలో చూడగలడే కానీ, ఒకచోట స్థాణువుగా కనిపించేదేదీ వుండదనే ఉద్దేశంతో అడిగాను. మామూలుగా God అనే పదాన్ని ఆయన తన ప్రసంగాల్లో ప్రయోగించడన్న విషయం ఠటాల్న గుర్తుకువచ్చి, ఈయన ముందు ఈ పదం వాడినందుకు ఎలా రియాక్ట్ అవుతాడోనని చూస్తూంటే ఆయన లేచి తన గది కిటికీ వైపుకు వెళ్తూ 'అంతే'నన్నట్లుగా తల ఊపుతున్నట్లు కనిపించింది. మనిషి తన కోరిక కొద్దీ, భయంకొద్దీ సృష్టించుకున్న 'దేవుణ్ని' 'కృ' తిరస్కరించాడే గానీ, మానవ ఆలోచనా పరిధిని దాటి, పవిత్రమైనదేదీ లేదని ఏనాడూ అనలేదు; పెను

జీకటి కావలవున్న దానిని దర్శించమనే, జీవితం పొడుగూతా ఘోషిస్తూ వచ్చాడు.

ఒకమారు రిషీవాలీలో ఉన్న టీచర్లనందర్నీ సమావేశపరిచి, వారితో తాను ఆశించే భావం బలీయంగా నెలకొన్నదా లేక కేవలం సాధారణ విద్యలు బోధించటంలోనే నిమగ్నమై నారా, అని పరిశీలించి చూశాడు. శ్రీమతి  రాధికా హెర్జ్‌బర్గర్‌తో ఆ సమావేశానికి నన్ను కూడా ఆహ్వానించమని చెప్పాడు. వెళ్ళి మౌనంగా కూచున్నాను. సుమారు రెండుగంటల సేపు సాగిన చర్చనంతా విన్నాను. మర్నాడు ఉదయం 'కృ'తో సమావేశమైనప్పుడు, 'చూచావుగా, నువ్వూ నిన్న ఆ సమావేశంలో వున్నావు. ఇక్కడి టీచర్లందరూ నా మాటను పూర్తిగా అర్థంచేసుకొని వుంటే, ఎంత మార్పు తీసుకువచ్చే వీలుందంటావ్?" అని అడిగాడు. ఆయనకు నామీద ఉన్న విశ్వాసాన్ని వమ్ము చేయననే నమ్ముతున్నాను.

సరస సంభాషణ అధికంగా చేసే నా మీద ఇష్టమలా వుంచి, ఎక్కువ మాట్లాడని దమయంతి, పద్మప్రియల మీద ఆయనకు ఇష్టమెక్కువగా ఉండేది. చదువరులు మన్నిస్తే ఇది నేననుకుంటున్న మాటే కానీ, ఇందులో ఎంత నిజముందో నాకు తెలియదు. రాజఘాట్ సమావేశమప్పుడు, అక్కడికి వచ్చిన వారందరి మధ్యా వచ్చి కూచొని తానూ భోజనం చేసి బయటికి వస్తున్నప్పుడు 'కృ'ను నేనోవైపు నుండి వచ్చి కలిశాను. రాజఘాట్‌లో నేను తటస్థపడడం ఆయనకు కొంచెం ఆశ్చర్యం గొలిపి, అయితే ఆ ఆశ్చర్యాన్ని ప్రకటించిన తీరు 'Whee is your wife, Sir?' (నీ భార్య ఏదండీ?) అని అడగడం. నేను కనిపిస్తే నా భార్య కనిపించాలి, అని ఆయన ఉద్దేశం. ఒక్క నిమిషం ఆలస్యంగా, ఆమె కూడా వచ్చి ఆయనకు నమస్కరిస్తూ నుంచున్నది. విధివశాత్తూ, తర్వాతి కాలంలో నా అనువాదం ఏదీ ఫౌండేషన్ ద్వారా ప్రచురించకముందే, నా శ్రీమతి నీలంరాజు దమయంతి పుస్తకం, 'గరుడయానం' (కృష్ణమూర్తి గారి The flight of the eagle కు అనువాదం) ఫౌండేషన్ వారి తెలుగు ప్రచురణల్లో ఒకటిగా విడుదల అయింది. రిషీవాలీలో ఒకమారు ఆయన వద్ద నుండి ఆ పూటకు  సెలవు తీసుకుంటూ ఇవతలికి వస్తుంటే, పద్మప్రియతో "నీ పేరేమిటి" అని అడిగాడు 'కృ'. 'పద్మప్రియ' అని చెప్పింది. 'What does it mean!' (అంటే అర్థమేమిటి?) అని అడిగాడు 'పద్మ' is lotus

ప్రియ is one who loves them అన్నది. "But there are no lotuses in Rishi Valley" (కానీ రిషీవాలీలో పద్మాలు లేవే) అన్నాడు 'కృ'.

'కృ'కు నా పేరు ఏనాడూ గుర్తుండి వుండదు. కేవలం మనిషి గుర్తే. ఏదో సందర్భంలో నాతో మాట్లాడుతూ, "నువ్వు నన్ను ఏటా కలుస్తుంటావు. అందుచేత నువ్వు నాకు తెలుసు అనుకుంటావు కానీ అది నిజమవుతుందా? నిన్ను నేను నిజంగా ఎరిగున్నానా? ఇప్పుడే కాదు. ఎప్పటికైనా నిన్ను నేను సంపూర్తిగా ఎరుగగలనా?" అని అన్నాడు 'కృ'. ఈ మాటల ఉద్దేశం బహుశా తనని నేను ఏటా ఏటా కలిసినా సంపూర్తిగా ఎరిగే అవకాశం లేదని చెప్పడమే ననుకుంటాను. అందువల్లనే నేను 'కృ'ను ఎరిగున్నానని చెప్పడం అసందర్భమవుతుంది. "ఆయన్ని మీరు ఎరిగున్నారట కదా?" అని అడిగినప్పుడు "ఆ మాటతో నిమిత్తమేమున్నది లెండి? ఆయన టీచింగ్‌ని గురించి ప్రస్తావించండి. మాట్లాడు కుందాం. ఎంతసేపైనా మాట్లాడుకోవచ్చు. ఆయన టీచింగ్‌ని అర్థంచేసుకోడానికి, ఆయన్ని వ్యక్తిగతంగా ఎరిగుండడం ఏ విధంగానూ సహాయపడదు" అంటుంటాను. పెడసరంగా మాట్లాడాననుకుంటారు. కానీ అదే నిజం; నిష్ఠురంగా కనిపిస్తుంది.

ఆ మాటకొస్తే ఏ మనిషిని మరో మనిషి ఖాయంగా ఎరిగున్నాననుకునే వీలులేదు. ఏ నిమిషాన ఏమి పరివర్తన వస్తుందో, ఎవరూహించగలరు? జీవరాసులన్నీ చాలావరకు యాంత్రిక జీవితం గడుపుతై. మనిషి ఒక్కడే అసాధారణంగా మార్పు చెందగలిగినవాడు.

ఒకసారి ఇంటర్వ్యూ అయిపోయిన తర్వాత నా కాగితాలు, దమయంతి పద్మప్రియ చేతుల్లోని కాగితాలు అన్నీ తీసి, ఒకటిగా నేను పెట్టుకుంటూ వుంటే, "ఈ రాసుకున్న దానితో ఏమిచేస్తుంటావయ్యా?" అని అడిగాడు. నేను ఓ పత్రిక తరఫున వస్తున్నానని మరిచినందువల్లనో, మరే కారణమో తెలియక. "ఇదంతా యధావిధిగా తెనుగు చేసి ఓ వారపత్రికలో ప్రచురిస్తుంటాను" అని చెప్పాను. "అలాగా?" అని వూరుకున్నాడు.

ఆ తర్వాత రిషీవాలీకి వచ్చినప్పుడు, అంతకుమునుపు మూడు నాలుగేళ్ళుగా ప్రచురించిన ఆంధ్రప్రభ వీక్లీ కవర్‌పేజీని, లోపలి ఇంటర్వ్యూ పేజీలను మాత్రం

ఒకటిగా వుంచి ఆయనకిద్దామని, రిషీవాలీలో శ్రీ విశ్వనాథ్ అనే ఆర్టిస్టు వుంటే, అవన్నీ అతని చేతికిచ్చి, ఆర్టిస్టిక్‌గా ఒక అట్టతో బైడింగ్ చేయించి, 'కృ'కు ఇచ్చాను. 'ఇక్కడ రాసుకు వెళ్ళేదంతా ఈ పత్రికల్లో ప్రచురిస్తుంటాను. అదే తెచ్చాను' అన్నాను. పై అట్టతీసి చూచి తన ఫోటో ఏదో కనిపిస్తే తెనుగు అక్షరాలు తనకు తెలియకపోయినా, అటూ ఇటూ చూస్తూ పేజీ తిప్పాడు. తర్వాతి కవర్‌పేజీ మీద, సహజంగా సినిమాస్టార్ బొమ్మలున్నై. 'With Cinema stars' (సినిమా స్టార్ల మధ్యా? భలే భలే) అంటూ నవ్వుతూ మూసేశాడు. ఆయన అలా అంటే నేనేమిచేయగలను? అంతేకాదు. ఆయన ఇంటర్వ్యూ కింద, పేజీలో చోటుంటే ఏదో ఒక వ్యాపార ప్రకటన కూడా ఉంటుంది. పత్రికల వారిని నేనెలా శాసించ గలను?

ఇలాంటిదే మరో సంఘటన. ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌లో 'కృ'ను గురించి రెండు ఆంగ్ల వ్యాసాలు వ్రాశాను. మొదటిది ప్రచురించినప్పుడు, అప్పటికే ఆయన మద్రాసు నుండి బొంబాయి వెళ్ళిపోయాడు. ఆ వ్యాసం 'కట్టింగ్' బొంబాయిలో వున్న డాక్టర్ పర్చూరేకు పంపించి, 'కృ'కు అది చూపించమన్నాను. 'ఏటా వచ్చి మిమ్మల్ని మద్రాసులో ఇంటర్వ్యూ చేసి వెళ్ళే అతడు వ్రాసిన ఇంగ్లీష్ వ్యాసం" అని ఆయన ముందు ఉంచాడు. తన ఫోటోతో సహా ప్రచురించిన ఆ వ్యాసాన్ని చూస్తూ ఎంత సన్నని ప్రింటండీ? ఏమి అధ్వాన్నపు కాగితమండీ?" అన్నాడని శ్రీ పర్చూరే తర్వాత నాకు తెలియచేశాడు. ఆ ఉత్తరంలో శ్రీ పర్చూరే, "ఆ ప్రింటుకీ న్యూస్‌పేపర్ వాళ్ళు వాడే ఆ కాగితం నాణ్యానికి నువ్వెలా బాధ్యుడివో నాకూ అర్థంకావడంలేదు" అని రాశాడు. 'కృ'కు సంబంధించిన విషయాలు అందంగా తీర్చిదిద్దాలి, అని నాకూ ఉన్నది. కానీ ఎవరి పరిమితులు వారివి. అమెరికాలో పబ్లిష్ అయిన "జి. కృ.తో సంభాషణలు" 'ప్రొడక్షన్ వేల్యూస్' ఉన్నత స్థాయిలోనే వున్నై కాబట్టి, ఈ పొరపాట్లన్నీ పరిహరించబడినై అని అనుకుంటాను.

1983 ఫిబ్రవరిలో, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం యాభై అయిదేళ్ళపైబడ్డ ప్రభుత్వోద్యోగులను హఠాత్తుగా వారి ఉద్యోగాల నుండి తొలగించింది. రాష్ట్ర గణాంక శాఖలో జాయింట్ డైరెక్టర్‌గా పనిచేస్తున్న నేను ప్రభుత్వం నుండి రిటైరయ్యాను.

పత్రికలకూ, జర్నల్స్‌కు రాస్తుండేవాణ్ణి. రేడియోలో ప్రసంగిస్తుండేవాణ్ణి. పెన్షను వస్తున్నప్పటికీ ఆర్థికంగా కాస్త దెబ్బతిన్నాను. 'డాటా న్యూస్ ఫీచర్స్' అనే సంస్థకు కొన్నాళ్ళు ఎడిటర్ చేసేవాణ్ణి. చివరకు జస్టిస్ చిన్నపరెడ్డి ఔదార్యంతో ఇచ్చిన తీర్పు ఫలితంగా అందర్నీ మళ్ళీ ఉద్యోగాల్లోకి తీసుకున్నారు. నన్ను ప్రభుత్వం డైరెక్టర్‌గా ప్రొమోట్ చేసి బకాయిలు ఇచ్చేశారు.

పద్మప్రియ B.Com.(Hons.) ప్యాసయింది. ఇంకా చదవవలసి వుండెను. ఈలోగా సరదాకి బ్యాంకు పరీక్షలు రాసింది. రెండు బ్యాంకుల వాళ్ళు సెలెక్టుచేసి ఉద్యోగమిచ్చి, వచ్చిచేరమన్నారు. ఒక బ్యాంకులో చేరింది. కానీ మనసు ఈ ఉద్యోగం మీదలేదు. కృష్ణమూర్తి గారి పుస్తకాలు కాలేజ్‌లో ఉన్నప్పుడూ, ఆ తర్వాత చదువుతూ, ఆ భావజాలంతోనే తిరుగుతుండేది.

దృష్టి యావత్తూ స్వేచ్ఛ, సృజనాత్మకత, పిల్లలకు విద్యగరపడం, తర్వాతి కాలంలో ప్రభుత్వ పాఠ్యగ్రంథాలు తయారు చేయడంలో ప్రభుత్వానికి సహకరించడం, వీటి మీదనే వుండేది. రిషీవాలీలో చేరిన తర్వాత కూడా, టీచర్ ఉద్యోగానికి సెలవుపెట్టి, తిరుచినాపల్లి రీజనల్ ఇంజనీరింగ్ కాలేజ్‌లో M.C.A. కోర్సు పూర్తిచేసి ర్యాంకుతో పాసైంది. బెంగుళూరులో ఒక కంపెనీలో ప్రాజెక్టు వర్కుచేస్తుంటే, ఆ కంపెనీవారు తమ లండన్ కార్యాలయంలో ఉద్యోగమిస్తామన్నారు. ఒకప్పుడు తన (కానున్న) భర్త విదేశాల్లో ఉన్నప్పుడు అక్కడి యూనివర్సిటీ వారు ఉద్యోగం చేయమని అడిగారు. కానీ భార్యాభర్తలిద్దరూ కృష్ణమూర్తి గారికి, ఆయన ఫౌండేషన్‌కూ అంకితమైనవారు. ఎక్కడ తిరిగినా, చివరకు గమ్యం రిషీవాలీయే. ఇప్పుడు (2013లో) శైలేష్, ఫౌండేషన్ వారి సహ్యాద్రి స్కూల్ (పూనావద్ద) ప్రిన్సిపల్‌గానూ పద్మప్రియ, అదే స్కూలులో మరో ఉద్యోగము చేస్తున్నారు. పద్మప్రియ కొంతకాలం మహారాష్ట్ర లోని జలగాం నగరంలో అక్కడి 'అనుభూతి' స్కూల్ ప్రిన్సిపల్‌గా చేసింది.

1982లో కృష్ణమూర్తిగారు పద్మప్రియతో నువ్వు రిషీవాలీలో వచ్చి పనిచేయదలుచుకున్నప్పుడు, ఎప్పుడైనా వచ్చి చేరవచ్చు. This offer holds అన్నందువల్ల, హైదరాబాద్‌లో ఈ బ్యాంకు ఉద్యోగం మనసుకు నచ్చనందువల్ల నవంబర్ 1983లో పద్మప్రియ

రిషీవాలీ స్కూలులో టీచర్‌గా చేరిన తర్వాత, నేను, సౌ॥ దమయంతితో పాటు రిషీవాలీలో వుండడం గురించి కృష్ణమూర్తిగారు ప్రస్తావించారు. “మీ ఇష్టం. ఉండమంటే ఉంటాను” అన్నాను. “నీ గురించిన వివరాలు తెలియజేస్తూ, రిషీవాలీలో వుంటూ, కృష్ణమూర్తి ఇంగ్లీష్ పుస్తకాలను తెలుగులోకి అనువదిస్తాను” అని ఒక దరఖాస్తు రిషీవాలీ వారికి పంపించు” అన్నారు కృష్ణమూర్తిగారు. "At your instance (మీరు సూచించినట్లుగా తెలియజేస్తూ) అని ప్రారంభించి రాయమంటే రాస్తాను” అన్నాను. రిషీవాలీలో ఏదో ఇంతచోటు దక్కించుకొని ఆ ప్రశాంత వాతావరణంలో కాలం వెళ్ళబుచ్చుదామని నాకు లేదు.

హైదరాబాద్ నగరం మధ్యలో వుంటూ (స్వగృహంలో) కృష్ణమూర్తి గారిని గురించి పత్రికల్లో వ్యాసాలు రాస్తూ, రేడియోలో ప్రసంగిస్తూ, నగరంలోని తియొసాఫికల్ సొసైటీ బ్రాంచీలలోనూ, కృష్ణమూర్తి సెంటర్‌లోనూ చిక్కడపల్లిలోని ‘యోగాలయ’లోనూ విస్తృతంగా ప్రసంగిస్తూ, ‘ఏక్టివ్’గా జీవితం గడపాలని అనుకుంటున్నవాణ్ణి. ఈ అనుకున్నదంతా 1983 నుండి 2010 వరకూ చేశాను. ఆ కాలంలో కాకినాడ దివ్యజ్ఞాన సమాజం వారి ఆహ్వానం మీద అక్కడికి కూడా వెళ్ళి మూడు రోజుల సమావేశం నిర్వహించేవాణ్ణి.

కాబట్టి రిషీవాలీలో ఉండిపోతే ఇదంతా చేయలేను కాబట్టి, ‘మీరు ఉండమంటే అలాగే వుంటా’ (సంతోషంగానే ననుకోండి) అని ఆయనకలా సమాధానం చెప్పాను.

‘అలాగే (నేను నీతో చెప్పినట్లే) రాయి’ అన్నారు ఆయన. నా వివరాలు, నా పరిపాలనా అనుభవం, రేడియోలోనూ పత్రికల్లోనూ నే చేసిన కృషి తెలియజేస్తూ, రిషీ వాలీలో వుంటూ ‘కృ’ పుస్తకాలు తెనుగులోకి అనువదిస్తాను, అని రిషీవాలీ యజమాన్యానికి ఉత్తరం రాశాను.

‘కృ’తో చనువుగా సమీపంగా తిరుగాడు తున్నందువల్ల, అక్కడున్న కొందరికి ఇది నచ్చలేదు. ‘అనువాదాలు చేయడానికి, ఇక్కడే వుండి చేయాల్సిన అవసరమేముంది?’ అని మాట్లాడేటప్పుడు నోటి మాటగా విమర్శించారు. కాగితంమీద మాత్రం, “ఇప్పటికే

రిషీవాలీ 'సర్వీసెస్' మీద, వొత్తిడి అధికంగా ఉంది. కొత్తవాళ్ళను చేర్చుకొని బరువు పెంచగలిగేము" అని తీర్మానం చేశారు.

మద్రాసులో 'కృ' ప్రసంగాల కాలంలో ఆయన్ని కలిసినప్పుడు "ఏమయింది?" అని అడిగారు. 'ఇలా తీర్మానించారు' అని చెప్పాను. ఆయనకు అక్కడితో వదిలిపెట్టాలని లేదు. 'నేనీ దేశం నుండి వెళ్ళేలోగా, స్కూలుకు చెందిన ఒక ముఖ్య కార్యనిర్వాహకులు నన్ను బొంబైలో కలుస్తారు. నేను వారితో మాట్లాడుతాను. నువ్వు వారి పేరిట మళ్ళీరాసి బొంబైకి ఉత్తరం పోస్టు చేయి' అన్నారు. దీనికై వెంపరలాడడం నాకిష్టం లేకుండాపోయింది. అయినప్పటికీ ఆయనకొచ్చిన ఆలోచనను కాదనడం దేనికని – ఆ ప్రశాంత వాతావరణంలో ఎక్కువ రాతపని చేయగలుగుతానేమోననే ఆశలేకపోలేదు – రాశాను. బొంబైలో వారికి గట్టిగా చెప్పినట్లున్నాడు. నన్నొకసారి రిషీవాలీకి రమ్మని ఉత్తరం రాశారు.

మొదట్లో వ్యతిరేకించినవారు, ఈ రెండో ప్రయత్నాన్ని కూడా అంత గట్టిగానూ తిరస్కరించారు. 'కృష్ణమూర్తిగారు ఇలా అభిప్రాయ పడుతున్నారు' అని వీరంటే 'ససేమిరా, కాద'న్నారు వారు. ప్రయత్నిస్తున్న వారి మాటకడ్డమొచ్చి, నేనే 'దీనికై ఎందుకింత పట్టు బడతారు? నేనిక్కడ ఉండినా ఉండకపోయినా, చేయాల్సిన పని ఎలాగూ చేస్తూ వుంటాను. దీనికింత వాదోపవాదాలెందుకు?' అని సర్ది చెప్పాను. నేను అడుగు వెనక్కు తీసుకునే సరికి, ఇరువర్గాలు ఊరట చెందినై.

'కృ'గారికి ఖండఖండాంతరాల్లో, ఫౌండేషన్ పనులతో మరెన్నో సమస్యలుండి వుంటై కాబట్టి, నేను మళ్ళీ మరు సంవత్సరం కనిపించినప్పుడు దీనిని గురించి ప్రస్తావించడం మానేశారు. నేనూ, సంస్థల్లో భాగంగా వుంటూ, పనిచేయగలిగేను. 'టీచింగ్'కు స్వేచ్ఛగా అంకితమై, వ్యక్తిగత స్పర్థలతో నిమిత్తం లేకుండా, నిరాటంకంగా పనిచేసే వీలు దొరకడమే నాకు ముఖ్యమనిపించింది.

కానీ రిషీవాలీలో ఓ పది సంవత్సరాలపాటు తడవకో మూడు నెలలు ఉంటూ ఉండడం మరొకరకంగా సంభవించింది. 1983 చివర్లో రిషీవాలీలో టీచర్‌గా పనిచేయ

నారంభించిన చి. పద్మప్రియ, అంతకుమునుపే టెక్సాస్ (అమెరికాలో) విద్యాభ్యాసం పూర్తి చేసుకొని కెనడా యూనివర్సిటీలో పనిచేస్తూ, 'కృ' యెడల, రిషీవాలీ యెడల అంకిత భావంతో, రిషీవాలీ స్కూలులో టీచర్‌గా చేరిన శైలేష్ షిరాలీ, పరస్పరం కలవడం, కొంత పరిచయం తర్వాత స్నేహం, మరికొంత కాలానికి వివాహమాడా లనుకోడం జరిగినై. అయితే వివాహమాడేముందు కృష్ణమూర్తి గారికి, ఇక్కడ హైదరాబాదులో మాకు తెలియజేయాలని నిశ్చయించుకొని, ఆ సమయానికి (1984 నవంబరు) రిషీవాలీలో వున్న కృష్ణమూర్తి గారికి ఆయన పర్సనల్ ఫిజీషియన్ డాక్టర్ పర్చూరే ద్వారా తెలియజేశారు. 'కృ' గారికి పద్మప్రియ బాగా గుర్తే కానీ శైలేష్ అంతగా తెలియదు. వివాహం ఎవరితో నిశ్చయించు కుంటున్నదీ డాక్టర్ పర్చూరేను వివరంగా అడిగి తెలుసుకున్నారు. చి. పద్మప్రియ క్షేమం ఆయనకంత ముఖ్యంగా తోచింది. పద్మప్రియ, శైలేష్‌లు రిషీవాలీలో కృష్ణమూర్తి గారిని ఆయన గదికి వెళ్ళి కలిసి విషయం వివరించినప్పుడు, ఆయన "ఈ వివాహం జరిగితే ఆ పుట్టేపిల్లలు ఈ రిషీవాలీలోనే పెరుగుతారు. ఇక్కడే చదువుకుంటారు గదా" అని తనలో తాను అనుకుంటున్నట్లు గమనించారు.

పద్మప్రియతో వివాహం సంగతి ప్రస్తావిస్తూ, శైలేష్ నాకు హైదరాబాద్‌కు ఉత్తరం రాశాడు. రిషీవాలీలో నేను అతణ్ణి అంతకుముందు చూసి వున్నాను. నేను ఢిల్లీలో వున్న అతడి తండ్రి అశోక్ షిరాలీకి ఉత్తరం రాసి, ఆయన అభిప్రాయం కనుగొన్నాను. "మా కుమారుడు ఏ నిర్ణయానికి వస్తే, అదే మా నిర్ణయం అని రాశాడు. (ఆయన రిటైర్డ్ జాయింట్ సెక్రటరీ, కేంద్ర ప్రభుత్వ ఫైనాన్స్ డిపార్ట్‌మెంట్).

'వివాహం, నేనీ దేశంలో వున్నప్పుడే జరుగుతుందా?' అని అడిగాడు కృష్ణమూర్తి గారు. ఆయన ఉద్దేశం నాకు అర్థమయింది. 'ముహూర్తాలున్నాయో లేదో' అన్నారు కొందరు. నా సీనియర్ స్నేహితుడు, శ్రేయోభిలాషి శ్రీ పెమ్మరాజు వెంకటరావు గారికి వెళ్ళి చెప్పాను. 'పెట్టుడు ముహూర్తంలో చేద్దాం' అని ప్రోత్సహించారు వెంకట్రావుగారు. ఒకప్పుడు పెమ్మరాజువారు ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కమిటీకి జనరల్ సెక్రటరీ. చాలా పలుకుబడిగల్గిన కాంగ్రెస్ నాయకుడు.

'కృష్ణమూర్తి గారు ఫిబ్రవరి 8, 1985 నాడు బొంబై వదిలి రోమ్‌కు వెళ్తారు. మనమీలోగా...' అని నేను "నాకు వదిలేయండి," అని పంచాంగాలు చూసి లెక్కలు కట్టి ఎలాగో ఫిబ్రవరి 1 అని ముహూర్తం నిర్ణయించాడు. విజయనగర కాలనీలో కమ్యూనిటీ హాలు బుక్ చేశాను. మద్రాసుకు వెళ్ళినప్పుడు అక్కడ శ్రీ అచ్యుత్ పట్వర్ధన్, రిషీవాలీకి వెళ్ళినప్పుడు, డాక్టర్ రాధికా హెర్జ్‌బర్గర్, 'వివాహం రిషీవాలీలోనే చేస్తే సరిపోతుంది కదా?' అన్నారు. వారి ఉద్దేశం ఈ ఇద్దరు టీచర్ల సహోద్యోగులు, మిత్రులూ ఇక్కడ రిషీవాలీలోనే వున్నారు. ఈ రిషీవాలీ పెద్ద మర్రిచెట్టు (నాలుగువందల ఏళ్ళనాటిది) కింద వేదికమీద చేస్తే చూడముచ్చటగా ఉంటుందని. ఆ వేదికమీద అనేక రకాల సంగీత కచ్చేరీలు, నృత్య ప్రదర్శనలు జరిగినై కానీ వివాహమనేది అంతవరకూ ఎప్పుడూ జరగలేదు. ఈ ఒక్క వివాహం మాత్రం ఆ చెట్టుకింద జరిగింది. కృష్ణమూర్తిగారు అనేక సాంస్కృతిక కార్యక్రమాలు నవంబర్, డిసెంబర్‌లలో ఆ చెట్టుకిందే తిలకించేవారు.



*వివాహం జరిగింది ఈ మర్రిచెట్టు కిందే*

వధూవరుల తల్లిదండ్రులు, సమీప బంధువులు ఫిబ్రవరి 1లోగా రిషీవాలీకి వచ్చారు. గెస్ట్ హౌసస్ నిండిపోయినై. రిషీవాలీలోని టీచర్లు, ఉద్యోగులు, అందరూ ఆహ్వానితులే. చుట్టుపక్కల గ్రామాలలోని పల్లెప్రజ 'సీతారాముల' కళ్యాణానికి అందరూ ఆహ్వానితులే నన్న చందంగా గుంపులు గుంపులుగా వచ్చారు.

మదనపల్లె నుండి పిలిపించిన పురోహితుల ఆధ్వర్యంలో ఫిబ్రవరి 1న రాత్రి 8 గంటలు ముహూర్తానికి వివాహం కన్నుల పండువుగా జరిగింది. ఆ సమయానికి కృష్ణమూర్తి గారు బొంబైలో ప్రసంగిస్తూ వున్నారు. వివాహమైన మర్నాడు రిషీవాలీ నుండి బయలుదేరి, హైదరాబాద్‌కు చేరాం. 4వ తారీఖునాడు రిసెప్షన్ వేడుక ముగించి, మర్నాడే వధూవరు లిద్దరూ రైలులో బొంబాయికి బయలుదేరారు.

7వ తారీఖున కృష్ణమూర్తిగారు పాల్గొంటున్న ఫౌండేషన్ మీటింగ్ స్థలానికి వెళ్ళారు. 'కృ'గారు 8వ తారీఖున రోమ్ నగరానికి వెళ్ళాల్సివుంది. వివాహమూ, రెసెప్షనూ ఆఘ మేఘాల మీద ఏర్పాటుచేసి అన్నిటినీ వేవేగంగా ముగించాల్సిన కారణం, ఆయన బయలు దేరేలోగా ఆయన వద్దకు వెళ్ళి ఆశీస్సులు పొందాలని. ("ఆశీస్సులు' అనేవి మా మనసు లోని మాట. ఆయనవాడే పదం కాదు).

ఫిబ్రవరి 7, 1985 మధ్యాహ్నం మీటింగ్‌లో వున్న కృష్ణమూర్తి గారికి తాము దర్శించుకోడానికి వచ్చామని నూతన వధూవరులు లోనికి కబురంపారు. మీటింగ్‌లో పాల్గొంటున్న ఆయన ఇవతలి హాలులోకి వచ్చి, ఇద్దరి చేతులూ పట్టుకుంటూ తన సంతోషాన్ని ప్రకటించారు. 'ఇవాళ ప్రొద్దున్నే బట్టలు సర్దుకుంటూ నా కాగితాల్లో ఈ వివాహ ఆహ్వాన పత్రికను చూసి ఇక తీసెయ్యాలి కదా అనుకుంటున్నాను' అన్నారు నవ్వుతూ. ఆయన అనుకున్నట్లు, తాను దేశంలో వున్నప్పుడే, ఇదంతా తనకు అత్యంత ప్రియమైన రిషీవాలీ మర్రిచెట్టుక్రింద జరిగింది. ఇలా జరగడం, రిషీవాలీలో ఇదే ప్రథమం, ఆఖరు కూడానేమో.

ఈ ఉదంతం అంతా చెప్పకముందు, నేను ఆడపా దడపా నెలలపాటు రిషీవాలీలో ఓ పదేళ్ళపాటు వుండకపోలేదు, అన్నాను. అందుకు దారితీసిన పరిస్థితులు 1994లో సంభవించినై. ఆ సంవత్సరం జనవరిలో శైలేష్ పద్మక్రియలకు 'కారుణ్య' జన్మించింది.

అప్పటి నుండి తరచూ నేనూ నా భార్య దమయంతీ రిషీవాలీకి వెళ్ళవలసి వచ్చింది. నేను రిషీవాలీ వచ్చిపోతూండడం చూసి, స్కూల్ డైరెక్టర్ ఆఫ్ స్టడీస్ శ్రీమతి రాధికా హెర్జ్‌బర్గర్ 'మదనపల్లిలో కృష్ణమూర్తి జన్మించిన గృహాన్ని మన ఫౌండేషన్ నిర్వహణలోకి తీసుకున్నది. 'కృ' స్టడీసెంటర్ మనమక్కడ ఏర్పాటు చేశాం. ఊళ్ళో వాళ్ళకి కృష్ణమూర్తిని గురించీ, ఆయన బోధను గురించీ చెప్తే బాగుంటుంది. ఎలాగూ నువ్వు తరచూ వస్తున్నావు కాబట్టి వచ్చినప్పుడల్లా ఓ ఐదారు ప్రసంగాలు చేసి వెళ్ళు' అని సూచించింది.

సంతోషించాను. కృష్ణమూర్తి పుట్టిన ఇంట్లో విహరించడం, ఆయన అంబాడిన, అడుగులు వేస్తూ నడయాడిన ఆ ఇంట్లోనే, నేను ప్రసంగించడం, ఏదో ఒక వింత భాగ్యంగా తోచింది. ఆ విధంగా ఓ పది పన్నెండేళ్ళపాటు సంవత్సరానికో రెండు మూడుమార్లు వెళ్ళి, 'కృ' జన్మించి కొన్నేళ్ళపాటు తిరుగాడిన ఇంట్లో, ఓ నలభై మందితో ప్రసంగించే వాణ్ణి. కవులు రచయితలు, టీచర్లు, ఇతర పెద్దలు వస్తుండేవారు. 'కృ'ను ఎరిగిన కొందరు వృద్ధులు కూడా వచ్చి ఆనందిస్తుండేవారు.

సాహితీకారులు శ్రీ ఆర్.యస్. సుదర్శనం, ఆయన సతీమణి శ్రీమతి వసుంధరా దేవి (రయితలుగా ఇద్దరూ ప్రసిద్ధులే) ఊళ్ళో వుంటే తప్పనిసరిగా హాజరయ్యేవారు. స్టడీ సెంటరును జర్నలిస్టు శ్రీ పురాణం త్యాగమూర్తి శర్మ నిర్వహిస్తుండేవారు.

అక్కడ నే మాట్లాడిన రోజులు చాలా ఉత్సాహభరితంగా వుండేవి. కృష్ణమూర్తిగారిని గురించి మాట్లాడితే అలుపురాదు సరికదా, కొత్త ఉత్సాహం పుట్టుకువస్తుంది. ఆ శక్తి అటువంటిది కాబోలు.

1985 డిసెంబర్‌లో నేనూ దమయంతీ 'కృ'ను కలవడానికి వెళ్లినప్పుడు ఆయన ఆరోగ్యం బాగా దెబ్బతిన్నదని, అక్కడ అందరితోబాటు మాకూ తెలిసింది. ఈసారి కూడా ప్రశ్నాపత్రాలు తీసుకువెళ్ళినప్పటికీ, ఆయన్ని ఇంటర్వ్యూ పేరిట బాధించడం ధర్మం కాదని అనిపించి, "మీకు కులాసాలేనట్లున్నది. ఈ ఇంటర్వ్యూ జరగకపోయినా వచ్చిన నష్టమేమీ లేదు. మిమ్మల్ని కలిసి వెళ్ళిపోదామనుకుంటున్నాము" అన్నాను. "మరేం ఫర్వాలేదు. కానీ" అన్నారాయన. ప్రతిసారీ కళ్ళద్దాల సహాయం లేకుండా టైప్డ్ కాగితాన్ని తానే చదువుతూ సమాధానం చెప్తుండేవారు. కానీ ఈసారి ఆయనకు శ్రమ

ఇవ్వకూడదని, "నేనే ప్రశ్నలు చదువుతాను" అన్నాను. "నీ ఇష్టం. నీకేది అడగాలని వుంటే, అదడుగు". ఒక్కొక్క ప్రశ్నకు సమాధానం, అందులోనే ఏవో జోకులు చెప్తూ, మేమిద్దరమూ తలవంచుకొని చకచకా వ్రేళ్ళు నొప్పిపుట్టేట్టు రాసుకుంటావంటే, తాపీగా చూస్తూ వున్నారు; ఇంటర్వ్యూ క్లుప్తంగా ఓ అరగంటలో ముగించాము. అంతా అయిపోయిన తర్వాత ఇహ మళ్ళీ ఆయన్ని చూచే అవకాశ ముండదని, "May we bow before you in the traditional Indian fashion Sir?" (మీకభ్యంతరం లేకపోతే మేము ఒక్కసారి మీకు భారతీయ సంప్రదాయంలో ప్రణమిల్లుతాము) అని అనుమతి కోరాను. ఒక క్షణంపాటు ఆయనకు నేనేమడుగుతున్నానో అర్థంకాలేదు. ఆ క్షణంగడవగానే, అర్థంచేసుకున్న 'కృ' హఠాత్తుగా "No, Sir" (అలా కుదరదు) అంటూ సుఖాసనంలో మా ఎదురుగా కూచున్న మనిషి, నడుమువద్ద నుండి శరీరాన్ని తలను కూచోనున్న మా ముందరికి వంచేశాడు. ఇద్దరమూ విస్మితులమయాము.

అంటే నేను నోటితో వెలిబుచ్చిన నా మనసులోని కోర్కెను, ఆయన మేమిద్దరం ప్రణమిల్లినట్లే భావించి, తానూ ప్రతిగా మాకు ఆ ప్రణమిల్లడాన్నే ఆచరించేశాడు. అదే విస్మయ భావంతో, అందులో నుండి పూర్తిగా తెప్పరిల్లక మునుపే, లేచి నుంచొని, "మేము సెలవు తీసుకుంటాం" అన్నాను. సాధారణంగా తన గది బయటి మేడమీదనే కొంత దూరం తోటే వచ్చి వీడ్కోలు చెప్పే "కృ" ఈసారి మేము తన బెడ్‌రూమ్ తలుపు దాటుతుంటే, తాను ఆ గదిలో తన చిన్నరైటింగ్ టేబిల్ వద్దకు వెళ్ళి మావైపు చూడకుండా ముఖం గోడవైపుకు తిప్పుకున్నాడు.

"కృ" ఇమోషనల్ మనిషి, "Devotion is bad for me, Sir" అని ఓసారి అని వున్నాడు. సర్వసాధారణంగా తన యెడల ఏ రకమైన ఆరాధనా భావం పైకి ప్రకటించ కుండా వుండే నేను ఈసారి, నాలో దాగివున్న భక్తి, శ్రద్ధలు 'డివోషన్' ప్రదర్శించేసరికి, ఆయన ముఖం చాటు చేసుకొని అటు తిరగవలసి వచ్చింది. చేసేదేమీలేక మాట్లాడకుండా వెళ్లిపోయాం.

డిసెంబరు 30, 1985 సాయంత్రం 4.15కు జరిగిన ఈ నా ఇంటర్వ్యూకు ముందు, ఓ పాశ్చాత్య 'క్వేకర్' మత జర్నలిస్టు వనిత ఆయన్ని కలిసి కాసేపు మాట్లాడి

వెళ్ళింది. నాకు తెలిసినంతవరకు, నాకు ఇంటర్వ్యూ ఇచ్చిన అనంతరం, 'కృ' మరే పత్రికా ప్రతినిధినీ కలవలేదు. ఆయన జీవితంలో ఆఖరి ఇంటర్వ్యూ తెనుగువారితో ఓ తెనుగు పత్రికకు ఇవ్వడం సంభవించింది అనుకుంటాను.

సమస్త భాషా పరిజ్ఞానాన్ని దాటి, సమస్త జాతి మత భేదాలను దాటి 'నేను కేవలం మానవుణ్ణి, మానవజాతి ప్రతినిధిని' ('I am humanity') అన్న 'కృ'ను తెనుగు వాడనడం కూడా అసందర్భమే అవుతుంది. అయితే ఆయన భారతీయుడు  కాడని కాదు, నా ఉద్దేశం; భాషా దురభిమానం కానీ, జాతి దురభిమానంకానీ లేని వాడనీ, అన్ని పరిమితులను దాటినవాడనీ అంటున్నాను.

1986 జనవరి 4వ తారఖు మధ్యాహ్నంవేళ, రిషీవాలీ టీచర్లందరూ ఆయన్ని కలవడానికి ఏర్పాటుగావించుకొని వచ్చారు. ఆ విషయం తెలిసి పద్మప్రియతోబాటు నేనూ దమయంతీ కూడా ఎలాగో సందు చేసుకొని లోనికి వెళ్ళి వసంత విహార్ హాలులో నుంచున్నాం. 'కృ'కు కొద్దిగా జ్వరమున్నదని చెప్పుకుంటున్నారు. 'లంచ్ టేబిల్' వద్దకు రావడం లేదన్నారు. ఏదో పత్యంగా కాస్త ఆహారం ఆయన బెడ్‌రూమ్ వద్దకే తీసుకు వెళ్తూండేవారు.

తెల్లటి పైజమా, కాలర్‌లేని తెల్లటి అర్ధచేతుల చొక్కా ఒకటి ధరించి, తన బలహీన పరిస్థితిని లెక్కచేయకుండా ఉత్సాహంగానే శరీర కాంతులు వెదజల్లుతూ తన గది నుండి మా మధ్యకి వచ్చాడు. ఒక్కొక్కరి వద్దా సెలవు గైకొంటూ కరచాలనం చేస్తున్నారు. నేను ఆ టీచర్ల గ్రూప్‌కు చెందినవాణ్ణి కాదు కాబట్టి, ఇలా తోసుకువచ్చినందుకు, లోన కాస్త సంకోచిస్తూ వారీ వీరి వెనకనుంచోనున్నాను. ఈలోగా నన్నూ దమయంతిని చూచి నవ్వుతూ "I thought you were hiding behind, Sir" అని చమత్కరించాడు. (వెనక ఎక్కడో దాక్కుంటున్నావనిపించింది సుమా). నా రెండు చేతులూ తన చేతుల మధ్య ఉంచుకున్నాడు. అదే నా ఆఖరు ప్రణామంగా మనసులో అనుకున్నాను. కళ్ళు మూసుకొని నేను ఆయన చేతుల్లో నా చేతులుంచి ఓ అర్ధ నిమిషంపైగా అలా నిలబడిపోయానని పద్మప్రియ తర్వాత నాకు చెప్పింది.

భాషాడంబరంతో కృష్ణమూర్తిగారిని ఎన్ని రకాలుగానైనా, ఎన్ని అతిశయోక్తులతో నైనా వర్ణించవచ్చు. కానీ ఈ మాటలవల్ల ప్రయోజన మేముంటుంది? ఆ మనిషిని

ఎరిగున్న మేము, ఆయన్ని ఎరగని వారికన్నా ఏవిధంగానూ అధికులం కాదు. సనాతన (Eternal) మైన ఆయన టీచింగ్‌ను మీరు అర్థంచేసుకుంటే, కేవలం మెదడుతో కాకుండా, హృదయంతో మీ సత్తతో అర్థం చేసుకుంటే, అది మీ నరనరాలలో ప్రవహించ నారంభిస్తే మీ జీవితం మారుతుంది. కావలసింది మన జీవితంలో పరివర్తన కానీ, 'కృ' ఎవరైతే మనకేమి? ఆ మహనీయుడు ఎలాగూ తరించాడు; దోవ చూసుకోవలసింది మనం.

**ఉత్తర రంగం**

'కృ' అమెరికాలో మరణించారనే వార్త హైదరాబాద్‌లో 1986 17 ఫిబ్రవరి సోమవారం సంధ్యాసమయాన తెలిసింది. కొందరు పత్రికల వారు "ఆయన జీవిత విశేషాలు మిమ్మల్ని అడిగి తెలుసుకోవచ్చని ఎవరో చెప్పారు" అంటూ టెలిఫోన్‌లో ప్రారంభించారు. నా మానసిక పరిస్థితి ఎలా వున్నప్పటికీ, వారి వివరాలు ముఖ్యమైనై. వారి కర్తవ్యం వారిది; చెప్పక తప్పలేదు.

మంగళవారం 18న తెల్లవారేసరికి ఆకాశవాణి ప్రొడ్యూసర్ శ్రీ రావూరి భరద్వాజ టెలిఫోన్ చేసి "జి. కృను గురించి స్క్రిప్ట్ తయారుచేసుకురండి. మూడింటికి రికార్డింగ్. రాత్రి 7-45కు బ్రాడ్‌కాస్ట్. మీరు సరేనంటే ఎనౌన్స్ చేయాల్సి వుంది" అన్నారు. అంగీకరించక చేసేదేముంది? నా దుఃఖాన్ని మాటల్లో, ఆంధ్రదేశంతో పంచుకోక ఎలా తప్పుతుంది? ఇటు స్క్రిప్ట్ తయారుచేస్తూనే వున్నాను. నిద్రలేచిన 'కృ' అభిమానులందరూ, తమ ఆవేదనను మరెవరూ దొరకక, నాకు తెలియజేయాలని అభిప్రాయపడ్డారు. అటు వారి సానుతాప వాక్యాలు, ఇటు స్క్రిప్ట్ తయారుచేసుకోడం ఎలాగో ముగించి, సగభాగం చిత్తు కాగితాలతోనే రేడియో స్టేషన్‌కు భరద్వాజ గారితో రేడియో వారి వాహనంలో వెళ్ళి రికార్డు చేసి వచ్చాను.

అద్భుతమైన టీచర్ గతించిన మాట వాస్తవమే. అంతకన్నా అద్భుతమైన టీచింగ్ మిగిల్చి వెళ్ళాడు. అధ్యయనం చేయండి; ఆయన దర్శించింది మీరూ దర్శించండి.

***(ఇందులో కొంత భాగం జిడ్డు కృష్ణమూర్తి సెంటర్, హైదరాబాద్ వారి The Presence that stays లో ప్రచురితమయింది.)***

# భ్రమకానిదీ, విలువైనదీ

"మనమింతసేపూ మరణమంటే ఏమిటో అర్థం చేసుకునేందుకు ప్రయత్నించాం. అన్నిటినీ, మన సమస్తమైన ఆలోచనల్నీ, పట్టుదలల్నీ ద్వేషాల్నీ, మన తీరీతీరని కోరికల్నీ, అరకొరగా చేసి మిగిల్చిపోతున్న అనేకానేక కార్యాల్నీ, ఈ మొత్తాన్ని అంతం చేసేది మరణం. మరణంతో వాదించలేవు. 'ఇదుగో ఆగు వస్తున్నా!' ననలేవు. ఈ కొనసాగుతున్న ఆలోచననీ, ఈ కొనసాగించిన జీవితాన్ని, దీనినంతటినీ ఒక్క దెబ్బతో అంతం చేసేస్తుంది. ఇదే కదా మరణమంటే? ఏదో ఒకనాడు మరణించవలసి వచ్చినప్పుడు, ఇవన్నీ అంతమయ్యేవే కదా? వీటన్నిటి యెడలా, ఏ ఒక్కదాని యెడలనైనా, ఇప్పుడే ఈ క్షణమే మరణించరాదా? అంతమొందించరాదా? ఇందాకటి నుంచీ 'అనుబంధం పెంచుకుంటే బాధగా పరిణమిస్తుంది' అని అన్నప్పుడు మీరందరూ తలలూపారే? వీటన్నిటి యెడలా మరణించటం, లేక వీటన్నిటినీ ఒక్క తృటిలో అంతమొందించటం గురించి మాట్లాడేసరికి, ఎందుకని అలా నిశ్చేష్టులుగా ఉండిపోతున్నారు? మరణమంటే ఏమిటో తెలుసుకున్నాం కదా? ఎందుకు భయపడాలి? కొనసాగేది ఏదైనా అంతమొందితేనే కదా కొత్తది సృష్టి అయ్యే అవకాశం ఉండేది? పాతది కొనసాగుతూ వుంటే దానికి ఎన్ని మార్పులు చేర్పులు చేసినప్పటికీ, ఎంతగా సంస్కరించినప్పటికీ అది కొత్తదయ్యేనా? పాతది అంతమొందితే తప్పితే నూతన సృష్టి జరగదు. మీ ఇష్టం. ఇది మీ జీవితం. మీ బాధ, మీ ఘర్షణ. మానసికంగా దీనిని అంతమొందించ మంటున్నాము. కానీ ఈ మాట మీ చెవిని పడుతున్నదో లేదో తెలియదు.

ఈ అంతమొందటం అర్థంకాకపోతే మనమిప్పుడు ప్రస్తావించుకోబోయే ధ్యానం అంటే ఏమిటనేది అర్థమయ్యే అవకాశంలేదు. ధ్యానమనే పదం ఉచ్చరించగానే నిటారుగా కూర్చోటానికి ప్రయత్నించకండి. ఇక్కడ మాట్లాడుతున్న మాటల ఆధారంగా ఉద్రేకం తెచ్చుకోకండి. అలాంటి ఉద్రేకానికి విలువలేదు. ఈ ప్రసంగంవల్ల ప్రేరణ జనిస్తే, ఇక్కడి నుంచి అవతలికి వెళ్ళగానే, ఆ కాస్తా చల్లారిపోతుంది. ఒక దానిచేగాని లేక ఇచ్చటి ప్రాసంగికుడి ద్వారా గాని కలిగే ప్రేరణ మత్తుమందు లాంటిది. ఈ మత్తుమందు

ప్రభావం తగ్గిపోగానే యథాస్థితికి దిగజారటం జరుగుతుంది. ప్రేరణ మిమ్మల్ని ఎక్కడికీ చేర్చలేదు. ఈ మాటల ఆధారంగా మీలో ఉద్రేకం జనిస్తే, ఈ వ్యక్తిమీద ఆధారపడే ప్రమాదముంది. కానీ అలా ఆధారపడవద్దు. నేను మీకు గురువును కాను. నాకు శిష్యులనేవారు లేరు. ఈ గురుశిష్య సంబంధం నాకు పరమ అసహ్యం. కాబట్టి ఇవన్నీ వదిలేసి హాయిగా సంతోషంగా వినండి".

ఇలా ప్రసంగిస్తూ ఉండగా వీడియో యంత్ర సామగ్రి పనిచేయడం మానేసింది. కానీ ధ్యానాన్ని గురించి శ్రీ జిడ్డు కృష్ణమూర్తి చెప్తున్న విషయం మంచి రసకందాయంలో పడ్డది. "ఈ యంత్రాలు ఆగిపోయినా నే చెప్తున్న విషయాన్ని ఆపేదిలేదు. ఈ ధ్యానం యొక్క సౌరభం ఈ ధ్యానం యొక్క సౌందర్యం అత్యద్భుతమైనది. ధ్యానించని జీవితం నిరర్థకం. ధ్యానమంటే ఏదో ఒక విషయాన్ని గురించి ఏదో ఒక సమయంలో చేసేది కాదు. ప్రతి ఒక్క విషయాన్ని తీసుకొని ఇది నిజమా అబద్ధమా అని చివరంటా ఆలోచించడం. భ్రమని భ్రమగా గుర్తెరిగి, నిజాన్ని నిజంగా గ్రహించడం, నిత్యజీవితంలోని ప్రతిబంధకాన్ని తిన్నగా అర్థం చేసుకొని దాటెయ్యడం. ఇదంతా ధ్యానంలో భాగం" అంటున్నారు ఆయన.

భావితరాలవారికనీ, సమకాలికుల్లోనే ఆయన్ని సందర్శించలేకుండా ఉండిపోయిన అనేకానేకులకు ఆయన సందేశం అందించాలనే ఉద్దేశంతో, టేపులూ, వీడియో యంత్రాలూ అమర్చారనేమాట నిజమైనప్పటికీ, అవి పనిచేసినంత సేపూ తను మాట్లాడి, అవి పనిచేయటం ఆగిపోతే వాటికై ఎదురుచూస్తూ తనూ ఆగిపోవడానికి, ఆ యంత్రాలకు అనుకూలంగా తను ప్రసంగించడం ఆయనకు సాధ్యమా? తన లోపలి నుంచి పెల్లుబికి వస్తున్న ఊటను ఆయన ఎలా అడ్డుకోగలడు? శివతాండవం ప్రారంభమైన తర్వాత ఎవరి కొరకై అగమంటే ఆగుతుంది? శ్రీకృష్ణుని వేణుగానం, మరికొందరు గోపికలు రావలసి ఉన్నది కాబట్టి ఆగమంటే ఆగేనా?

సుమారు యాభై మూడేళ్ళ క్రితం (1926) మద్రాసులోని అడయార్ థియోసాఫికల్ గ్రౌండ్స్‌లో యౌవ్వనంలోని కృష్ణమూర్తి ప్రసంగం విని డాక్టర్ అనీబిసెంట్, ఆనందం ముప్పిరిగొన "యమునాతీరాన వినిపించిన అలనాటి వేణుగానం మళ్ళీ అడయార్

గ్రౌండ్స్‌లో ఆ సంధ్యా సమయాన వినిపించింది" అంటూ ప్రకటించింది. 1895లో చిత్తూరు జిల్లా మదనపల్లిలో శ్రీ నారాయణయ్య దంపతులకు అష్టమ సంతానంగా జన్మించిన కృష్ణమూర్తికి చిన్నతనం లోనే దేవతలు కన్పించటం, సందేశాలివ్వటం వంటివి ఏవో జరిగినై. అడయార్ బీచ్‌లో తమ్ముడితో తిరుగాడుతున్న కృష్ణమూర్తిని లెడ్‌బీటర్ అనే పాశ్చాత్య థియాసఫిస్టు 'ఇతడిలో ఏదో మహత్తు ఉందని' చేరదీసి రానున్న జగద్గురువుగా రూపొందించాలని ప్రయత్నం మొదలెట్టాడు. కృష్ణమూర్తినీ, అతడి తమ్ముడు నిత్యానందను, పిన్నవయస్సులోనే ఇంగ్లండు తీసుకుపోయి చదువులు చెప్పించింది డాక్టర్ అనీబీసెంట్. "ఇతడే రానున్న జగద్గురువు అని ప్రకటించింది. జీసస్ క్రైస్ట్ మళ్ళీ అవతరించాడనే ప్రచారం కూడా జరిగింది. బౌద్ధులు నమ్మే మైత్రేయావతరణ ఇతడిలోనే జరిగిందని అన్నారు కొందరు. జగద్బోధకుడు బోధించ టానికి అనువుగా దేశదేశాల్లో విశాలమైన స్టేడియంలు నిర్మింపజేసింది అనీబీసెంట్. కానీ కృష్ణమూర్తికి ఈ తతంగమేమీ నచ్చలేదు. ఉక్కిరి బిక్కిరైపోయాడు. ఏ ఒక్కరి చెప్పుచేతల్లో ఉండటానికి అతడు ఇష్టపడలేదు. తనని పెంచి పెద్దచేసిన వారు ఎంతటి మహనీయులైనా, తనకై వారు నిర్దేశించిన పాత్ర ధరించటానికి, వారు ఊహించిన విధంగా తను రూపొందటానికి, అతడి మనసు అంగీకరించలేదు. అతడిలో అపరిమితమైన హృదయా వేదన ప్రారంభమైంది. పంజరంలో పక్షిలా గిలగిలలాడిపోయాడు. తమ్ముడు నిత్యానంద మరణించటంతో అతడి విచారం, తద్వారా విచారణ అధికమైనాయి. ఏ మతమూ, ఏ సిద్ధాంతమూ తన దుఃఖాన్ని తొలగించలేక పోయింది. ఇతరులు నేర్పినట్లు తను ప్రసంగించి ఏమి ప్రయోజనం సాధించే టట్లు? జగద్గురువు బిరుదు తగిలించుకొని తనని తా వంచించుకోటం, ఇతరులను వంచించటం తప్పితే మిగిలేదేముంది?

1929లో అనగా తన ముప్పై నాల్గవ ఏట "నాకూ ఈ సంస్థలకూ సంబంధం లేదు. నేను దేనికీ చెందను. నన్ను చూసి నా సంస్థను చూసి ఎవరైతే ఏయే ఆస్తులు వ్రాసి ఇచ్చారో అవన్నీ తిరిగి ఇచ్చివేస్తున్నాను. ఇక ముందు నేనే సంస్థ నడిపేదిలేదు. నాకు అనుయాయులంటూ ఎవరూలేరు. సత్యాని కభిముఖంగా నలుగురు నా వెంట ఉన్నా చాలు. ఈ నా నిర్ణయం తిరుగులేనిది" అంటూ ఎక్కడివక్కడ వదిలేశాడు.

అనీబిసెంట్ కన్న ఒక మహాద్భుత స్వప్నం ముక్కలు చెక్కలై పోయింది. ప్రపంచ వ్యాప్తంగా థియోసఫిస్టుల్లో కలవరం బయలుదేరింది. వూహా జగత్తులో వారు నిర్మించుకున్న రమ్యహర్మ్యాలు కుప్పకూలిపోయినై. కృష్ణమూర్తికి ఇవేమీ పట్టలేదు. అతడి హృదయంలో 'ఆనందం' అప్పటికే నెలకొన్నది. అతడి నిశ్చయం సుదృఢమయి పోయింది. అతడి విముక్తి పరిపూర్ణమయి పోయింది... దూర తీరాలతో నిమిత్తంలేని అతడి అనంతయాత్ర ఆనాటి నుండి ఈనాటి వరకూ యాభై ఏళ్ళకు పైగా కొనసాగుతూనే ఉంది. శోకాన్ని తొలగించుకొని, దాని మరుగున ఏమి దాగి ఉన్నదో చూడమంటాడు ఆయన. శోకం అంతమైన హృదయం లోనే మరొకటి చోటు చేసుకునే అవకాశ ముందంటాడు "ఈ దుఃఖ సముద్రం దాటేనా, ఈ శోకపుటలలు ఆగేవా అని ఎదురు చూడవద్దు. సమస్యలనే రూపంలో దుఃఖం యొక్క కెరటాలు ఎప్పుడూ పైకి లేస్తూనే వుంటై. మీదికి వస్తున్న ఒక్కొక్క అలనీ అర్థం చేసుకొని అతిక్రమించటమే మార్గం. అది నేర్చావంటే, సమస్యలు ఉత్పన్నమయ్యే లోగానే వాటిని ఇట్టే పరిష్కరిస్తావు. ఇది చేతైనప్పుడు దుఃఖం నీలో పరిష్కృతమవుతుంది."

"ఈ దుఃఖ సముద్రాన్ని దాటేసరికి నీవు నీవు కావు. నీలో నీది అనేది ఏదీ మిగలదు. మొత్తం మానవాళికి ప్రతినిధిగా, మనిషిగా, ఈ దుఃఖజలధిని దాటుతావు, అంటారు శ్రీ జిడ్డు కృష్ణమూర్తి.

జీవితంలో కరుణయొక్క ప్రాధాన్యం గురించీ, మనం తరచూ లోనయ్యే భావోద్వేగం యొక్క నిరర్థకతను గురించి ఆ పురుషోత్తముడు చెప్పిన మాటలు ఎందరి హృదయాల్లో నాటుకున్నాయో, ఎందరికి నిజంగా అర్థమైనాయో మనకు తెలియదు. చెట్టుక్రింద ఆయన తన ప్రసంగం ముగించి లేచి వెడుతున్న తరుణంలో మాత్రం ఆయన చుట్టూ గుమిగూడి వూపిరాడనంత పనిచేశారు. ఆయన ఎవ్వర్నీ దీవించరు. కాళ్ళను ముట్టుకోనివ్వరు. సాష్టాంగ పడనివ్వరు. నమస్కరిస్తూ ఆ జనసమూహంలో నుంచి దోవ చూసుకుంటూ ముందరికి వెళ్తుంటే కొందరు ఆ నమస్కరిస్తున్న చేతులనే తమ చేతులతో పట్టుకొని బలవంతంగా తమ తలలమీద పెట్టుకున్నారు. ఇలా ఉంటుంది మన అవగాహన. తోడు లేకుండా ఒంటరిగా నడిచివెళ్తున్న ఆ వయోవృద్ధుడిని

ఆ మహా తపస్విని అలా చుట్టుముట్టి బాధించారంటే మన స్ఫురణ ఏ పాటిదో తెలుసుకోవచ్చు. మనకు చేతైందల్లా ఈ సేవించడం, పూజించడం, ఆరాధించడం, దీవెనలందుకోడం మాత్రమే అయివుండాలి. ఏ మహాద్భుత సాహసయాత్రలో పాల్గొనమని శ్రీ జిడ్డు కృష్ణమూర్తి మనల్ని ఆహ్వానిస్తున్నారో దానిలో పాలుపంచుకునే సామర్థ్యం గానీ, కుతూహలం గానీ, సుముఖతగానీ మనలో కనిపించదు. ఇది మన దురదృష్టమనుకోవాలి. ఒక విధంగా చూస్తే ఇది అతడి దురదృష్టం కూడాను.

*ఆంధ్రప్రభ 10-2-1979*



# రష్యాలో స్వేచ్ఛా వాయువులు

సోవియట్ రష్యాను స్టాలిన్ పరిపాలించిన నాటికీ, నేటికీ ఆదేశంలో ఎన్నో మార్పులు సంభవించినై. ఇప్పుడు రష్యన్ కమ్యూనిస్టు పార్టీ అధినేత మైకేల్ గోర్బచేవ్ (1988) 'గ్లాస్‌నోస్ట్' అనీ 'పెరిస్ట్రోయికా' అనే రెండు రష్యన్ పదాలు తరచూ వాడుతుంటాడు. సోవియట్ సమాజంలో మునుపెన్నడూ లేని స్వేచ్ఛను ప్రజల ఆలోచనా సరళిలో, కళల అభ్యాసంలో, రాజకీయ సాంఘిక చర్చల్లో అనుమతించగలమని ఈ పదాల అర్థమట.

కమ్యూనిస్టు సిద్ధాంతానికి నాస్తిక భావం ఒక మూలస్తంభమంటారు. కానీ రష్యన్ బోల్షివిక్ విప్లవానంతరం, గడిచిన ఈ డెబ్బయి ఏళ్ళలో నాస్తిక భావం అక్కడ వ్రేళ్ళూని మహావృక్షమయిందా అనేది సందేహాస్పదమే. మొన్నీమధ్య భారతదేశంలో జరిగిన ఫిల్మ్ ఫెస్టివల్‌కు సోవియట్ రష్యానుండి తెచ్చి ప్రదర్శించిన 'పశ్చాత్తాపం' అనే సినిమాలో దైవం ప్రసక్తిలేని జీవితానికి సాఫల్యం లేదనే విషయాన్ని ప్రస్తావించారు. అంటే గోర్బచేవ్ మహాశయుడు కళాకారులకు రచయితలకు అక్కడి సమాజంలో నిజంగానే స్వేచ్ఛనిచ్చాడన్న మాట.

శ్రీ జిడ్డు కృష్ణమూర్తిగారు 1985-86లో చివరిసారిగా భారతదేశంలోని వారణాశి, మద్రాసులలో పర్యటించినప్పుడు, వారిని ఆఖరి దఫా ఇంటర్వ్యూచేస్తూ "మీ పుస్తకాలు సోవియట్ రష్యాలో నిషేధింపబడినై కదా" అన్నాను. "అవును నాకా విషయం తెలుసు" అన్నారు ఆయన. "కానీ అక్కడి ప్రభుత్వం అనేక మతపరమైన గ్రంథాల ప్రచురణను పంపిణీని సహిస్తూనే వున్నది" అని ప్రశ్నార్థకంగా అన్నాను. ఆయన మందహాసం చేస్తూ "అవి నిరపాయకరమైనవి కాబట్టి. వాటివల్ల ఎవరికీ ప్రమాదం లేదు" అన్నారు.

"మరి మీరంటే ఇంత భయమెందుకు?" అన్నాను. "భయమనను. 'కె' (ఆయన తనని తాను అలా వ్యవహరించుకునే వారు) స్వేచ్ఛను గురించి అమితంగా మాట్లాడుతాడు కదా? సహజంగా వారికది రుచించదు" అన్నారు. "మీరు చెప్పే విషయం జీవితంపై ఎంతో వెలుతురు విరజిమ్ముతుంది కదా. ఆ పుస్తకాలే..." అని నేనంటుండగా ఆయన

మధ్యలోనే "వారికవి అక్కరలేదు. వారికెంతసేపు తమ విధానం (సిస్టమ్) కొనసాగాలని వుంటుంది. ఆ సిస్టమ్ తమ తాతల కాలంనాటిదైనా సరే, దానిని ఎవరూ ప్రశ్నించకూడదు" అన్నారు.

శ్రీ జిడ్డు కృష్ణమూర్తిగారి రచనలు రష్యాలో అసలులేవని కాదు. కానీ రహస్యంగా అండర్ గ్రౌండ్‌లోని మేధావులు, సీరియస్ వ్యక్తులు మాత్రమే ఒకరికొకరు అందించు కుంటూ అధ్యయనం చేస్తుంటారని విన్నాను. దైవం ఉన్నాడా లేడా అనే విషయంలో జి. కృ. గారు ఒకసారి చెప్పిన జోక్‌ను గమనిస్తే అందులోని సున్నితమైన హాస్యం తెలిసి వస్తుంది. విశ్వాంతరాళాల్లోకి వెళ్ళిన వ్యోమగాములు, తిరిగి రాగానే నాటి రష్యన్ అధినేత శ్రీ కృశ్చేవ్‌ని కలిశారట. కృశ్చేవ్ వారిని ఎడంగా తీసుకెళ్ళి రహస్యంగా "మీరు ఆకాశం పైకి వెళ్ళినప్పుడు మీకక్కడ ఏవైనా వింతకాంతులు విచిత్ర జీవాలు గానీ కనిపించాయా?

కాంతివలయం మధ్య పొడుగైన తెల్లటి గడ్డంతో కూర్చున్న వ్యక్తి ఎవరైనా గోచరించాడా?" అని అడిగాడట. "అవును కామ్రేడ్ మీరు వర్ణించిన దృశ్యమే మాకక్కడ కనిపించింది" అన్నారట. అప్పుడు కృశ్చేవ్ వారినిలా హెచ్చరించాడు "మన ఈ సంభాషణ మన మధ్యనే పరిమితమన్న విషయం గుర్తుంచుకోండి. మరో నరమానవుడికి తెలియ కూడద"ని చెప్పి పంపాడట.

అటు తర్వాత అస్ట్రోనాట్లు ప్రపంచంలో అక్కడా ఇక్కడా తిరిగి రోమ్ చేరుకొని, క్రైస్తవ మతాధిపతి పోప్‌ను వాటికన్‌లో కలిశారట. సవియనంగా వారు ఆయనకి నమస్కరించిన అనంతరం, ఆ మతాధిపతి వారిని కొంచెం అవతలకు తీసుకువెళ్ళి "నాయనలారా; మీరు ఆకాశ వీధిలో విహరించినప్పుడు అక్కడేవైనా గొప్ప వెలుగున్న దీపాలు, తెల్లని పొడుగు గడ్డం నిమురుకుంటూ కూచున్న వ్యక్తిని చూచారా?" అని రహస్యంగా అడిగారట! వారు "లేదు ఫాదర్, దీపపు వెలుగులు లేవు. గడ్డం వ్యక్తీలేడు" అన్నారట. పోప్ మహాశయుడు నిట్టూరుస్తూ "అంతేలే నాయనా. ఆ సంగతి నాకూ అనుమానంగా ఉంటూ వచ్చింది. కానీ మీకు పుణ్యముంటుంది బాబూ. ఈ విషయం మరెక్కడా అనకండేం" అన్నారట!

సిద్ధాంతపరంగా నాస్తికుడైనా శ్రీ కృశ్చవ్ హృదయంలోని భయ సంకోచాలు, విశ్వాసపరంగా పరమ ఆస్తికుడిగా భాసిల్లే పోప్ మహాశయుడికి లోలోన, 'కలడో లేడేమో' ననే అనుమానమూ తెలియజేసే ఈ జోక్ ఇరుపక్షాల వారికి కూడా అంతరుచించక పోవచ్చు. 'అస్తి, నాస్తి' అనే విషయం తేల్చుకోవాలనే సత్యాన్వేషకులకు మాత్రమే ఈ జోక్ ఉపకరించవచ్చు.

ప్రఖ్యాత జర్మన్ వేదాంతి హెర్మాన్ కీసర్లింగ్, జి. కృ. గారు వెలిబుచ్చే భావాలు ఒకరకమైన రష్యన్ నాస్తిక వాదమని ఒకప్పుడు అభివర్ణించాడు. "జి.కృ. తాత్వికబోధ మనకు అంతుబట్టేది కాదు. అవి ఎడ్వాన్స్‌డ్ స్టూడెంటులకు మాత్రమే పనికివస్తాయి" అని తోసిపుచ్చారు శ్రీ వినోబాభావే.

"ఉన్నాడు. ముమ్మాటికి వున్నాడు అని నినదించి ఏమి ప్రయోజనం? లేడు. లేనే లేడు అని వెర్రికేకలు పెట్టి ఏమి ప్రయోజనం? మనిషిని మించిన మహత్తరశక్తి అతి పవిత్రమైనది ఏదైనా వుందా లేదా కనుగొందాం పట్ట"మంటారు. జి.కృ. అందుకై అంతర్గతంగా అన్ని రకాల అథారిటీని తొలిగించి పరిశోధించటానికి పూనిక వహించ మంటారు. అలా పూనుకున్న వారికే అందుకు తగిన నిష్పాక్షికమైన చూపు ఏర్పడుతుంది. వారికున్న శ్రద్ధమేరకు, వారి అర్హతననుసరించి కొంత గోచరమవడం ప్రారంభం కావచ్చు.

ఇంత మాత్రానికే ఆయన రచనలను రష్యాలో నిషేధించాల్సిన అవసరమే మున్నది? డెబ్బయి ఏళ్ళ అనంతరం కూడా సోవియట్ విప్లవం జి.కృ.గారి భావ విప్లవాన్ని తట్టుకో లేదా? జి.కృ. గారు దేహంచాలించి రేపు ఫిబ్రవరి 17 నాటికి రెండేళ్ళే పూర్తవుతాయి.

ఇప్పటికైనా రష్యాలో కృష్ణమూర్తి గారి పుస్తకాల మీది ఆంక్షను తొలగించి, వాటిని కూడా స్వేచ్ఛగా తమ దేశంలోకి రానిస్తే, సోవియట్ సమాజంలో నిజంగానే స్వేచ్ఛా వాయువులు వీస్తున్నై అని నమ్మే వీలుంటుంది.

*ఆంధ్రప్రభ **16-2-88***

# నాటి తత్త్వ విచారణ ఏమైంది?

"కాలారంభం నుండీ భారతీయుల్లో స్వచ్ఛమైనదీ, సత్యమైనదీ ఏదో వుంటూనే వచ్చింది. ఆనాటి భారతీయ హృదయంలో నిజమైన ధార్మిక దృష్టి, అసలైన 'రిలిజన్' వుండేవి. బుద్ధుడైతేనేమి, అంతకుమునుపు ప్రభవించిన వారైతేనేమి అందరూ కూడా ఈ దేశపు గడ్డమీద తమ చెరగని ముద్రవేసి వెళ్ళారు. నేటి భారతంలో కనిపించే ఈ జ్యోతిష్కులు, మతగురువులుగా చలామణి అవుతున్న ఈ కుహనా వ్యక్తులు...ఆ పరిస్థితులెక్కడ? నేటి ఈ పరిస్థితులెక్కడ? అంటే, అసలు విషయం మరుగైపోయి చివరకు మనకు మిగిలింది వీరేనా?" అంటూ ఉద్వేగం చెందేవారు శ్రీ జిడ్డు కృష్ణమూర్తిగారు, తాను జీవించిన కాలంలో.

"ఈ రిలిజస్ ఇన్‌క్వైరీ, ఈ ధర్మజిజ్ఞాసలో ఆనాటి భారతీయులు సంశయం, 'డౌట్' అనే దానికి ఇచ్చిన సమున్నతస్థాన మెటువంటిది? మరి క్రిస్టియానిటీ వంటి మతాన్ని తీసుకున్నామంటే, అది మనిషి విశ్వాసం మీద ఆధారపడినట్లు కనిపిస్తూనే వుంది కదా? సందేహం, సంశయం అనే వాటికి ఆ మతంలో తావెక్కడున్నది? అసలు ప్రశ్నించడమే పనికిరాదన్నారు ఆ మతంవారు. అలాచేస్తే భ్రష్టుపట్టి పోతావన్నారు.

మరి ఈనాటి భారతీయ ధార్మిక చింతనలో శంకకు అసలు స్థానమున్నాదా? ఏ విషయాన్నైనా శంకకు గురిచేసి దాని నిజానిజాలు తేల్చే బదులు, పాశ్చాత్య ఆలోచనా విధానాన్ని – గ్రుడ్డిగా విశ్వసించడాన్ని – అనుసరిస్తున్నామా?

విశ్వాసం మీద ఆధారపడిన మతాలలో పైపై మెరుగే కానీ, అసలు మూలంలోకి వెళ్తే వాటిల్లో సారముండదు. కానీ నేటి భారతదేశం పరిస్థితి చూస్తే, ఈ అంధ విశ్వాసం మీద ఆధారపడిన విధానాలే, ఒకప్పటి విచారణాబద్ధమైన భారతీయ పరిశోధనాసక్తిని జయించాయోమో ననిపిస్తుంది.

భారతీయ సంప్రదాయంలో బుద్ధుడు, నాగార్జునుడు, మనిషి మనస్సు వేటిలోనైతే ప్రవర్తిల్లుతుందో వాటన్నిటినీ కాదన్నారు. ఈ కాదనడం, లేదనడం, ఈ 'డినయల్'

మనమెందుకు విడనాడాము? నా ఉద్దేశం ఈ ప్రపంచాన్ని విడనాడమని కాదు. ప్రపంచాన్ని వదలి మనమెక్కడికి పోగలం? కాబట్టి విడనాడవలసింది ఈ ప్రపంచాన్ని కాదు. తననీ తన మనస్సు ప్రవర్తిల్లే తీరునూ విడనాడాల్సి ఉంది. ఇది ఎందుకు చేయకుండా వున్నాం?"

ఇదీ శ్రీ జిడ్డు కృష్ణమూర్తిగారి ఆవేదన. ఆయన జీవితం చివరి దశల్లో అనగా 1984 సంవత్సరంలో అమెరికాలోని ప్రపంచ యునైటెడ్ నేషన్స్ సంస్థ ఆయనను వచ్చి ప్రసంగించమని ఆహ్వానించినప్పుడు క్రిస్టియన్ ఇస్లాం వంటి విశ్వాసపరమైన మత సభ్యులతో నిండివున్న ఆ సమావేశంలో 'నమ్మకంమీద ఆధారపడిన మతాలకూ, జిజ్ఞాస విచారణ ఇన్‌క్వైరీ మీద ఆధారపడిన హిందూ బౌద్ధ మతాలకూ వున్న తేడాను' విస్పష్టంగా ప్రకటించారు. మనిషి సృష్టించిన మతాలు, దేవుళ్ళను, పక్కకుపెట్టి జీవితంలో పవిత్రమైన అంశమేదైనా వుందా అని కనుగొనడానికి 'ఇన్‌క్వైరీ'ని ఆశ్రయించమన్నారు.

భారతీయ సంప్రదాయంలో చర్చకు, తర్కానికి, విచారణకు ఉన్న ప్రాధాన్యం చాలా ఉత్కృష్టమైనది. సత్యాన్ని పరిశోధించి సాధించాల్సిందేగానీ, విశ్వసించి తెలుసుకో గలిగింది, కాదు. 'సత్యమిది' అని నిర్వచించే వీలులేదు. 'ఇది సత్యంకాదు. ఇది సత్యం కానేరదు' అని ప్రతి విషయాన్ని కూలంకషంగా పరిశీలించి తిరస్కరించవలసిందే కానీ, 'సత్యమిది' అని నిర్ధారించలేము; అది అనిర్వచనీయం. అసత్యమైన వాటినన్నిటినీ తిరస్కరించగా సత్యం చేరువకు వస్తాము. ఆ సమయంలో సత్యం ఎవరికి వారికే ద్యోతక మవుతుంది. కానీ అతడు మరొకరికి నోటితో చెప్పగలిగే స్థితిలో వుండడు. వ్యక్తావ్యక్తంగా సూచించగలడే కానీ సరిగి వర్ణించలేడు; అది వర్ణనాతీతం.

నేటి కాలంలో భౌతిక సంపదకుండే ప్రాధాన్యాన్ని తగ్గించే వీలులేదు. అలాగే నేటి అన్యాయపు ఆర్థిక అసమానతలు, దోపిడీ వ్యవస్థ, సాంఘిక దురాచారాలు రూపు మాపితే కానీ భారత జాతిని పునరుజ్జీవింప చేయలేము. కానీ ఈ పునరుజ్జీవనం, నేడు అనుసరిస్తున్న ఈ మతాలు, ఈ బూజు పట్టిన ఆచారాలు, ఈ కుల వ్యవస్థ

ద్వారా సాధ్యమవుతుందనుకోవడం భ్రమ, ఇన్‌క్వైరీ ద్వారా సత్యాన్ని దర్శించటానికి భారతీయులు మొదట్నుంచీ చేస్తూ వచ్చిన ప్రయత్నమే మనకు తరణోపాయం. ఈ స్వచ్ఛమైన 'స్పిరిట్ ఆఫ్ ఇన్‌క్వైరీ'కి అనేకానేకులు పునరంకితమైననాడే, ఈ దేశపు ప్రాచీన వైభవం తిరిగి వెల్లివిరిసే అవకాశ ముంటుందని జిడ్డు కృష్ణమూర్తి గారి భావన.

*ఆంధ్రప్రభ 10-5-88*



# జీవిత సాఫల్యం

వారణాశిలోని రాజఘాట్ స్కూల్ కాంపౌండ్‌లో నడుస్తూ శ్రీ జిడ్డు కృష్ణమూర్తి గారు ఒక మామిడితోపు దాటుతూ వెళ్ళారు. ఆయనతోటి నడుస్తున్న ఒక సహచరుడు ఒక మామిడిచెట్టును చూపిస్తూ, అది ఇంతవరకూ పూత పూయలేదనీ, ఆ కారణంచేత దానిని కొట్టేద్దామని అనుకుంటున్నానని చెప్పాడు. ఆ మాట విని చలించిన కృష్ణమూర్తిగారు దాని వంక చూచి, "ఇకనైనా జాగ్రత్తపడు. పిందె వేయకపోయావంటే నిన్ను తెగ్గొట్టేస్తారట" అని హెచ్చరించారు.

ఆ మాట ఒక మిత్రుడితో ఆయన చెప్పినప్పుడు, "అప్పుడు ఏమయింది?" అని కుతూహలంకొద్దీ అడిగాడా మిత్రుడు. తటపటాయిస్తూ కృష్ణమూర్తిగారు, "ఆ ఏడు కాసింది. కానీ నా మాటవల్ల అని అనడం లేదు సుమా" అని మిత్రుణ్ణి హెచ్చరించాడు. కృష్ణమూర్తి గారి 'టీచింగ్', అద్భుతాల మీద ఎప్పుడూ ఆధారపడలేదు కాబట్టి, ఈ సంఘటనలో మనమూ అద్భుతం చూడడానికి ప్రయత్నించ నక్కరలేదు. ఏదైనా అద్భుతమనేది ఉంటే అది మనిషిలో ఆ టీచింగ్ తీసుకురాగల్గిన 'మార్పు'లోనే వుంది.

ఫలవంతంకాని చెట్టును కొట్టివేస్తారని జీసస్ క్రీస్తు ఏనాడో చెప్పాడు. ఆ మాట అన్నాడంటే క్రీస్తు దయావిహీను డనుకోనక్కరలేదు. ఆ సామ్యాన్ని ఆధారం చేసుకొని సంతాన విహీన అయిన స్త్రీ పనికిరాదనీ, నిందార్హమైనదనీ అర్థం చెప్పేవారు కూడా ఉన్నారు. ఒక పతితురాలి నుండి మంచినీరు స్వీకరించిన ఆ కరుణామూర్తి సంతాన విహీనతను నిందించగల డనుకోడం పొరపాటు. కాయలు కాయవలసిన చెట్టు తన కర్తవ్యం నెరవేరిస్తేగానీ దానికి మనుగడ లేనట్లు. మానవుడు ఈ భూమిమీద పుట్టినందుకు పవిత్రమైన దానిని, అమేయమైన దానిని కనుగొంటేనే అతడి మనుగడకు సాఫల్యం. కాని పక్షంలో అతడి జీవితం వ్యర్థం. కాయలు కాయని చెట్టును ఎలాగైతే నరికేస్తారో, ఆ మాహానామ రహితాన్ని కనుగొనని మానవుణ్ణి మృత్యువు నిర్దాక్షిణ్యంగా నరికివేస్తుందని జీసస్ అభిప్రాయం.

జాతస్యమరణం ధృవం. మృత్యువనేది పుట్టినవాడి కెవడికీ తప్పేదికాదు. భౌతికంగా మరణమనేది, పరమార్థం కనుగొన్నవారికీ, కనుగొనకుండా జీవితాన్ని వృథా చేసుకున్న వారికీ, ఇద్దరికీ సంభవిస్తుంది. కానీ కనుగొన్నవాడు మృత్యువును 'అతిక్రమిస్తాడు' జీవన్ముక్తుడై జీవించడం నేర్చుకుంటాడు కాబట్టి మానవ సహజమైన భౌతిక మృత్యువు అతణ్ణి భయపెట్టజాలదు. దాని ఆలోచన ఉండదు. అది ఆసన్నమైనప్పుడు ప్రశాంతంగా రాలి పడిపోతాడు. జీవిత ధర్మాన్ని కనుగొని తనువు చాలించాడు కాబట్టి అది ఫలవంతమైన జన్మ. ఇలా ఫలవంతం కాకపోయిన జన్మలన్నీ వృథా అయిపోయినట్లే.

మనిషి జీవితం ఉత్పత్తిదాయకం కావాలంటాడు పాశ్చాత్య మేధావి గ్రంథకర్త ఎరిక్‌ఫ్రామ్. మామిడిచెట్టు తన ఫలాల్ని మిగతా సృష్టికి అందించడమే దాని పరమావధి. మనిషి తన జీవితాన్ని కూడా అదే విధంగా సార్థకం చేసుకోవాలి. కానీ కేవలం సంతానోత్పత్తి ద్వారా కాదు. మనిషికి సాధ్యమైన, అతడి చేతనైన మరోరకమైన అభివృద్ధి అతడిలో నిబిడీకృతమై వుంది. ఈ 'పొటెన్షియల్'ను నిర్లక్ష్యం చేస్తే మనిషి తన అసలు భాగ్యాన్ని వ్యర్థపరచుకొన్నా డనుకోవాలి. తన 'పొటెన్షియల్'ను గుర్తించి, అది వికసించేట్లు చేసుకోగలిగితే జీవితం ఫలవంతమవుతుంది. తనలో ఉన్న శక్తినంతటినీ వెలికితీయడానికి ప్రయత్నించాలి. తన జీవితాన్ని తాను బాధ్యతారహితంగా గాలికి ఎగిరిపోయే ఎండుటాకులా జీవించడం వ్యర్థం.

భూమి ఉత్పత్తిదాయకమవడమంటే సేద్యఫలాలను అందించగలగడం. మనిషి జీవితం ఉత్పత్తిదాయక మవడమంటే, అతడు తన జీవితంలో ప్రేమను కరుణను కనుగొని, వాటిని పండించడమే. అలాంటి ఫలాలను అరుణాచల రమణుడు, షిర్డీ సాయిబాబా, మెహర్‌బాబా వంటివారు పండించారు. ఆ పుణ్య పురుషులతో సమానంగా కాకపోయినా, ఎవరికి వారు తమ జీవితాలను జాగ్రత్తగా తఱచి, ఫలవంతం చేసుకోగలిగి ఉండాలి. అవే ధన్య జీవితాలు.

***ఆంధ్రప్రభ 31-1-89***

# కృతజ్ఞత పొంగిపొరలినప్పుడు

శ్రీ జిడ్డు కృష్ణమూర్తిగారి సంస్థలలో గాని, స్కూళ్ళలోగాని ఎక్కడా వారి ఫోటోలు, శిలావిగ్రహాలు కనిపించవు. గ్రంథాలలో వారి ఫోటోలు కనిపిస్తున్నప్పుడు, స్కూళ్ళలో పెడితే తప్పు అవుతుందా అని అడిగే వారున్నారు. ఆ వ్యక్తి రూపురేఖ లెలాంటివి. అనే ఆసక్తి కొద్దీ పుస్తకంలోని ఫోటోలు చూడడం వేరు. వారి సంస్థల్లో నిలువెత్తు విగ్రహాలు పెద్ద సైజు ఫోటోలు ప్రదర్శించడం వేరు. మొదటిది ముచ్చట, రెండవది వ్యక్తి పూజ, విగ్రహారాధన అవుతుంది.

వ్యక్తి పూజను కృష్ణమూర్తిగారు తీవ్రంగా వ్యతిరేకించారు. తనపట్ల భక్తి ప్రపత్తులు ప్రదర్శించడాన్ని ఆయన ఏనాడూ సహించలేదు, ప్రోత్సహించలేదు. అసలు విషయం మరుగున పడిపోయి, ఈ వేలంవెర్రి మాత్రమే మిగులుతుందని గ్రహించినవాడు ఆయన. అందువల్ల ఆయన వేదిక మీదికి వచ్చీ రాగానే అందర్నీ ఒకసారి కలియజూచి ప్రసంగం ప్రారంభించేవారు. ఎవరి పరిచయ వాక్యాలూ గానీ, ప్రశంసా పత్రాలు గానీ, పూలమాలలు గానీ, చప్పట్లు చరచడం గానీ ఏమీ ఉండేవి కావు. ఈయన జీవిత సరళిని ఎరగని పాశ్చాత్యులు న్యూయార్క్ వంటి పట్టణాలలో ప్రసంగానంతరం తమ మర్యాద చూపించడానికని చప్పట్లు చరని తమ హర్షాన్ని ప్రకటింపజూస్తే "దయచేసి చప్పట్లు కొట్టకండి. ఈ వక్తకు వాటితో నిమిత్తంలేదు. మిమ్మల్ని మీరు ఉత్సాహపరుచుకోడానికై కావాలంటే చప్పట్లు చరచుకోండి" అని నిర్మొహమాటంగా చెప్పి వేదిక నుండి దిగి వెళ్ళే వారు. శ్రోతల్ని అమర్యాదపరచాలని ఆయన ఉద్దేశం కాదు. లేక తన ప్రత్యేకత చూపించాలనే ఉద్దేశమూ కాదు. మనిషి శ్రేయస్సు కోరి అతడికి తరణోపాయం సూచించాలని ఆయన ప్రసంగిస్తుంటే ఆయనను ప్రశంసిస్తూ చప్పట్లు చరచవలసిన అవసరమేమిటి? కురుక్షేత్రంలో కృష్ణుడు అర్జునుడికి కర్తవ్యబోధ చేసినప్పుడు అంతా విినిన అర్జునడు చప్పట్లు చరిస్తే ఎంత బాగుంటుందో, కృష్ణమూర్తిగారి ప్రసంగానికి శ్రోతలు చప్పట్లు కొట్టడం అంతే బాగుంటుంది. గౌతమ బుద్ధుడు దుఃఖ నివారణోపాయం గురించి ప్రసంగించాడనుకుందాం. దుఃఖభాజనులైన అక్కడి

శ్రోతలు, ఆ ప్రసంగం వింటున్న వేళలో తమ దుఃఖమేమైనా దిగివచ్చి తమ హృదయాలు తేలికపడ్డాయా' అని పరిశీలించుకోవాలి గానీ, 'నీ ప్రసంగం అద్భుతంగా ఉంది' అనే సర్టిఫికెట్ ఇచ్చినట్లు చప్పట్లు చరచడంలో ప్రయోజనమే ముంటుంది? సర్కస్ కళాకారులకూ, సినిమా హీరోలకూ, అందాల తారలకూ చేతి చప్పట్లూ, తప్పెట మోతలూ అవసరముంటాయి గానీ, సత్యం ప్రవచించడానికి, ఆప్తవాక్యం చెప్పడానికి వచ్చిన పావన పురుషులకు తప్పట్లు అవసరం లేదు. వారి మాటలు జాగ్రత్తగా, శ్రద్ధగా ఆలకించడమే వారికి ఈ శ్రోతలు చెల్లించగలిగిన మూల్యం. వారు వీరి వద్ద నుండి మరేమీ ఆశించరు.

ఉపదేశించిన వ్యక్తి పట్ల కృతజ్ఞతా భావం పెల్లుబికితే ఆ మనోభావాన్ని ప్రదర్శించే మార్గాలనేకం ఉన్నాయి. నిజానికి ఆ ఉపదేశాన్ని జీవితంలో ఆచరించడంకన్నా మించిన నివాళి మరొకటుండబోదు. అలా జీవించే బదులు చేసేవే ఈ పొగడ్తలూ, పూజలూ, ఆరాధనలూను. ఇక్క్యూ అనే జెన్ మాస్టరు చలికాలపు రాత్రివేళ ఒక బౌద్ధారామంలో తలదాచుకున్నాడు. చలి ఎక్కువవడం చేత మంటపెట్టడానికి ఏవైనా దొరుకుతాయా అని అటూ ఇటూ వెతికాడు. గదిలో ఆ సమయానికి చెక్కతో చేసిన బుద్ధ విగ్రహాలు తప్పితే మరేమీ కనిపించలేదు. వాటితోనే మంట తయారుచేసి, చలికాచుకుంటూ కూచున్నాడు. అవతలి గదిలో మంట, పొగ గమనించిన పూజారి మేల్కొన్నాడు. ఈ రాత్రికి కాస్త చోటివ్వమని అభ్యర్థిస్తూ వచ్చిన ఈ అగంతకుడు చేసిన అత్యాచారం చూచాడు. "బుద్ధుడి విగ్రహాలను చెక్కపేళ్ళలా కాలుస్తున్నా వేమిటి? బుద్ధి నశించిందా?" అంటూ మీదికి పోయాడు. ఇక్క్యూ తన చేతి కర్రతో, అక్కడి బూడిదను అటూ ఇటూ కదిలించి చూస్తున్నాడు. "చేసింది చాలక బూడిదను పరిశీలిస్తున్నావేమిటి?" అని గద్దించాడు పూజారి. "బుద్ధుడి అస్తికల కోసం వెతుకు తున్నాను" అన్నాడు ఇక్క్యూ. "బుద్ధుడి చెక్క విగ్రహాలలో అస్తికలెలా ఉంటాయి? తెలివి మించినట్లున్నదే" అన్నాడు పూజారి. "అయితే, మరి నాలుగు చెక్క విగ్రహాలు పట్టుకురా. నాలోని బుద్ధుడు చలికి ఓర్వలేకుండా ఉన్నాడు" అన్నాడు ఇక్క్యూ. ఇదేదో సామాన్యమైన పిచ్చిగా లేదనుకుని "నువు ముందు బయటికి నడు" అంటూ మహానుభావుడైన ఇక్క్యూని ఎరగని ఆ పూజారి, గజగజ వణికే చలిలో వెలుపలికి పారద్రోలాడు.

ప్రొద్దునే పూజారి అల్లంత దూరం నడిచి వెళ్ళినప్పుడు అక్కడ రోడ్డు పక్కన ఒక మైలురాయి వద్ద కాసిని పుష్పాలుంచి ఏదో పూజ చేస్తున్న ఇక్యూను చూచాడు. "బుద్ధం శరణం గచ్ఛామి" అనే గొణుగుడు అస్పష్టంగా వినిపిస్తున్నది. ఈ దృశ్యాన్ని చూచి ఆశ్చర్య పడిన పూజారి "రాత్రే కదా బుద్ధుని విగ్రహాలు మంటపెట్టడానికి సాహసించావు. ప్రొద్దున్నే ఇదేమిటి? ఈ మైలు రాయిని బుద్ధుడిగా ఆరాధిస్తున్నావేమిటి?" అని ప్రశ్నించాడు. "కృతజ్ఞత అనేది హృదయంలో ఉండాలే కానీ, దానిని ఎక్కడైనా ప్రకటించవచ్చు. అది నీ హృదయంలో లేకపోతే వేయి బుద్ధ విగ్రహాలైనా ఈ భావాన్ని జనింపజేయలేవు" అన్నాడు ఇక్యూ.

*ఆంధ్రప్రభ* ***9-5-1989***



# సౌందర్య దర్శనం

సౌందర్యం వస్తుగతమా? లేక తనని తాను విస్మరించి జీవించినప్పుడల్లా మనిషికి సౌందర్యం దర్శనమవుతుందా? ఒక ఇంజనీర్‌తో జరిపిన సంభాషణలో శ్రీ జిడ్డు కృష్ణమూర్తి గారు ఈ విషయమై చేసిన చర్చే ఈ అనువాద వ్యాసం.

ఇంజనీర్ : ఇందాక మీరు చూసిన దృశ్యంలో మీరే సౌందర్యం చూచారో కాని నాకైతే ఏమీ కనిపించలేదు. ఒక్కోమారు బారుగా పొడుగ్గా వున్న రైల్వే పట్టాలు చూచినప్పుడో, ఒక పెద్ద నదీ ప్రవాహం మీద ఆధునిక వంతెన నిర్మాణం చూచినప్పుడో, "ఇది అందంగా వున్నది సుమా" అని నాకనిపించవచ్చు. నిజానికి ఇలాటి నిర్మాణాలు మానవాళికి కొంత ప్రయోజనం చేకూరుస్తున్నాయి కాబట్టి వీటిలో కొంత అందం కూడా కనబడవచ్చు. కానీ నాకీ సౌందర్యమనేది ప్రత్యేకంగా ఎలా వుంటుందనేది గ్రాహ్యం కావడంలేదు. ఆకాశంలో తిరుగాడే ఆ జెట్ విమానాలు మనందరికీ ఎంతో ఉపయోగ పడుతున్నాయనే మాట నిజమే. కాని మొన్న మీరు ఆకాశంలో పయనిస్తున్న ఆ జెట్‌ల వంక చూచి, "అవి ఎంత అందంగా వున్నాయో చూచారా?" అని అన్నప్పుడు, వాటి ప్రయోజనం గురించి నాకు తట్టిందే కానీ, వాటి అందమేమిటో, అది మిమ్మల్ని ఎందుకు ఉత్సాహపరిచిందో నాకర్థం కాలేదు. ఆ కొమ్మమీది పుష్పం మీకే వింత అనుభూతి కలుగుజేస్తున్నదో కానీ, నాకు మాత్రం ఏమీ అనిపించదు.

బహుశా నేను కొంత మోటు మనిషినేమో. మీ మనసూ, మెదడూ, నా మనసూ మెదడూ కన్నా పదునైనవై యుండాలి. నా ఫీలింగ్స్. నాలో కలిగే భావాన్ని నేనెప్పుడూ పరిశీలించుకోనూ లేదు, వాటినే పెంచి పోషించనూ లేదు. నాకు సంతానం వున్నది. లైంగిక సుఖమంటే ఏమిటో ఎరుగుదును. కానీ ఆ సుఖం కూడా చివరకు బరువుగానూ భారంగానూ కనిపించిందనే చెప్పాలి.

ఇక ఇప్పుడు మీరేమో సౌందర్యాన్ని గురించి చెప్పడం మొదలెట్టేసరికి, నేను నా జీవితంలో ఏదైనా కోల్పోయానా అనే చింత ప్రారంభమయింది. ఇంతగా వయసు చెల్లిన వాణ్ణి, ఇప్పుడీ దశలో ప్రపంచంలోని అందాన్ని ప్రకృతి సౌందర్యమనబడే

దానిని చూచి ఆనందించగలనా అనే అనుమానం ఉదయిస్తున్నది. ఇంతకీ సౌందర్యమంటే ఏమి టంటారు?

జిడ్డు కృష్ణమూర్తి : మీరు ఏ సౌందర్యాన్ని గురించి అడుగుతున్నారు. జీవిత సౌందర్యం గురించా, లేక మనిషి తన నేత్రంతో ఏదైనా ఒక వస్తువులో చూచే అందాన్ని గురించా లేక కవిత్వంలోని సొగసుల గురించా, అదీ కాకపోతే సంగీతంలోని మాధుర్యం గురించా? ఇదంతా మీకు ఇమోషనల్‌గానూ సెంటిమెంటల్‌గానూ కనిపించవచ్చు. కానీ మీ గణితశాస్త్రంలో కూడా అందమున్నది. ఆ విషయం మీకు తెలియనిది కాదు. గణితంలో గొప్ప తీరూ, క్రమమూ వున్నాయి. మరి జీవితంలో కూడా ఒక తీరు తెన్నూ కనిపించినప్పుడు, దానిలో అందం లేదంటారా?

ఇం : జీవితం అందమైంది అవునో కాదో నాకైతే తెలియదు కానీ, నా జీవితాన్ని నేనేమి చేసుకున్నానో మాత్రం బాగా తెలుసు. నా జీవితానికో క్రమం ఏర్పరచుకోడానికి నన్ను నేను విపరీతంగా శిక్షించుకున్నాను. నా యెడల నేనెంతో కఠినంగా వుండవలసి వచ్చింది. ఈ విధంగా నా జీవితాన్ని నేనో చిత్రహింసకు గురిచేయడంలో ఒక పద్ధతీ క్రమమూ వుండి వుండవచ్చు. కానీ ఈ విధమైన తీరూ క్రమమూ మీ దృష్టిలో 'సౌందర్యం' అనే పేరుకు నోచుకోకపోవచ్చు. అందంగా జీవించడమంటే ఏమిటో నిజానికి నాకు తెలియదనే ఒప్పుకోవాలి. ఆ మాటకొస్తే నా వృత్తికి సంబంధించిన కొంత సాంకేతిక యాంత్రిక పరిజ్ఞానంతో తప్పితే మరి దేనితోనూ నాకట్టే సంబంధం లేదనే అనిపిస్తుంది. మీతో మాట్లాడిన సందర్భంగా నే గ్రహించిందల్లా నా జీవితం మ్రోడువారిపోయిందనే; పోనీ జీవితం కాకపోతే నా మనసు అనుకోండి– ఆ మనసు మొద్దుబారిపోయిందను కుంటాను. ఏ బుద్ధి వికసించి నందువల్లనైతే మీకీ జీవితం ఇంత అందంగానూ ఆనంద మయంగానూ స్ఫురిస్తున్నదో, ఆ బుద్ధి యెడల నేనెలా మేల్కొనాలి?

జి.కృ. : మొదట మీ ఇంద్రియ జ్ఞానం మరింత పదును పడాలి. చూడడంలోనూ, వినడంలోనూ, స్పృశించడంలోనూ గమనించడంలోనూ, సమస్త ఇంద్రియాలూ ఇంతకన్నా సునిశితమవాలి. వినడమంటే ఆ పక్షుల కుహూ రవాలే కాదు. ఆకుల సవ్వడే కాదు, మీరు మీ మాటల్లో వాడే పదజాలం, ఆ పదాల వెనుక నుండే భావం

– అది ఎంతటి సామాన్యమైనదైనా, ఎంత నికృష్టమైన దయినప్పటికీ, జాగ్రత్తగా విని అర్థం చేసుకోవాలి. మీ మనసులో కలిగే ప్రతి కోరికా, ప్రతి కదలికా, అది అందిస్తున్న రహస్య సంకేతాలు అన్నిటినీ గ్రహించవలసి వుంటుంది. నిరంతరం తోసుకువచ్చే ఆ తలపుల్ని చెవి వొగ్గి వినండి; వాటిని అణచకండి వాటిని తీర్చిదిద్దడానికి, ఒక మార్గంలోకి మళ్ళించడానికీ ప్రయత్నించకండి. వాటిని మహత్తరమైనవిగా రూపొందిద్దామని 'సబ్లిమేట్' చేద్దామని అనుకోవద్దు. ఉత్తిగా వినండి.

ఇంద్రియాల సున్నితత్వం, వాటి ప్రాధాన్యం గురించి మీకు చెప్తున్నానంటే, ఇంద్రియ లోలత్వాన్ని సూచిస్తున్నానని అనుకోవద్దు. ఇంద్రియ వాంఛలకు లోనవమని అనడంలేదు; అందుకని ఈ వాంఛలు అనర్థదాయకమని ఖండిస్తూ వాటిని అణగత్రొక్కమనీ అనడంలేదు. కాని జాగ్రత్తగా గమనించమంటున్నాను. రైలు పట్టాలమీద సరదాగా నడుస్తూ వెళ్తున్నప్పుడు, కాలు జారిపడకుండా ఎంత జాగ్రత్తగా వెళ్తుంటామో. అలాగే ఆ ఇంద్రియ వాంఛల్ని వాటి తీవ్రతను కూడా గమనించమంటున్నాను. అలా గమనిస్తూ నడుస్తూ వుంటే, రైలు పట్టామీది కాలు ఎప్పుడైనా జారి నేలమీద పడినప్పటికీ వెంటనే వెనక్కు తీసుకున్నట్లు ఇక్కడ కూడా జరిగిన పొరపాటు వేగిరంగా సరిదిద్దుకోవచ్చు. ఇలాంటి గమనికలో మొత్తం శరీరం, సమస్తేంద్రియాలతో సహా, సజీవంగా సున్నితంగా, తెలివిగా, సమతూకంగా, బిగలాగిన వింటినారిలా తయారవుతుంది.

బహుశా మీరీ శరీరం చాలా అప్రధానమైనదిగా భావిస్తుండవచ్చు. మీరు భోజనం చేస్తుండగా చూశాను. ఏదో బాయిలర్‌లోకి బొగ్గుతోస్తున్నట్లుగా ఆహారాన్ని నోట్లో పడేస్తున్నారు. మీకు తిండి చాలా ప్రియమై వుండవచ్చు. కాని మీరు తింటున్న తీరు మాత్రం చాలా యాంత్రిక మయిపోయింది. పళ్ళెంలోని పదార్థాలను ఆదరాబాదరా కలిపే తీరు, వాటిని మీ నోట్లోకి తోసే తీరు, ఇవన్నీ మీరు చాలా అనాలోచితంగా చేస్తున్నట్లు కనిపిస్తుంది. ఈ చర్యలన్నిటినీ మీరు గమనించినట్లయితే, మీ చేతివ్రేళ్ళు, మీ కళ్ళు చెవులూ, దేహం అన్నీ కూడా సున్నితత్వాన్ని సజీవత్వాన్ని, ప్రతిస్పందించగల్గిన శక్తినీ సంతరించుకుంటై. ఇదంతా కొంతవరకు తేలికేననుకోండి.

కాని పరిస్థితుల ప్రభావం చేత ఏదో గాటిలో పడి తన్నుకునే మనసుకు కలిగే యాంత్రికమైన ఆలోచనలు, భావ పరంపర, ఫీలింగ్స్, అది తలపెట్టే కృత్యాలు, చర్యలు వీటన్నిటి నుండి మనసును బయటపడేయడం అంత తేలికైన పనికాదు. పరిస్థితుల ప్రభావం, అంటే మనిషి చేసే వృత్తి. అతడి చుట్టూ వున్న సమాజం, సంసారం, వీటన్నిటి ప్రభావం అతడి మీద పడుతూనే వుంటుంది. ఇవన్నీ మనసును ఒక గాట్లో పడేస్తాయి. మనసుకుండే వైశాల్యాన్ని (విల్లుకుండే సాగే గుణాన్ని) కుంచింపజేస్తాయి. నిశితంగా గమనిస్తే కాని దృగ్గోచరం కాని విషయాలను, కుంచించుకుపోయిన మనసు చూడజాలదు.

దీని అర్థమేమిటంటే, మిమ్మల్ని మీరు సరిగ్గా ఇప్పుడెలా ఉన్నారో అలాగే చూడగలిగి వుండాలి. చూచిన దానిని మార్చడానికి ప్రయత్నం చేయడంగానీ, చూచిన దాని నుండి పలాయనం చిత్తగించడం కానీ పనికిరాదు. అద్దంలో మీరెట్లా వుంటారో, మీరూపు అచ్చం ఎలా వుంటుందో చూచుకున్నట్లే. మిమ్మల్ని మీరు చూచుకోవాలి అన్నమాట. ఈ చూచినదానిని గురించి 'ఏదో ఒకటి చేయాలి', లేదంటే, చూచిన దానిని సహించలేక దీని నుండి పరుగిడి పోదాం, అనే ఆలోచనకు లోనైతే, మనసు మళ్ళీ మరో గాట్లో, మరో అలవాట్ల వలయంలో చిక్కుకుంటుంది. ఇటు ఈ గాటిలో కానీ అటు ఆ గాటిలో కాని పడని మనసు, వేరుగా వుంటుంది. అలాంటి మనసు ఒక పుష్పంగానీ, ఒక వస్త్రం యొక్క రంగుగానీ, చెట్టుకొమ్మ నుండి రాలి పడుతున్న ఒక ఎండుటాకును గానీ చూచినప్పుడు ఆ ఆకు ఎంత సోయగంగా రాలిపడుతున్నదీ, ఆ పుష్పం ఎలాంటి వింత రంగుల్ని పోగేసుకున్నదీ, స్పష్టంగా చూడగలుగుతుంది. అప్పుడు మనసు లోపలా, వెలుపలా కూడా జీవం తొణికిసలాడుతుంది; అలాంటి మనసుకు ఎటుపడితే అటు వంగే సామర్థ్య ముంటుంది. దానికి నిత్య జాగరూకత ఏర్పడుతుంది. గ్రహింపును పెంచే సున్నితత్వమూ. తద్వారా ఏర్పడిన ఈ బుద్ధీ, నిత్యమాచరించే కర్మలోని స్వేచ్ఛా, ఇవన్నీ జీవితంలోని సౌందర్య దర్శనానికి దోహదం చేస్తాయి.

ఇం : అలాగే ననుకుందాం. మీరు చెప్పినట్లే ఎంతో సున్నితత్వాన్ని అలవరచుకొని, అతి మెళకువగా వుంటాననుకోండి. ఆ తర్వాత ఏమవుతుందిట? ఉన్నదంతా ఇంతే

నంటారా? అందరి కంటికి నిత్యమూ కనిపించే ఈ సాధారణమైన పువ్వునూ ఎండుటాకునూ చూస్తూ వున్నందువల్ల ప్రయోజనమేమిటి ఒరుగుతుందంటారు? ఇలా చూడడమనేది అందరూ చేస్తూనే ఉంటారనుకుంటాను. ముఖ్యంగా చిన్నతనంలో ప్రతి ఒక్కరూ చేసే వుంటారు. దీనివల్ల ఏమి అద్భుతం జరుగుతుంది? సరే చూస్తాననుకోండి. ఆ తర్వాత ఏమవుతుంది? మీరు బోధించే ఈ గమనిక కాక, మరో మెట్టు ఏదైనా వుందా?

జి.కృ. : మీరీ సంభాషణ కుపక్రమించినప్పుడు "నాకీ సౌందర్యమంటే ఏమిటో తెలీటంలేదు. ఇది నేను ఫీల్ అవలేకుండా వున్నాను. ఇది నా అనుభవంలోకి రావడం లేద"ని అన్నారు. మీ జీవితంలో మీకు సౌందర్యానుభూతి కలగలేదన్నారు. మీ ప్రశ్ననుస రించి, అసలు సౌందర్యమంటే ఏమిటో విచారించే ప్రయత్నం ప్రారంభించాం. ఈ విచారణ కేవలం పదాలతోనే కాక, మేథస్సుతోనే కాక, అసలు ఆ సౌందర్య స్వరూపమేమిటో, మనిషి దాని యెడల ఎలా స్పందిస్తాడో అనే విషయం తరచి చూస్తున్నాం.

ఇం : ఆ మాట నిజమేననుకోండి. కానీ నేనీ ప్రశ్న మిమ్మల్ని వేసినప్పుడు, మీరు వివరించే ఈ సున్నితమైన వీక్షణ అనేదే కాక, దీనికి పైమెట్టుగా మరేదైనా వుందా అనేదే నా ఉద్దేశ్యం.

జి.కృ. : ఉన్నది, లేకేమి? కాని ఓం ప్రథమంలో సున్నితమైన ఈ వీక్షణ, ఈ గమనిక లేనిదే, ఇంతకన్నా అతి విశాలమైనదీ, అనంతమైనదీ గోచరించే అవకాశమే వుండదు.

ఇంజనీర్: తీక్ష్ణమైన వీక్షణ, సున్నితమైన మనసు కలిగిన వారెందరో వున్నారు. కవులూ, కళాకారులూ ఎంతో భావోద్రేకంతో వీక్షిస్తారు. అయినప్పటికీ ఈ దృశ్య ప్రపంచాన్నంతా ఛేదించుకొని అనంతమైన, అసదృశమైన ఆ మహా సౌందర్యాన్ని, మనుషులు దైవం అని పిలిచే దానిని, చూచే అవకాశం కనిపించడంలేదే. మనిషికి ఎంత సున్నితమైన వీక్షణ వున్నా, లేక నాలాగ మొద్దుబారిపోయినా, మనిషి ఏదో కొద్దిపాటి సౌందర్యాన్నో లేక మరికాస్త సౌందర్యాన్నో దర్శిస్తున్నాడు. అంతేగాని, దీనినంతా

ఛేదించు కొని మనిషిని మరో పరిణామ స్థాయికి, మరో దరికి తీసుకువెళ్ళి ఆ అత్యద్భుత సౌందర్యాన్ని చూపించలేకపోతే ఇంతటి ఈ ప్రయత్న మెందుకనిపిస్తుంది. నిశితంగా గమనించడం వలన సిద్ధించే ఈ సునిశితత్వం ద్వారా లభించేది యావత్తూ పరిమాణంలో మరికాస్త పెద్దదవచ్చు. రాసిలో కలిగే ఈ హెచ్చుతగ్గులు వాసిలో తేడా తీసుకురాగలవని నేననుకోను. రాసిలో ఆధిక్యత గుణాత్మకమైన మార్పునెలా సాధిస్తుంది? ఏదో కొద్దిపాటి మార్పు, ఒకింత మెరుగుతెచ్చే ప్రక్రియతో నా ప్రస్తుత అవస్థలో నేను సంతృప్తిపడగలిగిలేను.

జి.కృ. : ఇప్పుడు మీరడగుతున్న దేమిటంటారు? నిస్సారంగా ఎండి, పాలిపోయి, కళావిహీనమైన ఈ పరిస్థితిని దాటి, మరో డైమెన్షన్ ఎలా అందుకోవాలనేదేనా మీ ప్రశ్న?

ఇం : అవును. అదే నా ప్రశ్న. ఈ కవులు, కళాకారులు సునిశితమైన చూపు నలవరచుకున్నవారు ఊహించే సౌందర్యాన్ని నేను చిన్నచూపు చూడడంలేదు. కాని అద్భుతమైన దేదీప్యమానమైన ఆ సత్య సౌందర్యం మాత్రం వీరూహించేది కాదు. అది తప్పనిసరిగా వేరేదై వుండాలి.

జి.కృ. : మీరు నిజంగా వెతుకుతున్నది అదేనా? మీకదే కావాలంటారా? అలా అయే పక్షంలో, మీ జీవితంలో, మీ ఉనికిలో సంపూర్ణ విప్లవం సంభవించాల్సి వుంటుంది. మీకు నిజంగా అది కావాలా? ఈ అంతర్ విప్లవానికి మీరు సిద్ధమేనా, అనేది ఆలోచించండి. ఈ అంతరంగిక విప్లవం మీ భావనా ప్రపంచాన్ని, కృత్రిమంగా మీరేర్పరచుకున్న విలువలనూ, నీతినీ అన్నిటినీ కూలదోసేస్తుంది. మీ సంఘ గౌరవాన్ని, మీరు సేకరించిన విజ్ఞానాన్ని అన్నిటినీ పెఠిల్లున బ్రద్ధలు కొట్టేస్తుంది. అలా బ్రద్ధలై పోయినపుడు మీరు మీరుగా మిగలరు. మీలో ఏమీ మిగలదు. శీలమనుకునేది, కారెక్టర్ అనుకునేది కూడా మిగలదు. ఇప్పుడు మీరు చేస్తున్న అన్వేషణ అనేది కూడా వుండదు. ఇది మంచి, ఇది చెడు అనే అభిప్రాయాలుండవు. ఇతరుల మీదికి ఉవ్వెత్తున లేచే ఈ స్వభావం కానీ, 'అలాంటి స్వభావం ప్రదర్శించకూడదు సుమా' అనే ద్వంద్వం కానీ వుండదు. ఇప్పుడు మీ వ్యక్తిత్వంలో ఉన్నదనుకున్నదేదీ మిగలదు. మొత్తం శూన్యమై పోతుంది.

ఇలా ఏర్పడిన ఈ శూన్యంలో ఒక తీక్షణమైన తపస్సు (Extreme Austerity) నెలకొంటుంది. ఆ తాపసిక సౌందర్యంలో ఒక్క చిటుకు క్రౌర్యం కానీ, పరుషం కానీ, కలహించే ధోరణి కాని వుండవు. ఈ మొత్తాన్ని ఛేదించుకొని బయటపడడమంటే ఇదీ అర్థం. మీరిది నిజంగా కోరుకుంటున్నారా? ఇది కావాలంటే అత్యాశ్చర్యకరమైన బుద్ధి కావాలి. మోపెడు సమాచారం సేకరించినా, బండెడు శుష్క పాండిత్యం సంతరించుకున్నా లాభంలేదు. ఈ బుద్ధి ప్రజ్వరిల్లినప్పుడు మీరు మేల్కొని వున్నా నిద్రావస్థలోనున్నా అది తన పని తాను చేస్తూనే వుంటుంది.

అందుకే వెలుపలా లోపలా కూడా గమనిక అవసరమన్నది. ఈ గమనిక మనసును నిశితంగా పదును పెట్టగలుగుతుంది. పదునెక్కిన ఈ మనసు నిశ్చలమవుతుంది. ప్రశాంతంగా వుంటుంది. ఈ సున్నితత్వం, ప్రకాశవంతమైన ఈ బుద్ధే, మనిషి మేథని ఏ సందర్భంలో ఉపయోగించవలసి వుంటే అక్కడ ఉపయోగపడేట్లు చేస్తుంది. మిగతా వేళల్లో ఈ మేథ, ఈ మనస్సు నిద్రిస్తవని కానీ, అచేతన స్థితిలో ఉంటై అని కానీ అనుకోనక్కర లేదు. జాగ్రత్తగా గమనిస్తూ నిశ్చలంగా వుంటాయి.

అప్పుడు ఎట్ట ఎదుట కనిపించే ప్రతి విషయానికి మనసు స్పందించే తీరు వేరుగా వుంటుంది. లోపల కలిగే ఒక భావానికి మరొక భావానికి పరస్పర వైరుధ్యముండదు. అంతస్సంఘర్షణ ఎప్పుడైతే నిర్మూలమవుతుందో, మనసు ఏ విషయాన్నైనా తిన్నగా చూడ గలుగుతుంది. వక్రీకరించే లక్షణముండదు. ఆ స్థితిలో చేసే కర్మ– అది ఏదైనప్పటికీ– ప్రమాదం తటస్థించ నున్నప్పుడు తన్నివారణార్థమై కర్మ ఎంత వేగంగా జరుగుతుందో, అంత త్వరగా చిటికెలో జరిగిపోతుంది.

అప్పుడు సిద్ధాంతపరమైన బరువంతా తీసి పక్కకు పెట్టవచ్చు; భావాల చెరనుండి విముక్తి సిద్ధిస్తుంది. ఇప్పుడీ లోకాన్ని వీక్షిస్తున్నది 'నేను' అనే ఈ భావపరంపరే. ఈ 'నేను'గా రూపొందిన వాడు ఎప్పుడూ అడ్డుగోడలు కడుతూనే వుంటాడు. ఈ అడ్డుగోడ తొలగిపోతే, ఛేదించుకొని బయటపడడమూ లేదు. అసలు ఛేదించవలసింది ఏదీ మిగలదు.

అప్పుడు సమస్తమైన సౌందర్యమూ ఆ జీవించే తీరులోనే ద్యోతకమవుతుంది. మిగతా ప్రాణికోటితో మొత్తం ప్రకృతితో ఆ జీవికుండే సంబంధంలోనే సౌందర్యమంతా ఇమిడి వుంటుంది. ఒక మిథ్యా బింబంస్థానే మరో మిథ్యా బింబాన్ని ప్రతిష్ఠించే ప్రయత్న ముండదు. అప్పుడే ఆ అనంతమైనది గోచరించే అవకాశం లభిస్తుంది.

***ఆంధ్రప్రభ 17-2-91***



**'కృ'** అడపాదడపా జోక్స్ చెప్పేవాడు. 'ఓ ఇంగ్లిష్ పిల్లవాడు **సర్ ఎడ్విన్ లూట్యెన్స్** (ఢిల్లీ నగర నిర్మాణానికి ఆకారమిచ్చినవాడు)ను, 'దేవుడుమనుషుల్లో తెల్లవాళ్లనీ నల్లవాళ్లనీ విడిగా ఎందుకు సృష్టించాడు?' అని అడిగినప్పుడు సర్ ఎడ్విన్ ఇచ్చిన సమాధానం: 'చదరంగమాడటానికి'.

# 'ఒరిజినల్' మనిషి

"మీలో ఒరిజినల్ అయినది ఏదైనా ఉందేమో ఒక్కసారి పరిశీలించండి. మీరిలా ఎందుకు అయిపోయారో ఆలోచించండి. ఎవరో ఎప్పుడో చెప్పిన దానిని వల్లె వేస్తూ కూచుంటే ప్రయోజనమేమి సిద్ధిస్తుందండీ? పవిత్ర గ్రంథాలకు భాష్యాలు రాయడంతో సరిపెట్టుకుంటే ఏమిటొస్తుందండీ? మీరంతా ఇలా సెకండ్ హాండ్ మనుషులుగా రూపొందడం మీకెలా సమ్మత మవుతుందండీ?" అని ఎంతో బాధపడేవారు శ్రీ జిడ్డు కృష్ణమూర్తిగారు. "మీకు ఏర్పడిన "కండిషనింగ్" నుండి విడివడ"మని సూచిస్తుండేవారు.

ఆయన వాడే కండిషనింగ్ అనే పదానికి విస్తృతార్థం ఉంది. సంప్రదాయ వేదాంత పరిభాషలో చెప్పాలంటే స్థూలంగా "పూర్వ వాసనలు" అని అర్థం చెప్పవచ్చు. ఇంకా వివరంగా చెప్పాలంటే – ఏ అనుభవాలు, జ్ఞాపకాలు చిత్తంలో చోటు చేసుకున్నాయో, ఈనాడు నీ జీవిత సరళిని నిర్ణయిస్తున్నాయో, వేటి ప్రభావంలో పడి నీ జీవితాన్ని యాంత్రికంగా గడుపుతున్నావో, ఏవైతే నిన్ను బంధిస్తున్నాయో, వేటి నుండి విడివడలేక నీవు అవస్థపడుతున్నావో, ఆ మొత్తాన్నుండి విముక్తి చెందాలి. ఈ పూర్వ స్మృతులనే వాసనల నుండే కాక, ఈ నాటి అనుభవాలు, ప్రభావాలు, ప్రచారాలు, నమ్మకాలు మొదలైన వాటికి కూడా ఎడంగా నిలబడాలి. అభిప్రాయాలు, ఆలోచనలు, రియాక్షన్లు అన్నీ నీ గతాన్ని బట్టే రూపొందుతున్నాయి కాబట్టి, వాటిని పరీక్షగా గమనిస్తూ ఉండాలి; వాటి మూలాన్ని తెలుసుకోవాలి. ఇలా జీవిస్తే "కండిషనింగ్" యావత్తూ వదిలిపోయి ఒరిజినల్ మానవుడి దశకు వస్తావు. మూల పురుషుడి స్థితిని అందుకుంటావు.

ఈ ప్రాథమిక స్థితికి రావడమంటే అడవి మనిషి అయిపోవడమనీ, భాష, సంస్కృతి నాగరికత మొదలైనవన్నీ లోపించిన మృగ సమాన స్థితికి దిగజారడమనే భయ సంకోచాలు ఉదయించవచ్చు. కానీ అది సరికాదు. తపస్సు చేసిన మునులందరూ ఈ కండిషనింగ్ పోగొట్టుకోడానికే తపస్సు చేపట్టారు. తపస్వికి ఏ పూర్వానుభవం ఉపయోగపడదు. పైగా ప్రతిబంధకంగా తయారవుతుంది. తాను ఎవరైనది కానీ, ఏ దేశ కాల పరిస్థితులకు చెందిన వాడిననే విషయం కానీ, తపస్సులో నిమగ్నమైనంతసేపూ,

ఏ ఒక్కటీ గుర్తుండదు. చిత్తంలో పూర్వానికి చెందినదేది ప్రవేశించినా ఇక అది నూతన చిత్తం కాదు. పూర్వ చిత్తంలో నుండి నూతన మానవుడు ఆవిర్భవించలేదు. దానితో తెగతెంపులు చేసుకోక తప్పదు. లేని పక్షంలో బోయవాడిలో నుండి వాల్మీకి జన్మించడు.

పాత మనస్సు నుండి జన్మించిన భావం ఎంతటి ఉదాత్తమైనదైనా, అది స్వార్థాన్ని, దాటగలిగి ఉండదు. అలాంటి చర్యల్లో, మనిషికి తెలియకుండానే, స్వార్థం ఎక్కడో గూడుకట్టుకొని ఉంటుంది. కొన్ని ఉత్తమ కార్యాలు, లోకం మెచ్చుకునేవి, చేసినట్లే చేస్తుంది; కానీ ఏదో ఒక దశలో వాటికి ప్రతిఫలం కోరుతుంది. ధన కనక వస్తు వాహన రూపేణా కాకపోయినా కీర్తి రూపేణా చరిత్రలో శాశ్వత స్థానం రూపేణా, ఏదో ఒకటి వాంఛిస్తూనే ఉంటుంది.

పాత మనసు తునాతునక లైతేనే, తుడిచి పెట్టుకుపోతేనే, కొత్త మనసు జనిస్తుంది. అప్పుడే మనిషి పునర్జన్మ ఎత్తినట్లు భావించాలి. నవ్య మానవుడు ఎప్పుడు ఉద్భవిస్తాడో అని కవిత్వం రాయాల్సిన అవసరం ఉండదు; అతడికై కలలు కనాల్సిన పనిలేదు. ప్రయత్న పూర్వకంగా ఇప్పుడే, ఇక్కడే మీలోనే ఈ నవ్య మానవుణ్ణి ఆవిష్కరించవచ్చు. అప్పుడే మీరు ఒరిజినల్ మనిషి అనిపించుకుంటారు.

***ఆంధ్రభూమి 25-3-1992***

# ప్రముఖ భారతీయ తత్త్వవేత్త శ్రీ జిడ్డు కృష్ణమూర్తి

విద్యనర్థించేవాడు విద్యార్థి. పాఠ్యపుస్తకాల ద్వారా, పంతుళ్ళ బోధ ద్వారా విద్య నార్జించటం నేటి విద్యార్థి ఏకైక లక్ష్యంగా రూపొందింది. బడిలో పంతులు చెప్పేదేకాక, జీవితం నేర్పేది కూడా నేర్చుకోమని శ్రీ జిడ్డు కృష్ణమూర్తి గారి ఉద్బోధ. గ్రంథాలు, ఉపాధ్యాయులు నేర్పగలిగినదంతా లోకజ్ఞానం, అపరావిద్య. మనిషి జీవికకు ఈ అపరా విద్యలు ఏంతైనా అవసరమనే మాటనెవరూ కాదనలేరు. అందులో నేటి సాంకేతిక యుగంలో లోక సంబంధిత విద్యలు నేర్వకపోతే మనిషికి బ్రతుకుతెరువూ లేదు, సంఘ జీవనంలో పాల్గొనే అవకాశమూ లేదు. మనిషి ఇంజనీర్‌గానో, ప్రొఫెసర్‌గానో, కంప్యూటర్ స్పెషలిస్టుగానో, డాక్టర్, బూరోక్రాట్, స్కిల్డ్ వర్కర్ మొదలైన ఏ వృత్తి నవలంబించి జీవికకు అవసరమైన ధనమార్జించాలన్నా, లౌకిక విద్యలనాశ్రయించిక తప్పదు; దేశ కాలాను గుణ్యంగా లోకం ఏ విద్యల నాదరిస్తుందో ఆ విద్యలు నేర్వక తప్పదు; కానీ పరిమితమైన ఈ జ్ఞానమూ, ఈ విద్యలతోనే సరిపెట్టుకొని, తద్వారా దక్కేటువంటి ఆర్జనేకాక కీర్తి ప్రతిష్ఠలను తలుచుకుంటూ మురిసిపోయి, ఇదే జీవిత పరమావధి అని భ్రమపడితే, చిట్టచివరకు ఆ మనిషి దోసెట్లో బూడిద మిగులుతుంది. జీవిత కాలమంతా తన ప్రేయస్సుకై పాటుబడ్డాడే కానీ, శ్రేయస్సుకై తాను చేసిందేమీలేదు. అసలైన విద్య ఏ మనిషినీ పొరపాటు చేయనీయదు.

నిజమైన విద్య మనిషిని బంధవిముక్తుణ్ని చేసి స్వేచ్ఛను ప్రసాదించగలిగి వుండాలి అంటారు శ్రీ జిడ్డు కృష్ణమూర్తి. స్వేచ్ఛలోనే మనిషి వికసించగలడు. స్వేచ్ఛలోనే తనకు తెలియనిది, ఈ తెలిసినదాని ఆవలనున్నదీ, పవిత్రమైనది కనుగొనగలడు. ఇప్పటివరకు తనకు తెలిసిన సమస్తంలోనూ వినూత్నమైనదేమీలేదు, నిత్యమైనదేమీలేదు. జీవితం శర వేగంతో పయనిస్తూ వుంటే, గతాన్ని నెమరు వేసుకుంటూ కూచోనే మనిషి. దానితో సమానంగా పయనించలేడు. గతంలో చిక్కుకున్న మనిషికి అతడి పాత జ్ఞాపకాలు, పాత అనుభూతులు, పాత అనుభవాలు ఇవే గుర్తుకొస్తూ వుంటై; అతడి మనస్సంతా వాటితోనే నిండిపోయి వుంటుంది. వీటన్నిటి బరువుతో, ఈ నిర్బంధిత మనస్సు స్వేచ్ఛగా

రెక్కలు విప్పుకొని ఎగరలేదు కాబట్టి, అత్యంత వేగంగా ముందుకు సాగిపోతున్న జీవిత దర్శనం జరగనే జరగదు. ధ్యానమూ, దర్శనమూ లేని జీవితం వ్యర్థమంటారు శ్రీ జిడ్డు కృష్ణమూర్తి.

నిజమైన విద్య మనిషిని ఈ దర్శనంవైపు మళ్ళించాలి. ఒక వంక లోకసంబంధమైన విద్యలన్నీ క్షుణ్ణంగా నేర్చుకుంటూ, వాటిలో నైపుణ్యం సాధిస్తూ, మరోవంక మనిషి ఎదగ డానికి, మానసికంగా వికసించడానికి, హృదయానందం బడయడానికీ, సృష్టి మొత్తాన్ని ప్రేమించడానికి అవసరమైన విద్యను కూడా నేర్వాలి అంటారు శ్రీ కృష్ణమూర్తిగారు. ఇలాంటి విద్యకు అంతమనేది లేదు. ఎరుకతో నిత్య జాగరూకతతో, కోమలమైన మనస్సుతో ఈ విద్యను జీవితాంతం నేరుస్తూ వుండాల్సిందే. ఇలా నేర్వడానికి అనుకూలమైన మనసు కలిగుండాలి. కాపట్యం, దురాశ, భయం, మొదలైనవన్నీ విడనాడిన మనసే, సతతమూ శ్రద్ధతో ఈ విద్యనధ్యయనం చేయగలిగిన స్థితిలో వుంటుంది.

కృష్ణమూర్తిగారికి ఈ మనసు చాలా చిన్నతనంలోనే సిద్ధించినట్లు కనిపిస్తుంది. చిత్తూరు జిల్లాలోని మదనపల్లెలో నారాయణయ్య, సంజీవమ్మలకు పుట్టిన ఈ అష్టమ గర్భుడు, తల్లి మరణానంతరం, రెవెన్యూ శాఖ నుండి రిటైరైన తండ్రి మద్రాసు వెళ్ళి అక్కడి థియోసాఫికల్ సొసైటీలో ఉద్యోగం చేస్తున్న మూలాన, తమ్ముడు నిత్యానందతోబాటు మద్రాసుకు వెళ్ళిపోయాడు. అక్కడ తియోసఫిస్టు అయిన లెడ్ బీటర్ అనే ఒక ప్రజ్ఞావంతుడు అడయార్ బీచ్ వొడ్డున తమ్ముడితో తిరుగాడుతున్న కృష్ణమూర్తిలో కనిపించిన కొన్ని అసాధారణ లక్షణాలను తన అతీంద్రియ శక్తితో గ్రహించి, కానున్న జగద్గురువు ఇతడేనని ప్రకటించడం, అనీబిసెంటు ఆ విషయాన్ని ప్రపంచంలో ఎల్లెడలా చాటడం అందరూ ఎరిగినదే. కృష్ణమూర్తిని జగద్గురువుగా రూపొందించడానికి చిన్ననాట నుండీ ప్రయత్నాలు ప్రారంభించారు. ఇంగ్లీషు భాషను చక్కగా నేర్పారు. బలహీనంగా వున్న అతడికి పుష్టిగల ఆహారం పెట్టారు. అనీబిసెంటు కృష్ణమూర్తిని తన పిల్లవాడిగానే భావించి, పెంచి పోషించి, పెద్దచేసింది.

కానీ కృష్ణమూర్తికి థియోసాఫికల్ చట్రంకానీ వారిధోరణి కానీ నచ్చలేదు. అధ్యాత్మిక రంగంలో ఒకరి అథారిటీని మరొకరు స్వీకరించడం అనవసరమేకాక,

అనర్థదాయకమనీ, సత్యం స్థాణువుగా ఒకచోట వుండేదికాదు – కాబట్టి దానికి నిర్దేశిత మార్గమంటూ ఏదీ ఉండజాలదనీ, సత్యాన్ని ఎవరికి వారే దర్శించాల్సిందే కానీ, సంస్థాగతంగా సామూహికంగా ఇందుకై ఎవరూ ఏమీ చేయజాలరనీ 1929లో ఆయన ప్రకటించాడు. అంతకు మునుపు తాను ఏఏ సంస్థలకు అధిపతిగా అనేక స్థిరచరాస్తులు పొంది వుండెనో, వాటన్నిటినీ ఆయా దాతలకు తిరగ రాసేశాడు. తాను గురు పీఠాన్ని అధిష్ఠించడం లేదని, తనకు శిష్యులనే వారు ఎవరూ లేరని ప్రకటించి, నడి సముద్రంలో నావలాగ ఒంటరిగా నిలబడి పోయాడు. చాలామంది థియోసఫిస్టులు ఆయనకు ఎడమైన మాట వాస్తవమే. అయినప్పటికీ, కొందరు మిత్రులు మాత్రం అతడికి అండగా వుండిపోయారు. అలాంటి మిత్రుల సహాయంతో జీవితమంతా పలుదేశాల్లో పర్యటించి, నిత్యమూ తాను దర్శించే జీవిత సత్యాన్ని పదిమందితో పంచుకుంటూ వుండేవాడు. 1895లో మదనపల్లెలో జన్మించిన ఈ తెలుగుబిడ్డ, 1986లో అమెరికా దేశపు కాలిఫోర్నియా రాష్ట్రంలోని ఓహాయ్ (ojai) అనే గ్రామంలో తొంభై ఒకటవ ఏట తన తుదిశ్వాస విడిచాడు.

శారీరకంగా ఆయన మన మధ్య లేకపోయినప్పటికీ, సాంకేతికాభివృద్ధి ధర్మమా అని ఆయన వ్రాసిన పుస్తకాలు, చేసిన ప్రసంగాల టేపులు, మేధావులతో ప్రొఫెసర్లతో, శాస్త్రజ్ఞులతో ఆయన జరిపిన సంభాషణల సంవాదాల వీడియో టేపులు, అన్నీ నేటి తరం వారికి లభ్యమవుతున్నాయి. కాబట్టి, ఆయన చెప్పిందేమిటో, అది మన జీవితాలకు ఎంత ప్రయోజన ముంటుందో చదివి, విని చూచి తెలుసుకోవడానికి అవకాశమున్నది. విముక్త స్థితిలో సంపూర్ణమైన మానవులుగా, కరుణాంతరంగులుగా జీవించి తరించాలనే అభిలాష వున్నవారికి ఆయన సందేశం యథాతథంగా అప్పుడూ ఇప్పుడూ కూడా అందుబాటులోనే ఉంది.

***తెలుగు విద్యార్థి, ఏప్రిల్ 1993***

# తీరని దుఃఖం

శ్రీ జిడ్డు కృష్ణమూర్తిగారు కనుగొని ప్రవచించిన తత్త్వం దేశ కాలాతీతమైనది. ఈ జగద్గురువు బోధించే తరణోపాయాన్ని లోకం తిరస్కరించి తన దుఃఖంలో తాను మళ్ళీ మునిగి తేలుతూ ఉంటుందేమో అని మొదట్లోనే అనుమానించిన ఒక అనామకుడైన రచయిత, కృష్ణమూర్తి గారి సందేశాన్ని లోకానికి చాటటానికి ప్రారంభించిన ఇంటర్ నేషనల్ స్టార్ బులెటిన్‌లో అరవై నాలుగు సంవత్సరాల క్రితమే (1929)లో చిత్రమైన ఒక కట్టుకథ రాసి ప్రచురించాడు. అది చదివినప్పుడు దానిని అనువదించి కృష్ణమూర్తి గారి జన్మదిన సందర్భంగా తెలుగు పాఠకులకు అందజేద్దామనిపించింది.

భారతీయ కాలమానం ప్రకారం కృష్ణమూర్తిగారు మే 11వ తారీఖున రాత్రి 12.30 గంటలకు జన్మించిన కారణంచేత ఆయన పుట్టిన తేదీ మనమిక్కడ మే 11గా భావిస్తాం. కానీ పాశ్చాత్యుల లెక్కననుసరించి, రాత్రి 12 గంటలు దాటిన తర్వాత అది కాలెండర్‌లో కొత్త తారీఖు ప్రారంభమైనట్లే కాబట్టి, అక్కడి వారంతా కృష్ణమూర్తిగారు మే 12న జన్మించినట్లు భావిస్తారు. ఇక కథ చదవండి.

 

అనగా అనగా – నిజమైన కథలన్నీ ఇలాగే ప్రారంభమవుతై సుమా – ఒక లోక ముండేది. ఆ లోకంలోని జనులంతా అనారోగ్యంతో విచార భావంతో బ్రతుకు వెళ్ళదీస్తుండే వారు. కష్టాల కడలిగా కనిపిస్తున్న జీవితాన్నుండి విముక్తి చెంది, ఆనందాన్ని అందుకోవాలని శతవిధాల కోరుకుంటుండేవారు. ఇందుకోసం మొక్కుతుండేవారు, ప్రార్థిస్తుండేవారు. ప్రేమిస్తుండేవారు, ద్వేషిస్తుండేవారు. వివాహాలాడుతుండేవారు. యుద్ధాలు చేస్తుండేవారు. వారు ఎంత దుఃఖితులో, సంతానం కూడా అంత దుఃఖానికి లోనై ఉండేది. అయినప్పటికీ “ఆనందం మీ జన్మ హక్కనీ” ఎప్పటికైనా మీరు (పిల్లలు) ఆ లక్ష్యాన్ని అందుకోవాలని, తమ పిల్లలకు బోధిస్తుండేవారు.

ఇలాంటి బాధామయ లోకంలోకి ఎవరో ఒక మహాజ్ఞాని, ఒక గొప్ప బోధకుడు రానున్నాడని, ఉన్నట్లుండి ఒకనాడు ఎవరో మరొకరి చెవులో ఊదారు. ఆ రహస్యం ఆ నోటా ఆ నోటా పడి, బాగా ప్రచారం పొందింది. ఆ వచ్చే బోధకుడు ప్రజలు అనుభవిస్తున్న దుఃఖానికి నివారణోపాయం కనుగొన్నాడనీ, జనులు అందుకోదలచుకున్న శాశ్వతా నందానికి దారి చూపించగలడనీ చెప్పుకున్నారు.

ఈ 'వరల్డ్ టీచర్' ఆగమనం గురించి మంగళకరమైన వార్తను దశదిశలా వ్యాపింప జేయడానికి అనేక సంస్థలు, సంఘాలు, స్థాపించారు. ప్రజలంతా ఎంతో ఉత్కంఠతో ఎదురుచూస్తున్న జగద్గురువు రాకను తెలియజేయడానికి స్త్రీ, పురుష కార్యకర్తలు నలు దిక్కులకూ వెళ్ళారు. గురువు వేగంగా వచ్చి తమని తరింపచేయాలని అక్కడక్కడా ప్రార్థనలు ప్రారంభించారు. జగద్గురువుకు సరియైన స్వాగత సత్కారాలు ఉండాలంటూ కొందరు అనుష్ఠాన కర్మలు చేయసాగారు.

ఈ కొత్త టీచర్ చేసే బోధలను మరింత బాగా అర్థం చేసుకునేందుకు, కొందరు పాత శాస్త్రాలనూ పవిత్ర గ్రంథాలనూ తీసి ఒకప్పటి ప్రవక్తలు ఏం చెప్పారో దానినంతా శ్రద్ధగా పఠించనారంభించారు. ఈ కొత్త గురువు రంగప్రవేశం చేయక మునుపే, ఆయన చెప్పబోయే దానికి తాము భాష్యం చెప్పనున్నట్లు ముందే ప్రకటించుకున్నారు.

ఒకనాడు ఆయన రానే వచ్చాడు. లోకులకు ఆనందమివ్వడానికి, వారి బాధ నివారించడానికి, వారి దుఃఖాగ్ని చల్లార్చడానికి వచ్చానని అన్నాడు. తాను స్వయంగా అనేక ఇడుమలకోర్చి, పెను దుఃఖానికి లోనై ఎట్టకేలకు ఆనంద సామ్రాజ్యాన్ని కనుగొన్నాడు. అక్కడికి వెళ్ళే మార్గం అందరికీ చూపిస్తానన్నాడు. కాని అక్కడికి దారి చాలా ఇరుకు కాబట్టీ, దాదాపు నిలువు నిటారుగా ఎక్కాల్సి వుంటుంది కాబట్టీ, ప్రయాణానికి ఇంతకుముందు పోగేసుకున్న సామానంతా వదిలేసి, తక్కువ లగేజితో 'లైట్‌గా' సిద్ధం కమ్మన్నాడు. తమ తమ దేవుళ్ళనీ, మతవిశ్వాసాలను, ఆచార విధి నిషేధాలనూ, పవిత్ర గ్రంథాలనూ మొదలైన వాటినన్నిటినీ ప్రక్కన పెట్టమన్నాడు. బంధాలు తెంచుకు బయలు దేరమన్నాడు. అలాచేసే పక్షంలో, దారిలో వారి దాహాన్ని తీర్చడానికి తన వద్ద ఉన్న సజీవ జలాలు అందిస్తానన్నాడు.

ప్రయాణాంతంలో తాను శాశ్వతంగా నివసిస్తున్న ఆనంద సామ్రాజ్యానికి చేరుస్తానన్నాడు.

ఇంతకాలంగా బోధకుని కోసం ఎదురు తెన్నులు కాచిన వారంతా ఇప్పుడేదో అసౌకర్యానికి గురయ్యారు! కలవరం చెందారు. "మేము ఎంతగానో శ్రమించి నేర్పినదంతా ఇప్పుడిట్టే వదిలేయమంటే అదెలా సాధ్యమవుతుంది? ఆ విజ్ఞానం లేకుంటే లోకం ఈ టీచర్‌ను ఏనాటికీ అర్థం చేసుకోలేదు. ఏ పూజలు పునస్కారాలు చేసిన కారణాన మాకింత శక్తి సంప్రాప్తించిందో, వాటినే వదిలేయమంటే ఎలా కుదురుతుంది? మా బంధు మిత్రాదులను వదిలేయమంటాడు, ఇదేమిటి?" అన్నారు.

తమలో తాము గుసగుసలాడుకో మొదలెట్టారు. "అసలు మనం ఎదురుచూసిన టీచర్ ఇతడేనంటారా? అయినట్లయితే మనల్ని ఇవన్నీ విసర్జించమని చెప్పి ఉండేవాడా?" అని ఆశ్చర్యపోయారు. గురువు ఆగమనానికి ముందే, తాము ఆయనకు కాబోయే శిష్యులమని ప్రకటించుకున్న వారు మరింత అలజడికి లోనయ్యారు.

ఈ విషయమై దీర్ఘంగా ఆలోచించి, ధ్యానించి చివరికేదో వెలుగు కనిపించినట్లు భావించి, ఇలా ప్రకటించారు. "లోకాన్ని ఉద్ధరించడానికి టీచర్ వస్తాడన్న మాట నిజమే! కానీ ఈ లోకాన్ని మేమెరిగినంతగా ఆయన ఎరగడు. అందువల్ల ఆయన ప్రవచించే దాని అర్థ తాత్పర్యాలు లోకానికి మేము వివరిస్తాం" అన్నారు.

అప్పుడు పండితులైన వారు లేచి ఇలా సెలవిచ్చారు. "అన్నిటినీ పరిత్యజించమని ఆయన ఇచ్చే సలహా మాకు వర్తించదు. మా పాండిత్యం లోకానికి చాలా అవసరం. లోక క్షేమం కోసం ఈ పాండిత్యం మేమిలా ఆర్జిస్తూ ఉండాల్సిందే" అన్నారు. పూజా పునస్కారాలు చేసేవారు "మా కోసం చేసే పూజలు వదిలేయగల మనుకోండి; వాటి అవసరం ఎలాగూ దాటిన వాళ్ళం. కానీ లోకుల కోసమైనా మేము వీటిని చేస్తూ ఉండాల్సిందే. ఆచార విధులన్నిటినీ పాటించవలసిందే; లేని పక్షంలో సామాన్యులకు ఎంతైనా అపకారం చేసిన వాళ్ళమవుతాము" అని అంటూ పూజా విధులన్నీ యధావిధిగా కొనసాగడానికి ఆలయాలు, చర్చీలు, మసీదులు నిర్మించే కార్యక్రమాన్ని చేపట్టి, ఇదంతా లోకోద్ధరణకేనన్నారు. టీచర్ మాట వినే తీరిక లేనంత పనిభారాన్ని మోస్తుండేవారు.

బంధుమిత్రాదులను వదిలేయమనే ఈయన బోధ కొందరికి మాత్రం చాలా అనుకూలంగా తోచింది. హాయిగా బాధ్యతారహితంగా బ్రతకవచ్చు కదా అనుకున్నారు. "మీరు చెప్పినట్లుగా అన్నీ వదిలేశాం. మిమ్మల్ని అనుసరించదల్చుకున్నాం. ఇక మా తిండీ తిప్పలూ మీరే చూచుకోండి. ఏదో ఒక ఉద్యోగమిప్పించి, మా పోషణ జరిగేట్లు చూడండి" అని తమ బాధ్యత ఆయనపై మోపుదామని ప్రయత్నించారు.

చాలా కొద్దిమంది మాత్రమే, బంధాలన్నిటినీ నిజంగా వదిలేసి, టీచర్ సమీపాన కూచొని, "ఆకలి"గొన్నవారికి ఆహారమెలా సమకూర్చాలో, 'దాహం'గొన్న వారికి జలాల నెలా అందజేయాలో నేర్చుకోనారంభించారు. వీరు తమకున్న పాండిత్యంకన్నా ఈ టీచర్ కనుగొన్న సుజ్ఞానమే లోకానికి ఎక్కువ ఉపయుక్త మని గ్రహించిన వారు. జటిలమైన తమ ఆలోచనా విధానంకన్నా ఈయన నేర్పే సరళమైన విద్యే లోకులకు సులభంగా అర్థమవుతుందని తెలుసుకున్నారు. ఆయన లోకులకు అందివ్వ దలచుకున్న ఆనందానికి ఈ బాహ్య పూజా పునస్కారాలు అనవసరమైనవే కాక, అవరోధాలు కూడానని కనుక్కున్నారు. బంధుమిత్రాదుల యెడల మానసిక బంధం, పరస్పర దోపిడీ విధానం తెంచుకోడం అవసరం కానీ, వారి గతికి వారిని వదిలేసి తమపాటికి తాము బాధ్యతారహితంగా తిరగమని టీచర్ ఉద్దేశంకాదని అర్థం చేసుకున్నారు.

కానీ మెజారిటీ సంఖ్యలో ఉన్నవారు మాత్రం ఈ కొద్దిమందిని నిరసించారు. "లోకానికి టీచర్ ఇచ్చే పోషకాహారం అవసరంలేదు. మేము తయారుచేసిన పిండి వంటే లోకానికి ఎక్కువ ఉపయోగం. అదెలా చేయాలో మాకొక్కరికే తెలుసు. అలాగే లోకుల దాహం తీర్చడానికి స్వచ్ఛమైన జలాలు కాదు వాడాల్సింది; మా సీసాల్లో, జాడీల్లో మేము నింపిపెట్టిన ఈ ప్రత్యేకమైన మధువే వారికి ఉపయోగం. మీ టీచర్ మాటలు మరీ సరళమైనవి; అందువల్ల అవి లోకుల తలకెక్కవు. 'ఓస్ బోధ అంటే ఇంతేనా!' అని లోకం ఈ బోధను పెడచెవినపెట్టే ప్రమాదమున్నది. లోకంలోని జటిలమైన సమస్యలను పరిష్కరించడానికి అనువుగా మా వద్ద ఓ పట్టాన కొరుకుడుపడని క్లిష్టమైన సిద్ధాంతాలు వున్నాయి. వాటికి భాష్యం చెప్పి ప్రపంచానికి చక్కగా విశదీకరిస్తాం" అన్నారు.

ఎవరు పడితే వారు గురువు వద్దకు వెళ్ళకుండా నిరోధించడానికి, మరికొందరు ఆయన చుట్టూ దడులూ, గోడలూ కట్టి, లోపలికి ప్రవేశించడానికి తలుపు తాము తెరవాల్సి ఉంటుందని కాపలా పెట్టారు.

అనతి కాలంలో వరల్డ్ టీచర్‌కు విసుగుపుట్టి అక్కణ్ణుంచి వెళ్ళిపోయాడు. అంతకు ముందు అనేక రకాలుగా మాట్లాడిన వారందరూ, వెళ్ళిపోయిన టీచర్‌ను మహాపురుషుడని పేర్కొంటూ, ఆయన పేరిట ఆలయాలు నిర్మించి, ఆయన వైభవానికి తగినట్లుగా వినూత్నమైన పూజా విధానాలు సృష్టించి, ఆయన "చేయనటువంటి బోధ" ఆధారంగా ఒక కొత్త మార్గాన్ని నెలకొల్పారు. మునుపటిలాగే లోకం బాధపడుతూ, మూలుగుతూ, 'సహాయపడే వారెవరూ లేరా? అనే వెర్రి కేక పెడుతూనే ఉండిపోయింది!

***ఆంధ్రప్రభ 12-5-1993***


జిడ్డు కృష్ణమూర్తి బోధ బుద్ధుని బోధ వలె నుంటుందని అరుణాచల రమణుల సమక్షంలో ఎవరో అనగా, 'అవునవును - అభివ్యక్తీకరణకు మించినది (beyond expression)' అన్నారు శ్రీరమణులవారు.

# మనిషి స్వేచ్ఛే నా ఏకైక లక్ష్యం

చిత్రకారుడు ఓ చిత్రాన్ని వేస్తున్నాడంటే అది తన సంతోషంకొద్దీ చేస్తున్నాడన్న మాట. తన మనోవైఖరిని, తన ఆనందాతిశయాన్ని తన చిత్త స్వాస్థ్యాన్ని స్పష్టంగా తెలియ జేయడానికి చిత్రం గీస్తున్నాడు. నేనిప్పుడు చేస్తున్నది కూడా అలాంటిదే. ఎవరి వద్దనూ ఏమీ కాంక్షించి నేనీ పనిచేయడంలేదు.

మీరంతా అథారిటీకి అలవాటుపడ్డవారు; అలాంటి వాతావరణంలో కృషిసల్పితేనే ఆధ్యాత్మికతను అందుకోగలమని మీ అభిప్రాయం. మరెవరో మీ మధ్యకొచ్చి తన అసాధారణ శక్తితో, తన మహిమతో మీకు శాశ్వత విముక్తి ననుగ్రహించి ఆ విధంగా మిమ్మల్ని ఆనందసీమకు చేరవేయగలడని ఆశిస్తూ ఎదురుచూస్తూ వున్నారు. మీ దృష్టి అంతా అటువంటి ప్రామాణికమైన అధికారయుతమైన వాక్కు మీదనే ఆధారపడి వున్నది.

ఇప్పటికి మూడేళ్ళుగా మీరంతా నేను మాట్లాడేదంతా వింటున్నారుకానీ, చాలా కొద్దిమందిలో తప్పితే, మీ ఎవ్వరిలోనూ ఏ మార్పూలేదు. ఇప్పుడైనా నే చెప్పేది సవిమర్శాత్మకంగా విశ్లేషించి చూచి మౌలికంగా సంపూర్ణంగా అర్థం చేసుకోండి.

పద్దెనిమిదేళ్ళుగా మీరు ఈ జగద్గురువు (వరల్డ్ టీచర్) ఆగమనం కొరకై ఎదురు చూస్తున్నారు, సిద్ధమవుతున్నారు. ఈ పద్దెనిమిదేళ్ళుగా మీరు ఎంతో సంఘటితమయ్యారు. మీ హృదినీ, మదినీ ఆ గురువు ఆనందంతో నింపుతాడనీ, మీ మొత్తం జీవితాన్ని మార్చి వేస్తాడనీ, ఓ నూతన అవగాహన కల్పిస్తాడనీ, జీవితంలో మిమ్మల్ని పై మెట్టుమీద నిల్పుతాడనీ, గొప్పగా ఉత్తేజపరుస్తాడనీ, విముక్తి కలిగిస్తాడనీ ఎంతగానో ఆశించారు. మరి ఇప్పుడు జరుగుతున్నదేమిటో చూడండి. అలాంటి విశ్వాసం పెంచుకున్నందువల్ల, మీలో ఏమాత్రమైనా మార్పు కలిగిందేమో ఆలోచించండి. మీతో మీరే తర్కించుకోండి. మార్పంటే, చొక్కా మీద పెట్టుకునే బాడ్జీలు మార్చడం వంటి స్వల్ప విషయంకాదు సుమండీ!

మీరేర్పరుచుకున్న విశ్వాసం, మీ జీవితంలోని ప్రాధాన్యంలేని విషయాలనన్నిటినీ తుడిచివేయగలిగిందా అని నేనడుగుతున్నాను. మార్పు సంభవించిందో లేదో తేలాలంటే, అదొక్కటే మార్గం. పూర్వంకన్నా ఏ విషయాల్లో ఈనాడు మీరు స్వేచ్ఛను సాధించారు? ఏఏ విషయాల్లో మీరు అప్పటికన్నా ఇప్పుడు పెరిగి పెద్దయినట్లు? అసత్యమైన, అముఖ్య మైన విషయాల ఆధారంగా నిర్మితమైన ఈ సమాజంలో మీరు ఎదురైనప్పుడు. తాము పోషించే విలువలకు మీరు విఘాతంగా పరిణమిస్తారేమోననే బెదురు మీరీ సామాజికుల్లో కల్గించారా? ఇదే మీ ఎదుగుదలను సూచించగలరు.

మీ ఆధ్యాత్మికతకు, ఆనందానికి జ్ఞానోదయానికి మీరంతా మరొకరిపై ఆధారపడు తున్నారు. జ్ఞానం కొరకై, సెల్ఫ్ యొక్క నిత్యత్వం, ప్రకాశం, ప్రక్షాళన కొరకై మీలోననే వెతుక్కోవాల్సి వుంటుంది అని నేనంటే, ఆ పనిచేయడానికి మీలో ఏ ఒక్కరూ సిద్ధంగా లేరు. కొద్దిమంది ఉండవచ్చుగాక. కానీ వారి సంఖ్య చాలా స్వల్పమనే చెప్పవలసి వుంటుంది. మరి అటువంటప్పుడు ఆర్గనైజేషన్ ఉండి ఏమి ప్రయోజనం?

బయటి నుండి ఎవరూ మిమ్మల్ని విముక్తుల్ని చేయగలిగిలేరు. సామూహిక ప్రార్థనలు కానీ, ఏదో మహదాశయానికి మిమ్మల్ని మీరు అంకితం చేసుకున్నందువల్ల కానీ, మీరు విముక్తులవు తారనుకోకండి. మీరందరూ ఒక సంఘంగా ఏర్పడినందువల్లా, నిరంతర కార్య నిర్వహణలో నిమగ్నమైనందువల్ల కూడా విముక్తులు కాలేరు. టైప్‌రైటర్ ఉపయోగం ఉత్తరాలు టైప్ చేయడానికే; అందుకని దానిని ఓ వేదికపై పెట్టి పూజించము కదా? అదే విధంగా మీ ఆర్గనైజేషన్ మీకు ప్రధానమనిపిస్తే దానిని పూజిస్తున్నట్లే అనుకోవాలి.

పత్రికల వారు నన్నడిగే ప్రథమ ప్రశ్న "మీకు సంబంధించి ఎంతమంది వున్నారు? మీ అనుచరులెందరు?" అంటుంటారు. అంటే నే చెప్పే విషయం యొక్క నిజానిజాలు వారు నాకున్న సంఖ్యాబలాన్ని పట్టి నిర్ధారిస్తారన్నమాట. నిజానికి నాకు సంబంధించిన వారు ఎందరున్నారో నాకు తెలియదు. నాకా విషయం అనవసరం కూడాను. విముక్తుడైనవాడు, ఆఖరికి ఒక్కడున్నా చాలు!

మరో విషయమేమిటంటే, ఆనంద సామ్రాజ్యపు ద్వారం తెరవడానికి అవసరమైన తాళపుచెవి కొందరి వద్దనే ఉన్నదని మీ నమ్మకం. కానీ అది ఎవరి వద్దా లేదు. దానిని తమ హస్తగతం చేసుకునే అధికారం ఎవరికీ లేదు. ఆ తాళపుచెవి 'సెల్ఫ్' మాత్రమేనని గుర్తుంచుకోండి; ఆ సెల్ఫ్‌ని ప్రక్షాళన చేసి ఏనాటికి క్షీణించని నిత్యత్వం కలదిగా రూపొందించడం ద్వారానే మీకా శాశ్వత సామ్రాజ్యం లభిస్తుంది.

ఆధ్యాత్మికంగా మీరెంత ప్రగతి సాధించారు, మీ ప్రస్తుత స్థాయి ఏపాటిది, మొదలైన విషయాలు మరొకరి చేత చెప్పించుకోడం మీకు అలవాటయింది. ఇది ఎంత పిల్ల చేష్టో మీరు ఆలోచించండి. సర్వకాల సర్వావస్థలయందు క్షీణించని శాశ్వతత్వం మీలో నెలకొన్నదో లేదో మీకు మీరు స్వయంగా తెలుసుకోవలసిందే కానీ, ఈ విషయం మరొకరు మీకు ఎలా చెప్పగలరండీ?

కానీ (జీవితాన్ని) ఎవరైతే నిజంగా అర్థం చేసుకోవాలని అభిలషిస్తారో, ఎవరైతే ఆది అంత్యాలులేని, నిత్య సత్యాన్ని కనుగొనాలని కాంక్షిస్తారో, అలాంటి వారంతా మరింత తీక్ష భావంతో కలిసి ఒకటిగా నడుస్తారు; వారు అడుగిడినచోట అసత్యమైన, అనావశ్యకమైన అంధకారపు నీడలన్నీ వెనక్కు తగ్గక తప్పదు. వీరంతా అవగాహన కలిగి వుంటారు కాబట్టి, తమ దృష్టిని అసలు విషయంపై కేంద్రీకరించగలరు; అగ్ని శిఖలుగా రూపొందగలరు. అలాంటి ఒక చిన్న బృందాన్ని సృష్టించడం నా కర్తవ్యంగా భావిస్తున్నాను. అలాంటి వారి మధ్య నుండేటి మైత్రీభావం ఎటువంటిదో మీకు అర్థం కాకపోవచ్చు. కానీ ఆ మైత్రీ భావ కారణంగా ఆ బృందంలోని ప్రతి ఒక్కరూ, పరస్పరం నిజమైన సహకారం అందించుకోగలిగి వుంటారు. ఈ సహకారమైనా అథారిటీని అనుసరిస్తే మోక్షం ప్రాప్తిస్తుంది అనే ఆశవల్ల కాదు; అలాకాక అర్థం చేసుకున్న కారణాన నిత్యమైన దానితో జీవించనారంభించినందువల్ల సంభవిస్తుంది.

ఈ రెండేళ్ళుగా నేను చాలా ఆలోచించి తీసుకున్న ఈ నిర్ణయానికి ఇవి కొన్ని కారణాలు. ఈ నిర్ణయం అకస్మాత్తుగా తోచిన ఒక చర్యగా భావించవద్దు. నాకెవరో చెప్పి ఒప్పించారనుకోకండి– ఇలాంటి విషయాల్లో ఎవరూ నన్ను ఒప్పించగలిగిలేరు. మనసులో నేనీ విషయాన్ని రెండేళ్ళుగా జాగ్రత్తగా, ఓర్పుగా,

సావధానంగా ఆలోచించి, చివరకు ఈ స్టార్ సంస్థను రద్దు చేయాలనే నిర్ణయానికి వచ్చాను.

మీరు ఇతర సంస్థలను నిర్మించుకోవచ్చుగాక; మరెవరైనా జగద్గురువుకై నిరీక్షించ వచ్చుగాక. అయితే వాటి వేటితోనూ నాకు సంబంధంలేదు. అలాగే కొత్త పంజరాలు సృష్టించడం కానీ, ఆ పంజరాలకు, బోనులకు వినూత్నాలంకరణలు చేసుకోడంతోగానీ నాకు నిమిత్తం లేదు. మనిషికి నిర్నిబద్ధమూ, సంపూర్ణమూ, అయిన స్వేచ్ఛను కలిగించడమే నా ఏకైక లక్ష్యం.

(మేరీ లూట్యెన్స్ రచించిన ది ఇయర్స్ ఆఫ్ ఎవేకనింగ్ నుండి)

***ఉదయం 5-11-1994***



# సత్యప్రేమికుడు

మదనపల్లెలోని తెలుగు దంపతులకు జన్మించి, బ్రిటిష్ జాతీయుల కనుసన్నల్లో పెరిగి, కేవలం, పాస్‌పోర్ట్ నిమిత్తార్థమై భారతీయుడిగా నమోదు చేయించి కులమత జాతిభేదాలను దాటి విశ్వమానవుడిగా ఎదిగి "నేను మనుష్య స్వభావాన్ని మానవ ధర్మాన్ని" [I am humanity] అన్నట్టి శ్రీ జిడ్డు కృష్ణమూర్తిగారి శతజయంతి ఉత్సవాలు ఈ సంవత్సరం (1994–95) పొడుగునా ప్రపంచవ్యాప్తంగా జరుగుతున్నాయి. ఈ సందర్భంగా మద్రాసులో జనవరి 18 నుండి 21 వరకూ నాలుగురోజులపాటు నేల నాలుగు చెరగుల నుంచి, కృష్ణమూర్తి 'టీచింగ్'ను అభిమానించేవారు, సాధకులు ఆ పట్టణం అడయారు వసంత విహార్‌లో సమావేశమవుతున్నారు. ఈ సెంటినరీ కమిటీ అధ్యక్షుడు మాజీ రాష్ట్రపతి శ్రీ ఆర్. వెంకట్రామన్. ఆయన, ఆయనతోబాటు తన చిన్నతనంలోనే కృష్ణమూర్తిని 'వసంత విహార్'లో కలిసి మాట్లాడి, 'ఈ కృష్ణమూర్తిగారు చాలా అసాధారణమైన వ్యక్తి' అని వర్ణించి ఆయన యెడల అభిమానం పెంచుకున్న టిబెటన్ మతగురువు శ్రీ దలైలామా, ఈ సమావేశంలో పాల్గొని ప్రసంగిస్తారు. వీరేకాక మరెందరో తాత్వికులు, మేధావులు పాల్గొంటున్న సమావేశమిది.

1929లో హాలెండ్ దేశంలో జరిగిన ఒక సమావేశంలో "సత్యానికి నిర్దేశిత మార్గమంటూ లేదు. ఇది కనుగొనడానికి సామూహికంగా ప్రయత్నాలు చేయడానికి వీలుపడదు. అందుచేత జగద్గురువు రాకకై ఎదురు చూస్తూ దానికై సన్నాహాలు చేసేందుకు సృష్టించిన ఈ ఆర్డర్ ఆఫ్ ది స్టార్ అనే సంస్థను రద్దు చేస్తున్నాను" అని కృష్ణమూర్తి నిర్ద్వంద్వంగా ప్రకటించేసరికి తియోసఫిస్టులు చాలా కలవరపడ్డారు. తియొసాఫికల్ సొసైటీలో కృష్ణమూర్తిని మొదట చేరదీసిన లెడ్‌బీటర్, చిన్నతనంలో 'కృ'కు పాఠాలు బోధించిన అరండేల్ మహాశయుడు అతడికి దూరమయ్యారు.

కానీ చోద్యమేమిటంటే, 'కృ'ని పెంచి పోషించి పెద్దచేసిన శ్రీమతి ఎనీబేసెంటు మాత్రం ఇలా జరిగినందుకు ఎంతో ఆశాభంగం చెంది కూడా, "కృష్ణమూర్తి అపసవ్యమైన పని చేయజాలడని నా నమ్మకం. అతడి నోటి నుండి విశిష్టమైన టీచింగ్ రానున్నది"

అని నిస్సంకోచంగా ప్రకటించింది. అలాగే 'కృ'కి చిన్నప్పుడు పాఠ్యాంశాలు బోధించి, అటు తర్వాతి కాలంలో తియొసాఫికల్ సొసైటీకి అధ్యక్షుడైన శ్రీలంక దేశీయుడు శ్రీ జినరజదాన, "కృ. చెప్పేది మీకెవరికైనా వెంటనే అర్థంకాకపోతే, అర్థమయేంత వరకూ దానినే మళ్ళీ మళ్ళీ చదువుతుండండి. వేరెవరి వద్దకో వెళ్ళి అర్థం చెప్పించుకోడానికి ప్రయత్నించకండి" అని అన్నాడంటే, ఆ టీచింగ్ ఎంత ప్రశస్తమైనదో మరొకరి ద్వారా అర్థతాత్పర్యాలు చెప్పించుకుంటే, అది వక్రీకరింపబడే ప్రమాదముంటుంది కాబట్టి, స్వయంగానే దానితో తంటాలు పడి నేర్చుకోడం ఎంత అవసరమో తెలియజేస్తున్నాడన్న మాట. తర్వాతి కాలంలో తియొసాఫికల్ సొసైటీ ప్రెసిడెంట్ అయిన శ్రీ ఎన్. శ్రీరామ్, కృష్ణమూర్తి బోధను శ్రద్ధగా గమనిస్తుండేవాడు. ఆయన కుమార్తె ఈనాటి సొసైటీ ప్రెసిడెంట్ అయిన శ్రీమతి రాధా బర్నియర్, కృష్ణమూర్తి టీచింగ్‌ను మొదట్నించీ ఎంతగానో అభిమానిస్తూ వచ్చింది. "కృ". తియొసాఫికల్ సొసైటీతో 1929లో తెగతెంపులు చేసుకున్నాడు అనేకన్నా కృష్ణమూర్తి చెప్పేది ఆనాటి తియొసాఫిస్టులు సరిగ అర్థం చేసుకోలేక, వారే ఆయన్ని విడనాడారు అనడం సబబు" అని ఓ సందర్భంలో ప్రకటించింది. ఆమె ఈనాడు ఇండియన్ కృష్ణమూర్తి ఫౌండేషన్‌లోని కొద్దిమంది సభ్యుల్లో ఒకరు.

కృష్ణమూర్తి తన జీవిత కాలంలో ఎన్ని సంస్థలకు దూరమయినా, ఎందరు పాత మిత్రుల స్థానంలో కొత్త మిత్రులు రంగ ప్రవేశం చేస్తున్నా, సత్యం ఆయన్ని ఎటు నడిపిస్తే అటు నడిచి వెళ్ళిపోయాడు. లోకంలో ఎవరితోనూ, ఏరకంగానూ సమాధాన పడకుండా సత్యానికి మాత్రమే కట్టుబడిన ఆయన మార్గం కఠినమే అయినప్పటికీ, సత్య ప్రేమికుడెవరికైనా ఈ గతి తప్పదు.

యవ్వనంలో లాటిన్ అమెరికన్ దేశాల్లో ఒకసారి ఆయన ప్రసంగించడానికి వెళ్ళినప్పుడు, అక్కడి కాథలిక్ చర్చ్ బిషప్‌లు తదితరులు అతడి సభలు జరుగనివ్వకుండా చేయాలని ప్రయత్నించారు. అక్కడి రేడియో స్టేషన్ వారు 'కృ' చేత చేయించదల్చుకున్న ప్రసారాన్ని ఈ వైరివర్గం తమ పలుకుబడితో రద్దు చేయించింది. ఇన్ని అవరోధాలు సృష్టించినప్పటికీ, 'కృ' అక్కడ బహిరంగ సభలు నిర్వహించాడు. "ఇక్కడి మీ శత్రువులు

మిమ్మల్ని ఆటంక పరచడానికి ఎన్నో ఎత్తులు వేశారన్న సంగతి మీకు తెలుసా?" అని సభలో ఎవరో అడిగారు. "నే చెప్తున్న విషయం లోతుల్లోకి వెళ్ళి, అర్థం చేసుకున్న వారు, దీనితో స్వేచ్ఛగా సహకరిస్తారండీ. ఇది అర్థంకాక తమ అజ్ఞానంలోనే తాము ఉండిపోయిన వారు దీనిని తిరస్కరిస్తారు. అంతేగానీ, శత్రువు లెక్కడ ఉంటారండీ?" అని సమాధానమిచ్చాడు కృష్ణమూర్తి.

యవ్వన దశలోనే ఒకసారి 'కృ'కు రుమేనియాకు రమ్మని అక్కడి అభిమానులు ఆహ్వానించారు. ఆయన అక్కడికి చేరిన రోజున, ఆయన్ని ఆహ్వానించిన పెద్దమనిషి, ఒక ఉత్తరాల ప్యాకెట్ అతడి చేతికిచ్చాడు. ఆ ఉత్తరాలన్నిటిమీదా రక్తంతో సంతకాలున్నాయి! 'కృ' దేశంలోకి అడుగుపెట్టినా, ప్రసంగించినా కాల్చేస్తామని ఆ ఉత్తరాలలో బెదిరింపులు. 'కృ'ను పోలీస్ రక్షణలో ఉంచవలసి వచ్చింది. ఆయన సభలకు వచ్చిన వారినందరినీ పోలీసులు తనిఖీ చేసిగాని లోనికి పోనిచ్చేవారు కాదు. 'కృ' తల్లి హిందువనీ, తండ్రి యూదు జాతీయుడనీ, ఎవరో ప్రజల్లో ప్రచారంచేసి వ్యతిరేకత కలిగించేసరికి 'కృ' ప్రసంగ ధోరణికి ఆగ్రహించే అక్కడి క్రిస్టియన్లకు, ఈ సమాచారం అందడంతో అగ్నికి ఆజ్యం పోసినట్లయింది. 'కృ'ని నిరసించి, భోజనం చేస్తున్న హోటల్ ఆహారంలో అక్కడి ఆయన వ్యతిరేకులు విషం కలిపారు. 'కృ' తీవ్ర అనారోగ్యానికి గురయి, ఒక సానిటోరియమ్‌లో మూడు నాలుగు వారాలపాటు ఉండవలసి వచ్చింది. అప్పటి నుండి ఆయన జీర్ణ ప్రక్రియ దెబ్బతిని, జీవితాంతమూ తాను తినే పదార్థాలు జాగ్రత్తగా ఎంచుకోవలసి వచ్చేది అంటారు.

ఒకప్పటి తన సహచరుడు అయినప్పటికీ, తనపై అసూయతో 'కృ'ను కోర్టు ద్వారా సవాల్ చేసి ముప్పుతిప్పలు పెట్టిన శ్రీ రాజగోపాల్ ఎంతగా సతాయిస్తున్నప్పటికీ, 'కృ' అతణ్ని ఒక్కమాట అనేవాడు కాదు. 'నువ్విలా ఎందుకు ప్రవర్తిస్తావ్? సమరసంగా ఎందుకుండలేవు?' అనే మాటతోనే అతణ్ణి సమీపిస్తుండేవాడు, సంభాషిస్తుండేవాడు.

కృష్ణమూర్తిని శత్రువుగా భావించిన వారు ప్రపంచవ్యాప్తంగా అక్కడక్కడా ఉండవచ్చు కానీ, 'కృ' మాత్రం ఎవరినీ శత్రువుగా భావించేవాడు కాదు. అజాతశత్రువు అనే వర్ణన సరిపోతుందనుకుంటాను.

కృష్ణమూర్తి నిర్భయస్థుడు. తన తరానికి చెందిన జవహర్‌లాల్ నెహ్రూను, తర్వాతి తరంలోని ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీని ఎరిగి ఉన్నప్పటికీ, ఆమె దేశంలో ఎమర్జెన్సీ విధించడం, ఆ విధంగా ప్రజల వాక్స్వాతంత్ర్యం మొదలైన వాటిని హరించడం 'కృ'కు ఎంతమాత్రం నచ్చలేదు. ఎమర్జెన్సీ విధించకముందు, భారతదేశానికి ఏటా వచ్చి కొన్ని ప్రధాన పట్టణాల్లో ప్రసంగించినట్లే, ఆ సమయంలో కూడా వద్దామనుకున్నాడు. నిర్మొహమాటంగా ఉన్నదున్నట్లు మాట్లాడే కృష్ణమూర్తి, తీరా దేశంలోకి వస్తే బహిరంగ సభలలో 'ఎమర్జెన్సీని' విమర్శించకుండా ఉండడు. ఈ అప్రియమైన మాటలు ఇందిరా ప్రియదర్శినికి ఎలాగూ కోపం తెప్పిస్తాయి. పోలీసువారు ఈయన మీద కేసు పెడితే 'కృ'ను నిర్బంధించవలసి రావడమో, ప్రసంగాల మీద ఆంక్ష విధించడమో, ఏదో ఒకటి చేయక తప్పదు. ఇందిరాగాంధీ సన్నిహితురాలైన శ్రీమతి పుపుల్ జయకర్‌కు పెద్ద సంకటావస్థ ఏర్పడింది. ఒక వంక తనకు మొదట్నుంచీ చేరువగానున్న ప్రధాని శ్రీమతి ఇందిర–మరొక వంక తాను ఎవరి టీచింగ్‌నైతే శిరోధార్యంగా భావించిందో, ఆ కృష్ణమూర్తి. 'కృ'ను ఎరిగిన వారికి, అతడు వేదిక నుండి ప్రసంగం ప్రారంభించిం తర్వాత ఎవరూ ఆపగలిగి, అదుపులో పెట్టగలిగి లేరని తెలుసు. రాజకీయాలు, ఆర్థిక విషయాలు, సాంఘిక సాంస్కృతిక ఆధ్యాత్మిక రంగాలంటూ జీవితాన్ని ఆయన విడివిడిగా దర్శించజాలడు. ఆయనకు మొత్తమంతా కలిసి ఒకటిగానే కనిపిస్తుంది. స్వేచ్ఛను ఎవరు ఎక్కడ హరించినా సహించలేడు.

'కృ' పూర్వ చరిత్ర కూడా అలాంటిదే. ద్వితీయ ప్రపంచ సంగ్రామ కాలంలో (1939–45) తాను నివసిస్తున్న అమెరికాలో ప్రసంగించేటప్పుడు, 'హిట్లర్ ప్రారంభించిన యుద్ధం గురించి మీ అభిప్రాయమేమిటని, అక్కడి పౌరులు సభలో అడగగా, "యుద్ధానికి మీరూ నేనూ అందరమూ బాధ్యులమేనండి. ఏ ఒక్కరినీ ప్రధానంగా వేలెత్తి చూపనక్కర లేదు. ముందు మనలోని దుష్టత్వం గమనించండి" అనే ధోరణిలో ఆయన చెప్పుకు పోతుండే సరికి, సభలోని అనేకులు సామూహికంగా అక్కడి నుండి లేచిపోయారు. యుద్ధం పరిసమాప్త మయ్యేవరకూ ఈ ఆగ్రహ ప్రదర్శనలు ఏ రూపం ధరిస్తాయోనని, బహిరంగ సభలు లేకుండా ఆయన మిత్రులే జాగ్రత్తపడ్డారు.

ఇటువంటి 'కృ'ను ఆ ఎమర్జెన్సీ కాలంలో భారతదేశానికి రానివ్వడం ఎవరికీ శ్రేయస్కరం కాదని, "భారతదేశంలో పరిస్థితులు కాస్త చక్కబడిన తర్వాత వద్దురు గాని" అని సలహా ఇచ్చారు, భారత, అమెరికా దేశాల్లోని ఆయన మిత్రులు. ఇందిరాగాంధీ మరి రెండు నెలలకు ఎమర్జెన్సీ ఎత్తేసి, ఎలెక్షన్లు ప్రకటిస్తుందనగా, 'కృ' భారతదేశానికి వచ్చారు. ఒక పూటంతా ఇందిరాగాంధీ 'కృ'తో కూచొని మాట్లాడింది. వారిద్దరూ ఏమేమి మాట్లాడారో ఎవరికీ అంతగా తెలియదు. కాని ఎమర్సెన్సీ తొలగించడానికి 'కృ' కొంత కారణమయి వుండవచ్చునని అంటారు శ్రీమతి పుపుల్ జయకర్.

ఢిల్లీలో ఇందిరాగాంధీని కలిసిన అనంతరం, వారణాశి వచ్చి అక్కడ తన రాజఘాట్ స్కూల్ మైదానంలో ఎమర్జెన్సీ ఇంకా గట్టిగా అమలులో వున్న తరుణంలోనే, సభలో కొందకు సి.ఐ.డి.లు వున్నారని అందరికీ తెలుస్తున్నప్పటికీ, ప్రజల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను అరికట్టటానికి ఎవరికీ హక్కులేదని 'కృ' తీవ్రంగా విమర్శించారు. అక్కడి నుండి మద్రాసు వచ్చినప్పుడు, పత్రికల వారు వచ్చి కలువగా, "ఇటువంటి పరిస్థితుల్లో ప్రజలు తమ వాక్ స్వాత్రంత్యం మొదలైన ఇతర స్వాతంత్ర్యాలు కోల్పోతూ వుంటే, ఈ దేశంలోని ఆధ్యాత్మిక గురువులు ఒకరు కాకపోతే ఒకరైనా 'ఏమిటిది?' అని అడిగిన పాపాన పోలేదేమండీ? వారి ఉద్దేశం ఇలాంటి విషయాలు ఆధ్యాత్మికతకు సంబంధించనివనా?" అని తన బాధను వ్యక్తం చేశారు.

కృష్ణమూర్తిగారి శతజయంతి జరపడం, వ్యక్తిగా ఆయన్ని ఆరాధించడానికి కాదు. బ్రతికున్న కాలంలోనే ఆయన ఆరాధన నాశించలేదు. ఇక మరణానంతరం ఆయనకు దీనితో ఏమిపని? కానీ ఆయన టీచింగ్ మాత్రం మానవాళిని స్వేచ్ఛాభిముఖంగా నడిపించగల శక్తి గలది. సెంటినరీ నిర్వాహకులు చాలా కొద్ది ధరలో అందిస్తున్న ఆయన పుస్తకాలను చదివి, మీ జీవితాల్లో ప్రయోగించి చూచుకోండి; మీరు స్వేచ్ఛ సాధిస్తే, ఈ కార్యక్రమ నిర్వాహకుల కృషి సఫలీకృతమైనట్లే. కృష్ణమూర్తి లక్ష్యం నెరవేరినట్లే.

*ఆంధ్రప్రభ 18-1-95*

# స్వయంగా కనుగొన్న దానికి ఉండే సత్తా

కృష్ణమూర్తిగారి ప్రసంగాలు మనస్సు నాకట్టుకుంటై అనే మాట నిజమే. కానీ ఆ విన్న క్షణమందు, పాలపొంగులా పెల్లుబికే ఉత్సాహమూ అభినివేశమూ ఎక్కువసేపు నిలవకపోవచ్చు. మరొకరు చెప్పింది ఎంతో బాగుందని, దానిని ప్రచారం చేయడానికి నడుంకట్టినందువల్ల ప్రయోజనమేమీ దక్కదు. ఎవరికివారే ఈ విషయాన్ని జాగ్రత్తగా, సునిశితంగా, సావధానంగా లోలోనికి వెళ్ళి నేర్చుకోవాలి. ఇందుకుగాను ఓ పరిభాషగానీ, ఓ ప్రత్యేక శిక్షణగానీ, ఒకరి అథారిటీగాని అక్కరలేదు. తమ తమ మనసులలోకి చూచుకునే శ్రద్ధాసక్తులు వుంటే చాలు. ఆ చూపే ఎలా వుండాలో వివరిస్తున్నారు శ్రీ కృష్ణమూర్తిగారు.

జి. కృ. సూచించే మనసుకావల ఉన్నటువంటి స్థితి ఏదో 'రొమాంటిక్ ఐడియా' అనుకోనక్కరలేదు. కేవలం గ్రంథాలు చదవడంతో వేదాంత ఉపన్యాసాలు వినడంతో సరిపుచ్చుకోకుండా, స్వయంగా మనసు లోతుల్లోకి వెళ్ళడం ప్రారంభిస్తే ఆయన చెప్పే స్థితిని మీరే కనుగొనవచ్చు. మానవుడిగా ఆయనకు సిద్ధించినటువంటిది, మీకూ నాకూ మాత్రం ఎందుకు సిద్ధించకూడదు? ఆయనకు సిద్ధించింది కాబట్టి ఆయన్ని ఆరాధిస్తాం అనే బదులు, మీరు కూడా దానిని దర్శించడానికి మీ శక్తియుక్తులను వినియోగించడం ధర్మంకాదా?

ఆలోచనారహితమైన మనసు ఆవలనున్న వాస్తవాన్ని చూచీ చూడగానే, ఆ కాస్తతోనే సంతృప్తి చెంది సాధించవలసిందేదో సాధించాననే భ్రమలో ఇక కర్తవ్యమల్లా ఇతరుల నుద్ధరించడానికి పెద్ద సంస్థలు స్థాపించడమే ననుకోవడం, అందుకై మనుష్యుల్ని కూడగట్టి ధన కనక వస్తు వాహనాలు పోగేస్తూ వుండడం యావత్తూ, మనిషి తన అతిశయాన్ని, అహంకారాన్ని చాటుకోడమే అవుతుంది. ఇలాంటి వైఖరే సాధకునికి అన్నిటికన్నా పెద్ద ప్రతిబంధక మంటున్నారు కృష్ణమూర్తి. అనంతమైన దానిని, నిత్యనూతనమైన దానిని గురించి నేర్చుకున్నది అతి స్వల్పం. నేర్చుకోవలసింది ఎంతైనా ఉన్నదనే వినమ్రతతో జీవితమంతా ఈ నేర్వడానికి అంకితం చేయడమే మానవ

కర్తవ్యం. అలా బ్రతికేవారి ద్వారానే సత్యం నిత్యనూతనంగా ఎప్పటికప్పుడు ప్రకటితమవుతూ వుంటుంది.

పృచ్ఛకుడు : మీరు చెప్తున్న విషయం నాకు చాలా ఆసక్తిదాయకంగా ఉంది. నాలో ఎంతో అభినివేశం కలుగుతున్నది. ఈ విషయాన్ని గురించి అచరణాత్మకంగా ఏదైనా చేద్దామని వుంది. ఏమి చేయమంటారు?

కృష్ణమూర్తి : అభినివేశం అనేది త్వరితంగా అణగారిపోతుందండీ. ఇక్కడ చెప్తున్న విషయాన్ని బట్టి మీరు ప్రేరణ చెందుతున్నట్లయితే, ఆ ప్రేరణ అనతికాలంలోనే అంతర్ధాన మవుతుంది. అప్పుడు మీరు మరో ప్రేరణ, మరో సెన్సేషన్ (ఇంద్రియ సంబంధ జ్ఞానం)కై వెతుకులాడుతారు.

అలాకాక ఈ చెప్తున్న విషయం, మీరు లోలోనికి వెళ్ళి చేసే విచారణలో, మీరు స్వయంగా కనుగొన్న దానిలో ఒక భాగమైనట్లయితే అది మీదే అవుతుంది. అప్పుడది మరొకరు కనుగొని మీకు చెప్పినది కానేరదు. కానీ ఇదే మరొకరిదైనప్పుడు, ఒక అథారిటీని సృష్టించడం, ఆ వ్యక్తి అథారిటీని ఆరాధించే విధానం రంగప్రవేశం చేయడం, ఇదంతా సంభవిస్తుంది. ఇక అథారిటీని ప్రామాణికంగా ఎంచే ఈ విధానం చాలా క్లిష్టంగాను అలసట కలిగించేదిగాను, మీ యావచ్ఛక్తినీ హరించేదిగాను తయారవు తుంది. ఇక్కడ మనం మాట్లాడుకున్న విషయం శ్రద్ధగా ఆలకించి, స్వయంగా అర్థం చేసుకున్నట్లయితే, మీ అంతట మీరే, సహజంగా చేయవలసినదేదో చేస్తారు. అలా కాకుండా కేవలం అభినివేశం మాత్రమే కలిగుండి, ఇక్కడి ప్రసంగంవల్ల ప్రేరణ కలిగిందంటారను కోండి. అప్పుడిక మీరు చేసేదల్లా ఏదో ఒక కూటమిలో సభ్యుడిగా చేరడం, జనాన్ని సమీకరించడం. సంస్థలు స్థాపించడం వగైరా. ఇలాంటివన్నీ మరో అవరోధంగా తయారవుతై.

అదట్లావుంచి మనం మాట్లాడుకుంటున్నది ఇంతకీ దేనిని గురించి? నేనేమీ కొత్త విషయం చెప్పడంలేదే. మనవంక మనమెలా చూచుకోవాలి అనే విషయమే కదా మనం అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నది? ఎట్ట ఎదుట కనిపిస్తున్న ఈ చైతన్యమే మనం. అట్టి ఈ చైతన్యం ఎలా ప్రవర్తిల్లుతుంది అనేది కదా మనం అర్థం చేసుకోదల్చుకున్నది?

మనల్ని మనం అర్థంచేసుకోవాలంటే మనిషికి తనను గురించిన జ్ఞానమవసరం. తనను తాను గమనించే తరుణంలో కానవచ్చే లక్షణాన్ని అది ఏదైనప్పటికీ, నిరసించకుండా, సమర్థించకుండా, మరొకదానితో పోల్చి చూడకుండా, దానిపై ఏ తీర్పు తీర్మానమూ చేయకుండా, దానిని ఎరుగాలి. లోనజనిస్తున్న ఆలోచననూ, 'నేను'గా కనిపించేదాని రీతినీ, గ్రహించడంలో మరొకరి అథారిటీ అవసరం లేదు కదా. నిన్నూ నీ తీరునూ వ్యక్తిగతంగా స్వయంగా నీవే కనుగొనాలి.

వచ్చిన చిక్కేమిటంటే, మనకీవిషయంలో ప్రోత్సాహం కావలిసి వస్తూ వుంటుంది. కలిసి పయనించడానికి తోడు కావలసుంటుంది. 'బాగానే చేస్తున్నావోయ్' అని కితాబులిచ్చే వారుండాలి. మనవలెనే ఆలోచించే మనుష్యుల్ని కలవాలనిపిస్తుంటుంది. ఇవన్నీ కూడా మనల్ని పక్కత్రోవ పట్టించే చికాకులని తెలుసుకోండి.

ఇది మీరే కనుగొనవలసినది. ఈ మొత్తం విషయంలో లోపలికి వెళ్ళిన కొద్దీ, తనంత తానే క్రియ నాచరించే ఒకానొక స్థితిని మీరే స్వయంగా కనుగొంటారని సూచిస్తున్నాను; అది ఆ విధంగా ప్రవర్తించడానికి మీరు చేయవలసిందేమీ వుండదు. మీరు వాస్తవమైన దానిని కనుగొంటే, ఆ సత్యపదార్థం తనంతట తానే ప్రవర్తిల్లుతుంది. కానీ మనం కలగచేసుకొని ఆ సత్యంచేత ఏవో చేయిద్దామని చూస్తుంటాం. దాని విషయంలో ఏవో కార్యక్రమాలు చేపట్టి తద్వారా కలిగే అనేక రకాల అనుభవాల వలన మళ్ళీ నిబద్ధీకృతుల మవుతుంటాం.

ఏవో కొన్ని ప్రసంగాలు వినిన కారణంగానూ, కొన్ని పుస్తకాలు చదివినందువల్ల కాక, లోచూపువల్ల ఏర్పడే మరోరకమైన కర్మాచరణ (యాక్టివిటి) ఉన్నదని నా భావన. అది మీరు స్వయంగా కనుగొంటే, మనసుకు ఆవల ఆ స్థితిని మీరనుభవించగలరు; అక్కడ ఆవిర్భవించే కర్మాచరణ అనేది వేరొకటున్నదని మీకే తెలిసివస్తుంది. కానీ ఏదో ఒకింత అర్థమయింది కాబట్టి, ఆ అనుభవాన్నే పట్టుకొని, దానికే అంటిపెట్టుకొంటూ. 'ఇకముందు ఆ స్థితి నుండే నా కర్మాచరణ సాగించగలను' అనుకుంటే, అది మీ ప్రతిబంధకంగా పరిణమిస్తుంది.

***ఉదయం 28-1-95***

# జీవన గమనం

మన జీవితం మనకో సమస్యల వలయంగా కనిపిస్తుంది. వాస్తవమైన కష్టాలే కాక, మానసికమైన బాధలు, వ్యాకులం కలిగించే చికాకులెన్నిటితోనో నిండి ఉంటుంది. వీటన్నిటినీ ఎలా పరిష్కరించాలో మనకు తెలియదు. మనల్ని మనం ఏమాత్రం ఎరిగున్నా ఒకటి తెలుస్తుంటుంది. పరిశీలనగా మనవంక మనం చూసుకున్నప్పుడు మనలో కనిపించే ఈ సమస్యల నుండి పరిగెట్టిపోదా మనిపిస్తుందనే విషయం స్పష్టమవుతుంది. ఈలోన దాగి ఉన్న అనేకానేక సమస్యలు తీరా తారాస్థాయి నందుకున్నప్పుడు ఓక్లిష్ట పరిస్థితి ఏర్పడుతుంది. అప్పుడే అవి మనకు విశదంగా కనిపించనారంభిస్తై. అప్పటికీ వాటిని ఎలా తీర్చాలో మనకు తెలియదు. అందుకు అవసరమైన తీవ్రత (Intensity) గానీ, తేటతెల్లంగా, విశదంగా చూడగలిగిన జ్ఞానం కానీ మనకు ఉన్నట్లు కనిపించదు.

ఈ సమస్యల నుండి తప్పించుకుపోదాం. లేక వీటికో కచ్చితమైన సమాధానం కొరకై వెతుకుదాం అని అనుకునేకన్నా, వీటిని అర్థం చేసుకొని వీటి నుంచి విముక్తి చెందడం అతి ముఖ్యమైన, ప్రధానమైన విషయం అని తెలుసుకోండి. సమస్య అంటే మీరు అర్థం చేసుకోకుండా మీలో ఉండిపోయినది. ఇది మీ హృదయాన్నీ, మనస్సునీ తొలుస్తూ, కొరుకుతూ ఉంటుంది. ఈ చిత్రహింస ఒకసారితో అంతంకాదు. పునరావృత మవుతూనే ఉంటుంది. దీనిని తలుచుకున్నప్పుడల్లా మీకు భయం కలుగుతుంటుంది.

సమస్యలు అల్పమైనవైనా, ప్రాణంతో సమానమైనవైనా, ఇలాంటి సమస్యలతో ఒత్తిడికి లోనైన మనసు, దూర తీరాలకు పయనించలేదు. సమస్య లేవైనప్పటికీ, అవి మన ఆలోచననూ, దినచర్యనూ ప్రభావితం చేస్తూనే ఉంటై. వాటిననుసరించే మన జీవితం రూపొందుతూ ఉంటుంది. ఈ సమస్యల నుండి మీరో అసాధారణమైన సంపూర్ణ విముక్తి సాధిస్తే తప్పితే, మీరు దూర దూరాలకు పయనించలేరు. నిత్య జీవితంలోని ఉపరితల సమస్యలన్నిటినీ అర్థం చేసుకుంటే తప్పితే, అహేతుకమైన ఉద్దేశరహితమైన, ఏ అన్వేషణ ద్వారా సాధించలేని, ఒకానొక దానిలోకి చొచ్చుకుపోలేము. అందులోకి దూరి వెళ్ళాలంటే మీ యావచ్ఛక్తీ కావలసి ఉంటుంది. నావరకు నేను ఆ

లోతుల్లోకి వెళ్ళాలని అభిలషిస్తున్నప్పటికీ, మీ సమస్యలు మిమ్మల్ని పట్టి బంధించి ఉక్కిరిబిక్కిరి చేస్తున్నంతకాలం నాతోబాటు మీరు ఆ లోతుల్లోకి రాలేరు. ఒకవేళ మీరలా చేయగలిగినా అది కేవలం మీ సమస్యల నుండి కాసేపు పలాయనం చిత్తగించే ప్రక్రియే అవుతుంది. అంటే ఏ మాత్రం వాస్తవంలేని ఏదో ఊహా కవిత్వమైన దానిని నోటి మాటలతో వెంబడించిన చందంగా ఉంటుంది.

మన సమస్యను మనం ఎరిగే ఉన్నాం అన్నప్పుడు మన అర్థమేమిటి? మనకేదో ఒక బాధ, ఒక కష్టం ఉన్నదనో, లేక మనకు ఈ వరకే దక్కిన ఓ సుఖం కొనసాగదనో భయం కలిగుండడమే, సమస్య నెరిగి ఉన్నట్లు లెక్క. ఈ చిక్కు సమస్య మీ వెలుపల ఉన్నట్లు భావించి మీరు దానివంక చూస్తున్నారా? లేక మీరు చేస్తున్నదానికీ, మీకూ మధ్యన ఏ మాత్రం ఎడం లేకుండా, చూడబడుతున్న దానికీ చూచేవాడికీ నడుమ విభజన లేకుండా గమనిస్తున్నారా? సర్వసాధారణంగా మీ వాడుక ననుసరించి, వెలుపలనుండే అందులోనికి చూస్తారు. అనగా మిమ్మల్ని గూర్చి మీరేర్పచుకున్న మనోచిత్రానికి (image) ఈ చూడబడుతున్నది మీకు భిన్నంగా కనిపిస్తున్నది. మీరు సృష్టించుకున్న మనోచిత్రం మీరేమై ఉండాలో, ఏమైతే బాగుంటుందో మీకు చెప్తూ ఉంటుంది. మీరు ఇతఃపూర్వం ఆర్జించిన జ్ఞానం, చదివిన చరిత్ర, మీ వంశ సంప్రదాయం, మీకు కలిగిన అనేకానుభవాల ద్వారా ఏర్పడ్డదే ఈ మనోచిత్రం. మీరు సమస్యయెడల ఎరుక కలిగి ఉన్నారు కానీ, మీరు సృష్టించుకున్న ఈ మనోచిత్రం ఎడల ఎరుక కలిగిలేరు.

అలాకాక ఇక్కడ మనం చేస్తున్న ప్రయత్నం సమస్యను పరిష్కరించడానికి కాదు, మనసు నిర్మించిన ఈ చిత్రం ఎలా రూపొందిందో అర్థం చేసుకోడానికి ప్రయత్నిస్తున్నాం. మనలో ఈ మనోచిత్రమే గనుక లేకపోతే, ఉత్పన్నమయిన సమస్యను ఏమి చేయాలి. దానితో ఎలా వ్యవహరించాలి అనేది తెలుసుకునే వీలుంటుంది. నన్ను గురించి నాకో మనోచిత్రముంటే అది నిత్య జీవితంలోని వాస్తవాలకు విరుద్ధంగా ప్రవర్తిల్లుతుంటుంది. అప్పుడీ నిత్య జీవన వాస్తవాలను ఆ మనోచిత్రపు కళ్ళతో తప్పితే మరోవిధంగా చూడలేను. అంటే సమస్యను ఈ మనోచిత్రం సృష్టించింది కానీ, అక్కడి వాస్తవం ఈ సమస్యకు కారణం కాదు.

కానీ నన్ను గురించి నాకో భావ చిత్రం లేకపోతే నేను అసలు ఉన్నానా అనే భయమూ, మరోదే తీవ్రమైన అనిశ్చిత పరిస్థితి ఉదయిస్తై. లోపల 'భద్రత' అనే భావమే నశిస్తుంది. నాలో 'భద్రత' ఉండాలనే ఈ కోరికే నన్నీ మనో చిత్రం సృష్టించుకునేట్లు చేస్తున్నది. కానీ ఇదేమో, మాటలతో పదాలతో నిర్మించుకున్న చిత్రం. ఈ చిత్రాన్ని మార్చాలని గానీ, దీనిని ప్రోత్సహించాలనిగానీ లేక దీనిని చెదరగొట్టాలని గానీ, ఇలాంటి ఏ ప్రయత్నాలు చేసినా, నన్ను గురించి నే సృష్టించుకున్న మరేదో మనోరూపం మాట వింటున్నట్లు లెక్క. అలాంటి రూపం లోగడ నిర్మించుకున్నందువల్లే ఇలాంటి ప్రయత్నం ప్రారంభమవుతున్నది. కానీ మనోచిత్రాన్ని చెదరగొట్టాలి, మార్చాలి అనే ప్రయత్నం గనక లేనట్లయితే నా మనసే ఆ మనోరూపమనుకోవాలి. ఇక ఇప్పుడు మనసూ మనోరూపమూ అని రెండు లేవు. నా మనసే నేను సృష్టించుకున్న మనో రూపం కూడాను. ఆ రూపంతో తాదాత్మ్యం చెందడానికి గానీ, దానిని ధ్వంసం చేయడానికిగానీ మనసులో ఎంత చిన్న కదలిక సంభవించినా, అది మనసుకు పుట్టిన మరో బుద్ధి, మనసు చేయబూనిన మరో సృష్టి అని గ్రహించండి. అందుచేత ఈ మనో రూపాలు సృష్టిస్తున్నది తానేననేది మనసుకు పూర్తిగా తెలుసు. ఈ వాస్తవాన్ని మీరు నిజంగా చూచినట్లయితే ఇక ఆ మనోరూపానికి ఉండే ప్రాధాన్యమంతా ఒక్క తృటిలో మాయమవుతుంది. మనసులో ఇప్పుడిక మనో చిత్రాలనేవే లేవు కాబట్టి. ఇక ఆ మనసుకొక స్థిరత్వం (static position) అంటూ లేదు. ఏ వేదికపై అధిష్ఠించి కూచొని గమనించడ మంటూ లేదు. ఏ విశ్వాసమూ, ఏ సిద్ధాంతమూ, జ్ఞానరూపంలో ఏ అనుభవమూ అనే ప్రాతిపదిక ఆధారంగా, అసలు విషయాన్ని అది సమీపించడంలేదు.

ఇప్పుడిక 'ఉన్నదానిని' చూడడానికి నాకు ఏ మనోచిత్రంకానీ, ఏ 'కేంద్రం' కానీ, ఏ నిశ్చయాలుగానీ లేవు. అందువల్ల ఇప్పుడు నాలో ఏ వైరుధ్యమూ కూడా లేదు. ఆ కారణం మూలాన నాకిక సమస్య కూడా లేదు. జీవితం ఒక గమనం (movement). నీవు కూడా ఆ జీవితంతోబాటే నడిచావంటే ఇక సమస్య ఉండదు. స్థిరమైన ఓ స్థితి నుండి జీవితాన్ని అర్థం చేసుకోవాలని ప్రయత్నించినప్పుడే జీవితం ఓ సమస్యగా రూపొందుతుంది. నువ్వు అర్థం చేసుకోవలసింది ఈ ప్రాపంచిక జీవనాన్నే; ఆధ్యాత్మిక జీవనమనేదాన్ని అర్థం చేసుకోవలసిన అవసరంలేదు.

ఏదో గొప్ప స్థితినందుకోవాలనే వాంఛా, ఈర్ష్యా, దురాశా, కీర్తి కాంక్షా మొదలైనవి నిత్యమూ నిన్ను ముందుకు తరిమే స్థితి తొలగి, ఈ ప్రాపంచిక జీవనానికి సంబంధించిన అన్ని విషయాలూ వాటి వాటి స్థానంలో సక్రమంగా కుదురుకోవాలి. అలాంటి జీవిత క్రమం సిద్ధించినప్పుడు సంపూర్ణంగా భిన్నమైన మరో గమనం (movement) ప్రారంభ మవుతుంది. మనసు కావలనున్న ఈ నూతన గమనాన్ని, మునుపెన్నడూ మనసు ఊహించ గలిగి ఉండనేరదు. ఇది దానికసలు తెలియనే తెలియదు. కాబట్టి దీనిపై విశ్వాసం ప్రకటించడంగానీ, దీనిని గురించి ఏరకమైన తీర్మానం చేయడంగానీ, ఎలాగూ ఉండే అవకాశంలేదు. నిజానికి ఉన్నది జీవిత గమనం ఒక్కటే అయినప్పటికీ ఈ గమనాన్నే మనం ప్రాపంచిక జీవనమనీ, ఆధ్యాత్మిక జీవనమనీ, బాహ్య జీవనమనీ, అంతర్ జీవనమనీ విభజించుకుంటున్నాం.

***ఉదయం 4-2-95***



# తండ్రి తెలిపిన సత్యం...

1911 లో కృష్ణమూర్తిని థియొసాఫికల్ సొసైటీ వారు తమ సంస్థలోకి తీసుకున్న అనంతరం, ఆయన చరిత్ర అందరికీ తెలిసినదే. కానీ కృష్ణమూర్తి బాల్యాన్ని గురించి అంత స్పష్టంగా ముందెన్నడూ ప్రచురించబడలేదు. ఈ మధ్యనే శ్రీ బి. శివరావు అనే ప్రముఖ థియోసాఫిస్టు – రచయిత మరణానంతరం ఆయన ఇంట్లో కనిపించిన కాగితాల్లో, నారాయణయ్య ప్రకటనతో కూడుకున్న కొన్ని టైపు చేసిన కాగితాలు లభించాయి. ఆ కాగితాల క్రింద తండ్రి శ్రీ నారాయణయ్య “ఇందులో చెప్పిన విషయాలన్నీ సత్యాలు. వీటిని నేను నోటితో చెప్పగా రాసుకోవడమైనది” అని సంతకం చేసి ఉన్నాడు. నారాయణయ్య దీనిని ‘అఫిడవిట్’ అని అభివర్ణించాడు. స్టేట్‌మెంటు అనండి, లేక అఫిడవిట్ అనండి, మొత్తానికి ఇందులోని సమాచారమంతా శ్రీమతి కాథరీన్ టైలర్ అనే ఆంగ్ల థియోసాఫిస్టు, చాలా కష్టం మీద సేకరించింది. నారాయణయ్య చెప్పిన మాటలన్నిటినీ యథాతథంగా టైపు చేసి, ఆయన చేత సంతకం చేయించుకున్నది. ఇప్పుడిక నారాయణయ్య మాటల్లో కృష్ణమూర్తి బాల్యం గురించి చదవండి :

“నా ప్రభుత్వ ఉద్యోగ బాధ్యతల కారణంగా నేను అప్పుడప్పుడూ ఊరు విడిచి వెళ్తుండేవాణ్ణి. (శ్రీ నారాయణయ్య ఆ రోజుల్లో మదనపల్లెలో తాశీల్దార్ ఉద్యోగం చేస్తుండే వాడు. అప్పటి మదనపల్లె, కడప జిల్లాలో ఒక తాలూకా) ఆ రోజు అనగా మే 11, 1895 శనివారంనాడు, సూర్యాస్తమయానికి ఇల్లు చేరుకున్నాను. నా భార్య ఆనాడే ప్రసవించనున్నదని మా అందరికీ అనిపిస్తుండేది. కానీ ఆమె ఏ బాధా లేకుండా ఉల్లాసంగానే ఉన్నది. మేముంటున్న ఇంట్లో ‘పైన మేడ మీదే ఉంటావా, లేక కింద గదుల్లో ఉంటావా?’ అని అడిగాను. క్రింది భాగంలో తాను అప్పటికే ఒక గది ఎంచు కున్నాననీ, ఆ గదినే సిద్ధపరుచుకున్నాననీ చెప్పింది. మేమిద్దరం మేడ మీదనే పడుకున్నాము. రాత్రి పదకొండు గంటలప్పుడు “వొంట్లో హాయిగా లేదు, క్రిందికి తీసుకు వెళ్ళండి” అన్నది. కిందికి వచ్చిన తర్వాత “పూజ చేసుకునే గదిలోకి వెళ్దాము” అన్నది. సాధారణంగా మేము రాత్రి భోజనాలయిన తర్వాత కానీ, మర్నాడు

ఉదయానకానీ, స్నానం చేసేటంత వరకూ ఆ గదిలోకి వెళ్ళము. కానీ ఆమె వెళ్ళాలని పట్టుబట్టేటప్పటికి అలాగేనని ఒప్పుకున్నాను. మనిషి చాలా ప్రశాంతంగా ఉంది. లోనికి వెళ్ళి కాసేపు ధ్యానిస్తూ కూచున్నది. 'దేవుళ్ళ విగ్రహాలకు సాష్టాంగపడింది. ఆవిడ ఇష్టదైవం ఆంజనేయమూర్తి. ఆయన నామమే ఉచ్ఛరిస్తూ గది వెలుపలికి వచ్చింది. అటు తర్వాత ప్రసవానికై తాను విడిగా తయారు చేసుకున్న గదిలోకి వెళ్ళింది.

శిశువుగా కృష్ణమూర్తి మొదట్లో మదనపల్లె వంటి ఆరోగ్యవంతమైన ఊళ్ళో వుంటుండే వాడు కాబట్టి, అక్కడున్నంతకాలం బాగానే పెరిగాడు. కానీ అతడికి ఏణ్ణర్థం నిండేటప్పటికి నాకు కడపకు ట్రాన్స్‌ఫర్ వచ్చింది. ఆ వూళ్ళో మలేరియా ప్రబలంగా వుండేది. ఆ వ్యాధితో తీవ్రంగా బాధపడిన కారణాన కృష్ణమూర్తికి 'ఫిట్సు' కూడా వస్తుండేవి. ఎంత మంచి వైద్య సహాయం ఉన్నప్పటికీ పిల్లవాడి ప్రాణం విషయంలో ఆశ వదలుకున్నాం. చిన్నతనంలో ఏర్పడిన ఈ అనారోగ్యం, ఈ జ్వరం, కృష్ణమూర్తిని అటు తర్వాత సంవత్సరాల తరబడి వేధించినై. అందువల్ల చదువుల్లో చాలా వెనకబడ్డాడు.

"నేను కదిరికి వచ్చిన తర్వాత, కృష్ణను రోజూ బడికి పంపిస్తుండేవాణ్ణి. కదిరిలో బడికి వెళ్తున్నంతకాలం, కృష్ణ ఇంటికి తిరిగివచ్చినవేళ, పలకో, బలపమో, పుస్తకమో ఏదో ఒకటి లేకుండా తిరిగి వస్తుండేవాడు. ఏ బీద పిల్లవాడికో ఏదో ఒకటి తక్కువైతే, క్లాసులో అది వాడికిచ్చేసి, తను ఉత్తచేతులతో ఇంటిముఖం పట్టేవాడు. తానిచ్చేసినది మళ్ళీ తనకు కొనివ్వమని, నన్నడుగుతుండేవాడు.

ప్రొద్దున్నే ఇంటివాకిటి ముందుకు బిచ్చగాళ్ళు వస్తుండేవారు. ఓ గిన్నెడు బియ్యం బయటికి పంపి, ఒక్కొక్కరిజోలెలో ఓ గుప్పెడు పడేయడం మా ఇంటి ఆచారం. నా భార్య, కృష్ణకు ఈ పని చెప్పి పంపిస్తే ఆ గిన్నెడు బియ్యమూ మొదటివాడి జోలెలో పోసేసి, మళ్ళీ ఖాళీ గిన్నె నింపమంటూ వాళ్ళ తల్లివద్దకు పరిగెట్టుకు వచ్చేవాడు. అప్పుడు అతడి తల్లే బయటికి వెళ్లి, తలా ఎంత వేయాలో కృష్ణకు నేర్పించి తిరిగి వచ్చేది.

మా ఇంటిముందు ఓ పెద్ద వరండా ఉండేది. ఆఫీసు అయిన తదుపరి సాయంత్రం వేళల వచ్చే చల్లగాలి కోసం నేనా వరండాలో నా మిత్రులతో కాసేపు పిచ్చాపాటీ మాట్లాడుతూ కూచుండేవాణ్ణి. సంధ్యవేళ 'మాతా కవళం' అంటూ మళ్ళీ భిక్షుకులొచ్చేవారు. నా ప్యూనులు వాళ్ళని తరిమేయాలని చూచేవాళ్ళు. కానీ కృష్ణ మాత్రం ఆ జవానులను ఆటంకపరచి, వంట ఇంట్లోకి పరిగెట్టి, భిక్షుకులకు పట్టెడన్నం తెచ్చి పడేస్తుండేవాడు. కృష్ణ హృదయం ఔదార్యంతో నిండి ఉండేది. పిల్లలందరికీ ఇష్టమైన దేదైనా ఇంట్లో చేస్తే, వాళ్ళ అమ్మ అందరికీ సమానంగా పంచేది. కృష్ణ, తనకొచ్చిన వంతులో కొద్దిగా తీసుకొని మిగిలింది మళ్ళీ అందరికీ పంచేవాడు. నిత్య (కృష్ణమూర్తి తమ్ముడు నిత్యానంద) అలా వుండేవాడు కాదు. తనవంతు తాను ఉంచుకొని, ఇంకాస్త పెట్టమని కృష్ణను అడిగేవాడు; కృష్ణ అలాగేనంటూ ఇచ్చేసేవాడు కూడాను.

కదిరిలో మేము కాపురముంటున్న ఇంటివద్దనే ఒక పెద్ద దేవాలయ ముండేది. అది చాలా పవిత్రదేవాలయంగా ప్రసిద్ధి చెందింది. ప్రతి రోజు సాయంత్రం తన తల్లితోనూ, తమ్ముడు నిత్యానందతోనూ, కృష్ణ ప్రార్థనలకై ఆ గుడికి వెళ్తుండేవాడు. తమ్ముడు నిత్యాకన్నా తన అన్నయ్య, నా పెద్దకొడుకు (శివరాం) కన్నా కృష్ణకు చిన్నప్పటి నుండి భక్తి మెండుగా ఉండేది.

"కదిరిలో ఉండేటప్పుడు కృష్ణను బడి మార్పించి, క్రిస్టియన్ మిషన్ స్కూలుకు పంపాను. కానీ కృష్ణకు పాఠ్యపుస్తకాల మీద శ్రద్ధ ఉండేది కాదు. అతడి దృష్టి అంతా ఎందుకనో యంత్రాల మీదికి వెళ్ళి నిలిచేది. ఓ రోజున నేను 'టూరు' మీద వెళ్ళినప్పుడు, కృష్ణ బడికి వెళ్ళడం మానేసి, ఇంట్లో ఉన్న ఓ చిన్న టేబిల్ గడియారం ఊడదీశాడట. కృష్ణను స్కూలుకు తీసుకువెళ్ళడానికి ఆఫీసు నుండి నా ప్యూన్ ఒకడు వచ్చాడు. కృష్ణ ఏమి చేస్తున్నాడో చూద్దామని అతడి తల్లి పిల్లవాడి గది వద్దకు వెళ్ళింది. కృష్ణ, తాను ఊడదీసిన గడియారం భాగాలన్నీ శ్రద్ధగా పరిశీలిస్తూ కూచున్నాడు. తాను బడికి వెళ్ళేది లేదని చెప్పేశాడు. గడియారం అంతా ఊడదీసిన అనంతరం మళ్ళీ దాని మరలన్నీ యథాస్థానాల్లో బిగించ నారంభించాడు. ఇంట్లో ఉన్న మరో జవాను సహాయంతో

గడియారం పూర్తిగా బిగించి, అది పూర్వం లాగే పనిచేస్తున్నట్లు గమనించి సంతృప్తిగా సాయంత్రానికి గది నుంచి బయటికి వచ్చాడు. అంతవరకు, ఆఖరికి భోజనానికి కూడా గది బయటకు రాలేదు.

(దీనిని బట్టి మనిషి మనస్సుని ఊడదీసి చూడడం, అందులోని బాధనీ, బంధాన్నీ మనిషికి చూపించి, వాటిని నివారణ చేసుకుని సంపూర్ణ మానవుడిగా మన ధర్మం మనమెలా నిర్వర్తించాలో తర్వాతి జీవితంలో కృష్ణమూర్తి నేర్పనారంభించాడని అనుకోవచ్చు : రచయిత)

ఇరవై ఏళ్ళ వయస్సు ఉన్న నా పెద్ద కూతురు 1904లో చనిపోయింది. ఆ అమ్మాయికి చాలా దైవభక్తి ఉండేది. ఈ లోకంలోనిది ఏదీ ఆమెకు పట్టేది కాదు. ఆ అమ్మాయి మరణం నా భార్యను చాలా కుంగదీసింది. ఆ దిగులుతో నా భార్య సంజీవమ్మ మరు సంవత్సరమే మరణించింది.

నా భార్య చనిపోయిన అనంతరం జరిగిన ఒక చిత్రమైన – సంఘటన గుర్తుకొస్తున్నది. మా ఆచారాన్ని అనుసరించి, ఇంట్లో చేసిన వంటలో ఓ కొద్ది భాగం ఒక ఆకుపై ఉంచి, మరణించిన వ్యక్తి మరణానికి ముందు చివరి సారిగా ఎక్కడ పడుకుని ఉండేవారో ఆ ఆహారం అక్కడ ఉంచేవాళ్లం. ఆమె మరణించిన మూడో రోజున ఉదయం తొమ్మిది గంటల మధ్య, కృష్ణ స్నానం చేయడానికి అటువైపుగా వెళ్లాడు. స్నానాల గదిలోకి వెళ్లి తలమీద నాలుగు చెంబుల నీళ్లు పోసుకున్నాడో లేదో, వంటి మీద బట్టలు కూడా లేకుండా నీటితో తడిసిన శరీరంతో బయటికి పరుగెత్తుకుంటూ వచ్చాడు. అప్పుడు కడపలోనే నివసిస్తున్న ఇల్లు ఇటు నుంచి అటు పొడవుగా రైల్వేకంపార్ట్‌మెంట్‌లా గదులన్నీ వరసగా ఉండేవి. స్నానాల గది నుంచి కృష్ణ నా ముందు పరిగెట్టి పోతూ ఉండగా, కృష్ణ చేయి పట్టుకుని నేను 'ఎందుకిలా పరిగెడతావ్?' అని అడిగాను. తాను స్నానాల గదిలో ఉన్నప్పుడు తన తల్లి తన వద్దకు వచ్చిందనీ, ఆమె అక్కడి నుంచి బయటికి వస్తుంటే, ఆమె ఏమి చేయనున్నదో చూద్దామని తాను ఆమెతో బయటికి, వచ్చానని అన్నాడు. "మీ అమ్మను శ్మశాన భూమికి తీసుకెళ్లిన సంగతి నీకు గుర్తు లేదా?' అని అడిగాను. "గుర్తుంది. కానీ ఇప్పుడామె ఎక్కడికి

వెళ్తున్నదో చూడడానికి వచ్చాను" అన్నాడు కృష్ణ. 'సరే కానీ,' అంటూ అతడిని ముందుకు పోనిచ్చి, నేను అతడి వెనకాలే వెళ్లాను. మూడో గది వద్దకు వెళ్లి కృష్ణ ఆగాడు. బ్రతికున్నప్పుడు, చీరెలు ఉతికిన తర్వాత ఆరడానికి నా భార్య ఆ గదిలో రాత్రి పూట చీరెలు ఆరవేసుకునేది. కృష్ణ తదేకంగా ఒక వైపుగా దేనినో చూస్తు ఉంటే, "ఏం జరుగుతున్నది అక్కడ?" అని అడిగాను. "అమ్మ తన తడి బట్టలు తీసేసి, పొడి బట్టలు ధరిస్తున్నది" అన్నాడు కృష్ణ. అక్కడ నుంచి బయలుదేరి, ఆమె మరణించిన ప్రదేశంలో మేము ఆకు వేసి అన్నం పెట్టిన చోటికి వెళ్లాడు. నేను ఆ పక్కనే నిలుచున్నాను. 'అమ్మ అన్నం తింటున్నది' అన్నాడు కృష్ణ. అటు తర్వాత అక్కడి నుంచి లేచి, కృష్ణ మెట్ల వద్దకు వెళ్లాడు. నేనూ అతడిని అనుసరించాను. మెట్లు సగం వరకూ ఎక్కి అక్కడ ఆగిపోయాడు. 'ఇక కనుపించడం లేదు' అన్నాడు. ఆ తర్వాత కృష్ణను దగ్గర కూచోబెట్టుకుని 'అమ్మ ఎలా ఉంది? నీతో మాట్లాడిందా?" అని అడిగాను. "అమ్మ మామూలుగానే ఉంది. నాతో ఏమి మాట్లాడలేదు" అన్నాడు కృష్ణ.

నా భార్య గతించిన పదకొండవ రోజున రాత్రి తొమ్మిది గంటల వేళ, ఆమె నాకు కనిపించింది. కర్మకు వచ్చిన నా అన్నయ్యతో మాట్లాడుతూ నేను మంచం మీద ఒక వంక పడుకొని ఉన్నాను. మా అన్నయ్య కూడా మరో మంచం మీద తల అటు పెట్టుకుని పడుకొని ఉన్నాడు. అప్పుడు నా భార్య, తెరచి ఉన్న గది తలుపులలో నుండి లోనికి వచ్చింది. నా మీదకు వంగుతూ ప్రేమగా తన ముఖాన్ని నా ముఖానికి అనించింది. తన చేతులతో నా జట్టు మృదువుగా సవరించింది. అటు తర్వాత మంచం చివర కాసేపు కూర్చున్నది. నేను కదలకుండా నిశ్చలంగా పడుకున్నాను. కానీ మా అన్నయ్యను "నా భార్య నీకు కనిపించడం లేదా ?" అని అడిగాను. "ఇదిగో ఇక్కడే నా పక్కనే కూర్చుని ఉన్నది" అని కూడా అన్నాను. కానీ అతడు, "నాకు ఏమీ కనిపించడం లేదు" అన్నాడు. నేను అలాగే కదలకుండా పడుకున్నాను. నా భార్య మళ్ళీ నామీదకు వాలి, అదే ప్రేమభావంతో "నేను వెళ్తున్నాను" అని రహస్యమూదినట్లు ఊది వెళ్లిపోయింది.

నా భార్య చనిపోయిన అనంతరం పిల్లల ఆరోగ్యం కడపలో పూర్తిగా చెడిపోయినందున నేనో పద్దెనిమిది నెలలు శెలవు పెట్టి అందర్నీ మదనపల్లెకు తీసుకువచ్చి

శెలవు చివరి భాగం అక్కడ గడిపాను. 1907లో రిటైరయ్యే వరకూ ఉద్యోగం కూడా అక్కడే చేసి రిటైరయ్యాను...”

“మదనపల్లెలో మా ఇంటి వద్దనే ఒక కొండ ఉండేది; ఆ కొండ మీద ఒక ఆలయం. ఆ ప్రాంతమంతా చాలా నిర్మానుష్యంగా ఉండేది. చుట్టూ ఎక్కడా ఒక ఇల్లు కానీ, మనిషికానీ ఉండేవాళ్లుకాదు. బడి పూర్తి అయిన తర్వాత, కృష్ణ రోజూ సాయంత్రం ఆ ఆలయానికి వెళ్తుండేవాడు. కానీ మిగతా పిల్లలకు ఆ నిర్జన ప్రదేశానికి వెళ్లాలనిపించేది కాదు. అక్కడేమి సరదా ఉంటుందని వారి ఆలోచన. నా ఇల్లు ఆ కొండ ప్రాంతానికి మైలున్నరో రెండు మైళ్ల దూరంలోనో ఉండేది. కాని కృష్ణ రోజు సాయంత్రం వేళకి అంత దూరమూ నడిచివెళ్లి, కొండ దారిలోని రాళ్లూ రప్పలూ అన్నిటినీ దాటుకుంటూ శిఖరాగ్రం చేరుకునేవాడు. తానింత అవస్థపడుతూ, పైపెచ్చు తన సోదరులను కూడా రమ్మని పట్టు పట్టుండే వాడు. తోటి వారినందరినీ అక్కడికి తీసుకువెళ్ళి, అందరికీ తినుబండారాలు పంచిపెట్టడం అంటే కృష్ణకు చాలా ఇష్టంగా ఉండేది. నేను మదనపల్లి తహశిల్దార్‌ని అయినందువల్ల నా మిగతా పిల్లలు ఈ తిండి పొట్లాలు కొండమీదికి మోసుకుపోవడం నామర్దా అనుకునేవారు. కానీ కృష్ణకు అలాంటి సంకోచమేమీ ఉండేది కాదు. “నేను మోసుకువెళ్తాను. నా చేతికి ఇవ్వండి” అని అవి తీసుకొని పైకి పరిగెట్టేవాడు.

కృష్ణలో నేను తరచూ చూసిన మరో విషయం ఒకటున్నది; చిన్న మొక్కల్నీ క్రిమికీటకాదుల్నీ, వృక్షాలనీ అతడు ఎంతో పరీక్షగా గమనిస్తుండేవాడు. ఒక రోజు ఇంటి వద్దనే ఉన్న ఓ చిన్న మొక్క దగ్గర కదలకుండా కూర్చున్నాడు; దాని వేరువంక శ్రద్ధగా చూస్తున్నాడు. ‘అక్కడ ఏం చేస్తున్నావ్?’ అని అడిగాను. అది పొద్దు పొడుస్తున్న సమయం. అటుగుండా ఏదో చిన్న విచిత్రమైన పురుగు వెళ్తుండడం చూశానన్నాడు. ఒక్క క్షణం కనిపించి మళ్ళీ కనిపించలేదట. అదేదో స్పష్టంగా చూడాలని తనకు పట్టుకున్నదట. కానీ నాకక్కడ ఏ పురుగూ కనిపించలేదు. అది ఎలా ఉంటుంది అని అడిగాను. కృష్ణ దానిని వర్ణించడానికి పూనుకున్నాడు. కానీ చిన్నవాడికి అన్ని మాటలేవి? చేతకాక “ఇంట్లో ఏదైనా తీసుకొచ్చి చూపిస్తానుండు” అంటూ లోనికి పరిగెట్టుకెళ్లాడు.

మేము చేసుకున్న 'బోండా' ఒకటి తీసుకు వచ్చి 'ఇలా ఉంటుంది' అన్నాడు. సాయంత్రం వేళ ఆ పురుగును పట్టుకువచ్చి నాకు చూపించాడు.

నేను 1882 నాటి నుండే తియోసాఫికల్ సొసైటీ సభ్యుణ్ణి. 1907 లో ప్రభుత్వ సర్వీసు నుంచి రిటైరయిన తర్వాత తియోసాఫికల్ సొసైటీలో పని చేస్తానని శ్రీమతి ఆనీబిసెంటుకు ఉత్తరం రాస్తే, "నీ నలుగురు పిల్లలతో నువ్వు సొసైటీ క్వార్టర్స్‌లో ఉంటే, వాళ్ళు ఏదో ఒక అల్లరి చేసి అక్కడ ప్రశాంత వాతావరణానికి భంగం కలిగిస్తారని" అభ్యంతరం చెప్పి, తోసిపుచ్చింది. నచ్చ చెప్పడానికి చూచినా వినలేదు. కానీ 1908 లో అడయార్ సొసైటీలోని ఒక శాఖ వారికి ఒక ఎసిస్టెంటు కావలసి వచ్చింది; నా పేరు ఆనిబిసెంటుకు రికమెండు చేశారు. జనవరి 1909 లో సొసైటీ క్వార్టర్స్‌లోకి వచ్చి చేరాను. కృష్ణను, నిత్యను మైలాపూర్ స్కూల్‌కి పంపి, పెద్దవాడు శివరాంని ప్రెసిడెన్సీ కాలేజీలో చేర్చాను. ఫిబ్రవరి 1909 లో లెడ్‌బీటర్ నా పిల్లలందరికీ పాఠాలు నేర్చుకోవడంలో సహాయపడుతుండేవాడు. సముద్రం వద్దకు తీసుకెళ్లి ఈత నేర్పుతుండే వాడు. ఆయన సమక్షంలో కానప్పుడు, పిల్లలు క్వార్టర్స్ దగ్గరలోనే ఉన్న కొలనులో ఈత కొట్టుండేవారు.

ఒక రోజు మధ్యాహ్నం మూడింటికి పిల్లలందరూ కొలనులో ఈత కొడుతు ఉండగా లెడ్ బీటర్ వొడ్డున నిలుచొని వాళ్ళందరినీ దీక్షగా చూస్తుండడం గమనించాను. నేనాయన్ని సమీపించినప్పుడు, నా కుమారుడు కృష్ణని చూస్తున్నాననీ, పిల్లవాడు మంచివాడనీ, నాకభ్యంతరం లేని పక్షంలో పిల్లవాణ్ణి ఇంకాస్త జాగ్రత్తగా గమనించవలసి ఉంటుందని అన్నాడు. నాకు అభ్యంతరం లేదని చెప్పాను. అయితే పిల్లవాణ్ణి, బడిలేని రోజున ఒకమారు తన గదికి తీసుకురమ్మనమని నాతో చెప్పాడు. అలాగేనని ఓ శనివారమో, ఆదివారమో కృష్ణను ఆయన గదికి తీసుకువెళ్లాను. కృష్ణను తన సరసన సోఫాలో కూచోబెట్టమన్నాడు లెడ్‌బీటర్; తన హస్తాన్ని కృష్ణ శిరస్సుపైన ఉంచి, కృష్ణ పూర్వజన్మను వర్ణించ నారంభించాడు. ఆయన చెప్పినది నే రాసుకున్నాను. ఆ విధంగా కృష్ణను గురించి రెండు మూడు పూర్వ జన్మల వృత్తాంతం ఆయన చెప్పినట్లు గుర్తు.

కృష్ణ బడికి వెళ్లవలసిన అవసరంలేని సెలవు రోజుల్లో ఈ కార్యక్రమం కొనసాగుతూ ఉండేది. ఇది సాగినకొద్దీ లెడ్‌బీటర్‌కు కృష్ణ నిత్య ల విషయంలో శ్రద్ధ క్రమంగా ఇనుమడింపజొచ్చింది. ఒక రోజు ఈ ఇద్దరు పిల్లల్నీ మైలాపూర్ స్కూల్‌లో మాష్టరు బెత్తంతో కొట్టాడని లెడ్ బీటర్‌కు తెలిసింది. ఆ కారణాన పిల్లలిద్దరి సూక్ష్మశరీరాలు (astral bodies) చాలా అలజడి చెందాయని ఆయన నాతో అన్నాడు. ఆ స్కూలు మాస్టారు ఈ పిల్లల్ని ఎందుకలా కొట్టాడో సంజాయిషీ చెప్పమని నా చేత ఆ స్కూలుకు ఉత్తరం రాయించాడు. ఇకముందు అలా కొట్టనని ఆ స్కూలు మాస్టారు వద్ద నుంచి ఒక విధమైన హామీ వచ్చేవరకూ ఊరుకోలేదు. అయినప్పటికీ లెడ్ బీటర్‌కు ఈ పరిస్థితి సంతృప్తికరంగా లేనందువల్ల "పిల్లలిద్దరినీ ఆ స్కూల్ నుండి వెనక్కి పిలిపించు, వాళ్ళిద్దరికీ నేనే చదువు చెప్తాను" అన్నాడు. నేనే కాస్త వెనకాడాను. కానీ లెడ్‌బీటర్ మళ్ళీ మళ్ళీ అదే మాట నాతో అంటుండేసరికి, అప్పటికి యూరప్‌లో వున్న శ్రీమతి అనీబిసెంటుతో ఆలోచించి చెప్తానని, తాత్కాలికంగా వాయిదావేశాను.

శ్రీమతి అనిబిసెంటు దేశానికి తిరిగివచ్చిన అనంతరం ఆమె అనుమతితో లెడ్‌బీటర్ మాటకు అంగీకారం తెలిపాను. కృష్ణ, నిత్యల చదువంతా లెడ్‌బీటర్ తన మీదనే వేసుకున్నాడు. పిల్లల్ని ఇంగ్లాండు పంపిస్తానని అన్నాడు. కానీ పిల్లల్ని వదిలిపెట్టి ఉండటానికి నేను ఇష్టపడలేదు. తర్వాత శ్రీమతి అనీబిసెంటు పిల్లల్ని తన పాలనా పోషణలో ఉంచమని అడిగింది. అది కూడా నాకిష్టం లేదు. కానీ ఆమె మళ్లీ అడగడంతో అలాగేనని ఒప్పుకున్నాను. అప్పటినుండి శ్రీమతి బిసెంటుతో బాటే పిల్లలిద్దరూ సొసైటీ హెడ్ క్వార్టర్స్ గదుల్లోనే ఉండిపోయారు. అయితే భోజనానికి మాత్రం నా వద్దకు వచ్చిపోతుండేవారు.

తియోసాఫికల్ సొసైటీ ప్రెసిడెంట్ అయిన శ్రీమతి ఆనిబిసెంటు ఆధ్వర్యంలోనే పిల్లల చదువులు సాగిపోతుండేవి. 1911 మార్చి 22న అబ్బాయిలిద్దరూ ఆమెతో బాటు బెనారెస్ వెళ్లారు. అక్కడి నుండి ఏప్రిల్ 2న యూరప్‌కి బయలుదేరారు. అని ముగించారు శ్రీ నారాయణయ్య.

నాటి భారతదేశంలో, తరచూ పాశ్చాత్యులే జిల్లా కలెక్టర్లుగా ప్రజల్ని పరిపాలిస్తున్న రోజుల్లో, తాలూకా తహశీల్దార్ ఉద్యోగమూ తత్సంబంధమైన హోదా పెద్దదేననవచ్చు; వారి పలుకుబడీ, పలు రకాల సంపాదన కూడా ఘనంగానే ఉండేవి. అలాంటి వాతావరణంలో శ్రీ నారాయణయ్య ఏమీ వెనకేసుకోకుండా, ఆస్తులు సంపాదించుకోకుండా రిటైర్ అయింతర్వాత పెన్షన్ డబ్బులతో, బ్రతికున్న సంతానంతో అడయార్ తియోసాఫికల్ సొసైటీలో నివసించ నారంభించాడంటే, అతడెంతటి నిజాయితీపరుడో గ్రహించవచ్చు.

తాలూకా మొత్తానికి పరిపాలకుడైన తహశీల్దార్ కొడుకులకుండే సహజ గర్వం కృష్ణమూర్తికి ఏ కోశానా లేకపోవడం గమనార్హం. తన ప్రాముఖ్యాన్ని తానెప్పుడూ గుర్తుంచుకోకుండా ఉండే ఆ లక్షణం జీవితాంతం అలాగే కొనసాగింది. అలాగే తన కేది కనిపించినా, దాని స్వరూప స్వభావాలు పూర్తిగా తెలుసుకోవాలనే ఆ చిన్నప్పటి పరిశీలనాసక్తి కూడా ఆయనలో అలాగే ఉండిపోయింది.

బాల్య కౌమార దశల్లో కృష్ణమూర్తి స్వభావాన్ని గురించి, గుణాల గురించి నారాయణయ్య చెప్పినవన్నీ, పెరిగి పెద్దయిన కృష్ణమూర్తిలో మరింత ప్రస్ఫుటంగా కనిపించేవి. తనకంటూ ఏదీ ఉంచుకొనకపోవడం, ఉన్నదంతా నలుగురికీ పంచేయడం అతడి నైజమయిపోయింది. తర్వాతి జీవితంలో కృష్ణమూర్తి ప్రదర్శించిన సున్నితత్వం, సజ్జనత్వం, సౌశీల్యం, దృష్టి నైశిత్యం, ధ్యాన నిష్ఠ మొదలైనవాటికి బీజాలు అతడి చిన్నతనంలోనే పడినట్లు నారాయణయ్య ఎఫిడవిట్ ద్వారా మనకు విదితమవుతుంది.

*ఆంధ్రప్రభ డైలీ 24-5-95*

# ధ్యానమే సుందరం, అద్భుతం

'ఈ పిల్లవాడు చాలా గొప్పవాడు కానున్నాడు'

అని చిత్తూరు జిల్లాలోని మదనపల్లెలో శ్రీ జిడ్డు నారాయణయ్య, సంజీవమ్మ దంపతులకు 1895లో అష్టమ సంతానంగా జన్మించిన కృష్ణమూర్తి జాతక చక్రం వేసిన జ్యోతిష్కుడు కుమార శ్రౌతులు భవిష్యత్తును సూచించాడు.

ఆ ప్రకారమే – పధ్నాలుగేళ్ళ వయసులోని కృష్ణమూర్తిని, అడయార్ దివ్యజ్ఞాన సమాజంలో మొదటిసారిగా తారసిల్లిన లెడ్‌బీటర్ తన అతీంద్రియ శక్తులతో, నిస్వార్థమైన ఈ బాలుడి తేజోమండలం చూచి, ఆశ్చర్యచకితుడైనాడు. తమ సమాజ సభ్యులు ఎదురు చూస్తున్న జగద్గురువు ఈ బాలుడిలోనే అవతరించనున్నాడని ప్రకటించాడు. ఆనాటి నుండి కృష్ణమూర్తి, అతడి తండ్రి అనుమతిని, దివ్యజ్ఞాన సమాజ సభ్యులు తమ పాలన పోషణలలో వుంచుకొని తగిన తర్ఫీదు నివ్వజొచ్చారు.

సమాజ సభ్యులు ఊహించిన తీరుగా తాను సత్యాన్ని ప్రకటించడం అసంభవం అని గ్రహించిన కృష్ణమూర్తికి, అనతికాలంలో ఓ విధమైన అంతస్సంఘర్షణ ప్రారంభమైంది. ఒకవంక తన సాధన క్రమం సాగిపోతున్నప్పటికీ, మరొకవంక ఈ అంతర్మథనం తీవ్రమై సుమారు ముప్ఫై ఏళ్ళ వయసులో "సత్యానికి నిర్దేశిత మార్గంలేదు. ఇది ఎవరికి వారు కనుగొనవలసిందేకానీ, ఒకరు మరొకరికి అందివ్వగలిగినది కాదు. ఈ ఆధ్యాత్మిక రంగంలో ఒకరి ఆధిపత్యం అధికారం, పెత్తనం పనికిరావు. ప్రతిమనిషీ తనకుతానే గురువుగానూ, శిష్యుడిగానూ, రూపొందాలి. శ్రద్ధాసక్తులతో జీవితాన్ని సున్నితంగా జాగ్రత్తగా గమనించడం నేర్చుకోవాలి అని స్పష్టంగా ప్రకటించారు.

సంపూర్ణంగా మేల్కొన్న మానవుడి వాక్కు ఇది. తాను మేల్కొని, ఆనంద సామ్రాజ్యంలో అడుగిడిన కృష్ణమూర్తి అనాటి నుండి సుమారు ఆరు దశాబ్దాలపాటు, ప్రపంచ వ్యాప్తంగా ఇతరులను మేల్కొల్పడానికి, తాననుభవించే ఆనందాన్ని ఇతరులకు పంచడానికి, నిరంతరం కృషిసలిపారు.

కృష్ణమూర్తి చెప్పేది అర్థం చేసుకోవడానికి ఏ ప్రత్యేకమైన వేదాంత పరిభాష నేర్వనవసరంలేదు. మనిషి ఏ దశలో వున్నప్పటికీ తనలో జీవితం రూపొందుతున్న తీరు గమనించ నారంభించవచ్చు. అయితే ఈ గమనిక లేక ఎఱుక ఎంపికలేనిదై వుండాలి. అంటే ఈ గమనిక, మనిషి ఇష్టా యిష్టాలమీద ఆధారపడి వుండకూడదు. తనకున్న పూర్వాభిప్రాయాల ననుసరించి, తనలో ప్రదర్శితమయ్యే ఏ లక్షణాన్ని గురించి ఏ గుణాన్ని గూర్చి ఇది మంచిదని కానీ చెడ్డదని కానీ సమర్థించనూ కూడదు, ఖండించనూ కూడదు; వివశుడై యాంత్రికంగా అది ప్రేరేపించినట్టెల్లా చేయనూ కూడదు. ఉన్నది ఉన్నట్లు నిష్పక్ష పాతంగా అభిప్రాయరహితంగా, ఆ గుణం యొక్క స్వరూప స్వభావాలు జాగ్రత్తగా చూడడం నేర్చుకోవాలి. ఇలా చూడటానికి మనకు ప్రధానమైన ప్రతిబంధకం, కృష్ణమూర్తిగారి మాటల్లో, మన 'కండీషనింగ్' అనవచ్చు.

పుట్టినప్పటి నుండి మనమనసుల్ని పలురకాలుగా ప్రభావితంచేసే ఈ కండీషనింగ్, లేక నిబద్ధీకరణ, జీవితంలో అన్ని రంగాలలోనూ కనిపిస్తుంది. మనం ఏ దేశంలో ఏ జాతి మధ్య జన్మిస్తే ఆ పరిస్థితులు మనల్ని 'కండీషన్' చేస్తాయి. సాటి మానవుడు కేవలం మనిషిగా కనిపించే బదులు, నిత్యవ్యవహారం కొరకు ఏర్పరచుకున్న జాతుల పేర్లు, దేశాల పేర్లు మనకు దాటరాని 'పరమ సత్యాలుగా' దర్శనమిస్తాయి. ఆ కారణంచేత భేద బుద్ధి ఏర్పడుతుంది. ప్రకృతిలో సహజంగా కనుపించని విభజనను మనిషి తన ఆలోచనతో సృష్టించి, తన సృష్టిని నిజమని భ్రమించి, తద్వారా వైషమ్యాన్ని పెంచుకుంటాడు.

ఇలా సంకుచిత పాక్షిక దృష్టితో చూచినంతకాలం, మనిషికి ఏదీ నిజంగా అర్థం కాదు. ఏదీ స్ఫురించదు; భేదభావమూ శత్రుత్వమూ మాత్రమే మిగులుతై. పూర్వ వాసనలతో నిబద్ధీకృతమైన ఆ పాత మనసు పూర్తిగా ఖాళీ అయి పరిశుభ్రమయితే తప్పితే, సంపూర్ణ దృష్టి సిద్ధించదు. ఈ సమగ్ర దృష్టి నుండి జనించిన ఆలోచనకే ప్రాధాన్యముంటుంది.

మనిషికి తరచూ సంభవించే దుఃఖం విషయంలో కూడా ఈ నిశితమైన చూపు ఎంతైనా అవసరం. దుఃఖం కలిగినప్పుడు దాని నుండి శీఘ్రంగా ఎలా తప్పించుకోవాలా

అని మనిషి వెతుకులాడకూడదు. ఆ విధంగా దుఃఖమెన్నటికీ నివారణ కాదు. దుఃఖ మనుభవించే వేళలో అది ఎక్కడి నుండి బయలుదేరింది, అనేది జాగ్రత్తగా చూడాలి. దానిని తిరస్కరించకూడదు. దాని నుండి పరిగెట్టరాదు. ఏదోరకమైన ఊరట కలిగించే పద్ధతులవల్ల ఒరిగేదేమీ వుండదు. సమయం చూచి, ఆ దుఃఖం మళ్ళీ పెల్లుబుకుతూనే వుంటుంది. అలాగని దుఃఖాన్ని చూచి, 'నా గతి ఇంతే కాబోలు' అని నైరాశ్యంతో తల ఒగ్గమనడంలేదు. ఈ దుఃఖం అనుభవించే వేళలోనే ఇది తనలోకి ఎలా ప్రవేశించిందో పరిశీలనగా కనుగొనాలి. ఈ దుఃఖానికి మమకారం కారణమై వుండవచ్చు. అవతలి వారి మీద మానసికంగా ఆధారపడడం కారణం కావచ్చు. కాబట్టి మమకారం పెంచుకున్న వాడు, ఆధారపడడం అలవాటు చేసుకొన్నవాడు, ఈనాడు తనకు వైఫల్యం కలిగినందువల్ల దుఃఖితుడైనాడు. దుఃఖమనేది ఈ మమకారం పెంచుకోవడంలో వున్నది కానీ, అవతలి మనిషి ఇతడి జీవితం నుండి భౌతికంగా గానీ, మానసికంగా గాని తొలగిపోవడం వల్ల కాదు. ఈ దుఃఖాగమనం మనిషికి ఏదో నేర్పడానికై ఉండవచ్చు. అందుకని దుఃఖాన్ని ఆహ్వానించమనడం లేదు, కోరుకోమనడం లేదు. కానీ అది సంభవించినప్పుడు మాత్రం తిన్నగా, మృదువుగా, ఓర్పుగా, నేర్పుగా, దాని మూలకారణమేమిటో కనుక్కోగలిగి ఉండాలి. దానిని అవతలికి నెట్టివేయకుండా దానితో కలిసి జీవించడం నేర్చుకోవాలి. అలాంటి సహవాసంలో అలా దానిలో కలిసి నిశ్చలంగా ఉండిపోయినప్పుడు మనిషిలోని అవిచ్ఛిన్నమైన యావచ్ఛక్తీ ఆ దుఃఖంపైన ప్రవర్తిల్లి, దానిని మటుమాయం చేస్తుంది; అవిచ్ఛిన్నమైన ఆ శక్తే దుఃఖభంజకమని మనిషి గుర్తిస్తాడు. దుఃఖవిముక్తుడే కరుణను కనుగొనగలడు. అతడే లోక బాంధవుడు.

సుఖదుఃఖాలనే ద్వంద్వాలలో ఒకటి వాంఛనీయమనీ, మరొకటి అవాంఛనీయమనీ భావించడం పొరపాటు. అదేవిధంగా జీవన్మరణాల్లో కూడా ఒకటి అభిలషణీయమనీ, మరొకటి భయానకమనీ ఎంచడం పొరపాటు. జీవన్మరణాలనేవి రెండూ నాణానికి రెండు వైపులా ఉండే ముద్రలు. ఇప్పటి మన ప్రస్తుత పరిస్థితిలో, మనకు నిజంగా జీవించడ మంటే తెలియదు. మరణించడమంటేనూ తెలియదు సరికదా. అదంటే విపరీతమైన భయం.

నిజానికి జీవించడం ఒక అందమైన కళ. అన్ని కళలకన్నా ఉత్తమోత్తమమైనటు వంటిది. ఆ కళను చక్కగా అభ్యసించి, జీవించనారంభిస్తే ధూర్జటికవి ఒక పద్యపాదంలో అన్నట్లు ఆ మనిషి "ఇల నే కష్టంబునం చీకాకై చెడిపోడు"; తనకు సంభవించే కష్టాలను మిగతా అందరిలాగే శాయశక్తులా, ఎదుర్కొంటాడు. తన జీవనాన్ని ఆర్థికంగా ఆరోగ్య పరంగా మెరుగుపరుచుకోడానికి ప్రయత్నించనూవచ్చు. కానీ తాను దేనివైపైతే చూపు సారిస్తున్నాడో దేనిపై తన ధ్యానాన్ని నిలిపాడో, అది మాత్రం చెక్కుచెదరదు.

కానీ, పుట్టిన అనతికాలంలోనే మనిషి ఈ జీవించే కళను అభ్యసించే బదులు, ఈ జీవితం ఎక్కడ అంతమయిపోతుందో అని భీతిల్లనారంభిస్తాడు. భూమిపై పుట్టిన తర్వాత ఏదో ఒకనాడు మరణం నిశ్చయమన్న చిన్న సత్యాన్ని గ్రహిస్తే, భూమిమీద ఉండే ఈ కొద్ది సమయాన్ని, మహాప్రవాహంలాంటి ఈ జీవితాన్ని, అర్థంచేసుకోడానికి ప్రయత్నించే వీలుంటుంది. కాబట్టి అసాధారణంగా అద్భుతంగా కనిపించే ఈ జీవిత మేమిటో, జీవన్మరణాల కతీతమైన మానవ ధర్మమేమిటో, బ్రతికున్నప్పుడే కనుగొంటే, బ్రతుకంతా ధర్మాచరణకే అంకితమవుతుంది. ధర్మాన్ని కనుగొనడం, దానిని చక్కగా ఆచరించడం, అనే విషయమే ముఖ్యమవుతుంది.

ఇదంతా కృష్ణమూర్తి గారి బోధలో భాగమే. ధ్యానంకన్నా సుందరమైనది, అద్భుత మైనది జీవితంలో మరొకటి లేదంటారు కృష్ణమూర్తి. ధ్యానమంటే ముక్కు మూసుకొని ఒక మూల కూర్చుని, దేనినో ఊహించుకొని, అందుగురించి దీక్షగా ఆలోచించడం కాదు. ఆలోచన అనేది దేనిలో నుండి జనిస్తున్నదో, అది ఎంత వ్యర్థమైనదో తెలుసుకొని, ఆలోచన పరిధిని దాటిన ధ్యాన నిమగ్నమైన మనసును దర్శించటమే జీవితంలో అత్యంత ముఖ్యమైనది. అలాంటి జీవితం నుండే సత్యమైనది, సుందరమైనది, శివమైనది ప్రకటిత మవుతుందని కృష్ణమూర్తిగారంటారు.

*శ్రీ జి. పుల్లారెడ్డి అమృతోత్సవ సంచిక **1995** నుంచి*

# నీ జీవితం ఒక గొప్పవరం

జీవితంలో నువ్వెన్నో విజయాలు సాధించి ఉండవచ్చు. ఎన్నో ఓటములూ చవి చూసి ఉండవచ్చు. కానీ ఏదో ఒక దశలో జీవితానికి కృతజ్ఞత నర్పించుకుంటూ బ్రతుకక తప్పదు. ఇక్కడిదంతా అనుభవించడానికి, గమనించడానికి, చేతనయితే గుణపాఠాలు నేర్చుకోవడానికి అవకాశమిచ్చింది ఈ నరజన్మే కదా?

ఈ జన్మను ప్రసాదించింది నీ తల్లిదండ్రులని మొదట్లో అనుకున్నావ్. ఒకవిధంగా ఆ మాట నిజమే. అయితే వారు నిమిత్తమాత్రులేమో? వారు నిన్ను ప్రత్యేకంగా ఉద్ధరించ డానికని ఉద్దేశపూర్వకంగా కన్నారు అనుకోవడానికి ఆధారాలేమీ కనిపించవు. నువ్వు నీ పిల్లల్ని కనేటప్పుడు వారి నుద్ధరించడానికే వారికి జన్మనిచ్చావా ఆలోచించు. పుట్టిన తర్వాత నువ్వు వారిని ప్రేమతోనో, అంత ప్రేమ లేకుండానో పెంచి ఉండవచ్చు; కానీ వారు పుట్టకముందు నీ ఆలోచనల్లా నిన్ను గురించే కానీ, రూపం ధరించని వారిని గురించి కాదు. మనిషి సుఖాన్వేషణలో ఈ సృష్టికార్యం సంభవించింది. నీ బలీయమైన కోర్కె యాంత్రికంగా నిన్ను ముందుకు తోసినందువల్ల ఈ సృష్టిలో నువ్వు పాలుపంచు కున్నావన్న మాట. నీ పరిస్థితి ఇలా ఉన్నప్పుడు నీ పూర్వీకుల పరిస్థితి ఇందుకు భిన్నంగా ఉండి ఉంటుందా? కాబట్టి జననీ జనకుల ఎడల కృతజ్ఞతనలా ఉంచి, అసలు నీకీ  జీవితం లభ్యమైనందుకు, నువ్వు ప్రప్రథమంగా దాని ఎడలే కృతజ్ఞుడివై ఉండాలి కదా?

నీ కోరికలన్నీ తీరనందువల్ల నీలో ఎంతో అసంతృప్తి చోటు చేసుకున్న మాట నిజమే. కానీ తమ అన్ని కోర్కెలూ ఎవరికి తీరుతున్నవి కాబట్టి, నువ్వొక్కడివీ అసంతృప్తి పెంచుకుంటావ్? ఎవరినైనా కదిలించి చూడు. భౌతిక అవసరాలే తీరని కోట్లాది ప్రజానీకం సంగతి చెప్పనే అక్కరలేదు. ఆ అవసరాలు తీరినప్పటికీ అనారోగ్యంతో బాధపడేవారి సంగతేమిటి? ' ఈ జబ్బు నా శత్రువులకు కూడా రాకూడదని' దుఃఖించే వారిని చూడలేదా? అసంతృప్తివల్లనే కదా ఉద్యోగులు, వర్తకులు, వ్యాపారులు, 'బిల్డర్లు' సమ్మె చేయడమూ, బంద్ పాటించడమూను?

కొందరు సంతృప్తి నటించే వారుంటారు అనే మాట నిజమే. "నాకేమీ కోర్కెలు లేవు. పిల్లలందరూ పైకి వచ్చారు. ఎవరికీ ఏ కొదవాలేదు" అని వారిముందు, వీరి ముందు అంటాడేగానీ, ఈ మాటలు బయటికి అంటున్నాడంటేనే లోన ఏదో అసంతృప్తి జ్వలిస్తున్నదనే అనుకోవాలి. మరేదీకాకపోయినా కోడలు సరిగ్గా చూడదనీ, కొడుకు తగినంతగా పట్టించుకోడనీ, మరేదీ కాకపోతే, తాను రిటైరయింతర్వాత తన భార్యే తనను గౌరవించడం మానేసిందనీ, రహస్యంగా చెప్పుకుంటాడు. మరి ఈ అన్ని రకాల అసంతృప్తినీ దాటి జీవితం ఎడల ఏమి కృతజ్ఞత ప్రకటించాలి?

ఇక్కడ ఈ భూమిమీద కనిపించే పచ్చటి పైర్లనీ, చెట్టూ చేమనీ, కొండల్నీ, అడవుల్నీ, సెలయేళ్ళనీ, నదుల్నీ, సముద్రాల్నీ చూచి ఆనందించడానికి ఈ జీవితమే నీకో అవకాశ మిచ్చిందనే మాట మరిచిపోవద్దు. త్యాగరాజ కృతులు, మీరా భజనలూ, సైగల్, తలాత్, లతామంగేష్కర్ సంగీత మాధుర్యం గ్రోలడానికి ఈ జీవితమే నీకు వీలు కల్పించింది. ఈ సువాసనలు, ఈ రుచులు, సుందరమైన ఈ అమాయకపు శిశువు ముఖం, నవ యవ్వనుల మధ్య కనుచూపుల్లో ద్యోతకమయ్యే ఆ అనురాగం, భక్తుల పారవశ్యం, సాధు పురుషుల సాంగత్యం ఇవన్నీ కూడా జీవిత వరప్రసాదమే.

ఈ అద్భుత జీవితాన్ని తిన్నగా దర్శించు. అసంతృప్తి, లేక సంతృప్తి అనే ఈ అల్పమైన వాటితో సతమతం కావద్దు. 'నేను సంతృప్తిగా వున్నాను' అనే భావం కలిగించు కున్నా కూడా, కాసేపయ్యేలోగానే మళ్ళీ 'అసంతృప్తి–సంతృప్తి', అనే ద్వంద్వంలో చిక్కుకో కుండా, ఆ రెంటితో నిమిత్తం లేకుండా, జీవితం ఏది వడ్డిస్తే అది స్వీకరించడం నేర్చుకుంటే, అంటే సుఖదుఃఖాలలో 'కాన్షస్'గా రెంటినీ గమనిస్తూ వుండగలిగితే, జీవితం తన అసాధారణ సౌందర్యంతో నీకు దర్శనమిస్తుంది.

లోకంలో ఎంత సౌందర్యమున్నదో చూడు. ఈ ప్రకృతి సౌందర్యాన్ని మనిషి సృష్టించలేదు; కానీ ధ్వంసం చేయడానికి మాత్రం మనిషే బాధ్యుడు. ఆ మనిషివి నువ్వే. 'అసంతృప్తి – సంతృప్తి' అనే చెర నుండి విడివడి చుట్టూ వున్నదానిని సున్నితమైన స్పృహతో పరికించడం నేర్చుకో. నీలోనూ ఆ సౌందర్యమే నెలకొంటుంది; అదే ప్రతిఫలించ నారంభిస్తుంది. వికృతమైనది ఏది కనిపించినా దానియెడల నీ స్పందన సహజంగా

వెన్వెంటనే జనిస్తుంది. నీకు సాధ్యమైనంత మేరలో నువ్వు దానిని అక్కడికక్కడే సరిచేయడం జరుగుతుంది. నీలో వికృతమైన ఏ భావం జనిస్తున్నా దానివైపు చూపు సారించేసరికి, అది తొలగక తప్పదు. వికృతమైనది బయట ఏది కనిపించినా, నీ చూపు, నీ చేష్ట దానిని తొలగించడానికే ప్రయత్నిస్తుంటుంది. నీలో వికృతమైనదేదీ లేనప్పుడు, బయట వికృతాన్ని చూస్తూ ఎలా వూరుకోగలవు?

మానవ జీవితంలో, సంఘంలో మారాల్సింది, మార్చాల్సింది ఎంతో వున్నది. అయితే నువ్వు మారితేగానీ, నీలోని జీవితసరళి మారితేగానీ, 'మార్పు' అనేది ప్రారంభం కాదు. సంఘంలో మార్పు రావాలంటే, అది ముందు నీతోనే శ్రీకారం చుట్టుకోవాలి. ఆపైన సంఘంలో ఎంత మార్పు సంభవిస్తుంది అనేది నువ్వు అంచనా వేయలేవు. నీలాగానే మారేవారి సంఖ్యమీద ఆధారపడి వుంటుంది. నీవలె పదిమంది మారితే, 'మార్పు' వేగాన్ని పుంజుకొంటుంది. వారిలో ఒక్కొక్కరినీ చూచి మరో పదిమంది చొప్పున మారితే, మరింత వేగమందుకుంటుంది. మార్పునకు మార్గమిదొక్కటే. బలవంతంగా సంఘ వ్యవస్థను మార్చగలమనుకున్న ఆదర్శవాదులు ఏమి సాధించారో నువ్వు చూస్తూనే వున్నావు.

అందుచేత వ్యష్టిపరంగానే మార్పు ప్రారంభం కావాలి. మార్పు సంభవించనంత కాలం నీవు నిజానికి వ్యక్తివే కావు. ఈ సంఘ చైతన్య స్రవంతిలో ఒక యాంత్రిక పని ముట్టువి. నీలో మార్పు ప్రారంభమైనప్పుడే నువ్వు వ్యక్తిగా రూపొందుతావు. ఇది జరిగినప్పుడు నీవీ జీవితానికి, ఈ భూమిపై లభించిన నరజన్మకూ, సతతమూ, కృతజ్ఞత తెలియజేసుకుంటూ వుంటావు. నోటితో ప్రకటించాల్సిన పనిలేదు. ఒకతరి ప్రకటించినా తప్పులేదు.

కానీ ప్రప్రథమంగా నీ మనసు కృతజ్ఞతా భావంతో నిండివుంటుంది. ఆస్తిక నాస్తిక వివాదంతో నిమిత్తం లేదు. ఈ జీవితం యెడల, ఈ భూమిపై మనుగడ యెడల కృతజ్ఞత నీలో నెలకొంటే, ఆ ఆనందమెటువంటిదో నీకే తెలుస్తుంది; నీ జీవితం ధర్మ యుతమవుతుంది.

*ఆంధ్రప్రభ 3-1-96*

# మారిన మనిషి

జిడ్డు కృష్ణమూర్తిని చదివి నందువల్లా, విన్నందువల్లా, 'మారిన' వారిని ఒక్కరిని చూపించండి, అని నన్ను అడిగిన వాళ్ళున్నారు. మారడమంటే ఏమిటో, మారినవాడు ఎలా ఉంటాడో అనే విషయంపై అంగీకారముంటే, మారారో లేదో, మారితే ఎంత మారారు అనే సంగతి చర్చించవచ్చు. అసలు మారిన మనిషి ఎలా ఉంటాడో మనం నిర్ధారణగా చెప్పలేనప్పుడు, కృష్ణమూర్తిని చదివి ఎవరైనా మారారా అని అడిగి ఏమి ప్రయోజనం?

మార్పు అంటే నీ ఉద్దేశం, దేనికీ చలించకుండా, ఎవరికెంత కష్టమొచ్చినా ఏదో ఒక సంస్కృత శ్లోకం వప్పజెప్పి, అలా వూరికే చూస్తూ కూచోడమనా? పవిత్ర గ్రంథాలు పారాయణ చేస్తూ కూచునేవారు చాలా మంది ఆ పనిచేస్తూనే వున్నారు. తమ స్వవిషయం వచ్చినప్పుడు మాత్రం, "నాకంత కష్టమొస్తే అందరూ అలా చూస్తూ వూరుకుంటా రేమిటండీ?" అని రోదిస్తారు. మరో పవిత్ర గ్రంథాన్ని పూటాపూటా పఠించేవారు నిమిషాలలో యుద్ధానికి ఆయత్తమవుతారు. మూకుమ్మడిగా నడుం బిగించి పోరుకు సిద్ధమవడం వారికి మంచినీళ్ళప్రాయం. ఉదాసీనత కానీ యుద్ధసన్నద్ధత కానీ, మార్పునకు చిహ్నమను కుందామా?

పోనీ మారిన వారు, బీదసాదలను ఆదుకుంటామంటూ, మెల్లమెల్లగా వారిని మతం మార్పిడికి ప్రోత్సహిస్తూ ఉంటారా? మారిని మనిషి ప్రియభాషణలే చేస్తుంటాడా, కఠినంగా ఎన్నడూ మాట్లాడడా? మారిన మనిషి ఎలా ప్రవర్తిస్తాడో మనం ఊహించగలిగి లేము. మారిని మనుషులుగా పేర్కొనబడే వారు నిజానికి బాహ్యంగా ఒక్కొక్కరూ ఒక్కో రకంగా ప్రవర్తించినట్లు కనిపిస్తుంది.

చిన్నప్పుడే తిరువణ్ణామలైకి వచ్చి అక్కడే స్థిరపడిపోయిన రమణుడు, అక్కడి నుండి మరెక్కడికీ వెళ్ళకుండా, జీవితాన్ని అక్కడే పరిసమాప్తం చేశాడు. ఇక నిసర్గదత్త మాహరాజ్ అయితే, బొంబాయిలో ఓ పచారీ దుకాణం నడపడం తప్పితే తన ఇంటి గడపకూడా దాటకుండా జీవించినట్లు కనిపిస్తుంది. అటు జిడ్డు కృష్ణమూర్తిని చూద్దామా,

లోకంలో పర్యటించకుండా వున్న సందర్భాలు ఆయన జీవితకాలంలో కొన్ని మాత్రమే కనిపిస్తాయి.

రమణుడు మద్య మాంసాలు గంజాయి దమ్ము పొగత్రాగడం ఇలాంటివేవీ ఎరగనే ఎరగడు. శాకాహారి అవడం అటుంచి, అనేక సంవత్సరాలు అంబలి, గంజి, భిక్షాటన ద్వారా సేకరించిన మధుకరంతో బ్రతుకుతుండేవాడు. తనకేది వడ్డించినా, బంతిలో కూచున్న అందరికీ సమానంగా వడ్డించాలని పట్టుబట్టేవాడు. మిగతా అందరికీ మజ్జిగ పోసి తనకు పెరుగు వడ్డించడానికి వచ్చినా ఊరుకునేవాడు కాడు. మార్పు సంభవించిన అనంతరం కూడా ఒకచోట కూచుని ఉపన్యాసాలు ఇచ్చే బదులు వంటగదిలో తిరగ మోతలు వేయడం, కూరలు తరగడం చేస్తుండేవాడు. తాను ఏ పూజచేయక పోయినా, చేసే వారిని ఆటంకపరిచేవాడు కాదు. ఎవరైనా తనని గురువుగా భావిస్తే వారించే వాడు కాదు. కానీ ఎవరైనా రమణుని గురువుగా పేర్కొని, తాను శిష్యుణ్ణని చెప్పుకుంటే, గురు వెక్కడున్నాడు? నేను నీకు గురువుని, నువ్వు నాకు శిష్యుడివని నేను చెప్పానా? అనేవాడు. అందరికీ ఒక్కడే, ఆ పరమాత్ముడే గురవనేవాడు. అమితమైన దయాదాక్షిణ్యాలు చూపించే వాడు; కొందరు మాత్రం తాత్కాలికంగా చాలా కఠినుడు సుమా అనేటట్లు ప్రవర్తించేవాడు.

ఇక శ్రీ జిడ్డు కృష్ణమూర్తి అంటేనా, ఆయన ధనికుల ఇళ్ళలోనే అతిథిగా ఉంటుండే వాడు. వారందించిన ఖరీదైన దుస్తులు ధరిస్తుండేవాడు. ప్రకృతి రామణీయకత ఉన్న ప్రదేశాల్లో, కొండల్లో, గుట్టల్లో విహరిస్తుండేవాడు. విందులో పాల్గొంటూ తాను స్వయంగా మితంగానే భుజించినా పలు రకాల వంటకాలు వడ్డించే భాగ్యవంతుల మధ్య కూచోడానికి ఆయనకు అభ్యంతరం ఉండేది కాదు. మాంసం ముట్టేవాడు కాదు కానీ కోడిగుడ్డుతో చేసిన ఆమ్లెట్లు తినేవాడు. తాను మద్యం సేవించకపోయినా స్విట్జర్లాండ్‌లో తన అతిథిగా వచ్చిన పాశ్చాత్యుడికి స్వయంగా తన చేత్తోనే మూత తెరవని మద్యం సీసా అందించినట్లు ఆ పాశ్చాత్యుడు ఓ పుస్తకంలో రాశాడు. యౌవనంలో ఒక పాశ్చాత్య యువతిని గాఢంగా ప్రేమించాడని, కృష్ణమూర్తి జీవిత చరిత్రలో మేరీ లూట్యెన్స్ వ్రాసింది. ఏ దేశంలోనూ, ఏ ప్రదేశంలోనూ, స్థిరపడకుండా ఆయన కోసం

ఎదురుచూసే అనేకమంది అభిమానుల కొరకై జీవితం పొడుగూతా 'దేశద్రిమ్మరి'లాగా తిరుగుతూ, ప్రబోధిస్తూ మేధావులతో, సైంటిస్టులతో, చర్చలు సంవాదాలు సాగిస్తూ, జిజ్ఞాసాపరులలో 'నిప్పు రాజేస్తూనే' ఉండేవాడు.

బ్రహ్మవేత్త అయినవాడు ఇంత పనిని ఎందుకు తలకెత్తుకోవాలి? కనిపించేదంతా మాయా ప్రపంచమని ముక్కుమూసుకుని ఒకచోట కూర్చోవచ్చుకదా? జీవితం పొడుగూతా పనిగట్టుకుని ఊరూరా తిరుగుతూ ఈ ప్రసంగించడమేమిటి? తిరిగినా మెహర్‌బాబా లాగా మౌనముద్ర ధరింపవచ్చుకదా? మరి కృష్ణమూర్తిలో మార్పు సంభవించినట్లా? సంభవించనట్లా?

ఆధ్యాత్మిక రంగంలో ఎవరి పెత్తనంగానీ, ఏ గురువునుగానీ అంగీకరించని కృష్ణమూర్తితో పోలిస్తే నిసర్గదత్తుడు దత్త సంప్రదాయంలో గురువును సేవించి కృతార్థుడినైనా నంటాడు. తన గురువు చెప్పిన మహావాక్యాన్ని నమ్మి, ఆలోచిస్తూ రోజుల తరబడి మరో ధ్యాస లేకుండా కదలక మెదలక అలాగే ఉండిపోయిన అనంతరం హఠాత్తుగా జ్ఞానోదయ మయింది అంటాడు. తానీ సంప్రదాయంతో నిమిత్తం లేకుండా జీవితాన్ని నిశితంగా గమనించడం ద్వారా మనిషి విముక్తుడు కావచ్చునని ప్రకటిస్తాడు.

అజ్ఞానం పటాపంచలయిన తర్వాత కూడా నిసర్గదత్తుడు ప్రబోధించడానికి ఎక్కడికీ బయలుదేరలేదు. అతడు అట్టే చదువుకున్నవాడు కాదు. మాతృభాష అయిన మరాఠీలోనే వ్యవహరిస్తుండేవాడు. నిత్యమూ తన పూజా మందిరంలో అందరి దేవుళ్ళ పటాలకూ హారతులు పడుతుండేవాడు; ఆ వరసలో జిడ్డు కృష్ణమూర్తి ఫోటో కూడా పెట్టి హారతి వెలుగు చూపించేవాడు. ఆరుణాచల రమణుణ్ణి తమ జీవితంలో ఎవరైనా దర్శించామని ఆయనతో చెప్పుకుంటే పులకించి పోయేవాడు. ఇంటి నుండి బయటికి పోకుండా తన వద్దకు వచ్చిన వారితో చర్చిస్తూ ప్రసంగిస్తూ, వారిచేతనే సమాధానాలు చెప్పిస్తూ 'విద్య' గరపుతుండేవాడు. ఆయన సరసన వచ్చి కూచున్న వారికి ఏదో వింత శాంతి, ఏదో శ్రేయస్సు, ఏదో సమస్య పరిష్కారం లభిస్తుండేది.

మరి మార్పుచెందినట్లుగా అందరూ భావించే ఈ పుణ్యపురుషుడు వారి కులాచారాన్ననుసరించి ఇంట్లో మాంసం వండి వడ్డిస్తే అందరితోపాటు తానూ

తినేవాడు. చిన్నతనం నుంచీ బీడీలు కాల్చే అలవాటున్నందువల్ల జీవితాంతం బీడీలు కాలుస్తూనే ఉండేవా డంటారు. అతడు బతికున్న రోజుల్లో బొంబాయిలో అతణ్ణి "బీడీ బాబా"గా పేర్కొంటుండే వారు. ఈ లెక్కన చూస్తే అధ్యాత్మికులు ఈ అలవాట్లు కలిగి ఉంటారని కానీ, ఇవి ఉండవని కానీ చెప్పే వీలు కనిపించదు.

అరుణాచల రమణ, జిడ్డు కృష్ణమూర్తి, నిసర్గదత్త మహరాజ్ అనే ఈ శతాబ్దపు ముగ్గురు మహానుభావుల బోధలలోనూ కొంత సామీప్యం సారూప్యం ఉన్న కారణాన ఈ మూర్తి త్రయాన్ని తీసుకు చర్చించాను. కానీ ఈ మార్పు సంభవించక మునుపూ, సంభవించిన తదుపరీ, వీరి జీవనశైలిలో, ఆహార విహారాల్లో, పూజసలపడంలో పూజ సల్పకపోవడంలో ఎంత భేదమున్నదో గమనించండి. అయినప్పటికీ వీరందరినీ మహా పురుషులుగా ఎందుకు పరిగణిస్తున్నారో, మన సాధారణ చైతన్యం ఆవలనున్న ఏ మహా కరుణను వీరు దర్శించారో, వీరి జీవితాలను ఏది ప్రభావితం చేసిందో కాస్త ఆలోచించండి.

కృష్ణమూర్తిని చదివినందువల్ల మారిన వారిని ఒక్కర్ని అయినా చూపించగలరా అని అడిగిన పృచ్ఛకుడికి నేనేమని సమాధానం చెప్పను? ఈ కృష్ణమూర్తే కాదు. కురుక్షేత్రంలో అలనాటి కృష్ణమూర్తి బోధించిన తర్వాత అది నిత్యమూ పారాయణ చేస్తున్న వారెందరు మారారు?

ఈలోగా ఎవరైనా ఎక్కడైనా మారారా అని వెతికే బదులు మార్పుయొక్క ఆవశ్యకత 'అర్జెన్సీ' గుర్తించి, మనం మారే వీలుందా లేదా అని ప్రయత్నిస్తే సరిపోతుంది కదా? అప్పుడు సాధ్యమో కాదో తేలిపోతుంది; ఇక ప్రశ్నించాల్సిన అవసరమే ఉండదు.

*ఆంధ్రప్రభ 24-1-96*

# అంతర్గత చైతన్యం

మార్చి మాసంలో కాకినాడ దివ్యజ్ఞాన సమాజం వారి ఆహ్వానంపై, శ్రీ జిడ్డు కృష్ణమూర్తిగారి టీచింగ్‌ను గురించి చర్చించడానికి, ఓ అధ్యయన శిబిరం నడపడానికి ఆ వూరికి వెళ్ళి ఓ నాలుగు రోజులుండి వచ్చాను.

సుమారు 1930 నుండి అంటే శ్రీ కృష్ణమూర్తికి ముప్ఫై అయిదేళ్ళ వయస్సు నాటి నుండి ఆయన సమాజానికి దూరమయినాడనే విషయం లోకానికి తెలిసినదే. “కృష్ణమూర్తి థియసాఫికల్ ఉద్యమాన్ని వదలివెళ్ళాడనే మాట అంతసరి అయినది కాదు. కృష్ణమూర్తి చెప్పే వైనం సరిగా అర్థంకాక, తియాసఫిస్టులు ఆయన నుంచి వైదొలిగారు అనడం సబబు” అని నేటి తియాసాఫికల్ సొసైటీ అధ్యక్షురాలు రాధాబర్నియర్ ప్రకటించి, కృష్ణమూర్తి టీచింగ్ యెడల తన గాఢాభిమానాన్ని తెలుపడానికని, అన్ని తియాసాఫికల్ లాడ్జెస్‌లోనూ కృష్ణమూర్తి అధ్యయన కేంద్రాలు ప్రారంభించమని సలహా ఇచ్చినందువల్ల, ఏడెనిమిదేళ్ళుగా ఈ ‘స్టడీసెంటర్స్’ నిర్వహించబడుతున్నాయి. కృష్ణమూర్తి జీవిత దర్శనంపై శ్రద్ధవున్న వారు కొందరు, ఒకవంక తియాసఫీ స్టడీస్ చేస్తూనే ఆనాటికీ ఈనాటికీ ఈ కృష్ణమూర్తి టీచింగ్‌ను అభిమానిస్తూనే వచ్చారు. కృష్ణమూర్తి ఈ సమాజం నుంచి విడివడిన తదుపరి, సంవత్సరానికోసారి మద్రాసు వచ్చి అడయార్ ప్రాంతంలోని తన నివాసమైన వసంతవిహార్‌లో ప్రసంగాలు చేసే కాలంలో, తియొసాఫికల్ సొసైటీలో అక్కడివారు ఇంటర్నేషనల్ కన్వెన్షన్ నిర్వహించుకుంటూ ఉన్నప్పటికీ, కృష్ణమూర్తి మాట్లాడే వేళల్లో తాము సొసైటీ ఆవరణలో ఏ కార్యక్రమాలు పెట్టుకోకుండా, ఈయన ప్రసంగం వినదల్చుకున్న వారు వసంతవిహార్‌కు వెళ్ళే వీలు కల్పిస్తుండేవారు. కృష్ణమూర్తి ద్వారా ప్రకటితమవుతున్న సత్యాన్ని ఎంతో శ్రద్ధగా గ్రహించి ఆదరిస్తుండేవారు.

కృష్ణమూర్తి వాక్కు ప్రథమంలో మనందరికీ ఉండే ఉపరితల చైతన్యం నుండి ప్రారంభమై, లోకరీతిని కళ్ళకు కట్టినట్లు చూపించేదైనప్పటికీ, కొద్దిసేపయ్యే లోగానే ఆ వాక్కు అంతర్గత చైతన్యాంబుధి నుండి వెలువడనారంభిస్తుంది. ఉపరితల చైతన్యంలో

మనలో మనకి అనేక విభేదాలున్నట్లు కనిపించినప్పటికీ, అంతర్గత చైతన్యమందరిదీ ఒక్కటే అని మనకు స్ఫురించకపోవచ్చు. అక్కడ, ఆ అట్టడుగున ద్యోతకమయ్యే ఆందోళనా, భయమూ, అభద్రతా ఒకటే. ఈ అంతర్గత చైతన్యంలో మేల్కొన్న మనిషి మాట్లాడనారంభిస్తే, మీకు ఏ కొద్దిగానైనా స్పృహ వుంటే, ఆ మాటలు వెళ్ళి నిద్రాణమైవున్న మీ అంతర్గత చైతన్యాన్ని మేల్కొల్పనారంభిస్తాయి. మీరు మీ ఉపరితల చైతన్యంతో ఆ వాక్కును అడ్డుకొంటున్నంతకాలం, ఎవరూ ఏమీ చేయజాలరు. ఆ శ్రీకృష్ణపరమాత్ముడు, ఆ బుద్ధుడు కూడా నిస్సహాయులే. మీ హృదయ కవాటాలు ఏమాత్రం తెరచినా, కృష్ణమూర్తి మాటలు మీ మాటల్లాగానే వినిపించ నారంభించుతాయి. అంతర్గత చైతన్యం అంతా ఒకటే అని మీకు ఖాయంగా తెలిసిన తర్వాత, ఇక కృష్ణమూర్తి ఎవరు? మీరెవరు, నేనెవరు? ఉట్టి నామరూప భేదమేకదా? అందువల్ల మీరెంత కాదనుకున్నా ఒకసారి కృష్ణమూర్తి మాటలు మీలోనికి వెళ్ళి అక్కడ మెదలాడడం మొదలెడితే, మీరు మేల్కొని మాటాడే మాటలన్నీ మీ 'నిజమైన' మాటలు అవుతాయి. కృష్ణమూర్తి చేసిందేమీ లేదు, మిమ్మల్ని నిద్ర నుండి మేల్కొల్పాడు. అతడి కర్తవ్యం తీరిపోయింది. మీలో ఉన్న వస్తువే జ్వాజ్వల్యమానంగా తనదైన ధోరణిలో అభివ్యక్తీకరింపబడుతుంది.

అయితే ఇది అనుకున్నంత తేలికైన పనికాదు; అందుకని ఇది కష్టసాధ్యమని కూడా అనడంలేదు. తేలిక, కష్టమనే విభజన చేయడం సరి అయిన పనికాదు. మనమెవరమో మనం తెలుసుకోవాలి అనే ఆసక్తి అధికమైనప్పుడు, ఆకలిదప్పులంత తీవ్రమైనప్పుడు, తేలికనా కష్టమా అనే మీమాంస చేస్తూ కూచుంటామా? మన కడుపు మాడుతుంటేనో, మన శిశువుపాలకై ఏడుస్తుంటేనో మానాభిమానాలు పక్కనపెట్టి గ్లాసెడు పాలకై, ఒక రొట్టె ముక్కకై నలువైపులా పరుగిడడం లేదా? అందుచేత సులభమా కష్టమా అనే ప్రశ్నకు అర్థంలేదు. ఇప్పుడైనా మరెప్పుడైనా నిన్ను నీవు తెలుసుకోక తప్పదు. ఆ విషయాన్ని వాయిదావేసి గడిపిన ఎటువంటి జీవితమైనా, ఎంత భాగ్యవంతమైనా, ఎంత కీర్తివంతమైనా వ్యర్థమే. చిట్టచివరకు నీకు మిగిలేది దుఃఖమే.

కృష్ణమూర్తి మీద తండ్రీకూతుళ్ళైన (యన్. శ్రీరామ్, రాధా బర్నియర్) ఈ ఇద్దరు ప్రెసిడెంట్లకే కాదు అంతకు పూర్వం సొసైటీ ప్రెసిడెంట్ అయిన శ్రీ జినరాజదాసకు కూడా 'కృ' మీద ఎనలేని గౌరవముండేది. జినరాజదాస ఒకసారి ఇలా రాశాడు :

"1928 నుండి కృష్ణమూర్తి టీచింగ్‌ను చర్చించడం కానీ, ఆ బోధను మరొకరికి వివరించి చెప్పడం కానీ నే చేసేది లేదని నాకు నేనో నియమం పెట్టుకున్నాను. కృష్ణమూర్తి ప్రసంగ ధోరణి ఎంత అనన్య సాధ్యమూ, ఎంత ప్రత్యేకమైనదంటే, ఎవరికి వారు ఆయన మాటలను నేరుగా అర్థం చేసుకోడానికి ప్రయత్నించాల్సిందే కానీ, మరొక మనిషి, – అతడెంతటి అవగాహన కలవాడైనా, ఎంత సానుభూతితో వివరించి చెప్పగలవాడైనా – సహాయం పొందడానికి ప్రయత్నించి లాభం లేదు. ఎవరికి వారు స్వయంగా తమ అవగాహనను బట్టి, తమ అంతఃస్ఫూర్తిని బట్టీ కృష్ణమూర్తి చెప్తున్న ఆదర్శంయొక్క రూపాన్ని గ్రహించాల్సి ఉంటుంది.

"కృష్ణమూర్తిని అర్థం చేసుకోవాలనుకున్న వ్యక్తి ఆయన చెప్పే విషయాన్ని లోతుగా ఆలోచించి, తన శక్తిమేరకు ప్రత్యక్షంగా స్ఫురింపజేసుకోడానికి ప్రయత్నిస్తే చాలావరకు సఫలీకృతుడవచ్చు. అనేక విషయాలు పాఠకుడికి మొదట్లో అర్థం కాకపోవచ్చు; కాని వాటిని మరొకరితో చర్చించినందువల్ల ఎక్కువ అర్థం స్ఫురిస్తుంది అని నేను అనుకోను" అంటాడు. శ్రీ జినరాజదాస దృష్టిలో కృష్ణమూర్తి మాటలు ఆలోచనా జనితమైనవి కాక ఏదో అసాధారణమైన మూలాన్నుండి బయల్వెడలుతున్నై. అందువల్లనే ఆ మాటల్ని మేధస్సుతో తర్కించి ప్రయోజనంలేదు; వాటిని హృదయంతో అర్థం చేసుకోవాలని ఆయన నిశ్చితాభిప్రాయం; మది నెమ్మదిస్తే గానీ హృది స్పష్టంగా పనిచేయనారంభించదు. కృష్ణమూర్తి ఏ విశ్వమానవ హృదయాన్నుండి ఈ మాటల్ని తవ్వి తెస్తున్నాడో పాఠకుడు, శ్రోత కూడా ఆ హృదయాన్ని ఆశ్రయిస్తే గానీ ఆ మాటల అర్థం స్ఫురించదు.

ఇటువంటి ప్రశాంత, సావధాన చిత్తంతో విని అర్థం చేసుకోడానికి ఆనాటి తియాస ఫిస్టులు ఓర్పు వహించక పోయినందువల్లనే, సత్యాన్ని కొండపై నుండి కిందికి దింపి పళ్ళెంలో వడ్డించి తమ ముందు ఉంచడమే జగద్గురువు కర్తవ్యమని ఊహించినందువల్లనే, కృష్ణమూర్తి బాట వేరైపోయింది; నాటి తియాసఫిస్టులలోనే కొందరు ప్రముఖులకు, తియాసఫీతో సంబంధం లేని తదితర వర్గాల్లో, ఆయన మార్గం విశిష్టంగానూ అసాధారణం గానూ కనిపిస్తూనే ఉండేది.

కాకినాడ అధ్యయన శిబిరానికి వయోవృద్ధులే కాక మధ్య వయస్కులు, కొద్ది శాతం యువతీ యువకులు కూడా వచ్చారు. కొందరు కృష్ణమూర్తి జీవించిన కాలంలో ఆయన ప్రసంగాలను ప్రత్యక్షంగా విన్నవారున్నారు. కృష్ణమూర్తి టీచింగ్ చర్చించ, విశ్లేషించ, వివరించ నలవి కానిది; ప్రామాణికంగా, నిర్ధారణగా ఎవరూ ఏమీ చెప్పగలిగింది కాదని మొదట్నే చెప్పాను. నే చేసిందల్లా "నాకు తెలిసింది ఇది, నాకర్థమైనది ఇట్లా" అని సవినయంగా చెప్పుకున్నాను. ఒకరు తెలిసినవారూ, మరొకరు తెలియనివారూ అనే విభజన లేకుండా అందరూ పాల్గొన్నారు. శ్రద్ధగా ఆలకించిన పెద్దవారిని చూసినప్పుడు సంతోషం జనిస్తే, యువతరాన్ని చూసినప్పుడు మా పెద్దతరం వారికన్నా ఈ చిన్నవారు మరింతగా నేర్చి అతి విలువైన ఈ టీచింగ్‌ను ముందుకు తీసుకుపోగలరనే ఆశ మొలకెత్తింది. యువతరం ఈ ఆశను వమ్ము చేయరనుకుంటున్నాను.

***ఆంధ్రప్రభ 3-4-1996***



# పాదుకాపహరణం

## జీవితం ఒక కళ

జీవించడమనేది అన్ని కళలకన్నా గొప్పది; మనిషి తమ చేతితో కానీ మెదడుతో కానీ సృష్టించిన విగ్రహాలు, ఆలయాలు శాస్త్రాలు, పురాణాలు, దేవుళ్ళు – వీటన్నిటికన్నా మించినటువంటిది. ఈ జీవించే కళను అభ్యసించడం ద్వారానే ఓ నూతన సంస్కృతిని నెలకొల్పగలుగుతాము.

–జిడ్డు కృష్ణమూర్తి

## సాధువులేడు

అమెరికాలోని కాలిఫోర్నియా రాష్ట్రంలో కృష్ణమూర్తి ఒకమారు కొన్నాళ్ళపాటు ఒక నిర్జన ప్రదేశంలో ఓ కుటీరం వేయించుకుని, మరెవరూ తోడు లేకుండా ఒంటరిగా ఉండిపోయాడు.

అటువైపుగా నడిచి వచ్చిన ఎవరో కొందరు "ఇక్కడో సాధుపురుషుడు (Saint) ఉన్నాడని చెప్పారండీ. ఏడీ అతడు?" అని అడిగారు. "ఆయన ఇప్పుడే వెళ్ళిపోయాడండీ" అని సమాధానమిచ్చి ఊరుకున్నాడు కృష్ణమూర్తి.

## మహారాజెవరు?

స్వాతంత్ర్యానికి పూర్వం భారతదేశంలో పెద్ద పెద్ద సంస్థానాధీశుల్ని మహారాజులనే వారు. జిడ్డు కృష్ణమూర్తి ముప్ఫై ఏళ్ళ ప్రాయంలో ఉన్నప్పుడు అలాంటి ఓ మహారాజు ఆయనకు స్నేహితుడు. ఆ మహారాజుకు కార్లంటే తగని మోజు. తనవద్దలేని 'మోడల్' ఏదైనా మార్కెట్‌లోకి కొత్తగా వచ్చిందంటే వేగంగా దానిని కొనుగోలు చేసేవాడు.

ఒకమారు పారిస్ పట్టణంలో ఈ మహారాజు కొత్తకారొకటి కొనడానికి బయలు దేరుతూ కృష్ణమూర్తిని తనతో తీసుకువెళ్ళాడు. కార్ల వ్యాపారి కృష్ణమూర్తి రూపాన్నిబట్టీ, వైఖరినిబట్టీ ఇతడే మహారాజని అనుకుని మాట్లాడనారంభించాడు. పక్కన ఉన్న వారు అతడు కాదని ఎంత చెప్పినా ఆ కార్ల వ్యాపారి ఓ పట్టాన నమ్మలేదు!

**పాదుకాపహరణం**

ఒకసారి రిషీవాలీ ఆడిటోరియంలో ఓ ప్రఖ్యాత కళాకారిణి డాన్స్ ప్రోగ్రామ్ చూడడం ముగిసిన తర్వాత తాను నివసించే పాత గెస్ట్‌హౌస్ వైపు నడిచి వెళ్ళడానికి లేచి చెప్పులు వదిలేసిన చోటువద్ద కొచ్చేసరికి కృష్ణమూర్తికి తాను వేసుకు వచ్చిన చెప్పుల జత కనిపించలేదు. అప్పటికప్పుడు ఆయనకు సరిపడే పాదరక్షలు మరెక్కడినుండో తెచ్చి ఇచ్చారు. నడిచి వెనక్కు వెళ్ళిన తర్వాత కృష్ణమూర్తి ఎవరితోనో మాట్లాడుతూ, "తీసుకున్న వారెవరికో మంచి చెప్పుల జతే దొరికుంటుంది. హాయిగా వాడుకుంటే బాగానే ఉండు. కానీ వాటిని పూజిస్తాడేమో?" అనే తన సంకోచం వెలిబుచ్చాడు.

(నేడు జిడ్డు కృష్ణమూర్తి 101వ జయంతి)

***ఆంధ్రప్రభ 11-5-1996***



# కృష్ణమూర్తి బోధలు

చిత్తూరు జిల్లా మదనపల్లెలో తెనుగు దంపతులకు పుట్టిన కృష్ణమూర్తి, బాల్యంలో పది పదిహేనేళ్ళ వరకూ మాతృభాషలోనే మాట్లాడుతూ పెరిగినప్పటికీ కాబోయే జగద్గురువుగా గుర్తించి, శ్రీమతి ఆనీబెసెంట్ అతడికి ఆంగ్లంలోనే క్షుణ్ణంగా తర్ఫీదు ఇప్పించడానికీ, పై చదువులు చదివించడానికీ, చిన్నతనంలోనే ఇంగ్లండు తీసుకు వెళ్ళింది.

అక్కడ ఆ బ్రిటిష్ వాతావరణంలో, అతడూ, అతడితోబాటు వెళ్ళిన తమ్ముడు నిత్యానంద, ఈ ఇద్దరి మధ్యే తెనుగు సంభాషణ సాగేది. కొంతకాలానికి నిత్యానంద అమెరికాలోని కాలిఫోర్నియా రాష్ట్రంలో ఉంటూ క్షయవ్యాధితో మరణించాడు. అటు తర్వాత, పాశ్చాత్య వాతావరణంలోనే పెరుగుతూ వచ్చిన కృష్ణమూర్తికి, మాతృభాష తెనుగు పూర్తిగా మరుగున పడిపోయింది. చిన్నప్పటి నుండీ తన పాలన పోషణా విషయంలో శ్రద్ధ వహించిన అనీబిసెంటును 'అమ్మా' అని సంబోధించడం, ఆమె ప్రస్తావన వచ్చినప్పుడల్లా 'అమ్మ' ఇట్లా అన్నదని ఇంగ్లీషులో అనడం మినహా, మరే తెలుగుపదం ఆయన చైతన్యంలో మిగిలినట్లు కనిపించదు.

1980 ఆఖరులో ఆంధ్రప్రభ వీక్లీ తరఫున ఆయన్ని నేను ఆంగ్లంలో ఇంటర్వ్యూ చేసినప్పుడు, "నావల్ల కాదని" ఆయన అంటూ ఉన్నప్పటికీ మూర్ఖంగా పట్టుబట్టి, ఆయన నోటి నుండి తెనుగులో ఒంట్లు – ఒకటి, రెండు, మూడు, నాలుగు – అనేంత వరకు పలికించగలిగాను. ఇక ఆ తర్వాత ఆయనవల్ల కాలేదు. అంతకు ముందు అనేక దశాబ్దాలుగాఆయన తెనుగు పలికి ఉండడు, ఏదో ఆనాటి ముచ్చట చెప్పానేగానీ, అంతకన్నా దీనికేమీ ప్రాధాన్యంలేదు.

భారతీయ భాషలేవీ ఆయన చైతన్యంలో మిగలకపోయినా, చిన్నప్పుడు నేర్చిన సంస్కృత శ్లోకాలు మాత్రం ఆయనకు చివరి వరకూ నోటికి వస్తూండేవి. భారతదేశం వచ్చినప్పుడు, అశ్లోకాలను ఎవరైనా వల్లించనారంభిస్తే, స్వరయుక్తంగా తాను కూడా అక్కడక్కడా పాల్గొంటుండేవాడు.

ఒక విధంగా కృష్ణమూర్తి సంప్రదాయ భారతీయ వేదాంత పరిభాష నుపయోగించ కుండా ప్రసంగించడం మనకు శ్రేయోదాయకమనే భావించాలి. తరతరాలుగా ఈ వేదాంత పరిభాష, ఆత్మానాత్మ విచారణ, అద్వైతద్వైత విశిష్టాద్వైత సిద్ధాంతాలు, ఇతర రాద్ధాంతాలకు అలవాటుపడిన మనకు, తత్సంబంధ పదజాలం నోటికొచ్చిన మనకు, ఆ పదజాలం వినిపించగానే, ఇదంతా మనకు కొట్టిన పిండే కాబట్టి, శ్రద్ధగా ఆలకించడం మానేస్తాం. దానికో చెవి అప్పజెప్పి, మరో చెవితో మన పక్కనే ఉన్న వారి చతురోక్తులు వింటూ, మనకు తోచిన ఆలోచన మనం చేస్తుంటాం. ఈ వేదాంత బోధవల్ల ఒరిగేదేమీ ఉండదు, అనే నిర్లిప్తత మనల్ని అలముకొని ఉంటుంది. వినీ వినీ చివరకు నిద్రలోకి జారుకుంటాం.

కృష్ణమూర్తిని ఎంతగానో అభిమానించి ఆయన్ని సింహాళ ప్రజానీకానికి తెలియజేయ డానికి అవిరళ కృషి సల్పిన సింహాళ జాతీయుడు డాక్టర్ అధికారం ఒకసారి కృష్ణమూర్తితో “మీరు చెప్పే విషయాన్ని ప్రజలకు స్థానిక భాషలో తెలియజేయడానికి నన్ను అనుమ తించండి” అని కోరాడు. “అలాగే ప్రసంగించండి. కానీ ఒక్క సంస్కృత పదం కూడా వాడకుండా జాగ్రత్తపడండి. అలా వాడిన తోడనే, వేలాది ఏళ్ళనాటి సంస్కారం, సంప్రదాయం శ్రోత మెదడులోకి దూసుకు వచ్చేస్తుంది. ఇంతకుపూర్వం ఈ విషయాన్ని ఎలా అర్థం చేసుకున్నాడో, మళ్ళీ అదే వరుసలో అర్థం చేసుకుంటానంటాడు. అలాంటి గాటిలో పడిపోయిన ఈ అవగాహనకు మీరు మరింత బలం చేకూర్చినట్లవుతుంది. వారి కిప్పటికే కంఠస్థమైన శాస్త్రజ్ఞానానికి ఈ సంస్కృత పదం చక్కగా అతుకుతుంది. అప్పుడా శ్రోత తాజాగా మీరు చెప్తున్న మాటవినే బదులు ఆ పాత శాస్త్రాలను గుర్తుతెచ్చుకొని అవే నెమరువేసుకుంటాడు. మీ స్వానుభవంతో మీ సొంత మాటల్లో, మీరు స్వయంగా చూచినది, అచ్చం మీరు గమనించినది, దీనిని మాత్రమే చెప్పడం నేర్చుకోండి. నేడు సింహాళ ప్రజలు వాడే సింహాళ భాషా పదాలనే వాడుతూ చెప్పండి” అని సలహా ఇచ్చారు.

అందువల్ల కృష్ణమూర్తి ఏ భాషలో ప్రసంగించాడు. మనకలవాటైన ‘పవిత్ర పదాలు’ వాడాడా లేదా, అనేది అంత ముఖ్యం కాదు. గ్రంథ పాండిత్యంతో నిమిత్తం

లేకుండా, తన హృదయంతో తాను ఎంత గ్రహించాడు, నిజంగా ఎంత నేర్చాడు అనేదే ముఖ్యం. అలాంటి వస్తువులోన వుంటే, ఏ భాషలో, ఏ పదజాలంతో వెలువరించినా ఒకటే.

మనిషినీ, అతడి మనసునూ కుదిపి, ఏదో విధంగా అతణ్ణి జీవితాన్ని దర్శించేటట్టు చేయడానికి, కృష్ణమూర్తి ఒక విశిష్టమైన 'టీచింగ్'ని రూపొందించాడు. ఆ టీచింగ్‌లో దేవుడున్నాడని కాని, లేడనికాని మొదలెట్టే వీలులేదు. ఏ నమ్మకమూ ఏ విశ్వాసంతోనూ ప్రారంభించే అవకాశం లేదు. 'నాకేమీ తెలియదంటూ' మొదలెట్టాలి. తన అనుభవ పరిధిలోకి వచ్చినా దేనినైనా సందేహించాలి. ప్రశ్నించాలి, పరీక్షించాలి. దానికేపాటి విలువ ఉన్నదో నిశితంగా చూచి నిర్ధారించుకోవాలి.

జీవితంలో తనకేది సంభవించినా, దాని నుండి తప్పించుకునే వీలులేదు. 'సుఖాన్నే అభిలషిస్తాను. దానినే ఆహ్వానిస్తాను' అనడం కుదరదు.

"దుఃఖాన్ని దరిరానీయను, సాధ్యమైనంతగా అడ్డుకుంటాను. తీరా వచ్చిపడితే ఏ మతగురువు పాదాల మీదనో పడి నివారించమంటాను. లేదా త్రాగుడు, వినోదం మొదలైన ప్రక్రియల ద్వారా విస్మరించే ప్రయత్నం చేస్తాను", అనే పిచ్చ పరిష్కారాలు పనికిరావు. ప్రాప్తించిన దుఃఖాన్ని కూడా సుఖంలాగే అనుభవించాలి. అయితే సూక్ష్మబుద్ధి గలవాడు ఈ సుఖదుఃఖాలను అనుభవించేప్పుడు, వాటిని చక్కగా ఎరుకతో, తెలివితో జాగరూకుడై అనుభవిస్తాడు. సుఖం ప్రాప్తించినప్పుడూ, అది తన మనస్సును ఆక్రమించ నివ్వడు; అదే మళ్ళీ మళ్ళీ కావాలి అనే ఆలోచనకు తావివ్వడు. ఏమరుపాటున ఉంటే తన ప్రాణం ఆ సుఖానికి అలవాటుపడే ప్రమాదమున్నదని గ్రహిస్తాడు. పూర్వం ఒకప్పుడు అనుభవించింది, 'మళ్ళీ' అదే కావాలి' అనే ఈ అలవాటే, ఈ బలీయమైన సంస్కారమే తననీ స్థితికీ, గతికీ తెచ్చిందని తెలుసుకుంటాడు. ఈ 'అలవాట్లే' తన బంధాలు అని కనుక్కుంటాడు. జాగ్రదావస్థలో అంతటినీ పరికిస్తున్న ఇతడు, ఈ సుఖాల కోసం తన మౌలిక స్వేచ్ఛను కోల్పోడు. ఈ స్వేచ్ఛా మానిసి ఎవరికీ, దేనికీ దాసుడు కాడు. దుఃఖం కలిగినప్పుడు కూడా, ఈ స్వేచ్ఛా జీవి, ఆ దుఃఖాన్ని అదే నిశ్చల చిత్తంతో చూస్తాడు, భయపడడు, విచారించడు, ఏదో విధంగా త్వరగా

వదల్చుకోవాలని అటూ ఇటూ పరిగెత్తడు. ఆ దుఃఖంతోబాటు జీవిస్తూ, దాని స్వరూప స్వభావాలను సంపూర్ణంగా తిలకిస్తాడు. కదలక మెదలక, తొణకక, బెణకక, దాని సమగ్ర స్వరూపం దర్శించేవాడికి, ఆ దుఃఖం ఎలా నిర్మితమైనదీ, ఏ అసంపూర్ణమైన గత చర్య దానిని మళ్ళీ మళ్ళీ జనింపజేస్తున్నదీ, అన్ని విషయాలూ విశదంగా కనిపించ నారంభిస్తాయి. అలా దాని పూర్ణ రూపాన్ని చూచినప్పుడు, దాని శక్తి క్షీణిస్తుంది, అది కరిగిపోనారంభిస్తుంది; ఆ పైని, దాని చిహ్నాలే మటుమాయ మవుతాయి.

ఈ దుఃఖం నుండి ఇలా సూక్ష్మబుద్ధితో విముక్తుడైన మానవుడికి, ఒకప్పుడు తన సుఖదుఃఖాలలో, మానసిక సంఘర్షణలో, పలు ద్వంద్వాలలో వ్యర్థమయిపోతూ వచ్చిన శక్తి యావత్తూ వేరొక బలీయమైన శక్తిగా మారిపోతుంది. అప్పుడా శక్తి ఏ ఒక్కరిని గురించో, లేక తనని గురించో ఆలోచించుకోడం కాక, ఈ 'మొత్తాన్ని' గురించీ ఆలోచిస్తుంది. మొత్తం అంటే తాను, తనవారు, తన దేశం అనే కాకుండా, జాతిమత కుల భేదాలకు అతీతంగా మనిషిని మనిషిగా చూడగలుగుతుంది. ఇలా చూడగలిగిననాడు తోటి మనిషి మీద ప్రేమ అంకురిస్తుంది. మనిషి మీదే కాదు, పశుపక్ష్యాదులు, చెట్టూ చేమా, సమస్తమైన జీవరాశి యెడల ప్రేమ జనిస్తుంది. ఈ ప్రేమను కనుగొని అనుభవించిన మానవుడు సంపూర్ణుడే.

మనిషి తానిప్పుడెట్లా ఉన్నాడో, దానిని ఉన్నది ఉన్నట్లు చూచుకొననారంభిస్తే అతడికి తరుణోపాయ ముంటుంది కానీ, ఎవరో ఏదో చెప్పారని, ఆ రకంగా రూపొందుదామని ప్రయత్నిస్తే, జీవితంలో కాపట్యం సిద్ధిస్తుందే కానీ మరేమీ జరగదు, పాపాలు చేసిన వాడికైనా మోక్షావకాశం ఉన్నది కానీ, కపటి కేనాటికీ మోక్షం ఉండజాలదు.

అందుకే కృష్ణమూర్తి 'ఎవరినీ అనుకరించవద్దు', 'ఎవరినీ అనుసరించవద్దు' అని స్పష్టంగా చెప్తాడు, ఆఖరికి తనని కూడా అనుసరించవద్దు అని ఖండితంగా చెప్పేవాడు. మనిషిగా పుట్టిన ప్రతి ఒక్కరూ ఏదో ఒక ప్రత్యేకత లేకుండా కేవలం మరొకరి లాగానే పుట్టడమనేది ఎన్నటికీ జరగదు; అయితే ఆ ప్రత్యేకత ఏమిటో వారే స్వయంగా కనుక్కోవాలి. ఈ కనిపించే జీవిత రంగంలో తాను చేయగలిగింది ఏదో

ఉన్నది. అదీ తానే కనుగొన గలడు కానీ, మరొకరు తనకు చెప్పేది కాదు. అందుచేత మరొకర్ని అనుకరించడం అనుసరించడం మహాపరాధమని గుర్తించండి; మీకు మీరు ద్రోహం చేసుకుంటున్నారన్న మాట. మీరెవరో, ఈ సృష్టిపై మీ ప్రేమ ఎలా వ్యక్తం కావలసి ఉన్నదో, ఏ కర్తవ్య నిర్వహణకై మీరు నిర్దేశితమై ఉన్నారో, మీరు స్వయంగా కనుగొన్ననాడు, మీ ద్వారా జరగవలసిన పని సవ్యంగా జరుగుతుంది.

ఇది కనుగొనేవరకూ మీరు ఎన్నిటి వెంబడిపడి పరుగెట్టినా, ఎన్ని ఉద్యమాలు నడిపినా, ఎన్ని మహత్తర కార్యాలకై ప్రాణం ఒడ్డి పోరాడినా, ఎన్ని ఆటలాడినా, మీరెవరో మీరు కనుగొనే వరకూ ఈ జీవితం మిమ్మల్ని వదలదు. అలా వదలకుండా మిమ్మల్ని పట్టుకోవడం. దాని కాఠిన్యమనుకోండి. దాని కారుణ్యమనుకోండి. కానీ ఈ రోజైనా, ఎన్నివేల లక్షల ఏళ్ళ తర్వాతనైనా, మీరు జీవిత దర్శనం చేసేవరకూ, జీవితం మిమ్మల్ని మరిచిపోదు.

తెలివిగల వానివైతే ఇది గ్రహించి, ఇప్పుడే అడుగు సరిగ్గా వేయమంటున్నాడు కృష్ణమూర్తి, 'నా కిప్పుడేమి తొందర? నేనింకా అనుభవించాల్సింది చాలా ఉన్నది" అని తీర్మానించుకుంటే, మీకు కృష్ణమూర్తి ఇప్పుడప్పుడే ఉపయోగపడడు.

***ఆంధ్రప్రభ 17-5-1996***



మరొకరితో నిజమైన సంబంధం నెలకొనాలంటే - ఆకాంక్షా పరత్వమూ, అనుమానమూ, పోటీ పడే లక్షణాలూ, తన స్వాధీనంలో ఉంచుకోవాలనే అభిలాష, ఆగ్రహం, వైఫల్యభావం పూర్తిగా లేని పక్షంలోనే సాధ్యమవుతుంది

# "చూపు" ఆవశ్యకత

చూడకుండా ఏమీ గ్రహించలేవు; ఏదీ అర్థంకాదు. అయితే ఈ 'చూడడానికి కళ్ళు అక్కరలేదు. ఒకప్పటి వేదాంతులు, ప్రపంచ వ్యామోహంలో పడేసే ఈ భౌతికమైన కళ్ళు నిజమైన చూపుకు ఆటంకమని కూడా భావించిన సందర్భాలున్నాయి. అలా అనుకున్నప్పుడు కళ్ళను పూర్తిగా మూసుకోడమో, సగం మూసుకోడమో చేస్తుండేవారు. కానీ ఆధునిక జీవన విధానంలో ఇలాంటివేవీ చేయగలిగిలేము. ఈ పద్ధతులు అంత ప్రయోజనమైనవి కాదు కూడాను.

మనమనుకున్నట్లు నువ్వు చూడనేరిస్తే, నువ్వెంత బంధితుడవో, ఎంత అస్వతంత్రుడివో, మిగతా లోకులంతా కూడా నీలాగే ఎంత దుఃఖితులో ఎంత యాంత్రిక జీవులో నీకే తెలుస్తుంది. అలాగే 'వినడం' కూడాను. చెవులు అన్ని శబ్దాలనూ వింటూనే వుంటై. కానీ నీలోని నీ సొంత గొడవ విస్మరించి ఈ లోకంలోని శబ్దాలను చెవి ఒగ్గివింటే, జీవులుపడే వేదన యావత్తూ వినిపిస్తుంది. వారి యాతనా, నీ యాతనా, వారి శోకమూ నీ శోకమూ వేర్వేరు కావు. మానవ చైతన్యమంతా ఒకటే కాబట్టి. అనుభవించే దుఃఖంలో తరతమ భేదాలుండవచ్చు కానీ, దుఃఖాన్ని దాటినవాడంటూ ఉండదు. అశాంతి, అసంతృప్తి, ఆందోళన ప్రారంభమైనప్పుడు, మానవుడు ఏ దేశానికి చెందినవాడు, ఏకాలానికి చెందిన వాడు అనే ప్రశ్నతో నిమిత్తంలేదు. రామాయణకాలం నుండి, 'పిరమిడ్లు' వెలసిన కాలం నుండి, ఇంకా అంతకుముందు నుండైనా, దుఃఖాన్ని తప్పించుకున్న మానవుడులేడు.

లేనేలేరని కాదు. ఏ కొద్దిమందో ఎప్పుడూ ఉంటూనే వుంటారు. అయితే ఈ తరణోపాయం కనుగొనడానికి 'చూడాలి, వినాలి, గమనించాలి.' ఈ ప్రక్రియ చేపట్టడానికి గ్రంథ విజ్ఞాన మవసరంలేదు. ఇప్పటికే నీవు ఏవేవో 'ఆధ్యాత్మిక' గ్రంథాలు చదివుంటే, ఆ విజ్ఞానమంతా వదిలించుకోవాలి. అదేకాదు, నీ పూర్వానుభవమంతా విసర్జించాలి. "ఇదంతా చాలా కష్టంగా ఉండేట్లుంది. ఏదైనా సులభమైన మార్గం వెతుక్కోవాలి. ఎవరో ఒక గురువు నాశ్రయిస్తాను" అంటావు.

నిజమైన గురువైతే, 'ఈ మొత్తానికి మృతి' చెందడమెలాగో నేర్పుతాడు. మృత్యువే నీ గురువైతే ఫరవాలేదు. నచికేతుడుకి నేర్పినట్లు విద్య బాగానే నేర్పుతాడు. కానీ సాధారణంగా గురువులు ఏవో కొన్ని ఓదార్పు వాక్యాలు చెప్పి పంపిస్తారు. ఆయన ఉన్నది ఉన్నట్లు, నిర్మొహమాటంగా నిష్కర్షగా మాట్లాడితే, నువ్వు ఆయన వద్ద ఎన్నాళ్లు శిష్యరికం చేస్తావు? మిగతా అందరు శిష్యులు మాత్రం అక్కడ ఎన్నాళ్ళుంటారు? 'సూక్ష్మంలో మోక్షం' అనే గురువులకే ఎక్కువ చెల్లుబాటు.

గురువు "ఇంత కోపం పనికిరాదు. వదిలేయాలి' అంటాడనుకోండి. ఆయన కోపాన్ని ఖండించాడు కాబట్టి దానిని వదిలేయాలనుకున్నావ్. 'నూతన సంవత్సరారంభం నుండి కోపం మానేస్తాను' అని తీర్మానించుకున్నావ్. నీవు తీర్మానం చేయగానే కోపం పోతుందా? అణగతొక్కవచ్చు. కానీ నిర్మూలనం కాదు. విజృంభించడానికి సమయం చూచుకొని, మళ్ళీ ప్రజ్వలిస్తుంది. కోపం వేరు, నువ్వు వేరుగా ఉన్నావో లేదో ఎప్పుడైనా గమనించావా? తీరా కోపం పుట్టుకొస్తున్నప్పుడు, నువ్వూ నీ తీర్మానం ఏమైనట్టు? కోపం ప్రత్యేకంగా కనిపిస్తున్నది; నువ్వు అనేది ఊహించుకున్నది. 'నువ్వు' అనేది నిజమైతే, కోపాన్ని నువ్వు అదుపులో పెట్టగలిగి వుండాలి కదా? పెట్టలేకపోతున్నావంటే, ఆ సమయంలో 'నువ్వు' అక్కడ లేవన్నమాట. కోపం వచ్చినప్పుడల్లా, దురాశ కలిగినప్పుడల్లా, కామం పెరిగినప్పుడల్లా, లోభంలో చిక్కుకున్నప్పుడల్లా, లేకుండి, జరగవలసిన హాని జరిగిపోయిన తర్వాత 'తగుదునమ్మా' అంటూ బయలుదేరి వచ్చే ఉత్తమమైన 'నువ్వు' లేక 'నేను' ఎవరు? ఈ వస్తువుకు నిజానికి ఉనికి లేదేమో? కోపమూ, లోభమూ కలిగిన వేళలో, వాటిలోని ఒక శకలం, ఇవతలకు వచ్చి నుల్చొని, 'ఈ కోపాన్ని నేను అదుపులో పెట్తాను చూస్తుండు' అంటున్నదేమో? అంటే కోపంలోని ఈ తునక, దాని గుణమే కలిగుండి, సంఘ మర్యాదను పాటించడానికి దానిని అదుపులో పెట్తానని ప్రకటిస్తున్నది. కపటంతో కూడిన మోసపూరితమైన ఈ ప్రవర్తనతో సంఘంలో పెద్ద మనిషిగా చెలామణి అవవచ్చు కానీ, నీలో కోపమేనాటికీ పోదు.

ప్రత్యక్షంగా కనిపిస్తున్నది కోపమే కాబట్టి, అదుపులో పెట్టే నువ్వు ఊహామాత్రుడే కాబట్టి, మనమీ కోపాన్నే లెక్కకు తీసుకుందాం. ఇది నీలో జనించినటువంటిది కాబట్టి,

దీనివంక జాగ్రత్తగా చూడు. అదుపులో పెట్టటానికి ప్రయత్నం చేయవద్దు. ఖండించవద్దు. సమర్థించవద్దు. వివశుడివై అది చెప్పినట్లల్లా చెయ్యవద్దు. శాంతమైన మనస్సు ఉండాలని ఆదర్శం ప్రతిపాదించవద్దు; ఏ శ్లోకాలూ పఠించవద్దు. దానివంక చూడు. అది నిన్ను ఏమేమి చేయించడానికి పురికొల్పుతున్నదో, అది ఎంత ఉధృతితో సెగలు పొగలు కక్కుతూ పైకి లేస్తున్నదో, అది ఆదేశించిన తీరుగా నువ్వు ప్రవర్తిస్తే నిన్నది ఏ స్థితికి చేరుస్తుందో, 'చూడు'. అదుపుచేయడానికి ప్రయత్నించవద్దు, నిశ్చలంగా, ఆలోచనారహితంగా, దాని స్వరూప స్వభావాలన్నీ గమనించు. ఇంత 'సంపూర్ణమైన చూపు' నీలో నెలకొంటే, కోపము, దాని నుండే ఒక తునకగా విడివడి దానిని కంట్రోల్ చేస్తాననే ఉత్తరకుమారుడి లాంటి 'నువ్వూ' ఇద్దరూ కూడా కుప్పకూలుతారు.

అయితే ఇది చేసి చూడవలసినదే కానీ, తర్కిస్తూ కూచోదగింది కాదు. కోపం నుండి విముక్తి చెందడం ప్రధానమంటావా కోపాన్ని గురించి గ్రంథం చదవడమో, రాయడమో, ముఖ్యమంటావా?

'ఇంతమాత్రంతోనే కోపం నశిస్తుందా? అంత సులభమైతే, మిగతావారంతా ఎందుకు వదులుకోలేకపోయారు? ఎంతో సాధన చేయాలంటారు. మహా మహా వారే కోపం పోగొట్టుకోలేకపోయారు. అయినా మనకంత శక్తి ఎక్కడుంది?" అని తోసెయ్య వచ్చు. అంటే మీ కోపం మిమ్మల్ని అంతగా బాధించటంలేదు అన్నమాట. కోపం వచ్చినప్పుడల్లా నీకు అందులో ఏదో కొంత సుఖమున్నది. ఇతర్లమీద కోపం తెచ్చుకున్నప్పుడూ, ద్వేషించినప్పుడూ, ఆఖరికి పై అధికారి కోపానికి గురయినప్పుడు కూడా, 'ఏదో సాడిస్టిక్, మాసోకిస్టిక్' సుఖం కలుగుతున్నది. మధ్యమధ్యలో 'ఈ కోపం మంచిది కాదండి. పోగొట్టుకోవాలండి' అని రివాజుగా అంటూ వుంటావు కానీ, దాని నుండి పూర్తిగా విముక్తి చెందాలని లేదు. నీకు శక్తిలేక కాదు. ప్రతి మనిషికీ, అతడి బలంతో, ఆరోగ్యంతో నిమిత్తం లేకుండా, విముక్తి చెందగలిగిన శక్తి ఉండనే ఉంది. అయితే ఆ శక్తిని సమాహితం చేసి, దీనివంక చూడాలనే ఇచ్ఛలేదు.

అటువంటప్పుడు ఎవరేమి చేయగలరు? "బెటర్ లక్ నెక్స్ట్ లైఫ్" అని పూరుకోవలసి ఉంటుంది.

***ఆంధ్రప్రభ 15-10-1996***

# విద్యార్థులపై ఎనలేని ప్రేమ

జి.వి.ఎస్. ఎవరికో ఒక గ్రంథం బహూకరిస్తూ రాసిన వాక్యాలివి : "కృష్ణజీ అద్భుత ప్రసంగాలను ఆనందంతో అలకించాం. పదిమందికీ తెలియజేశాం. ఆచరించాం. ఈ బోధ మీకూ మీ పిల్లల సంక్షేమానికి జీవితాంతం ఉపకరించేటువంటిది.

ఇంతకన్నా కోరుకోదగినదేముంది?

ప్రేమతో

జి.వి.ఎస్.

విద్యను ప్రేమించడమే కాక, ఆ విద్య నేర్చే విద్యార్థులను కూడా అమితంగా ప్రేమించి తరించిన విశిష్ట వ్యక్తి శ్రీ గడ్డమానుపు వెంకట సుబ్బారావు. సర్వసామాన్యంగా జీవితం పొడుగూతా అందరిచేతా జి.వి.ఎస్. అని పిలువబడుతుండేవాడు. తన విద్యార్థులందరినీ, జన్మనిచ్చిన ఏ జనకుడూ చూడనంతటి ప్రేమతో చూచేవాడని అందరూ అనుకోవడానికి కొన్ని కారణాలున్నాయి.

సుబ్రహ్మణ్యమనే ఆయన రిషీవాలీ స్కూలులో ప్రవేశించి, జి.వి.ఎస్. వద్ద పనిచేయడం మొదలెట్టినపుడు తన అనుభవం ఇలా చెప్పుకొస్తాడు : "జి.వి.ఎస్. వద్ద అంతకుముందు కాలంలో చదువుకున్న పాత విద్యార్థుల నుండి వచ్చిన ఓ ఉత్తరాల కట్టను నా ముందువేస్తూ, 'వాటిల్లో వేటి వేటికి మనం వెంటనే సమాధానాలు రాయాలో, అలాంటివన్నీ ఏరి ఇవతలపెట్టు' అని చెప్పారు".

"ఒక్కొక్క ఉత్తరం కవరు చింపి చదువుతూ ఉంటే, కొన్నిట్లో కొందరు ఆయన్ని, డియర్ ఫాదర్ అని సంబోధించడం చూశాను. ఇది ఏ కాథలిక్ స్కూల్లోనో అయివుంటే ఆశ్చర్యపడవలసింది ఏమీలేదు. అక్కడి హెడ్‌మాస్టర్లు, జెసువిట్‌లు కాబట్టి అలాంటి సంబోధన సహజమే. కానీ ఇక్కడ ఈయనని ఇలా సంబోధించడానికి కారణం లేదు. చిన్నప్పుడే తల్లిదండ్రులను పోగొట్టుకున్న విద్యార్థులు, ఈ రిషీవాలీలో చదివినప్పుడు, తాము చిన్నతనంలో నోచుకొనని ప్రేమాభిమానాలు ఈయన దగ్గర లభించేవి కాబట్టి

ఈయనను తండ్రీ అని సంబోధించే వారనుకుంటాను" అంటూ సుబ్రహ్మణ్యం ఓ మంచి సూచన చేస్తాడు. జి.వి.ఎస్. పేరిట ఒక చక్కని అనాథశరణాలయం కట్టిస్తే అదే మన మాయనకు అర్పించగల్గిన ఘనమైన నివాళి అంటాడు.

ఒకవిధంగా చూస్తే, అనాధులకే కాక, తనవద్ద చదువుకునే విద్యార్థులందరికి జి.వి.ఎస్. తండ్రిలాంటివాడే ననడంలో సందేహంలేదు. ఆయనకు భార్యా, పిల్లలు లేరు. అటు భారతమాతనూ, ఇటు విద్యాసరస్వతినీ ఆరాధిస్తూ, తనజీవితాన్ని వీరిద్దరికే అర్పించాలనే దీక్షపూని వివాహం మానేసినవాడు. ఈ మాట తల్లిదండ్రులకు ఖండితంగా చెప్పేసరికి, వారు చాలా నిరాశకు గురయ్యారు. ఆ జననీ జనకులకు కలిగిన సంతానంలో మిగతా అందరూ మృతిచెందగా, ఒక్క సుబ్బారావు మాత్రమే బతికి బట్టకట్టాడు. పెళ్ళిచేసుకొని పిల్లాపాపతో తమకు ఆధారంగా ఉంటాడనుకున్న ఈ కొడుకు తన ప్రతిన తెలియచేసేసరికి వారు చాలా బాధపడ్డారు. పుత్రుడిపై మమకార మొకవంకా, అతడి మొండిపట్టుదలకు ఆగ్రహం మరొకవంకా, వారిని చాలా మానసిక సంఘర్షణకు లోనుచేసింది. వంశం పేరు కూడా నిలవకుండా పోతుందనీ, మోక్షప్రాప్తి ఉండదనీ చింతించారు. చివరకు తల్లి సుబ్బమ్మ వినుకొండలో తమ ఇంటిముందే, సీతారామాంజ నేయులుకు ఒక ఆలయం కట్టించి, తనకున్నదంతా ఆ దేవాలయానికి రాసేసింది; సుబ్బారావు ఏమీ అనుకోలేదు.

విద్యార్థుల హృదయాల్లో జి.వి.ఎస్. మీద అంత ప్రేమ ఎందుకుండేదో కొన్ని కొన్ని సంఘటనలు చూస్తే తెలుస్తుంది. ఒకసారి సమ్మర్ వెకేషన్ అయిన తర్వాత స్కూలు తెరచారు. కావలసిన వంటసామగ్రి, స్టేషనరీ అంతా సమకూర్చుకోడమయింది. క్రీడారంగానికి అవసరమైన వస్తువులు కూడా సేకరించుకున్నారు.

స్కూలు తెరిచిన తర్వాత, పిల్లలు సాయంత్రం అల్పాహారం సేవించి, దుస్తులు మార్చుకొని ప్లేగ్రౌండ్‌లోకి వచ్చారు. టీచర్లు, అంపైర్లు, పర్యవేక్షకులుగా హాజరయ్యారు. కొందరు విద్యార్థులు ప్లే ఫీల్డ్ అంచున కూచుని, జరిగే ఆటను చూస్తునో తమలో తామే చిన్న ఆటలు కల్పించుకొనో, ఏదో కాలక్షేపం చేస్తున్నారు. జి.వి.ఎస్. అటువంకకు వచ్చినప్పుడు ఆ పరిస్థితిని చూచాడు. ఆయన దృష్టిలో విద్యార్థులంతా ఆటల్లో

పాల్గొనాల్సిందే. అడగలిగిన వారూ ఆడలేనివారూ అనే భేదాన్ని పాటించేవాడు కాదు. ఒక ఆటలో కాకపోతే మరో ఆటలోనైనా పాలుపంచుకోవాల్సిందే. 'నేను ఏ ఆటా ఆడను' అనే అవకాశమిచ్చేవాడు కాదు.

హాకీ గ్రౌండ్‌వద్ద కొందరిలా ఊరకే ఎందుకు కూచోనున్నారని అక్కడి టీచర్‌ని అడిగాడు. ఆ పిల్లవాళ్ళకు హాకీ స్టిక్‌లుకొనే డబ్బు లేకపోయిందనీ, హాకీ కర్రలు వ్యక్తిపరంగా ఎవరికివారే కొని తెచ్చుకోవాలి కాబట్టి, చేసేదేమీలేక, ఇవతల కూచొని చూస్తున్నారనీ టీచర్ చెప్పాడు.

"అదేమిటి? పిల్లలకు హాకీ కర్రలిచ్చి తీరాలి. అయ్యే ఖర్చు వారి వారి ఎకౌంట్‌కు లెక్క రాయండి. వారి పేరెంట్స్‌కు ఉత్తరాలు రాసి, ఆ ఖరీదును తర్వాత రాబట్టుకోండి" అని ఆదేశించాడు. మర్నాటికల్లా ఆ పిల్లలందరూ తమ తమ సొంత హాకీ స్టిక్‌లతో ఫీల్ట్‌లోకి ప్రవేశించి, బయటి ప్రపంచాన్ని విస్మరించి, ఆటలో మునిగిపోయారు.

అయితే 'ఈ హాకీ స్టిక్ ఖరీదు ఇంత' అని ఏ పేరెంట్స్‌కు తెలియజేసి ఖరీదు వసూలు చేసి ఉంటారు? ఉత్తరాలు రాసినట్లే, వెచ్చించిన మొత్తమంతా తెప్పించినట్లే అనుకోవాలి. వాస్తవానికి 'జి.వి.ఎస్.' అనే 'పేరెంటు' ఆ ఖర్చు యావత్తూ భరించి చడీ చప్పుడూ లేకుండా ఉండిపోయాడు.

థియోసాఫికల్ సొసైటీ అనుబంధంగా నడిచిన అడయార్ స్కూలును జి.వి.ఎస్. నిర్వహిస్తున్న రోజుల్లో అక్కడ చదువుకొని, సేలంలో వైద్యుడిగా స్థిరపడిన డాక్టర్ ఎస్.ఆర్. రాజారామ్ ఇలా చెప్పుకొస్తాడు. "జి.వి.ఎస్. అదుపాజ్ఞల్లో చదువుకుంటూ అడయార్ స్కూల్లో ఇంటర్ పూర్తిచేసిన తర్వాత, కొన్నాళ్ళ అనంతరం జి.వి.ఎస్.ను చూచిపోవడానికి ఆయన వద్దకు వెళ్ళాను. "మెడికల్ కాలేజీలో చేరలేదేమి?" అని అడిగాడు. నా ఆర్థిక పరిస్థితులు అనుకూలం కాదని ఆయనకు తెలియజేశాను. "నాకెందుకు చెప్పలేదు?" అని కోప్పడ్డంత పనిచేశాడు.

డాక్టర్ ఎస్.ఆర్. రాజారామ్ ఆర్థిక పరిస్థితుల కారణంగా చదువుకు స్వస్తి చెప్ప రాదన్న ఉద్దేశంతో జి.వి.ఎస్. ఆయనకు అప్పటికప్పుడు ఓ 'చెక్' రాసి ఇచ్చాడు.

"నేను కాలేజీకి వెళ్ళి వాళ్ళనడిగితే, సమయానికి నేను ఫీజు చెల్లించనందువల్ల నా సీటు కోల్పోయానని, నా పేరు తర్వాత వెయిటింగ్ లిస్ట్‌లో ప్రథమంగా ఉన్నవాడికి, ప్రిన్సిపల్ ఆఫీస్‌కి వచ్చి ఆ సీటు కేటాయిస్తాడనీ అన్నారు. కానీ జి.వి.ఎస్.కు మా విద్యార్థుల మీద వున్న ప్రేమ ఎటువంటిదో కానీ ఆ రోజు ప్రిన్సిపాల్ ఏ కారణంచేతో ఆఫీస్‌కి రాకపోవడం, సీటు కాలేజీవారు నాకే ఇవ్వడం తటస్థించింది.

ఈనాడు స్టెతస్కోపు అందుకున్నప్పుడల్లా జి.వి. సుబ్బారావు పేరే చెవుల్లో మార్మోగుతూ ఉంటుంది" అని అంటాడు డాక్టర్ రాజారామ్.

విద్యాపరంగా గానీ, సాంఘిక ఆర్థిక విషయాలలో గానీ, శ్రీ సుబ్బారావుకు అసమానతలు గిట్టేవికాదు. కులమత జాతి భేదాలు, ఆఖరికి లింగభేదాలు కూడా పాటించ నిచ్చగించే వాడు కాదు. ఆయన ఆధ్వర్యంలో ధనిక నిర్ధన భేదం ఉండేదికాదు. చిన్నతనం నుండి అతడిలో గాఢంగా నెలకొన్న థియోసాఫికల్ ఆదర్శాలు, ఇందుకు కొంతకారణంగా భావించవచ్చు.

1931 సంవత్సరకాలం నుండే హాస్టల్‌లోని విద్యార్థులందరికీ సహపంక్తి భోజనాలే. ఒకమారు మదురై జిల్లాలోని కొంబైలోయ నుండి కొందరు ముస్లిం విద్యార్థులు రిషీవాలీలో విద్యనభ్యసించేందుకు వచ్చారు. వారితోబాటు కొందరు క్రైస్తవ విద్యార్థులు కూడా ఉండేవారు. కులమతా లేమైనప్పటికీ రిషీవాలీలోని విద్యార్థులందరూ కుర్తా ధోవతియే ధరించేవారు. తమమతానుసారంగా వేషం ధరించే వీలులేదు.

భోజనాలు, టిఫిన్ పదార్థాలు వడ్డించడానికి, విద్యార్థులలోనే కొందరు వంటగది లోకి వెళ్ళి, బక్కెట్లలో పళ్ళాలలో వస్తువులను బయటికి తెస్తుండేవారు. వడ్డించిన పాత్ర ఖాళీ కాగానే తీసుకువెళ్ళి వంటమనిషి చేతికి ఇస్తుండేవారు.

ఇక్కడి దక్షిణాది విద్యార్థుల ఆహారంలో గోధుమ పిండి ఉండి తీరాలని, అప్పుడే అది నిజమైన పోషకాహారమవుతుందని సుబ్బారావు అభిప్రాయం. అందుకని ఒకప్పుడు బెనారస్‌లో తనకు పరిచయమైన మహరాజ్ అనే వంటవాణ్ణి రిషీవాలీకి పిలిపించి, అతడి చేత చపాతీలు చేయిస్తుండేవారు. హైందవేతరులైన వారు వంటగదిలోనికి

ప్రవేశిస్తున్నారని మహరాజ్‌కి తెలిసేసరికి. అతడికి చెడ్డకోపమొచ్చింది. వెంటనే జి.వి.ఎస్. వద్దకు వెళ్ళి, "ఏమిటిది?" అని ఎగిరిపడ్డాడు. చెప్పినదంతా విని, జివిఎస్ లోన నవ్వుకుంటూ, నెమ్మదిగా, "అలా జరుగుతున్నదా? నేను వచ్చి చూస్తా ఉండు" అంటూ వంటశాల వద్దకు వెళ్ళి, అక్కడి పరిస్థితి గమనించి, తాపీగా వడ్డనకై తీసుకువెళ్ళే పాత్రలు, గరిటెకాడలు వంటగది బయట ఉంచి, వడ్డించేవారు తమ పాత్రల్ని నింపుకోవలసివచ్చినప్పుడల్లా, వంటవారే ఆ పాత్రలు నింపేట్లు, విద్యార్థులు వడ్డించి వెనక్కు తెచ్చిన పాత్రలు వంటగది బయటే ఉంచేట్లు ఏర్పాటు చేశాడు. చపాతీల మహరాజ్ శాంతించాడు!

1951 సంవత్సరంలో, అక్టోబరు 29న జి.వి.ఎస్. జన్మదిన వేడుకలు జరుపు కుంటున్న సమయంలో, మద్రాసు కాంగ్రెస్ మంత్రివర్గంలో మంత్రిగా నున్న నీలం సంజీవరెడ్డి, ప్రథమంగా అడయార్ స్కూలులో శ్రీ సుబ్బారావు వద్దనే చదువుకున్న సంగతి ఎవరో ప్రస్తావించగా, "అలాగైతే నాగిరెడ్డి (మార్క్సిస్టు నాయకుల్లో తీవ్రవాదిగా రూపొందిన శ్రీ తరిమెల నాగిరెడ్డి – సంజీవరెడ్డి బావమరిది) కూడా నా శిష్యుడే" అని నవ్వేశాడు సుబ్బారావు. అంటే, తాను ఏ విద్యార్థిమీద కూడా తన రాజకీయ అభిప్రాయాలు రుద్దలేదనీ, ఎవరెవరు ఏఏ రకంగా వికసిస్తారో, అదివారి లక్షణాలను బట్టి ఉంటుందనీ, తాను తన విద్యార్థులకు కల్పించేదల్లా వ్యక్తిగత వికాసానికి ఒక అవకాశం మాత్రమేనని జి.వి.ఎస్. ఉద్దేశం.

ద్వితీయ ప్రపంచ సంగ్రామ కాలంలో మదనపల్లి సబ్ కలెక్టర్ 'వార్‌ఫండ్' వసూళ్ళకై రిషీవాలీ స్కూలుకు వచ్చాడు. విద్యార్థుల నుండి వసూళ్ళు చేయడానికి ప్రిన్సిపల్ జివిఎస్ సహాయ మభ్యర్థించాడు. జివిఎస్ తానక్కడి పిల్లలందరికీ తండ్రిలా వ్యవహరిస్తుంటాననీ, అసలు తల్లిదండ్రుల నడుగకుండా, వారి అనుమతి లేకుండా, ఈ పిల్లలవద్ద డబ్బు వసూలు చేయడం తనకు సమ్మతం కాదని అన్నాడు. అయితే స్కూలు టీచర్లనూ, ఉద్యోగులనూ అడిగి వారి నుండి వసూళ్ళు చేద్దామన్నారు సబ్ కలెక్టర్. తాను స్టాఫ్ మెంబర్ల వద్దనుండి ఎప్పుడు ఏ రకమైన వసూళ్ళు చేసిన వాణ్ణి కాదన్నాడు జి.వి.ఎస్. "మీరేదైనా ఇవ్వండి" అన్నాడు సబ్ కలెక్టర్. "ఇది భారతీయుల

యుద్ధం కాదు కదండీ. అందుచేత నే నివ్వజాలను" అన్నాడు జి.వి.ఎస్. అప్పుడు ఆ ఆఫీసర్ స్త్రీ విద్యార్థుల హాస్టల్ వద్దకు వెళ్ళి, వారికి నేరుగా విజ్ఞాపన చేసి వసూళ్ళు చేద్దామని అటువైపు బయలుదేరగా, "అటు మగవాళ్ళు వెళ్ళే వీలులేదండీ" అని చెప్పేశాడు జి.వి.ఎస్.

ఒకమారు అప్పటి రాష్ట్ర గవర్నర్ సర్ ఆర్థర్ హోప్, చిత్తూరు జిల్లా పర్యటన సందర్భంగా రిషీవాలీ కూడా రాదలచుకున్నాడని, చిత్తూరు కలెక్టర్ జివిఎస్‌కు రాశాడు. ఏ ఉత్సాహమూ చూపించకపోగా, జివిఎస్ అందుకు సమాధానం "అలాంటి విజిట్‌కు అయ్యే నాలుగైదు వందల రూపాయల (అప్పటి రూపాయి) ఖర్చు తన స్కూల్ భరించగలిగి లేదనీ, ఆ మొత్తాన్ని మరేదైనా విద్యాభివృద్ధి కార్యక్రమానికై వెచ్చించుకోవలసి ఉంటుందనీ రాసేసి ఊరుకున్నాడు.

వినుకొండ, గుంటూరు, మద్రాసుల్లో విద్యాభ్యాసం చేసిన శ్రీ గడ్డమానుపు వెంకట సుబ్బారావు 1911 నాటికే, అంటే తన ఇరవై ఒకటవ ఏట నుండే అనీబిసెంటు అభిమానాన్ని చూరగొన్నాడు. జాతీయ విద్యావిధానం పేరిట ఆమె ప్రారంభించిన స్కూళ్ళను నిర్వహిస్తూ, రిషీవాలీ స్కూలుకు ప్రథమ ప్రిన్సిపల్‌గా పనిచేశాడు. అటు తర్వాత మద్రాసులో బాలభారతి స్కూలు స్థాపించి కొంత కాలం నిర్వహించి, అడయార్ థియాసాఫికల్ సొసైటీలో 1975లో ప్రశాంతంగా కన్నుమూశాడు.

శ్రీ జిడ్డు కృష్ణమూర్తికి ఈ వార్త తెలియజేసినప్పుడు, "శివరావును (భారత రాజ్యాంగ చట్టం ముసాయిదా తయారుచేసిన బి. శివరావు) సుబ్బారావును (జివిఎస్) నేను నా చిన్నతనం నుండీ ఎరిగున్నాను. రిషీవాలీని నిర్మించిన ప్రథముల్లో సుబ్బారావు ఒకరు. పాత స్నేహితులందరూ కాలగర్భంలో కలిసిపోతున్నారు. చివరి రోజుల్లో ఎక్కువ బాధపడ లేదని ఆశిస్తున్నాను" అని రాశాడు. విద్యగరపే విషయంలో శ్రీ సుబ్బారావు, కృష్ణమూర్తి, సుదీర్ఘ చర్చలు జరుపుతుండేవారు, ఈ విషయమై వారి అభిప్రాయాల్లో చాలా సామీప్యం, సారూప్యం ఉంటుండేవి.

*ఆంధ్రప్రభ 11-3-97*

# కృష్ణమూర్తిత్వం

భారతీయ కాలమానాన్ని అనుసరించి శ్రీ జిడ్డు కృష్ణమూర్తి గారి నూట రెండవ "జన్మదినం" మే మాసం పదకొండవ తేదీ 1997. కానీ 1895లో మే 11వ తేదీన ఆయన రాత్రి పన్నెండున్నరకు జన్మించినందువల్ల పాశ్చాత్యులు తమ కాలమానం ప్రకారం ఆయన జన్మదినాన్ని పన్నెండవ తేదీగా భావిస్తుంటారు. "ఈ బోధనే ప్రధానమయింది. ఈ వ్యక్తి కాదు సుమా" అని ఆయన ఎంతగా చెప్పినా ఆ చెప్పినమాట నిజమేనని ఎంతగా అనిపించినా ఆ మనిషిని ఎరిగున్న వాళ్ళం, ఆ దివ్యసుందర మూర్తిమత్వాన్ని పూర్తిగా విస్మరించలేము కదా?

స్వతహాగా కృష్ణమూర్తి చాలా మొహమాటస్తుడు. సత్యాన్ని ఎంత నిర్మొహమాటంగా ఎవరితోనూ సమాధానపడకుండా ఎంత నిక్కచ్చిగా ప్రకటించేవాడో స్వవిషయం వచ్చినప్పుడు అంత సిగ్గరి; అంత వెనక్కితగ్గి నుంచునేవాడు. కృష్ణమూర్తిని వరల్డ్ టీచర్‌గా తర్ఫీదు చేస్తున్న రోజుల్లో అంటే ఆయన యవ్వనంలో ఆయన్ను ఎన్నో కోణాల నుండి ఫోటోలు తీయడం జరుగుతుండేది. కానీ అటు తర్వాతి కాలంలో కొన్నేళ్ళపాటు ఆయన ఫోటోలు తీయడానికి అనుమతించేవారు కాదు. మధ్య వయస్కుడిగా ఉన్నప్పటి ఆయన ఫోటోలు అట్టే లభ్యంకావు. ఒక దశలో తాను పదిమంది ముందూ కనిపిస్తూ ప్రసంగించే బదులు ఒక తెర వెనకాల నుండి ప్రసంగిస్తే ఎలా వుంటుంది. అనే ప్రయోగం కూడా చేసి చూశాడు. కానీ అలా చేయడం మరీ కృతకంగా వుంటుందని, ఆ పద్ధతికి స్వస్తిచెప్పి తెరతీసేసి శ్రోతలకు కనిపిస్తూ ప్రసంగించనారంభించారు.

చాలా కాలానికిగానీ మైకులు వాడే ప్రసక్తి ఉదయించలేదు. అప్పటి రోజుల్లో ఆయన ప్రసంగాలను రికార్డు కూడా చేసేవారు కాదు. 1933 నుండి 1967 వరకు అంటే ఆయన డెబ్భై రెండవ సంవత్సరం వరకు చేసిన ప్రసంగాలన్నీ షార్ట్‌హ్యాండ్ నోట్స్ ఆధారంతో జాగ్రత్తగా టైప్‌చేసి పరిశీలనానంతరం (Verbatim Talks) (ఆలకించిన శ్రోతలకు మాత్రమే) అంటూ "వసంతా ప్రెస్"లో అచ్చువేస్తుండేవారు. కృష్ణమూర్తి

సాధారణంగా ఆంగ్లంలో ప్రసంగించేవారనే మాట అలా వుంచి ఆయనకు ఫ్రెంచి ఇటాలియన్ భాషలలో ధారాళంగా ప్రసంగించగలిగిన శక్తి వుండేది. స్పానిష్ భాషను కొద్దిగా మాట్లాడేవారు. భారతదేశపు ఉత్తరాది భాషలేవీ ఆయనకు రావు. కానీ చిన్నతనంలో తమిళుల మధ్య తిరుగుతుండేవాడు కాబట్టి తమిళ మర్థమవుతూ వుండేది. తమ్ముడు నిత్యానంద కృష్ణమూర్తితో థియోసాఫికల్ సొసైటీలోనూ పాశ్చాత్య దేశాల్లోనూ, తోడుగా వుండేవాడు కాబట్టి, అతడు బ్రతికున్నంత కాలం, వాళ్ళిద్దరూ మాతృభాష అయిన తెనుగులోనే మాట్లాడుకునేవారు. కానీ 'నిత్య' మరణించిన తర్వాత తెనుగు భాష మాట్లాడే వారెవరూ లేనందువల్ల కృష్ణమూర్తి సంభాషణల్లో మాతృభాష మరుగునపడజొచ్చింది; దాదాపు పూర్తిగా విస్మరించారు.

మాతృ భాషతో సహా మరెన్నో స్వవిషయాలు స్మృతిపథం నుండి తొలగిపోయినా, ఏ చిన్నతనం లోనో ఆయన నేర్చిన సంస్కృత పదజాలం మాత్రం కొంత అలానే వుండిపోయింది. వృద్ధాప్యంలో కూడా, ఎవరైనా సంస్కృత శ్లోకాలు స్వరయుక్తంగా పఠించ నారంభిస్తే, వాటి అర్థాలు తనకు గుర్తులేకపోయినప్పటికీ, తాను కూడా స్వరం కలిపి ఉచ్ఛరిస్తుండే వాడు. ఆ శ్లోకాలను ఎవరైనా ఆలపించడం ప్రారంభిస్తే కొద్దిగా బొంగురుపోయిన గొంతుతో నైనప్పటికీ సమధికోత్సాహంతో ఆ శ్లోకపఠనంలో పాల్గొనేవాడు.

పద్దెనిమిదేళ్ళ వయస్సప్పుడు కృష్ణమూర్తి 'వారెంగి విల్లీ' అనే గ్రామంలో నివసిస్తుండే వాడు. ఆ ఈడుకి అతడి చిన్నతనమంతా అతడికి బాగానే గుర్తుండేది. తన చిన్నప్పటి సంగతులన్నీ ఒక డైరీలాగా రాయడం ప్రారంభించాడు. మనందరి లాగానే జీవితాన్ని ఇలా ఇలా తీర్చిదిద్దుకోగలనని ఊహించి, ఆ డైరీకి "నా యాభైఏళ్ళ జీవితం" అని పేరు కూడా పెట్టుకున్నాడు. తాను జీవితంలో ఎన్ని ఒడిదుడుకులకు లోను కానున్నాడో, ప్రపంచవ్యాప్తంగా ఎందరు థియోసఫిస్టుల కలల్ని భగ్నం చేయనున్నాడో తనకే తెలియదు కాబట్టి, కుదురుగా అలాంటి డైరీలను రోజూ కూర్చుని చక్కగా నింపగలననుకున్నాడు! జరిగినదంతా అందుకు విరుద్ధంగా జరిగింది. కాని అందులోని ఓ పది పన్నెండు పేజీలలో తన చిన్నతనం ఘట్టాలు కొన్ని రాసి ఉంచాడు.

ఒక పేజీలో ఇలా రాసివుంది. “1908లో అడయార్‌కు వచ్చేంతవరకూ, ఓ సామాన్య భారతీయ బాలుడి జీవితమే నేను గడిపాను. నా తండ్రి ఏటా దివ్యజ్ఞాన సమాజ వార్షిక సమావేశాలకు అడయార్ వెళ్తుండేవాడు కాబట్టి, నాకు అడయార్ గురించీ, అక్కడి చెట్టు చేమా గురించి మొదట్నించీ తెలుసు; నాకు అడయార్ అంటే సహజంగా ఆసక్తి వుండేది. మదనపల్లిలోని మా ఇంట్లో, మా తండ్రి థియోసాఫికల్ మీటింగులు చిన్న చిన్నవి నిర్వహిస్తుండేవాడు. కాబట్టి, ఆయన కార్యకలాపాలు, అడయార్ విశేషాలు నాకు ఆయన వద్ద నుండి నా తల్లి వద్ద నుండి తెలుస్తుండేవి.

ఇంట్లో మా తల్లికి పూజకై ఒక గది వుండేది. అందులో ఆమె రోజూ ప్రార్థనలు సలుపుకునేది. దేవుళ్ళ, దేవతల ఫోటోలతోబాటు అనీబిసెంట్ ఫోటో కూడా ఉండేది. ఆ గదిలో బిసెంట్ భారతీయ వస్త్రధారణతో, ఒక చిన్న బల్ల, దానిపై వున్న పులిచర్మం మీద కూచున్న ఫోటో అది.

మా సోదరులు బడికి వెళ్లి చదువుకునే రోజుల్లో నేను తరచుగా ఇంట్లోనే ఉండవలసి వచ్చేది : అందుకు కారణం నేను ఆ కాలంలో తరచుగా జ్వరానికి గురవుతుండడమే. దాదాపు ప్రతిరోజూ జ్వరం కాస్తుండేది. ఇంటిపట్టునే ఉంటున్నందువల్ల మధ్యాహ్నం వేళ మా అమ్మ తన పూజా గృహంలోకి వెళుతుంటే నేనూ ఆమెతోబాటు అందులోకి వెళ్ళేవాణ్ణి. ఆ సమయంలో ఆమె నాతో శ్రీమతి బిసెంటును గురించీ, కర్మ సిద్ధాంతం, పునర్జన్మను గురించీ చెబుతుండేది. రామాయణ మహాభారతాలు తదితర గ్రంథాల నుండి చదివి వినిపిస్తుండేది. నాకప్పుడు ఏడెనిమిదేళ్ళ వయసే కాబట్టి ఆవిడ చెప్పేవన్నీ అంతగా నాకర్థమయేవికావు; కానీ మాటలు అర్థంకాకపోయినా అవన్నీ విని చాలా ఫీలయేవాడి ననుకుంటాను” అని ముగిస్తాడు కృష్ణమూర్తి.

***ఆంధ్రప్రభ 13-5-1997***

# నన్ను గురించి నాకే మాత్రం తెలుసు?

"నిన్ను గురించి నీవు నేర్చుకో" అంటారు శ్రీ జిడ్డు కృష్ణమూర్తిగారు. నన్ను గురించి నేను నేర్చుకోవలసింది ఏముంది? అనే సందేహం మనందరికీ కలగవచ్చు. ఏ మనిషైనా కంప్యూటర్ల గురించి, జ్యోతిషశాస్త్రం, లెక్కలూ, ఫిజిక్సు నేర్చుకుంటారుగానీ, నన్ను గురించి నేను నేర్చుకునేదేమిటి? నన్ను నేను ఎరిగే ఉన్నాను కదా? నన్ను నేను ఎరుగకపోవడ మేమిటి? నేనెవరో నాకు తెలియకుండా ఉన్నానని ఈ మహనీయులు ఎందుకను కుంటున్నట్లు? ఇంత స్వల్పమైన విషయాన్ని గురించి, అంత గంభీరంగా ఉపన్యసిస్తా రేమిటి?

నేనెవరో నాకు బాగా తెలుసు. నడిరాత్రివేళ నిద్రలేపి అడిగినా చెప్పగలను. నా పేరు ఏమిటో, నేనేమి డిగ్రీ సంపాదించానో, ఏ ఉద్యోగం చేశానో, ఎంత సంపాదించానో, నా వంశం ఏదో, నాకు సంబంధించిన వారెవరో అన్నీ చక్కగా తెలుసు. ఇంకా ఏమి తెలుసుకోవాలి? నా మిత్రులెవరో, నేనిష్టపడే వారెవరో నాకు తెలుసు. నాకు ఎవరు అయిష్టమో, ఎవరిని నేను శత్రువులుగా పరిగణిస్తున్నానో, అది కూడా తెలుసు. నాకీ లోకంలో సహాయపడినవారూ, నన్ను తీవ్రంగా బాధించినవారూ అందరూ తెలుసు. ఇంకా తెలుసుకోదగిన దేమున్నది?

నా అలవాట్లన్నీ నాకు తెలుసు. ఎన్నిసార్లు కాఫీతాగుతానో, ఏ వేళకు నాకు భోజనం ఉండాలో తెలుసు. సిగరెట్లు కాల్చడమూ ఎరుగుదును; భయంవల్ల మానేయడమూ ఎరుగుదును. ఏవో కూడని కోర్కెలు మదిలో మెదలడమూ తెలుసు; పదిమందికీ తెలిస్తే ఎలాననే భయమూ ఎరుగుదును. మనసు ఎన్ని విధాలుగా చరిస్తున్నా, సంఘంలో పెద్ద మనిషిలా కనిపించడం భావ్యమూ, లాభదాయకమూ అని ఎరుగుదును. నన్ను గురించి నేనింకా ఏమి తెలుసుకోవాలి?

కొన్ని పనులు చేయరానివని నాకు తెలుసు. అవి చేయాలని నాలో ఎంతగా అనిపించినా, సంఘం హర్షించదు కాబట్టి, చేయను. కొన్ని పనులు, సంఘం

మెచ్చేవాటిని, చేస్తుంటాను. నాకు చిన్నప్పటి నుండి, ఇతరుల మెప్పు కావాల్సివుంది. నా తల్లిదండ్రులు నన్ను చూసి 'భళిరా' అనాలి. నా తోడబుట్టిన వారంతా నన్ను మంచివాడు, త్యాగశీలి అనాలి. వారందరి మెప్పుకై నేనేమైనా చేస్తాను. నాకిష్టంలేనిదైనా, నా మనసు ఎదురు తిరిగినా, వారి మెప్పుకై నేనెంతైనా కష్టపడతాను. వారు మెచ్చుకుంటూ వుంటే నా వంటిపై పన్నీరు జల్లినట్లుంటుంది.

పెద్దయింతర్వాత, ఒకప్పుడు చిన్నతనంలో నా కుటుంబీకులు, మిత్రుల నుండి పొందిన మెప్పే, సంఘం నుంచి కూడా ఆశించడం మొదలెట్టాను. నేనిలా ఇతర్ల మెప్పు కోసం ఎప్పుడూ ఎందుకు ఆరాటం పడుతుంటానో నాకు తెలియదు. ఇది కనుక్కోదగిన విషయమని నాకు యాభై ఏళ్ళు వచ్చిన తర్వాతగానీ అర్థంకాలేదు. అంటే ఈ యాభై ఏళ్ళుగా నేనీమెప్పుకై ఎందుకు తాపత్రయపడుతుండే వాడినో తెలియకుండానే యాంత్రికంగా బ్రతికానన్నమాట.

కాస్త తీరుబడిగా ఆలోచిస్తే, నా బ్రతుకంతా ఈ మెప్పు కోరడం చుట్టే పరిభ్రమిస్తూ వచ్చిందని నాకర్థమవుతున్నది. ఇందుకై ఎంతో ప్రయాసకు గురవుతుండేవాణ్ణి; ఎంత వ్యయానికైనా సిద్ధపడుతుండేవాణ్ణి. ఇతర్లు ఆశించినట్లుగా చేయలేనేమోనని అనుకున్నప్పు డల్లా, నాలో నేనేర్పరుచుకున్న మనోచిత్రం మసిబారిపోతున్నదేమోనని చాలా భీతిల్లేవాణ్ణి. అలాంటి సమయాల్లో ముఖం చాటేసేవాణ్ణి; ఊరుదాటి ఏదో పనిమీద వెళ్ళిపోయేవాణ్ణి. ఏదో అబద్ధం, ఏదో నటన. దీనిని నేను కాపట్యంగా భావించలేదు. మరొకరు ఇలా చేసినట్లైతే, "అమ్మో, ఎంత కాపట్యం!" అని విమర్శించడం మాత్రం బాగా అలవాటై పోయింది. నాలోనే ఈ గుణం వున్నదని అనుమానం వచ్చినప్పుడల్లా ఆ అనుమానాన్ని అణగద్రొక్కి, మరొకరి కాపట్యాన్ని ఇంతగా ఎండగడుతున్న నన్ను కపటిగా ఎవరు భావించ గలరని నా ధైర్యం. ఇంతచేసిన తర్వాత కూడా ఎవరో నా కాపట్యాన్ని బయటపెడితే, అతణ్ణి ద్రోహిగా వర్ణించి, సంఘంలో నాకున్న పలుకుబడితో అతడి నోరుమూయించే వాణ్ణి.

చూడగా చూడగా నన్ను గురించి నాకు తెలియదనే అనిపించ నారంభించింది. "మంచివాడు" అనిపించుకోడానికి చిన్నప్పటి నుండి నేపడ్డ ఈ యాతన అంతా ఎందుకు?

నాకు నేను ఇలాంటి ఆదర్శం ఎందుకు ఏర్పరచుకున్నట్లు? నా సహజ స్వభావంతో బ్రతికితే ఏమై ఉండేది? నేచేసే పనులు కొందరికి నచ్చి ఉండేవి. మరికొందరికి నచ్చక పోయి ఉండేవి. కానీ వీరిమెప్పుగానీ, వారు తప్పు పట్టడంగానీ, నేనెందుకు పరిగణించాలి! నా సహజసిద్ధమైన పద్ధతిలో నేను బ్రతికి ఉంటే, కనీసం ఆత్మ సంతృప్తితో బ్రతికి ఉండేవాణ్ణి కదా? వారి వీరి అభిప్రాయాలు సరకుగొనేవాణ్ణి కాదు గదా? అలా అయివుంటే, నాలో ఈ కాపట్యం ప్రవేశించి ఉండేది కాదుకదా?

నా బ్రతుకునింత అధ్వాన్నం ఎందుకు చేసుకున్నట్లు? లోకులు కాకులు అనే సామెత నాకు తెలియనిది కాదు. కానీ నన్ను విమర్శించినప్పుడే వాళ్ళు కాకులని తోసి పుచ్చేవాణ్ణి కానీ, నన్ను పొగిడినప్పుడు ఆ సామెత గుర్తుకొచ్చేది కాదు. వెచ్చగా హాయిగా ఉండేది. నన్నిట్లు పొగడుతూ, నా ఎదుట నాకు కిట్టనివారిని తెగడుతూ ఉంటే మరింత ఆనందంగా ఉండేది. మనిషినిబట్టి పొగిడి, తెగడే ఈ లోకులు ఎల్లవేళలా కాకులేనని నాకెందుకు స్ఫురించలేదు?

అంటే నన్ను గురించి నాకు చాలా తక్కువ తెలుసన్నమాట. నన్ను నేను కనుక్కో కుండా, ఏవేవో పనులు చేపట్టి నిర్వహిస్తున్నానంటే, ఇందులో ఏ ఒక్కటీ కూడా నాకూ, నా ఆత్మకూ సంబంధించినవి కాదు. ఇతరుల కోసం చేస్తూ వచ్చినవి. నా కోసం, నా నిజమైన శ్రేయస్సు కోసం నన్ను నేను ఉద్ధరించుకోడానికి చేసింది ఏమీలేదు. నా శరీర, మానసిక సుఖం కోసం పదిమందిలో గొప్పవాడిగా పరిగణింపబడేందుకు చేసిన వ్యర్థమైన పనులు. మరి నా ఆత్మ లాభం మాటేమిటి? ఇన్నేళ్ళూ ఇక్కడ వ్యర్థంగా బ్రతికి వెళ్ళిపోతున్నానా? భూమిపై ఈ జీవిత యాత్రలో ఏమీ నేర్చుకోకుండాపోతే, అవతల ఇక నేర్చుకునేదేమీ లేదంటారే? ఉత్తినే కాలాన్ని క్షేపిస్తూ, పశ్చాత్తాపం పడుతూ, కర్మ నాచరించ డానికి కావలసిన సాధన సంపత్తిలేక ఈ శరీరానికి కూడా నోచుకోక, గతించిన అవకాశాన్ని చేజారనిచ్చినందుకు చింతిస్తూ, నిట్టూరుస్తూ ఉండిపోవడమేనంటారే? భూమిపై ఉన్నప్పుడే ఆ సాధుపురుషుల మాటను పెడచెవిని పెట్టకుండా శ్రద్ధగా వినివున్నట్లైతే, ఎలా ఉండేదో? నేర్చుకోగలిగే వాడినేమో?

***ఆంధ్రప్రభ 24-6-1997***

# ప్రేమశాశ్వతత్వం

"ప్రేమను గనుక నిజంగా కనుగొన్నావంటే అది నీలో చెదరకుండా ఉండిపోతుంది. ఆ తర్వాత ప్రేమరహితమైన స్థితి సంభవించడమనేది ఉండదు" అని అన్నారు శ్రీ జిడ్డు కృష్ణమూర్తి, వసంతవిహార్‌లో జరిగిన ఓ చర్చా కార్యక్రమంలో. రెనీవెబర్ అనే అమెరికన్ యూనివర్సిటీ ఫిలాసఫీ శాఖాధిపతి, ఈ మాటకు అభ్యంతరం చెప్తూ "మేము కూడా మా జీవితాల్లో ఆ ప్రేమను ఆడపాదడపా అనుభవించినట్లే తోస్తుంది. కానీ అది ఓ క్షణకాలం మాత్రముండి, ఆ తర్వాత లేకుండా పోవడం జరుగుతుంటుంది. మరి మీరేమో ఈ మాట ఇంత ఖండితంగా తెలియజేస్తున్నారు" అన్నది.

"వచ్చిపోయేదయితే అది నిక్కమైన ప్రేమ అయి ఉండదు" అని తేల్చేశాడు కృష్ణమూర్తి. "అలా అంటే మేమేమి చేయాలో తెలియక ఊరకుండిపోయాం" అని కృష్ణమూర్తి మాటని సందేహిస్తున్నట్టు వ్యాఖ్యానిస్తుంది రెనీవెబర్. కానీ తనకు కలిగిన అనుభవం మానవాళి మొత్తానికి అకస్మాత్తుగా కొన్ని తడవలు కలిగే 'అనుభవం' మాత్రమే కానీ నిజమైన దివ్యానుభూతి, ఆత్మదర్శనం అయి ఉండదని ఆమెకు తెలిసి ఉండక పోవచ్చు. మనిషై పుట్టిన వారినెవరినైనా మహారాజు కానీ నిరుపేద కానీ పండితుడు కానీ పామరుడు కానీ, సజ్జనుడు కానీ పరమ దుర్మార్గుడు కానీ, ప్రతి ఒక్కరినీ ఏదో సమయంలో దైవమనేది రెండుమూడుసార్లు తట్టి లేపడానికి ప్రయత్నిస్తుంది. ఆ క్షణాన ఏదో ఒక అలౌకిక ఆనందం అతడి హృదయాన్ని అలముకుంటుంది అనే మాట నిజమే. అలా సంభవించడానికి ఆ మనిషి ఏ సాధన చేసి ఉండనక్కరలేదు. ఎలాంటివాడైనా, దైవం అతడికోసం ఆ ఆనందం ఎలా ఉంటుందో రుచి చూపిస్తుంది. ఆ సూచన ఆధారంగా మనిషి తనవంతు కృషి ప్రారంభించాలి, సున్నితమైన తన స్పృహను పెంచుకోవాలి. అభిప్రాయాలనేవి మన ఆలోచనా తరంగాల మీద ఆధారపడి ఉన్నవని గ్రహించి ఆ ఆలోచలన్నీ, పరిపూర్ణంకాని మన పూర్వానుభవం నుండే పుట్టుకొస్తున్నాయని అర్థం చేసుకొని, వాటన్నిటినీ పక్కకునెట్టి ప్రతి విషయాన్ని తాజాగా చూడగలగాలి. తనని తాను కచ్చితంగా నిష్కర్షగా ఉన్నది ఉన్నట్లుగా గమనించగలిగి

ఉండాలి. తనలో కనిపించే ఏ ఉద్రేకమైనా, ఏ కోరికైనా ఉత్తమమని సమర్థించుకో కుండా, అధమమని ఖండించకుండా చూడగలగాలి. ఇదంతా ఒక విధానమనుకొని యాంత్రికంగా అలవరచుకొని సాధన పేరిట రోజూ ఇంతసేపు చేస్తానని తీర్మానించకూడదు. ఇది నిజజీవితంలో సహజంగా అంతర్భాగం కావాలి. ఇలా చేయడం ద్వారా ఏదో ఫలితాన్ని ఆశించకూడదు. అలా ఆశిస్తే మనసు ఫలితంమీదనే ఉంటుంది. 'చేయడం' మీద ఉండదు. మురికిని వదిలించుకోడానికి స్నానమెంత అవసరమో, ఆకలి తీరడానికి ఆహారమెంత అవసరమో, తెలివిగా బతకడానికి ఈ చెప్పినదంతా అంతే అవసరం. ఇంతటి ఎరుకతో జీవిస్తే కానీ, మనసు ఇంత నిశ్చలమైతేగానీ, దైవస్ఫురణ ఏర్పడదు. ఇదంతా చేయకుండా, ఎంతమాత్రం కష్టపడకుండా, ఏ నష్టమూ భరించకుండా కృష్ణమూర్తికి కలిగినదే మనకూ కలగాలంటే పొరపాటే అవుతుంది. శ్రమించకుండా, అమూల్యమైనదేదైనా ఇట్టే లభించాలనుకోడం దురాశే మరి!

భగవంతుడిని ప్రేమించేందుకు మనందరికీ హక్కు ఉంది. అలాగే భగవంతుడి సంతతి అయిన మనల్నందర్నీ ఆయన ప్రేమిస్తున్నాడనేది సత్యమే. కానీ నువ్వు ప్రేమించి దైవాన్ని పొందాలనుకుంటే నీ ప్రతి అడుగుకీ ఆయన రెండడుగులు వేసుకుంటూ నీవైపు వస్తాడు గానీ, నువ్వేమీ చేయకుండానే ఆయన నీవద్దకు రమ్మంటే ఎలా కుదురుతుంది? ఆయనను ప్రేమించాలనే సంకల్పమే నీలో లేకపోతే ఆయనేమి చేయగలడు?

మనం దైవాన్ని తలుచుకునేది – కష్టాలు వచ్చినప్పుడు మాత్రమే; వాటిని తొలగించమని ప్రార్థిస్తాం. తొలగించకపోతే నిందిస్తాం. మనకున్న ప్రేమంతా మనమీదనే కానీ, దైవం మీదకాదు. దైవాన్ని కానీ మరొకరిని కానీ, సంపూర్ణంగా ప్రేమించాలంటే ప్రపత్తి కావాలి. త్యాగరాజు, పోతన తదితర మహానుభావుల జీవితాల వంకచూస్తే వారికేది ప్రాప్తిస్తే దానినే సంతోషంగా స్వీకరించినట్లు కనిపిస్తుంది. అంటే వారి భగవత్ ప్రేమకు షరతులు ఏమీ పెట్టలేదన్నమాట. అన్‌కండీషనల్ లవ్ అంటే అదే. హృదయాన్ని భగవదర్పితం చేసి లోకకార్యం నిర్వహిస్తూ ఉండేవారు.

వాగ్గేయకారుడు త్యాగరాజు చేసిన కృషి అంతా దక్షిణ భారతాన రామభక్తి సామ్రాజ్య స్థాపనకు దోహదం చేసింది. పలికించెదువాడు రామభద్రుడంటూ పోతన రాసిన భాగవతం ఆంధ్రదేశంలోని ఆబాలగోపాలం పఠించి భక్తి తన్మయత్వాన్ని పొందే అవకాశం కల్పించింది. భగవత్ ప్రేమికులు ఈ పనులే చేయాలని ఏమీలేదు. వారు ఏ పనిచేసినా అది వారి ప్రేమలో భాగమే. అలాంటి వారు అంట్లు తోమినా, వాకిలి శుభ్రం చేసి ముగ్గువేసినా వారి కర్మేంద్రియాలు ఏమిచేస్తున్నా, హృదయం భగవంతుడిలోనే ప్రవర్తిల్లుతూ ఉంటుంది. ఈ ప్రేమ కలిగిన వారు లోకానికి అపకారం చేయజాలరు.

కాబట్టి ఒకసారి ఈ ప్రేమ సిద్ధిస్తే, లేక నీ లోతుల్లో దీనిని కనుగొంటే అది ఒక సారి ఉండడం మరోసారి లేకుండా పోవడమనేది జరగదు. జిడ్డు కృష్ణమూర్తిగారు చెప్పినదిదే.

ఇదే విషయం విజయనగరం ప్రాంతంలో అనంతయ్య పంతులు పేరిట 1871లో జన్మించి తర్వాతి కాలంలో ప్రకాశానందగా గుజరాత్‌లో సంచరిస్తూ ప్రవచించిన స్వామి ఇలా వివరించాడు: 'ఒకమారు సమాధిద్వారా అవిద్య, అవిద్యాజన్యములైన దుఃఖాలు నశించి బ్రహ్మానందం పొందిన తర్వాత; మరల దుఃఖనివృత్తి కొరకు సమాధిని అభ్యసించడం అసంభవం.

"ఇది ఎట్లానంటే ఒకసారి ఓ బ్రాహ్మణుడు స్నానం చేసేందుకు సరోవరానికి వెళ్ళాడు. స్నానంచేసి తిరిగివస్తూ తన ధోవతిని ఉతుక్కొని పిండి, భుజంమీద వేసుకున్నాడు. ఇంటికి వచ్చిన తర్వాత ఆ ధోవతిని ఆరేసేందుకు విదిల్చాడు. అందులో నుంచి ఓ చిన్న చేపపిల్ల బయటపడి గిలగిలలాడింది. బ్రాహ్మణుడు దయతో ఒక కుండలో నీరుపోసి దానిలో ఈ చేపపిల్లను వేసి, చెరువువద్దకు తీసుకువెళ్ళి, కుండను ఆ నీళ్ళలో వదిలాడు. చేపపిల్ల ఎంతో సంతోషించింది. కుండలో నుంచి చెరువులోకి వెళ్ళడం, మళ్ళీ కుండలోకి రావడం దానికి సంతోషదాయకమైన క్రీడగా పరిణమించింది. రెండుచోట్లా నీరు ఉండడమే ఇందుకు కారణం.

'ఇదేవిధంగా జీవుడికి, బ్రహ్మానికి మధ్యగల తెర పడిపోతే, సమాధి దశలో ఉన్నా, సాధారణ జాగ్రదావస్థతో కూడిన మెళుకువతో ఉన్నా, ఆనందం సమానంగానే ఉంటుంది. ఇక దుఃఖానికి అవకాశమేది?'

శంకర భగవత్పాదుల వాక్యం ఇలా ఉంది. "దేహాభిమానే గలితే విజ్ఞాతే పరమాత్మని యత్ర యత్ర మనోయాతి తత్రతత్ర సమాధాయ" దేహాభిమానం నశించి పరమాత్మజ్ఞానం కలిగిన తర్వాత, మనస్సు వెళ్ళిన ప్రతిచోటకు సమాధికూడా వెళ్తుంది!

*ఆంధ్రప్రభ 23-12-1997*



# ఆప్తవాక్యం

కృష్ణమూర్తి వృద్ధాప్యంలోకి అడుగిడినప్పుడు ఆయనలో కొద్దిపాటి అశక్తత కనిపిస్తుంటే "ఇంతటి ముదిమిలో మీరింకా విసుగూ విరామం లేకుండా ప్రసంగిస్తూ ప్రపంచం చుట్టూ ఈ తిరగాల్సిన అవసరమేమిటండీ?" అని వారూ వీరూ అడిగితే, ఆయన ఒక్కక్షణమాలోచించి 'సింపుల్'గా, సరళంగా, "వాత్సల్యం (Affection) కొద్దీనండి" అన్నారు.

"అయితే మీరొకచోట స్థిర నివాస మేర్పరుచుకుని వారినే మీవద్దకు రానిస్తే సరిపోదూ?" అని మరో ప్రశ్న. "వారిలో ఎక్కువమంది అంతంతటి ప్రయాణపు ఖర్చులు భరించగలిగిలేరు కదండీ?" అనే చింత ప్రకటించారు కృష్ణమూర్తి.

నిజమే మరి...స్వయంగా పూనుకుని ఆ మానవుడు జీవితం పొడుగునా దేశ దేశాలలో పర్యటిస్తూ ప్రసంగిస్తూ తాను దర్శించిన 'సౌందర్యాన్ని' మనందరి మీది అనురాగం కొద్దీ పంచుకుందామని నిశ్చయించుకోకపోతే – కేవలం పుస్తకాల ద్వారా ఆడియో – వీడియో క్యాసెట్ల రూపంలోనే ఆయన్ని చూడగలిగేవాళ్ళం. టేప్ ద్వారా ఆయన్ని చూడడం గానీ, వినడంగానీ, సాక్షాత్తూ మనిషిని ఎట్ట ఎదుట చూచిన దానితో సమానం కాదు గదా? ఆ మనిషే మన ముందుకు వచ్చినప్పుడు ఉప్పొంగి ప్రవహించే అతడిలోని శక్తిని కూడా మనం కొంత పంచుకుంటాం కదా? అటువంటి దర్శనభాగ్యం కలిగించడానికి, ఆయన ఆ జెట్ ప్లేన్ ప్రయాణాలు చేసినప్పుడు తాత్కాలిక అనారోగ్యాలకు గురవుతుండే వారు. "ఇంతగా ఈ ప్రయాణాలు చేయకుండా ఎక్కడో ఒకచోట కదలకుండా ఉండిపోతే శీతోష్ణ పరిస్థితుల మార్పులవల్ల వచ్చే ఒడిదుడుకులకు గురికాకుండా శరీరారోగ్యం ఇంత కన్నా పదిలంగా ఉండేదనుకుంటాను" అని అంటుండేవారు కృష్ణమూర్తి.

వార్ధక్యం పెరుగుతున్న కొద్దీ తన పర్యటనా ప్రదేశాలను, ప్రసంగాల సంఖ్యనూ కుదించుకుంటూ వచ్చారు. కానీ శ్రద్ధగల జిజ్ఞాసువు ఈ ప్రపంచంలో ఎక్కడ వున్నా అతనికి ఏర్పడిన సందేహమెటువంటిదైనా ఆ ప్రశ్నను లేవదీయడమే తడవుగా పృచ్ఛకుడితో

పాటు తానూ అందుకు సమాధానాన్ని వెతకనారంభించేవారు. "ఈ మహానుభావుడికి వెతకడమేమి ఖర్మ" అంతటివాడు దేనికైనా సునాయాసంగా సమాధానం చెప్పగలిగి వుండాలి కదా?" ఆ మహాశక్తిని సతతమూ దర్శించే వ్యక్తికి సమాధానం మంచినీళ్ళ ప్రాయమై వుంటుంది కదా? అని మనమనుకోవచ్చు. కానీ అది అనుకున్నంత తేలికైన విషయం కాదు. నిజ జీవితంలో నుంచి పుట్టుకొచ్చిన సిన్సియర్ ప్రశ్నకు సమాధానం, మహత్తర జీవితం లోతుల నుండి తవ్వి తీయాల్సిందే. పృచ్ఛకుడి ప్రశ్నను, కృష్ణమూర్తి తనలో తాను మళ్ళీ వేసుకోవాలి; ప్రశ్నను అన్ని కోణాల నుంచి క్షుణ్ణంగా పరిశీలించాలి. ఆ తర్వాత హేతుబద్ధంగా పరీక్షిస్తూ సాధ్యమైతే ప్రశ్నించే వానిని కూడా వెంటబెట్టుకుని లోలోపలికి బయలుదేరాలి; ఈ సమాధానం మనిషి అనుభవాలు, జ్ఞాపకాల ద్వారా మెదడు నుండి జనించేది కాదు. గత స్మృతులనన్నిటినీ విసర్జించి, తర్కించగలిగినంత మేరకు తర్కించి, ఇక తర్కానికి అందని సువిశాల మానవానుభూతిలోకి చొచ్చుకుపోవాలి.

మూలం వరకూ వెళితే అక్కడ ఆ ప్రశ్నకు సమాధానం లభిస్తుందనవచ్చు; లేదా అక్కడ ఆ ప్రశ్న నిర్మూలనమవుతుందనవచ్చు. అలాంటి సమాధానం ఆ లోతుల నుండి వెలువడినప్పుడు, ప్రశ్నా – సమాధానమూ రెండు అదృశ్యమై – ధ్యానమూ, ఆరాధనా భావమూ మాత్రమే మిగలవచ్చు. ఇదంతా ప్రశ్నించేవాడి శ్రద్ధాసక్తుల మీద ఆధారపడి వుంటుంది.

ఈ ప్రక్రియ యావత్తూ ఇంత శ్రమతో – అయితే ఆనందంతో చేసే శ్రమే – కూడుకున్నది కాబట్టే – ఎవరైనా "ఏదీ ఇందాక చెప్పింది మళ్ళీ అనండి" అన్నప్పుడు – "పునశ్చరణ చేయగలిగిలేనండి, మరో రకంగా వివరించి చెబుతా వినండి" అంటూండే వారు. క్షణం కిందట నదిలో ప్రవహించి వెళ్ళిపోయిన అదే నీరు ఇప్పుడు కావాలంటే లభ్యం కాదు కదా? సమాధిలోకి ప్రవేశిస్తూ ఉండడం – వెలికి వచ్చిన దానిని ప్రకటిస్తూ ఉండడం అనే ప్రక్రియను సాధించిన ఈ అసాధారణ మానవుణ్ణి చూసి – శ్రీలంకలోని కొందరు బౌద్ధులు "అసలు మీరు ఎన్నడైనా ఆలోచించడమనేది ఉంటుందా?" (Do You ever think?) అని అడగవలసి వచ్చింది.

అవసరమైనప్పుడు మాత్రమే కృష్ణమూర్తి ఆలోచించేవారు. అంటే, 'ఈ స్కూలు ఎలాంటి ప్రదేశంలో నెలకొల్పాలి? ఎలాంటి టీచర్లను అక్కడికి తీసుకురావాలి? ఆ

టీచర్లకు సాధారణ లౌకిక విద్యల్లోని ప్రావీణ్యతేకాక ఎలాంటి శ్రద్ధ, ప్రేమ ఉండాలి?' ఇవన్నీ ఆలోచించదగ్గ విషయాలే. కానీ ఈ ఆలోచన యావత్తూ మనిషి తాను దర్శించిన దానికి అనుసంధానంగా సాగాలి.

అంతేగానీ ఆలోచన తన భద్రత, తన భయాలూ, ఆందోళనలూ, తన ఆశలు, తన చింతల చుట్టూ నిర్మితంకాకూడదు. ఇలాంటి ఆలోచనా సరళి ఆ వ్యక్తికి ఉపయో గించేదిగా కనిపించినా సమాజ శ్రేయస్సుకు భంగకరమైనది; ఆ వ్యక్తికైనా తుట్టతుదకు అనర్థదాయకంగానే పరిణమిస్తుంది. అందువల్ల ఆలోచనకు మూలం దర్శనమా లేక తానూ తన బంధుమిత్రాదులు నాలుగు కాలాలపాటు సురక్షితంగా వుండడమే ఉద్దేశమా అనే విషయం ప్రధానం.

కృష్ణమూర్తేకాదు – మనలో ప్రతి ఒక్కరూ ఈ 'సౌందర్యాన్ని' దర్శించగలిగే వున్నాము; మూలంలోని ఈ ఆనందాన్ని కలిగే వున్నాము.

"ఇదుగో నా వద్ద అమితంగా వున్న ఈ ఆనందాన్ని తీసుకోమని శ్రోతల కందిస్తున్నాను; కానీ వారికది అక్కరలేదని వారనుకుంటే నాకు చింతలేదు. నా మాటలు వినమని నేను ఎవరినీ బలవంతపెట్టడం లేదు" అంటారు కృష్ణమూర్తి.

మనల్ని సృష్టించిన ఆ భగవంతుడే మనిషిని బలవంతపెట్టడం లేదు; తనని ప్రేమించమని అడగడం లేదు. సృష్టిలోని అనేక అందమైన వస్తువులు, రుచులు, అభిలాషలు, కళలు, సంస్కృతులు, ఆదర్శాలు, వీటన్నింటి వ్యామోహంలో మనిషి ఎన్నాళ్ళు, ఎన్నేళ్ళు తిరుగాడినా భగవంతుడు చూస్తూ ఊరుకోగలడు. వీటన్నింటితో విసిగి వేసారిన మానవుడే, దృష్టి తన వైపు మళ్ళిస్తాడని, శాశ్వతానందం కోసం ప్రయత్నిస్తాడని భగవంతుడికి తెలియక కాదు.

భగవంతుడే మానవుడి స్వేచ్ఛను ఇంతగా గౌరవిస్తున్నప్పుడు, మీ స్వేచ్ఛను కృష్ణమూర్తి మాత్రం గుర్తించకుండా ఎలా వ్యవహరించగలరు? ఆయన మీకు ఆప్తుడనుకుంటే ఆయన వాక్యం ఆప్తవాక్యమనుకుంటే ఆయన్ని అధ్యయనం చేయండి.

***ఆంధ్రప్రభ 17-2-1998***

# పూర్ణంగా జీవిస్తూ, మరణిస్తూ వుండు

పరిపూర్ణంగా ఎప్పుడూ జీవించి ఉండవు. ఏ అనుభవమైనా అరకొరగా చూసి ఉంటావు. పూర్ణానుభవమంటే ఎరుగవు. అందుకనే ప్రతిదీ మళ్ళీ మళ్ళీ కావలసి వస్తూ ఉంటుంది. ఇంతకుముందు ఎరిగిన అనుభవమే కొనసాగుతూ ఉంటుంది. పాత అనుభవం పట్ల ఏనాడూ మరణించవు; దేనినీ అంతంచేయవు. అన్నింటికీ సెమికోలన్‌లే కాని, ఫుల్‌స్టాప్ అనేది దేనికీ ఇంతవరకు పెట్టి ఉండవు. నిన్న చేసిందే మళ్ళీ నేడు, నిన్న తిన్నదే మళ్ళీ ఇవాళ, ఎడతెగని కోరిక. జీవితమంతా ఈ పాత అనుభవాలతోనే నిండిపోతే, ఏ ఒక్క దానికీ 'మరణించక'పోతే, అంతమొందించకపోతే, కొత్తదేదైనా కానీ, నీ దరికి ఎలా వస్తుంది? 'పాత' బరువు ఏ రోజుకారోజు పెరిగిపోతున్నది. ఆ బరువునంతా జ్ఞాపకాల రూపంలో మోస్తుంటివి. బ్రతుకు భారం కావడానికి కారణం, ఈ స్మృతుల బరువును మీద వేసుకొని తిరుగుతూ ఉండడం, వాటిని నేటి కాలంతో పోల్చి చూసుకోవడం, ఏదో నిరాశకు గురికావడం, ఇది కదా మన బ్రతుకు భారమైం దనుకోడానికి కారణం?

ఈ గతమనేది నిజానికి ఎక్కడా లేదు; ఒక్క మన మదిలోనే మెదులుతున్నది. మనమే దీనిని పెంచి పోషిస్తున్నాం కానీ, నిజానికి ప్రత్యక్షంగా కనిపిస్తున్నది మాత్రమే మన చర్యకై వేచి చూస్తున్నది. గడిచిపోయిన దాని విషయంలో నువ్వు చేయవలసింది ఏమీలేదు; దానిపట్ల నీ కర్తవ్యం దానిని విస్మరించడమే. ఆ మోపెడు బరువు ఆవలికి విసిరేస్తే, తక్షణ సమస్యల్ని ఎదుర్కొనడానికి మనకిప్పుడు ఎంతో శక్తీ, ఎంతో కాలం లభిస్తుంది.

గతాన్ని విస్మరించడం అంటే, ఆ అనుభవ పరంపరకు స్వస్తి చెప్పడం, దానినంతా అంతం చేయడమంటే 'మరణించడమే'. ఎవరైనా ఒక సిగరెట్టు అలవాటును, తాగుడు అలవాటును సంపూర్ణంగా, మనస్ఫూర్తిగా, ఆశతో మళ్ళీ వెనక్కు తిరిగి చూడకుండా, చింతించకుండా, బలవంతంగా కాకుండా స్వచ్ఛందంగా విసర్జించగలిగితే, దానిపట్ల 'మరణించినట్లే'. ఇలాంటి మరణం నీకు గొప్ప స్వేచ్ఛను ప్రసాదిస్తుంది. నీ శక్తి ఏ గాట్లో పడి ప్రవహిస్తూ వచ్చిందో, అక్కడి నుండి అది విడుదల పొందుతుంది.

గతమనే గాటి నుండి ఈ శక్తి విముక్తమై, ఆ 'గతం' నుంచి జన్మించే మన 'భవిష్యత్తు' అనేది కూడా మబ్బు వీడినట్లు వీడిపోతుంది. అంటే 'రేపు' అనే రోజు, పై సంవత్సరం, అటు తర్వాత ఐదారు దశాబ్దాలు మనకు ఉండకుండా పోతాయని కాదు. అవన్నీ కూడా అలాగే ఉంటాయి. సూర్యుడు ఉదయిస్తూనే ఉంటాడు, అస్తమిస్తూనే ఉంటాడు. కానీ ఆ రాబోయే కాలం గురించిన నీ భయం, చింత, ఆశ, దురాశ మాత్రం వదలిపోతాయి. నీ 'వాస్తవమైన' భవిష్యత్తును అలముకొన్న ఆ చీకటి యావత్తూ వదలి పోయినప్పుడు, నీ ఆలోచనా భారం తీరిపోతుంది. చాలా తేలికగా ఉంటుంది. నీలో కొత్త శక్తి ప్రవేశిస్తుంది.

నిజానికి అది కొత్త శక్తికాదు. పాతశక్తే. పూర్వం రోజుల్లో 'గతం' అనే గాట్లోపడి నీవు ఊహించిన భవిష్యత్తుతో బరువెక్కిపోయింది. ఇపుడు ఆ గాటి నుంచి వెలివడ్డందు వల్ల, ఆ శక్తే నూతన శక్తిగా కనిపిస్తుంది. ఈ కొత్తశక్తి నిన్ను గతం వంక చూడనివ్వదు; భవిష్యత్తును గురించిన ఆశాభయాలను కలిగించదు.

ఇలాగైతే మనకసలు ఏ పనీ చేయాలనే పూనికపోయి నిస్తేజంగా పడి ఉంటామేమో ననే సందేహం కలుగుతుంది. కానీ అలా ఉండే అవకాశం లేదు. ఆశ మనలో కలిగించే ప్రేరణ, 'మోటివేషన్' కన్నా, మరింత ఉత్సాహంగా ఉంటాం. ఏ పని మనకెదురవుతుందో ఆ పనిని గురించి దీని ఫలితం ఎలా ఉంటుందో, నెగ్గుతామో నెగ్గమో అనే భయమూ ఆత్రుతలేకుండా ఆ పని ప్రారంభించగలిగి ఉంటాం. ఆ పని అవిభాజ్యమైన మన శక్తి ప్రయోగించబడుతున్నది. మునుపైతే ఆ శక్తి కొంత గతాన్ని గురించి తలపోస్తుండేది. అందుచేత తొట్రుపాటుండేది. కానీ ఇప్పుడా పనిని నిర్వహించడానికి పూనుకున్న శక్తికి మరో దృష్టిలేదు. 'వెనుక చూపూ' లేదు, 'ముందుచూపూ'లేదు. దృష్టి యావత్తూ ఆ పనిమీదనే కేంద్రీకృతమైంది. ఇలాంటి దృష్టితో మత్స్యయంత్రాన్నే భేదించే వీలుంది; ఇక మన పని ఏపాటిది? ఆ పని ఎంత చక్కగా జరిగే వీలుందో అంత చక్కగానూ జరుగుతుంది. ఇదే 'కర్మకౌశల'మని పేరు పెట్టుకోదలచుకుంటే అభ్యంతరం లేదు. కానీ పేర్లు ముఖ్యం కాదు. సంపూర్ణంగా ఒక కర్మ నాచరించడమంటే ఏమిటో మనకర్థమైతే చాలు.

ఇలా పనిచేసినప్పుడు శరీరం శ్రమించినా, చెమటలు పట్టినా, 'అలసిపోయాం' అనుకోము. శరీరం, దాని తాలూకు కండలు అలసిపోయిన మాట నిజమే. కానీ 'నీ'లో అలుపులేదు. సేదతీర్చుకోవాలనిపిస్తుందే కానీ వైఫల్యం తెచ్చే 'అలుపు' ఉండదు. నెగ్గాననే గంతులూ ఉండవు.

ఇలా 'జీవిస్తూ–మరణిస్తూ' జీవించడం నేర్చుకుంటే, ఇక ఆయుష్షు నిండిన తర్వాత సహజంగా వచ్చే మరణాన్ని గురించి ఏమి భయపడాలి? ఆ మరణం కొత్తగా నీవద్ద నుంచి ఏమి దోచుకుపోతుంది? మనుష్యులను ప్రేమించావే కానీ, నీ ప్రేమలో ఎవరిపట్లా మమకారం పెంచుకోలేదు; ఆ కారణంవల్ల, ఎవరిమీదా మానసికంగా ఆధారపడిందీ లేదు. ఆధారపడితే నిన్ను నీవు ప్రేమించుకున్నట్లేగానీ, వారిని ప్రేమించినట్టు కాదు; వారి అభివృద్ధే కాంక్షించా ననుకున్నప్పటికీ ఆ అభివృద్ధి నీకు చేసే మేలును, సుఖాన్ని గురించే ఎక్కువగా ఆలోచించావన్నమాట. కానీ ఇది నిజమైన ప్రేమకాదు; స్వార్థంతో కూడిన చింత.

వస్తువుల అశాశ్వతత్వాన్ని గురించి కానీ అధికారమనేది, ఇవాళ ఉండి రేపుపోతుందనే విషయం గానీ నీకు తెలీకుండా ఉందా? వేదాంతులు వచ్చి చెప్పాల్సిందేమున్నది? ఇదంతా నీకు ఏనాటి నుంచో తెలుసు. కానీ ఏనాడూ ఆచరించి చూడలేదు. ఇప్పుడు 'మరణించి' తద్వారా లభించే స్వేచ్ఛను చవిచూడు. నీ నూతన జీవితం ఎంత ఉత్సాహభరితంగా, ఎంత హాయిగా ఉంటుందో గమనించు. అప్పుడు దేహాంత సమయంలో 'మరణం' నీ వద్ద నుంచి ఏమీ తీసుకువెళ్ళగలిగి ఉండదు. అది తీసెయ్యగలిగినవన్నీ నీవింతకుముందే వదలించేసుకున్నావు.

ఇంతకు మునుపు అన్నిటిపట్లా సంపూర్ణంగా ఎలా జీవించావో, దుఃఖం కలిగినప్పుడు పలాయనం చిత్తగించకుండా సంపూర్ణంగా ఎలా అనుభవించావో, ఇప్పుడీ మరణాన్ని కూడా అంత పరిపూర్ణంగానూ అనుభవిస్తావు. మరణం ఎవరిని భయపెట్టగలదు? భయపడే 'నువ్వు' అక్కడ ఉంటేగదా భయపడడానికి? జీవితం పొడవునా జీవిస్తూ – మరణిస్తూ నీవాచరించిన ధర్మం నీకు స్పష్టంగా కనిపిస్తూనే ఉంటుంది. నీ ప్రాణాన్ని, ధర్మాన్ని ఎవరూ వేరుచేయలేరు

*ఆంధ్రప్రభ 13-10-1998*

# అలవాటు పెద్ద ఆటంకం

మీకు తెలిసినవారిలో మౌలికంగా మారిన మనిషిని ఎన్నడైనా చూశారా? 'పరివర్తన' గురించి సుదీర్ఘ ఉపన్యాసాలిచ్చేవారు మీకు తటస్థపడి ఉంటారు. నిజమే. కానీ 'మారిన మనిషి'ని చూశారా? మీ సంగతి, నా సంగతే తీసుకుందాం. చిన్నప్పటి నుండీ మనల్ని ఎవరో ఒకరు, "నీకెంత చెప్పినా నువ్వు మానవురా. వారినీ వీరినీ నమ్మ వద్దురా అని ఎన్నిసార్లు చెప్పినా, మనుష్యుల్ని నమ్ముతూనే ఉంటావు. చివరకు ఇలా నెత్తిమీదికి తెచ్చుకుంటావ్. ఏమిచేసినా నీ గుణం మారదు" అని హెచ్చరించే ఉంటారు. కానీ మనం చేసే పొరపాటు, జీవితం పొడుగూతా చేస్తూనే ఉంటాం. ఆ పొరపాటు మనకు అలవాటైపోయి ఉంటుంది. ఆ అలవాటు నుంచి తప్పించుకునే మార్గంలేదు.

కానీ మనకీ హెచ్చరిక చేసినవారు కూడా తమ 'పొరపాటు – అలవాటు' నుంచి విముక్తి సాధించలేరు. మనం కాస్త పెద్దవాళ్ళమైన తర్వాత, మనకీ సలహాలిచ్చిన వృద్ధుల వంక చూస్తే, వారి అలవాట్లు కూడా వారి జీవితాల్లో స్థిరంగా ఏర్పడిపోయినట్లు కనిపిస్తుంది.

లోకమంతా ఇంతే. అయితే అలవాటే తప్పా? అని ఆశ్చర్యం వేయవచ్చు. కానీ ప్రతి అలవాటు మనిషి స్వభావంలో భాగమైపోతుంది. దురలవాట్లను వదిలించుకోవాలే గానీ, మంచి అలవాట్లుండడం శ్రేయస్కరమే కదా? అనే సందేహం కలగవచ్చు. కానీ మంచి అలవాటు కూడా మనిషిని బానిస చేస్తుంది.

ప్రొద్దున్నే స్నానం చేయడం మంచి అలవాటే; అందులో చన్నీళ్ళ స్నానమయితే మరీ మంచిది. కానీ "ఈ ప్రాంతంలో అంత ప్రొద్దున్నే చన్నీళ్ళతో చేయకండి" అని ఎవరైనా చెప్పినప్పటికీ, అలవాటుకొద్దీ ప్రొద్దున్నే వొణికిపోయే చలిలో స్నానం చేస్తారనుకోండి. ఇందువల్ల ఆరోగ్యం దెబ్బతినవచ్చు. తాను ఏ పనిమీద ఆ ప్రాంతానికి వెళ్ళాడో ఆ పని నెరవేర్చుకోలేకపోగా, దానికే విఘాతమేర్పడి ఇంటికి తిరిగిరావచ్చు. ఆచారం

పాటించడం, అనుష్ఠానం చేసుకోవడం, ఇవన్నీ కూడా అలవాట్లే. ఏవో అనుకోని పరిస్థితుల వల్ల ఇవి ఆచరించలేక పోయినప్పుడు చాలా బాధ కలుగుతుంది; దైవాన్ని తలుచుకునే అవకాశమే పోగొట్టుకొని, 'ఆచారం పాటించలేకపోతినే' అనే చింతతోనే కాలాన్ని వృథా చేసుకోడం జరుగుతుంది. పైకి చూడడానికి ఈ 'అలవాటు' అనేది చాలా చిన్న విషయంగా కనిపిస్తుంది.

కాని నిజమైన ఆధ్యాత్మికుడికి ప్రతి అలవాటు, ప్రతి 'హ్యాబిట్' కూడా పెద్ద ఆటంకం. మనిషి అనాలోచితంగా, యాంత్రికంగా, గమనిక లేకుండా ప్రవర్తించడం శుద్ధ పొరపాటని అతడికి తెలుసు. ఇది బౌద్ధులు చెప్పే "మైండ్‌ఫుల్‌నెస్" లేకపోడమన్నమాట. ఈ గమనిక గనుక చిన్న విషయాల్లో లేకపోతే, పెద్ద విషయాల్లోనూ ఉండదు. తన వెలుపల ప్రవహించే అఖండ జీవితాన్ని, తన శరీరధారణ మూలాన వేరుగా లోన కనిపించే జీవిత ప్రవాహాన్ని, రెంటినీ అవిభాజ్యంగా గుర్తించాలి. ఈ ప్రవాహంలో నీరు ఎక్కడ నిలిచినా, 'హాబిట్' రూపంలో ఎక్కడ ఏ గాట్లో పడినా, మనిషికి తెలీకుండానే జీవచ్ఛక్తి తరచూ ఆ గాట్లోకి వెళ్ళి ఇరుక్కుంటుంది. హాబిట్ మనిషిని గుడ్డిఎద్దులాగా నడిపిస్తుంది. మాటవరుసకు ఏదో ఒక కారణాన ఒక జాతిమీద, ఒక వర్గం మీద ఒక అభిప్రాయం ఏర్పరచుకోడం జరుగుతుంది. ఈసారి ఎదురైన పరిస్థితి నూతనమైనదైనప్పటికీ, ఆ పూర్వానుభవం ద్వారా ఏర్పడిన అభిప్రాయం మన కళ్ళు కమ్మేసి, ఈ నూతన పరిస్థితిని తిన్నగా చూడనివ్వదు. గతంలో ఏర్పడిన దురభిప్రాయంతోనే చూస్తానంటుంది. కొత్తగా తారసిల్లిన ఈ మనిషికి ఆ గుణ ముండకపోవచ్చు; లేక అదే మనిషి ఒకప్పుడు ప్రవర్తించినట్లు ఇప్పుడు ప్రవర్తించక పోవచ్చు. కానీ మన మనస్సు పాతగాట్లోనే, పాత హాబిట్ ననుసరించే ఆలోచిస్తుంది. నిర్ణయాలు చేస్తుంది. నూతనంగా దర్శనమిచ్చే దేనినీ చూడగలిగిలేదు.

జీవిత ప్రవాహ గమనాన్ని చూస్తూ నడిచే ఓ సున్నిత సుకుమార హృదయుడికి కనిపించే నూతనత్వం, ఈ హాబిట్‌లో మునిగి తేలుతున్న మనిషికి కనిపించదు. అతడి చెవులకు వినిపించేది ఇతడికి వినిపించదు. హాబిట్ కళ్ళను కప్పేస్తుంది. చెవులను మూసేస్తుంది. హృదయ కవాటాలను బిగించివేస్తుంది.

ఒకప్పుడు మన శక్తి పొరపాటున ఓ గాట్లో పడింది; లోభత్వం ఏర్పడింది, లేక కామక్రోధాలవైపు మొగ్గాము. తీవ్రమైన ఈ గుణాలే కాకుండా, ఏవో కొన్ని సామాన్యమైన లక్షణాలు కూడా మనల్ని వేధిస్తూనే ఉంటాయి. అతిగా వాగడం, అందర్నీ వెక్కిరించడం, అంతులేకుండా తర్కించడం, అయినదానికీ కానిదానికీ విసుక్కోవడం, వెర్రిహాస్యంలో పాల్గొనడం, స్త్రీనిగానీ పురుషుణ్ణి కానీ కళ్ళప్పజెప్పి తేరిపారజూస్తుండడం, బలహీనుల్ని ఏడ్పించడంలో తృప్తి పొందడం, ఇవన్నీ కూడా గమనించదగినవే, శ్రద్ధలు చేయదగినవే. ఆ అలవాటు మరుగున కరుడుగట్టిన శక్తిని విడుదల చేయాల్సిందే. శక్తి ఎక్కడా కూడా స్తంభించి పోకూడదు. నిర్బంధింప బడకూడదు, ఘనీభవించకూడదు; ప్రవహిస్తూనే ఉండాలి. బయట ఎంత వేగంగా ప్రవహిస్తున్నదో, లోనకూడా అంత వేగంగానూ ప్రవహించాలి. దేశకాల పరిస్థితులకు అనుగుణంగా, వెలుపలి శక్తితో, లోని శక్తి జతకలుస్తూనే ఉండాలి. ఏ అభిప్రాయానికి అంటిపెట్టుకోకుండా జీవించగలిగి ఉండాలి. అలాంటి జీవనం, అటువంటి జీవితాచరణలో ధర్మం ప్రకటితమవుతుంది.

హాబిట్‌లో గనుక శక్తి చిక్కుకుపోయిందంటే అది ఈ జన్మకే కాదు, మరి అనేక జన్మల వరకూ అలాగే కొనసాగుతుంది. అందువల్లనే పుట్టుకతోనే పుట్టిన బుద్ధి పుడకలతో కానీ పోవడం లేదు. చిటికెలో తగాదాపడే గుణం, బూతు రచనల మీద అధికమైన ఆసక్తి, చాడీలు చెప్పే లక్షణం ఇలాంటివన్నీ మనిషిలో స్థిరపడిపోయి ఉంటాయి. ఫలాని వ్యక్తి మనకు తారసిల్లాడంటే, అతడు ఏమి మాట్లాడనున్నాడు? ఏరకమైన దుగ్ధ, అసూయ ప్రకటించనున్నాడు? అన్నీ ముందరే తెలుస్తుంటాయి. అయితే ఇది ఇతరుల విషయంలో ఎంత సాకల్యంగా తెలుస్తుందో, మన స్వవిషయంలో కూడా అంతగానూ తెలుసుకోవాలి. అప్పుడే ఈ జన్మలోని అలవాట్లను, జన్మాంతర అలవాట్లను తుత్తునియలు చేసే వీలుంటుంది.

ఇది జరిగిననాడు మనశక్తి పరిశుద్ధమై, ఏ రాళ్ళు రప్పలు, ఇసుక మేటల మధ్య చిక్కుకోకుండా మహాప్రవాహంలా ముందుకు సాగుతుంది; దీనికీ లక్షణ మేర్పడగానే, అదే లక్షణం కలిగున్న వెలుపలి ప్రవాహంలో సులభంగా ఐక్యమవుతుంది. ఇరుకు దారుల్లో ప్రవహిస్తున్న ఒకప్పటి మన జీవితం, ఇప్పుడు ధన్యతను చేకూర్చుకుంటుంది.

***ఆంధ్రప్రభ 23-10-1998***

# కృష్ణమూర్తిగారిని స్మరిస్తూ

శ్రీ జిడ్డు కృష్ణమూర్తిగారిని గురించి ప్రస్తావించుకునేప్పుడు ఆయన జీవితం పొడుగునా ఏం చెప్పారు అనేదే ప్రధానంగా ఎంచవలసి ఉంటుంది. జీవితం నుంచి డైరెక్ట్‌గా ఆయన నేర్చుకుంటూ మాట్లాడిన ఆ మాటలకే విలువ ఎక్కువ; ఆయన జీవితం లోని బాహ్య విషయాలకు అంత విలువలేదు. అయినప్పటికి భారతీయ కాలమానం ప్రకారం ఆయన ఫిబ్రవరి 17వ తారీఖున, ఆమెరికాలోని కాలిఫోర్నియా రాష్ట్రంలో మరణించారు కాబట్టి, ఆ తేదీని పురస్కరించుకొని, ఆయన జీవితంలోని ఒకటి రెండు ముచ్చట్లు రాయాలనిపించింది.

1931 సంవత్సరంలో శ్రీ కృష్ణమూర్తిగారు భారతదేశం వచ్చినప్పుడు, ఆనాటి కాంగ్రెస్ నాయకులు పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ, ఆచార్య జె.బి. కృపలానీ, అచ్యుత్ పట్వర్థన్‌లు ఆయనతో సమావేశమయ్యారు. దేశ స్వాతంత్ర్యం కోసం చిత్తశుద్ధితో అహర్నిశలూ కృషిచేస్తున్న ఈ రాజకీయ నాయకులు, భారతదేశం పునరుజ్జీవనం సాధించాలంటే, మునుముందు దేశ దాస్యం తొలగాలని అభిప్రాయపడ్డారు. దేశ స్వాతంత్ర్య సమరం సందర్భాన వ్యక్తి పునరుజ్జీవనాన్ని నిర్లక్ష్యం చేస్తే భారతదేశం దారితప్పుతుందని శ్రీ కృష్ణమూర్తి నిర్ద్వంద్వంగా చెప్పేశారు. నెహ్రూ అప్పటికి యువకుడు కనుక సునిశితమైన ఆనాటి అతడి మనస్సుకి భారత పునరుజ్జీవనావశ్యకత ప్రాధాన్యం తట్టింది. కానీ, భారతీయ సర్వతోముఖ వికాసానికి ఓంప్రథమంగా రాజకీయ స్వాతంత్ర్యం ముఖ్యమని అభిప్రాయ పడ్డాడు. రాజకీయ శృంఖలాలు తుత్తునియలయ్యేంత వరకూ భారతీయుడు తన పునరుజ్జీవనం గురించి ఆలోచించలేడని నెహ్రూ వాదన. ఈ విషయంలో కృపలానీ, పట్వర్థన్‌లు కూడా నెహ్రూ అభిప్రాయాన్ని సమర్థించారు.

కానీ కృష్ణమూర్తిగారు మాత్రం సమాధానపడలేదు. చరిత్రలో మొదటి నుంచీ భారతీయులు "రెలిజియస్ స్పిరిట్"నే అత్యంత ప్రధానంగా ఎంచుకున్నారనీ, భారతదేశం దానికే అంకితమైందనీ గుర్తుచేశారు. "ఒకనాడు ఈ దేశం నుంచి బౌద్ధం చైనా, జపాన్‌లకే కాక మొత్తం తూర్పు దేశాలకే విస్తరిల్లింది. ఆనాటి భారతీయ "రెలిజియస్

హృదయానికి" (Religious core) నేటి ప్రపంచానికి ఉన్న సంబంధమేమిటి?" అని నెహ్రూని అడిగారు.

భారత స్వాతంత్ర్యం సిద్ధించిన ఈ నాలుగైదు దశాబ్దాల కాలంలో, దేశ ప్రజ 'రెలిజియస్'గా వికసించకుండా, కేవలం రాజకీయ స్వాతంత్ర్యం మాత్రమే సాధించినందు వల్ల, అన్ని రంగాల్లోనూ దేశం ఏ గతికి దిగజారిందో అందరి కళ్ళకూ కనిపిస్తూనే ఉంది. 1931 నాటి ఆ ప్రస్తావనను, 1980లో అప్పటికి "రాజకీయ సన్యాసం" పుచ్చుకొని, కృష్ణమూర్తిగారితో కలిసి పనిజేస్తున్న అచ్యుత్ పట్వర్ధన్, ఆయనకు గుర్తుచేశాడు. అందుకు ప్రతిస్పందిస్తూ కృష్ణమూర్తిగారు "ఆ భారతీయ సామర్థ్యం, ఆ సారం సజీవంగా ఉందంటారా? పశ్చిమ దేశాలు, క్రిస్టియన్ ప్రపంచానికి కూడా రెలిజియస్ హృదయ మున్నది కానీ, అది విశ్వాసం అనే దాని మీద ఆధారపడింది. ఇక్కడ భారతీయ రెలిజియస్ హృదయం "తత్"ని తప్పితే అన్నింటినీ తిరస్కరించింది. మరి ఈనాడు ఆ ఆధ్యాత్మిక సామర్థ్యం, ఆ విత్తనం అదృశ్యమవుతున్నాయేమో ఆలోచించండి. అది ఈనాటికీ సజీవంగా ఉండి ఉంటే, పశ్చిమ దేశవాసులు ప్రతిపాదించే జీవిత విధానానికి, అక్కడి వారి విలువలకు నేటి భారతీయులు ఎలా స్పందిస్తున్నారు?" అనే ప్రశ్నే లేవదీశారు.

వేద రుషులవలె దేశ కాలావస్థలను అతిక్రమించి, మనిషి మెదడు నుంచి పుట్టిన మతాలవల్ల నిర్బంధింపబడకుండా, సంపూర్ణ స్వేచ్ఛతో, జిజ్ఞాసాపరంగా అంతర్గత జీవితాన్ని శోధించి, సత్యాన్ని సాధించడమే కృష్ణమూర్తి గారి ధ్యేయం. భారతీయుల్లో ఈ స్పిరిట్ విజృంభించాలనీ, ఇది ప్రపంచం అంతటా వీరి ద్వారా విస్ఫోటనం చెందాలనీ ఆయన ప్రగాఢ వాంఛ. కోర్కెలు తీరడం కోసం దైవ విగ్రహాలను పూజించడం, మతమంటే కేవలం గుళ్ళూ, గోపురాలూ అని భావించడం ఆచరణలో భౌతికలాలసత్వం, ఆయనకు విచారం కలిగించేవి.

వ్యక్తిగతంగా కృష్ణమూర్తిగారికి ఆధ్యాత్మికతతో కూడిన హాస్య ప్రధానమైన కథలంటే చాలా ఇష్టంగా ఉండేది. డిన్నర్ టేబిల్ వద్ద కూచున్నప్పుడు ఒకసారి ఓ తమాషా కథ చెప్పారు. మనుషులకి ఉండే సహజ గుణం సుఖంమీది అభిలాష; నిజమైన సజ్జనుడిగా రూపొందే బదులు, ఏదో యుక్తితో దైవాన్ని సాధించవచ్చని చాలామంది అనుకుంటారు.

ఆ విషయాన్ని ఉదహరిస్తూ, అత్యంత ధనికుడైన ఒక వ్యక్తి జీవితమంతా అస్తవ్యస్తంగా గడిపి, అడ్డదిడ్డంగా సంపాదించి చివరకు పుణ్యం ఆర్జించడానికి ఏదో దానధర్మాలు చేసి చనిపోయిన కథ చెప్పుకొచ్చారు. మృతిచెందిన ధనికుణ్ణి స్వర్గ ద్వారాల వద్దకు కొనిపోయారు. అక్కడి ద్వారాన్ని పీటర్ మహాశయుడు కాపలా కాస్తున్నాడు. ధనికుడు తాను చేసిన దానధర్మాలన్నీ వరసపెట్టి చెప్పుకొచ్చాడు. "అలాగే, అలాగే మీరు లోనికి వెళ్ళచ్చు" అన్నాడు పీటర్. కానీ లోపలికి వెళ్ళేముందు, భూమికింద ఉన్న భాగం ఎలా ఉంటుందో చూసి వస్తే బాగుండునేమో అని సూచించాడు. "అలాగే చూసివస్తాను. కానీ కిందికి వెళ్ళడం నావంటి వాడికి సులభమేనంటారా?" అని అడిగాడు. "అబ్బే, అదేముందీ? లిఫ్ట్‌లోని బటన్ నొక్కారంటే నిమిషంలో కిందికి వెళ్ళిపోవచ్చు" అన్నాడు పీటర్.

ధనికుడు క్రిందికి వెళ్ళగానే నరకలోకపు గేట్లు తెరుచుకున్నాయి. కానీ ధనికుడు అనుకున్నట్లు కాకుండా అక్కడ అన్నీ నందనవనాలూ, మధుపాత్రలను అందించే మదవతులూ, ఎక్కడా దొరకని అమిత రుచికరమైన పదార్థాలూ చూచి ఆశ్చర్య చకితుడయ్యాడు. అక్కడ కొంతకాలం ఉండి, ఆ ధనికుడు పీటర్ వద్దకి తిరిగివచ్చి "ఇక్కడి కన్నా అక్కడే ఎంతో ఆనందంగా ఉంది. నాకక్కడ నివసించడమే బాగుంటుంది అనిపించింది" అన్నాడు. "అలాగే, అలాగే, మీకలా అనిపిస్తుందని నేను ముందే అనుకున్నాను" అన్నాడు పీటర్.

ధనికుడు మళ్ళీ బటన్‌నొక్కి, కిందికి వెళ్ళిపోయాడు. కానీ ఈసారి అతడక్కడ ప్రవేశించగానే నందనవనాలు మధుపాత్రలు మాయమయ్యాయి. దుక్కల్లాంటి ఇద్దరు దౌర్జన్యపరులు, ధనికుడు కనిపించగానే దేహశుద్ధి చేయడం ప్రారంభించారు. చేతులు అడ్డం పెట్టుకుంటూ, వొంటిమీద పడుతున్న దెబ్బల నడుమ ఎలాగో సందు చేసుకొని, "నేను కొద్దిసేపటి కిందటనే ఇక్కడ నివసించి వెళ్ళాను కదా? అప్పుడేమో నన్నెంతో ఆదరంగా చూశారు. ఈలోగా ఏమయింది? ఏమిటీ విపరిణామం?" అని అడిగాడు.

కండలు పెంచిన ఆ గూండాలిద్దరూ, అతడికి మరో రెండు వడ్డిస్తూ, "అప్పుడు మీరు టూరిస్టుగా వచ్చారు కాబట్టి ఆ మర్యాద" అని సమాధానం ఇచ్చారు!

***ఆంధ్రప్రభ 17-2-99***

# మనిషికీ మహాశక్తికీ మధ్య పూజారి ఎందుకు?

ప్రముఖ పత్రికాధిపతి, దేశభక్తుడు శ్రీరామ్‌నాథ్ గోయెంకా – తన ఏకైక పుత్రుడు శ్రీ భగవాన్‌దాస్ అకాల మరణం అనంతరం శ్రీ అచ్యుత్ పట్వర్ధన్ ద్వారా కబురంపి మద్రాసు 'వసంత విహార్'లో శ్రీ జిడ్డు కృష్ణమూర్తి గారిని కలిశాడు. ఆ మహనీయుడితో కాసేపు సంభాషించిన తర్వాత శ్రీ రామ్‌నాథ్ గోయెంకాకు కొంత దుఃఖోపశమనం కలిగింది. భారతదేశ స్థితిగతులను గురించి చర్చిస్తూ 'ఈ లెక్కన ఈ దేశం గతి ఏం కావాలి?' అని శ్రీరామ్‌నాథ్ తన బాధను వ్యక్తం చేసినప్పుడు శ్రీ కృష్ణమూర్తి – "మహా పురుషులు జన్మించిన ఈ దేశపు మట్టిలో ఏదో పుణ్య విశేషముంది. ఈ దేశాన్ని సరియైన మార్గంలో నడిపించేవారు ఆ మట్టిలో నుండి పుట్టుకురాకపోరు. నిరాశపడ నవసరంలేదు" అని తన ప్రగాఢ విశ్వాసాన్ని ప్రకటించాడు.

యౌవన దశలో విశ్వ మానవుడిగా ఎదిగిన కృష్ణమూర్తికి సంకుచిత దేశాభిమానం ఉండే అవకాశంలేదు. 'ఇతర దేశాలకన్నా నా దేశమే గొప్పది. ఇతర జాతులకన్నా నా జాతే శ్రేష్ఠం' అనే ధోరణి లేనివాడు. మొత్తం మానవాళి దుఃఖాన్ని తన దుఃఖంగా పరిగణించి ఆ దుఃఖాన్ని ముందు తనలో నిర్మూలించుకొని 'ఇదుగో తరణోపాయం, మీకు సమ్మతమైతే మీరూ నేనందుకున్న స్వేచ్ఛనందుకోండి. అంతస్సంఘర్షణ లేని ఆనందమయ జీవితాన్ని సాధించండి' అన్నాడు కృష్ణమూర్తి.

ఆయన బోధలో ఉండే ఓ సౌలభ్యమేమిటంటే మనిషి తానే దశలో ఉన్నా అక్కడే ప్రారంభించవచ్చు. ప్రత్యేకంగా ఏ గ్రంథమూ, శాస్త్రమూ చదవనక్కరలేదు. ఏ ఆచారమూ, అనుష్ఠానమూ, ప్రత్యేక పూజా విధానమూ ఆచరించనక్కరలేదు. గుళ్ళూ గోపురాలు మసీదులు చర్చీలు మొదలైన వేటికీ వెళ్ళనక్కరలేదు.

చదివే పుస్తకం నీవే. నీలోకి నీవు చూడనారంభిస్తే గ్రంథపఠనం ప్రారంభమైనట్లే. ఆ గ్రంథంలో నీ చరిత్రే కాదు, మొత్తం మానవాళి చరిత్ర కూడా అక్కడే కనిపిస్తుంది. తరతరాలుగా మానవుడు ఈ దుఃఖాంబుధిలో ఎందుకు కొట్టుమిట్టాడుతున్నాడో నీకు అర్థం అవుతుంది.

విగ్రహ రూపంలో కానీ, పవిత్ర గ్రంథ రూపంలో కానీ, మరే రూపంలో కూడా ఆ మహాశక్తిని పరిమితం చేయజాలము. ఇవన్నీ మనిషి మెదడు కల్పించినవే, హస్తాలతో నిర్మించినవే కాబట్టి అపరిమితమైన అమేయమైన ఆ శక్తిని వీటిలో పరిమితం చేయడం అసాధ్యం. విశ్వవ్యాప్తమైన ఆ శక్తి ఎక్కడో లేదు, నీకు అతి సమీపంలోనే నీవద్దనే ఉన్నది. కనుగొనే కళ్ళు కావాలి; సరిగ్గా శ్రవణం చేయగలిగిన చెవులు కావాలి; అవగాహన చేసుకోగలిగిన నిర్మల హృదయం కావాలి. ఈ పరికరాలు శుద్ధిచేసుకుని, శ్రద్ధాసక్తులతో పూనికతో వేసే మొదటి అడుగే అనతి కాలంలో నిన్ను ఎంతో దూరానికి, ఎంతో లోతుల్లోకి తీసుకువెళ్ళ నారంభిస్తుంది. బాహ్యంగా గురువుకై వెతకనక్కరలేదు; నీ శ్రద్ధే నీలోని సద్గురువును మేల్కొల్పుతుంది. అప్పుడు నీవే గురువు, నీవే శిష్యుడివవుతావు. నేర్చుకొనడం అనేది అంతులేకుండా సాగుతూనే ఉంటుంది.

మతాలన్నీ వ్యర్థమైనవని తేలిపోయింది. విశ్వాసాలు, గుడ్డి నమ్మకాలపై ఆధార పడిన ఈ మతాలు, ఒకవంక మౌఢ్యాన్ని, మరోవంక మారణహోమాన్ని సిద్ధింపజేసినై. మానవుడు సృష్టించిన ఈ మతాలనన్నిటినీ దాటి, నేరుగా ఆ మహాశక్తితో సంబంధ మేర్పరచుకో గలిగిన మానసిక స్థితిని సాధించడానికి మార్గం చూపించాడు కృష్ణమూర్తి. అప్పుడు మానవజాతి, మతాల వారీగా, జాతులవారీగా విడిపోనక్కరలేదు. పండిత పామర భేదాన్ని, ధనిక నిర్ధన భేదాన్ని, తదితర విభేదాలేవీ పరిగణించకుండా అందరూ ఆ మహా శక్తితో నేరుగా సంబంధం పెట్టుకోడానికి అర్హులే. ఇందుకు కావలసిందల్లా నీవు ఇప్పటికే అనేక గ్రంథాల నుంచి సేకరించిన 'జ్ఞానమూ', వారూ వీరూ వెలిబుచ్చిన అభిప్రాయాలను ఔదలదాల్చడమూ, చాలా విలువైనదిగా భావించే నీ 'స్వానుభవమూ' వీటి ప్రామాణికతను పక్కకునెట్టి విశుద్ధమైన మనసుతో ఈ విషయాన్ని అధ్యయనం చేయడం మాత్రమే. అంటే ఇప్పటికి నీవు ఎరిగున్న దాని యెడల 'మృతి' చెందాలి; గతాన్ని విస్మరించాలి. లోక వ్యవహారానికి నిత్యం మరణిస్తూ, పునరుజ్జీవనం పొందనారంభించాలి. కోమలమైన స్పృహతో లోకాన్ని తాజాగా, నూతన నేత్రాలతో దర్శించాలి. అలాంటి నిత్య నూతనమైన మనసుకే 'నవనవోన్మేషమైనది' దర్శనమివ్వ గలదు.

ఈ వినూత్న మనసు సత్యాన్ని అన్వేషించదు. ఆహ్వానించదు. దర్శనానికై ఆతురత చెందదు. తనకు సత్యమెలా ఉంటుందో తెలియదు కాబట్టి ఆ విషయమై ఊహ చేయదు. తనకు ఖాయంగా తెలిసిన దాని నుండి అనగా తన కామక్రోధాదులు, మద మాత్సర్యాలు, వీటన్నింటినీ తరతరాలుగా ఎరిగి ఉన్నది కాబట్టి వాటి నుండి విముక్తి పొందనారంభిస్తుంది. తెలిసిన దాని 'చెఱ' నుండి విడివడనారంభించిన కొలదీ, జీవితంలో వెలుగు ప్రసరింప నారంభిస్తుంది.

కృష్ణమూర్తి లౌకికాన్ని తిరస్కరించలేదు. "ఈ భూమిమీద బాధలు మరిచిపో. నీవు కోరుకునే ఆనందం పరలోకంలోనే లభిస్తుంది" అని ఉపశమన వాక్యాలు పలకలేదు. ఇక్కడే ఈ భూమిమీదే మానవ జీవనం సుసంపన్నం చేసుకునే అవకాశం ఉన్నది అన్నాడు. అనేక రకాల అభిప్రాయాలు, మత ప్రచారం, పలు సిద్ధాంతాలు మొదలైన వాటిచే నిబద్ధీకృతమైన నీ మనసే నీ బాధకూ, అంతస్సంఘర్షణకూ కారణమని చూపించాడు. నీ మనస్సులో నుంచి తోసుకువచ్చే ప్రతి ఆలోచననూ, ఉద్రేకాన్ని, ఇచ్ఛనూ గనుక తిన్నగా చూస్తూ దాని నుంచి పలాయనం చిత్తగించకుండా, దుఃఖాన్ని తప్పించుకోడానికి ఏ గురువునూ ఆశ్రయించకుండా, నిదానంగా మనసులోని ప్రతి కదలికనూ గమనిస్తూ ఉన్నావంటే, అది మనసులోనే పెరిగి, పెద్దదై, ఎదగగలిగి నంతవరకూ ఎదిగి, దాని పూర్తి స్వరూప స్వభావాలు నీకు చూపించి, చివరకు నీ చూపు తీవ్రతకు ఓర్వలేక పటాపంచ లవుతుందనే రహస్యాన్ని విప్పి చెప్పాడు. అప్పుడు నీ ప్రతి ఆలోచనకూ బాహ్యంగా అనుభవం యొక్క ఆవశ్యకత తొలగిపోతుంది.

ఇలా విముక్తుడైన మానవుడు స్వేచ్ఛగా ఎంతైనా పరిశోధించగలడు. సతతం నేర్చుకునే గుణం సంతరించుకున్న ఈ మనిషి జీవితం, తెలుసుకొనవలసింది తెలుసుకునే తీరుతుంది. కేవలం ఎరుక, అతి నాజూకు స్పృహలతో కూడిన ఈ కృష్ణమూర్తి బోధ అనితర సాధ్యమనిపిస్తుంది.

*ఆంధ్రప్రభ 23-12-1999*

*(మిలీనియం సందర్భంగా ప్రచురించిన వ్యాసం)*

# నిశ్శబ్దం నెలకొన్న వేళ

"కృష్ణమూర్తిని ప్రత్యక్షంగా వినడానికి ఇంతింత దూరాలు ఎందుకు ప్రయాణం కట్టారండీ? ఆయన చెప్పేదేదో పుస్తకాలూ, ఆడియో వీడియో రూపంలో ఎలాగూ తర్వాత లభ్యమవుతూనే ఉంటాయి కదా?" అని వారూ వీరూ, కృష్ణమూర్తిగారు బ్రతికుండగా, అడుగుతూండేవారు. ఆ వెళ్లిన ప్రదేశాల్లోనైనా, అక్కడి కార్యకర్తలు శాయశక్తులా కృషి చేసి ఏర్పాట్లన్నీ గావించినప్పటికీ, ఏదో ఒక చిన్న లోపం ఉండనే ఉండేది, ఎవరికో ఒకరికి ఏదో ఒక అసంతృప్తి కలుగనే కలిగేది. కానీ ఈ చిన్న చిన్న అవస్థలు ఓర్చుకుంటూ అసలు అక్కడికి వెళ్లడం దేనికి?

తీర్థయాత్రలు చేసినందువల్ల పుణ్యం దక్కుతుందని నమ్మినట్లు, ఆయన సమీపానికి వెళ్లినందువల్ల కూడా అలాంటి దేదైనా లభిస్తుందనా? లేక విగ్రహ ప్రదక్షిణ జరిపినందువల్ల కలిగే ఫలితంలాంటిదేదైనా కలుగుతుందనా? ఈ వెళ్లే విద్యావంతులందరూ ఇలాంటి నమ్మకాలతో ఆయన చుట్టూ చేరుతున్నారనుకునే వీలు లేదు. ఆయన చెప్పే విషయం మీద తగిన శ్రద్ధ పెట్టలేని కొద్ది మందికి బహుశా ఇలాంటి నమ్మకాలేవైనా ఉండి ఉండవచ్చునేమో.

కాని, మొదటిసారి కొత్తగా వెళ్లేవాళ్లు ఆయన్ని గురించి వారూవీరూ ఇంత ఘనంగా ఎందుకు చెప్పుకుంటారో స్వయంగా చూచి వద్దామని బయలుదేరినవారు. ఆ తర్వాత ఎవరైనా "ఆయన ఏమి చెప్పాడండీ?" అని అడిగితే వివరించలేక, "అదేదో మీరే విని తెలుసుకోండి" అని ఊరుకునేవారు. ఆయన చెప్పినదేదో తమని వింతగా స్పృశించి నట్లుండేది కానీ, నోటి మాటల్లోకి మార్చగలిగిన అనుభూతిగా కనిపించేది కాదు.

"కృష్ణమూర్తిగారు సాయంత్రం ఆరు గంటలకు వేదిక వద్దకు వస్తారు" అని తెలిసి కూడా, మధ్యాహ్నం మూడు గంటలకే కొందరు సభాస్థలిలో వేసి ఉన్న జంపకాణాల మీద తమపై ఉత్తరీయమో, స్వెట్టరో మరేదో ఉంచి, తాము వచ్చి కూచోడానికి ముందే ఏర్పాటు గావించుకుంటుండేవారు. ఇలాంటి రిజర్వేషన్ చేసుకోవడానికి మొహమాట

పడే మరికొందరు, సాయంత్రం నాలుగింటి నుండి కాస్త ముందుగా ఉండే వరుసల్లో వచ్చి కూర్చొని, నిరీక్షిస్తూ ఉండేవారు. వారిలో కొందరు మందస్వరంతో ఇతరులకు ఇబ్బంది కలుగకుండా మెల్లిగా సంభాషించుకునేవారు; మరికొందరు మాత్రం – పూర్వం కృష్ణమూర్తిని విని ఉన్నవారు – మౌనంగా, అందరిలోనూ ఏకాంతంగా అలానే ఉండిపోయేవారు. సుమారు రెండుగంటల పాటు అలా నిశ్చబ్దంగా కూచోమని, వారినెవరూ ఆదేశించలేదు. కానీ కృష్ణమూర్తి రాకకై సాధ్యమైనంత వరకూ మనసులో ఏ చలనం లేకుండా ఉండిపోవడం, అలా ఉండాలనిపించడం వారికి సహజంగా స్ఫురించేది.

నిజానికి కృష్ణమూర్తి చెప్పేది ఏముంది? మనసును ఖాళీ పరచడం, దానిని ఆ శూన్యంలోనే ఉండనివ్వడం, కాలతీతమైన ఓర్పుతో, 'వేచి ఉన్నాననే' ఆలోచన రాకుండా 'నిరీక్షిస్తూ' కూచోడం ! ఈ నిరీక్షణలో 'ఆయన త్వరగా వస్తే బాగుణ్ణు' అనే కోరిక లేదు. 'ఇంకా రాలేదేమి?' అనే అసహనం లేదు. ఆయన ఎప్పుడొచ్చినా ఒకటే. ఈ జీవితమే ఆ మహాశక్తి రాకకై, దానిలో ఐక్యమవడానికై ఉద్దేశింపబడింది కాబట్టి, ఇంతకన్నా చేయదగిన పని మరొకటి లేదనే ప్రశాంత నిరీక్షణ. వెలుపలి నుండి చూచేవారికి ఈ మనిషి వేచి ఉన్నాడు కాబోలు అని తోస్తుంది కానీ, ఈ నిరీక్షకుడి మనసులో మాత్రం ఏ కదలికా ఉండదనుకోవాలి.

భక్తి, Devotion అనే పదం ప్రయోగించకుండా, కృష్ణమూర్తి తన శ్రోతల్ని ఈ అంతర్ముఖ స్థితిలోనికి ఎలా తీసుకు వెళ్లగలిగేవాడు? తిరిగి ఆయనను దర్శించబోతున్నా మనుకునే సరికల్లా, వీరిలో ఇంతటి నిశ్చబ్దమెలా అలముకొన్నది? ఆయన మాటలు మనిషిని నిశ్శబ్దం వైపు తోస్తుంటాయా? మనిషిని ఆ నిశ్శబ్దంలో మునకలు వేసేట్లు చేస్తుంటాయా? 'నిశ్శబ్దమే నా సహజస్థితి, ఈ మాటలు, భాష అనేవి నే పుట్టి పెరిగిన తర్వాత నాకు జోడింపబడినవి సుమా!' అని తెలియనారంభించిందా? ఒకప్పుడు, మాట్లాడని వాడు మనిషే కాడని అనుకున్న వాళ్ళు, ఈనాడు మాటలు వ్యర్థమని గ్రహించ నారంభించారా? ఉన్న సుఖమంతా మాటలు, ఆలోచనలు చొరరాని ఆ నిశ్శబ్దంలోనే లభిస్తున్నదా?

ఈ నిరీక్షకులు ఇలా మాట్లాడకుండా కూర్చున్నారంటే, మాటల్ని అదుపులో పెట్టారని కాదు; మాటల్ని వెలికి తీసే ఆలోచనలు కూడా లేకుండా ఉండిపోయారు. ఉక్తి వాచిక మౌనంలో గంపెడంత ఆలోచన ఉంటుంది. ఆలోచన ఉన్నంత కాలం అలజడీ ఉంటుంది.

మరి కృష్ణమూర్తి ఇంత విస్తారంగా మాట్లాడేవాడు కదా, తన శ్రోతల్లో ఈ నిశ్శబ్దాన్ని ఎలా జనింప జేయగలిగాడండీ? అనే ప్రశ్న ఉదయిస్తుంది. 'కృ' ఎంత మాట్లాడినప్పటికీ ఆ మాటలన్నీ ఆలోచన నుండి కాక నిశ్శబ్దంలో నుండి జనించినవి కాబట్టి, మీలోకి, మరొకరిలోకి ఆ నిశ్శబ్దమే ప్రవేశిస్తున్నది. మీకు తెలియకుండా మీలోని నిశ్శబ్దంలో వెళ్ళి కలుస్తున్నది. ఎల్లెడలా నిశ్శబ్దమే అలముకుంటున్నది. కానీ ఈ నిశ్శబ్దం హృదయ కవాటాలు తెరచిన వారికే అందుబాట్లో ఉంటున్నది.

నిశ్శబ్దం అంటున్నారు, అందులో నుండి జనించే మాటలంటున్నారు. ఈ రెండూ ఎలా పొసగుతై అనే సందేహం కలుగుతున్నది. కృష్ణమూర్తి మనసులో నిశ్శబ్దాన్ని భంగపరిచే ఆలోచన లేదు కాబట్టి, అనగా స్వప్రయోజన కాంక్షలేని కారణాన, నోటితో మాటలు పలుకుతున్నప్పటికీ ఆ మాటలన్నీ కూడా ఆ మహా నిశ్శబ్దాన్ని ప్రతిపాదించేవే అవుతున్నై. దేశకాల పరిస్థితులననుసరించి మనసు నేర్చి పదిలపరచుకున్న భాషాపరమైన ఆ మాటలు వెలువడుతుండవచ్చు. కానీ కాలాతీతమైన నిశ్శబ్దం నుండి వెలువడే ఆ వాక్కు నిశ్శబ్దాన్నే సాధిస్తుంటుంది.

అప్పుడప్పుడు కృష్ణమూర్తిగారు "ఈ ప్రాసంగికుడి నిశ్శబ్దం మీ కర్థమైతే, సందేశాన్ని నిశ్శబ్దంగానే అందించవచ్చు. కానీ నిశ్శబ్దాన్ని మీరు అర్థం చేసుకోగలిగిలేరు కాబట్టి ఇలా మాట్లాడవలసి వస్తున్నది" అంటుండేవారు. నిశ్శబ్దంగా ఉంటూ మీరీ లోకంలోని పలుకుల్నీ, శబ్దాల్నీ సరిగా వినడం నేర్చుకుంటే ఈ పలుకంతాలు, పలు స్వరాల ద్వారా మీ ఆలోచనలు నిర్మూలమై, మీలోని నిశ్శబ్దం మేల్కొంటుంది.

కృష్ణమూర్తి దేశంలోకి వచ్చారని తెలియగానే, "ఏటా ఎగిరి వచ్చే మహా పక్షిరాజం (eagle) వస్తుందట, వెళ్లి చూడాలి, వినాలి, ఆ మహా నిశ్శబ్దాన్ని అనుభవించాలి. అది

చూడని, వినని, అనుభవించని ఈ జీవితం ఎందుకు?" అనుకుంటూ బయలు దేరి వెళ్లే వాళ్లు ఈ యాత్రీకులందరూ.

కృష్ణమూర్తి గతించినప్పటికీ, ఆధునిక టెక్నాలజీ మూలంగా ఆయన ఆడియో వీడియో టేప్‌లు, పుస్తకాలూ మీకు లభ్యమవుతున్నాయి. ఆయన లేని కొరత కొంతవరకు ఇవి తీరుస్తున్నె. ఆ నిశ్శబ్దం వీటన్నిటి ద్వారా, ఆ నాటి వారికే కాదు, ఈనాడు మనకూ లభిస్తున్నది. ఉపయోగించుకోవడం, లబ్ధి పొందడం మన చేతుల్లో ఉన్నది.

*ఉవాచ సంచిక **2, 1999***



# మనకు అర్థమయ్యే భాషలో మాట్లాడిన మనిషి

“కృష్ణమూర్తి టీచింగ్‌ను గురించి ఇంతగా మాట్లాడుతున్నారు. ఈయన చెప్తున్నది మునుపెవ్వరూ చెప్పలేదంటారా? మన వేదాలలో ఉపనిషత్తులలో లేనిదేదైనా కొత్తగా చెపుతున్నారంటారా?” అని అడిగేవారున్నారు. నిజమే, వాటిల్లో లేకపోవడమెందు కుంటుంది? ఈ అనుమానం ఒక్క వేదాలు ఉపనిషత్తుల విషయంలోనే కాదు; బైబిల్‌నూ,కొరానును, బౌద్ధ గ్రంథాలను, గురుగ్రంథ సాహెబ్‌ను ప్రామాణికంగా ఎంచే వారికి కూడా కలుగుతుంది.

“మీరు మాట్లాడుతుంటే, ఒకప్పుడు జీసస్ ఇలాగే మాట్లాడి ఉంటాడనిపిస్తుంది,” లేక “మీ మాటలు మాకు గౌతమ బుద్ధుడి మాటల్నే స్ఫురింపజేస్తున్నై” అని ఒక్కొక్క వర్గంవారు కృష్ణమూర్తితో అనడం ఎరుగుదుం. అదలా ఉంచి, కృష్ణమూర్తే ఒకసారి అన్నట్టు “విలువైన ఉపనిషత్తులనే వాటిని మీరెలా ఉపయోగించు కున్నారనుకోవాలండీ? అర్థం చేసుకొని ఆ సందేశమేమిటో గ్రహించి తదనుగుణంగా జీవించ నారంభించారా?” అని సూటిగా ప్రశ్నించారు. అందుకు సమాధానం ‘లేదనే’ చెప్పాలి. వాటిని బీరువాలలో దాచాం, అటక మీదికి ఎక్కించాం. పూజించమంటే పూజిస్తాం. అసంఖ్యాకంగా ఉన్న భాష్యాలకు మరో భాష్యం రాయమంటే రాస్తాం. మన పాండిత్యం పదిమందికీ ప్రదర్శించి వారిని ఆశ్చర్యచకితులను చేస్తాం. వీటి వేటితో నిమిత్తం లేకుండా వాటిని, అందులో కనిపించే విద్యను ‘జీవిస్తున్నామా’ అనేది ప్రశ్న. దానికి సరియైన సమాధానం లేదు.

అలనాటి ఉపనిషత్‌కారులు మానవాళిని హెచ్చరించిన తర్వాత, గౌతమ బుద్ధుడు, మహావీరుడు, ఆదిశంకరులు, చైతన్య మహాప్రభు, జ్ఞానేశ్వర్, కబీర్ మరెందరో మహానుభావులు హెచ్చరించడానికే వచ్చారు. ‘మాకు ఉపనిషత్తులున్నై కాబట్టి, మీరు మాకు కొత్తగా చెప్పేదేముంది?’ అని వారందరినీ తిరస్కరించే వీలుందా? ఒకనాటి దేశకాల పరిస్థితులు మారిన కారణాన, తమ తమ స్వానుభవంతో ఈ నూతన దార్శనికులు ఏవో కొన్ని మార్పులతో చేర్పులతో ఆ మహానుభవాన్ని ప్రజల కందించడానికి పూనుకున్నారనుకోండి. వారిని కాదని, ఆ సజీవ ప్రవాహాన్ని అడ్డుకుంటామా?

సనాతనమైన, నిత్య నూతనమైన ఆ ప్రేమానుభవాన్ని తాను పొంది, ఆధునిక పరిస్థితులకు అనుగుణ్యంగా మలిచి, నేటి ప్రజలు మాట్లాడుకునే సరళ వ్యవహార పరిభాషలో దానిని పదిమందికీ పంచడానికి ముందుకు వచ్చిన ఓ 'ఆప్తమిత్రుణ్ణి' శ్రీ జిడ్డు కృష్ణమూర్తిని, మేము వినదలుచుకోలేదు, చూడదలుచుకోలేదు, అని అంటే నష్టపోయేది ఎవరు? మనమా, ఆయనా?

కాబట్టి మన తిరస్కార భావం కేవలం ఆయన యెడల కాకపోవచ్చు; అసలా మహా విద్య యెడలనే అయి ఉండవచ్చు. ముందు కృష్ణమూర్తిని నిరోధిస్తే, అటు తర్వాత తీరిగ్గా ఆ ఉపనిషత్ గ్రంథాలను పక్కకు పెట్టేయడం చాలా సుళువైన పని. ఇది కేవలం 'విద్య' యెడల విముఖత్వం. నవనవోన్మేషమైన జీవితాన్ని గురించి నేర్చుకోడానికి మన నుంచి పూనిక లేకపోవడం.

మరి పూనిక, దేని విషయంలో కనిపిస్తున్నది? ఎన్నేళ్ళు అనుభవించినా తీరని, విసుగు జనించని ఇంద్రియ సుఖాల విషయంలో చాలా పూనిక వుంటుంది. ఎంత సంపాదించినా, ఎంత కీర్తి గడించినా, మరింత కావాలనే కాంక్షయెడల వుంటుంది. ఈ రంగాల్లో మాత్రం కొత్త సుఖం, కొత్త కీర్తి కొఱకు ఎంతైనా వేగిరపాటు కనిపిస్తుంది. అంటే సుఖాన్వేషణా, ధనార్జనా, కీర్తికై ప్రాకులాట, వీటికి పాతరోత, అనేది వర్తించదన్న మాట.

అయ్యా, నువ్వానాడు ఆ ఋషుల మాట పెడచెవిని పెట్టావు. గౌతమ బుద్ధుడి కాలంలోనూ, అతణ్ణి తప్పించుకు తిరిగావు. అటు తర్వాత ఎందరు వైతాళికులు వచ్చిపోతున్నా, నీవు మాత్రం వారికి ఆమడ దూరంగా పరిగెడుతూనే ఉన్నావు. ఈ ఆత్మబోధ వింటే, ఇది హృదయంలోకి చొచ్చుకువెళ్తే, నీవు కనుగొన్న 'వాస్తవం' ఆధారంగా జీవించ నారంభిస్తే, ఈ సుఖలాలసత్వం తొలగిపోతుందేమోనని నీ భయం.

అల్పమైన ఈ సుఖం కన్నా, మరో మహాసుఖం ఉన్నదని తెలియజేయడానికే, నిన్ను మేల్కొల్పడానికే వచ్చారు ఈ మహానుభావులంతా. నీవు ఆదిశంకరుడి ద్వారా మేల్కొన్నా, నీ జన్మ సంస్కారాన్ని బట్టి నీవు కబీరు ద్వారా మేల్కొన్నా, పాశ్చాత్యుడివైతే

ఎక్‌హార్ట్, జేకబ్‌బొయిమీ ద్వారా మేల్కొన్నా, ముస్లిమువైతే జలాలుద్దీన్ రూమీ, రాబియా, ఫరీదుద్దీన్ అత్తర్ వీరిలో ఎవరి ద్వారా నిద్ర నుండి లేచినా సంతోషమే.

ఏ ఏ కాలానికి తగినట్లు, ఆయా కాలంలో ఆయా సమాజంలో, ఈ మహావృక్షాలన్నీ పూవులూ, కాయలూ అందించినై, బైబిల్ వంటి పవిత్ర గ్రంథముండగా 'నేనెవర్ని చెప్పడానికి?' అని జర్మన్ మిస్టిక్ ఎక్‌హార్ట్ అనుకోలేదు. స్వానుభవంలో పొంగిపొర్లుతున్న దానిని నలుగురికీ పంచక ఉండలేకపోయాడు. ఉపనిషత్తులుండగా, సత్యాన్ని నేనెందుకు ప్రకటించాలి అని అరుణాచల రమణుడను కోలేదు. ప్రత్యేక బుద్ధులు ఎందరెందరో గతంలో జన్మించి వెళ్లిపోగా ఆ తర్వాత అరుదెంచిన గౌతమ బుద్ధుడు, 'సత్యాన్ని నేనెందుకు కొత్తగా కనుగొనాలి, దానిని నేను ఎందుకు ప్రకటించాలి?' అని వెనకాడలేదు.

ఈ సత్యాన్ని దర్శించడం ప్రతి మనిషి యొక్క జన్మహక్కు; కర్తవ్యం కూడాను. ఒకరు మాటల ద్వారా ప్రకటించవచ్చు. మరొకరు తమ కళారాధనలో ప్రదర్శించవచ్చు, వేరొకరు తమ సాహిత్యంలో చూపించవచ్చు. ఎలా ప్రకటిత మవుతుందనేది వారి వారి జన్మ సంస్కారం మీద ఆధారపడుతుంది.

శ్రీ జిడ్డు కృష్ణమూర్తిగారు ప్రసంగించి వెళ్లిన తర్వాత, మరెవరూ ఏమీ చెప్పగలిగిలేరు అని మేము అనుకోడం లేదు. పాత కొత్తలతో నిమిత్తం లేకుండా నువ్వీ జీవితాన్ని నిజంగా దర్శిస్తే, నీ నుండి నీ చేష్ట నుండి, నీ మాటల నుండి, 'అది' కొత్తగా మళ్లీ మా ముందు చిగురిస్తుంది. కృష్ణమూర్తి శ్రవణం, పఠనం ఇందుకు దోహదం చేస్తే అతడి యెడల కృతజ్ఞత ప్రకటిస్తావు. నిజానికి అత్యంతావశ్యకమైనది ఈ జీవిత దర్శనమే.

***ఉవాచ సంచిక 3 1999***

# ఋషుల ప్రదేశం

ఋషిలోయ పబ్లిక్ స్కూలును గురించి, అక్కడి విద్యా విధానం ద్వారా రూపు దిద్దుకున్న విద్యార్థీ విద్యార్థినుల గురించి మీరు చాలా విని ఉంటారు. కాని ఆ స్కూలు పుట్టుపూర్వోత్తరాలు మీకు పూర్తిగా తెలిసి ఉండకపోవచ్చు. సుమారు ఏడు దశాబ్దాల చరిత్రగల ఈ స్కూలును గురించి కొద్దిగా తెలుసుకుందాం.

1924 సంవత్సరానికి మునుపు ఎక్కువ భాగం విదేశాల్లోనే ఉంటూ వచ్చిన శ్రీ జిడ్డు కృష్ణమూర్తి, ఆ ఏటి నుండీ ప్రతి సంవత్సరం ఇండియాకు రానారంభించారు. 1925 లో కృష్ణమూర్తి, ఆయన తమ్ముడు నిత్య, మదనపల్లికి వచ్చినప్పుడు (ఆ సంవత్సరంలోనే అటు తర్వాత నవంబరు మాసంలో, అమెరికాలోని 'ఓహై'లో 'నిత్య' మరణం సంభవించింది) ఆ ప్రాంతంలో ఒక స్కూలు స్థాపించాలనే ఉద్దేశం కలిగి, మంచి స్థలం కోసం వెతుకుతూ ఆ పరిసర ప్రాంతాలన్నీ తిరిగారు. అప్పటికే మదనపల్లిలో శ్రీమతి ఆనీ బెసెంట్ స్థాపించిన నేషనల్ కాలేజ్ ప్రిన్సిపాల్ శ్రీ సి.యస్. త్రిలోకికర్, స్థలాన్వేషణకై బయలుదేరిన మిగతా వారందరితో తాను కూడా బయలుదేరాడు.

నేడు ఋషిలోయగా వ్యవహరించే ఈ గ్రామ ప్రాంతానికి వెళ్లే దారిలో, కుడివైపున ఉన్న కొండ శిఖరాన్ని ఎవరో చూపించారు; ఆనాడు ఆ కొండ శిఖరాన్ని అక్కడి గ్రామ వాసులు చిరుత పులి కొండ అనేవారు. కృష్ణమూర్తి ఆ శిఖరాగ్రంపై ఆసీనుడై పశ్చిమాన ఉన్న ఋషి కొండను దాని సరసనే ఉన్న లోయను నేత్రాలతో సర్వే చేశాడు; ఆ సుందర దృశ్యాన్ని తిలకించి, సంతృప్తి చెంది తాను తలపెట్టిన నూతన విద్యాలయాన్ని ఈ లోయ ప్రాంతంలో స్థాపించడం బాగుంటుందన్నాడు. కృష్ణమూర్తి చేసిన ఈ సూచనను తమకిచ్చిన ('కదలండి ముందుకు' అనే) ఉత్తర్వుగా భావించామంటాడు, ప్రిన్సిపల్ శ్రీ త్రిలోకీకర్.

ఆనాటి నుండి ఆయన సహచరుడు శ్రీ బాలాజీ రావుతో కలిసి ఆ ప్రాంతంలోని భూముల్ని కొనుగోలు చేయనారంభించారు. ఎకరా, వందరూపాయల నుండి మూడు

వందల వరకూ చెల్లించి క్రయం చేశారు. ఖరీదైన చిన్న కమతాలు కొన్నిటిని ఐదు వందల రూపాయలు కూడా పెట్టికొన్నారు; ఈ కొనుగోళ్లు 1926 నుండి 1930 నాటి వరకూ సాగినై, ఆ విధంగా మొత్తం 280 ఎకరాలు సేకరించారు. అంతకు క్రితమే శ్రీ కృష్ణమూర్తి సెక్రటరీ, శ్రీ ఆర్. మాధవాచార్ ఆ లోయకు వెళ్లి, ఇప్పటికీ అక్కడ కనిపించే ఆ పెద్ద మర్రిచెట్టు క్రింద 'కృష్ణ కుటీరం' అనే ఒక చిన్న నివాస స్థలం నిర్మింప జేశాడు. ఈ భూమి కొనుగోళ్లకు వచ్చినవారు అందులో నివసించి తమ వ్యవహారం కొనసాగించేవారు.

స్థలం కొన్న తర్వాత కట్టడాల నిర్మాణం ప్రారంభించారు. విద్యార్థులకు తగిన పాల సరఫరా జరగడానికి, ఒకపాలడైరీ, పాడియావుల కొనుగోలు, అన్నిటికీ ఏర్పాట్లు గావించారు. ఎస్టేట్‌ను అభివృద్ధి చేసే పనులన్నీ 1930–32 సంవత్సరాల్లో చేపట్టారు.

నిజానికి ఈ లోయకు ఆ కాలంలో 'తెట్టులోయ' అని వ్యవహరించేవారు. (సమీపానే 'తెట్టు' గ్రామమున్నది) త్రిలోకికర్ అక్కడ పనులు ప్రారంభించే రోజుల్లో అక్కడి గ్రామీణులతో మాట్లాడుతుంటే, ఋషి కొండమీద, సాధారణ మానవ నేత్రాలకు కనిపించక పోయినప్పటికీ, ఈ నాటికి కూడా ఋషులు ఉంటూ తపస్సు చేసుకుంటుంటారని వారంతా విశ్వసిస్తున్నట్లు గమనించాడు. అటు భారతీయ సంప్రదాయం, ఇటు తన దివ్యజ్ఞాన సమాజ ప్రభావం కారణంగా, త్రిలోకీకర్ ఆ లోయను 'ఋషి లోయ' అని నామకరణం చేశాడు. ఋషిలోయ 2500 అడుగుల (MSL) ఎత్తున ఉన్నది; సరసనే ఉన్న హార్స్‌లీ హిల్స్ ప్రాంతం 4000 అడుగుల (MSL) ఎత్తున ఉన్నది.

మద్రాస్‌లోని అడయార్ థియసాఫికల్ ఆధ్వర్యంలో గిండీ ప్రాంతాన నడుపుతున్న అప్పటి స్కూలును, నాటి ప్రిన్సిపల్ శ్రీ గడ్డమానుపు వెంకట సుబ్బారావు, ఋషిలోయకి తరలించనున్నామని ప్రకటించాడు. ఎక్కడో లోయలో కొత్తగా నెలకొల్పిన స్కూలులో తగిన వసతులుంటాయో ఉండవోనని జంకిన కొందరు విద్యార్థుల తండ్రులు వెనక్కు తగ్గగా, మొత్తం మూడువందల మంది విద్యార్థుల్లో తొంభై మూడు మంది 'మేము సుబ్బారావు శిక్షణ కింద చదివేదే చదువు' అని ధైర్యం చేసి తరలి వచ్చేశారు.

1947 లో ఈ విద్యాలయానికి మొదటిసారిగా వచ్చిన శ్రీమతి పుపుల్ జయకర్, ఆ నాటికి ఈ ప్రదేశంలో కొన్ని స్కూలు కట్టడాలు మాత్రమే ఉండేవనీ, ఆ పెద్ద మర్రి చెట్టు తప్పితే చెప్పుకోదగ్గ వృక్ష సంతతి ఏదీ ఉండేది కాదని అంటూండేవారు. ఆనాటి నుండీ మొక్కలు నాటి మెల్లిమెల్లిగా ఒకటి రెండు దశాబ్దాల కాలంలో ఎంతో అభివృద్ధి సాధించారు. ఈనాడు ఋషిలోయ ఎంత చక్కటి వనమయిందంటే, ఎక్కడెక్కడి పక్షులో కొన్ని ఋతువుల్లో దూరదూరాల నుండి ఉత్సాహంతో, సంతోషంగా ఇక్కడికి తరలి వస్తాయి. ఆ పక్షులతో బాటు వాటిని శ్రద్ధగా పరిశీలించే 'బర్డ్ వాచర్స్' కూడా ఈనాడు ఋషిలోయకి ఆకర్షితులవుతున్నారు.

కృష్ణమూర్తిగారి పాఠశాలలు ఈ దేశంలోనూ తదితర దేశాల్లోనూ అక్కడక్కడా ఇంకా కొన్ని ఉన్నాయి. కానీ ఓం ప్రథమంగా స్థాపించిన ఈ ఋషిలోయ స్కూలంటేనూ, ఇక్కడి ప్రకృతి సౌందర్యమంటేనూ శ్రీ కృష్ణమూర్తికి చాలా ఇష్టముండేది. తనకు ఎవరి మీదనైనా అధిక ఇష్టం జనిస్తే, వారిని ఋషిలోయలో వచ్చి పనిచేయమని ఆహ్వానిస్తుండే వాడు.

ఒకమారు ఆయన విమానయానం చేస్తుండగా, ఒక విదేశీయుడు ఆయన పక్కనే కూర్చొని, ఈ కృష్ణమూర్తి ఇరానియానా, ఇండియనా అని తటపటాయిస్తూ, 'మీ దేశం...' అని అర్ధోక్తిలో ఆగాడు. "నేను ఋషుల దేశం (Land of the Rishis) వాణ్ణి. కానీ మీకా ప్రదేశం భారతదేశ చిత్రపటంలో పేర్కొనబడి ఉండదు" అని చమత్కరించాడు కృష్ణమూర్తి.

'కామెంటరీస్ ఆన్ లివింగ్' అనే కృష్ణమూర్తి పుస్తకాలు చదివారంటే అందులో కొన్ని ప్రకృతి వర్ణనలు ఋషిలోయకి చెందినవనే విషయం మీకు స్ఫురిస్తుంది. పొద్దునా, సాయంత్రం కూడా, దూర దూరంగా వెళ్లి, తన గెస్ట్ హౌస్ గదికి తిరిగి వస్తుండే వాడు శ్రీ కృష్ణమూర్తి. తర్వాతి కాలంలో ఎన్ని కొత్త గెస్ట్‌హౌసెస్, కాటేజెస్ కట్టించినప్పటికీ, కృష్ణమూర్తి ఋషిలోయకి వచ్చినప్పుడల్లా పాత గెస్ట్ హౌస్‌లో తాను మొదట్నించీ నివసించిన గదిలోనే ఉంటుండేవాడు; వృద్ధాప్యంలో కూడా మేడ మెట్లెక్కి ఆ గదికి వెళ్లే విశ్రమించేవాడు. అడపాదడపా డైనింగ్ హాలుకు వచ్చి, వందలాది విద్యార్థులతో కూర్చుని భోజనం చేసేవాడు.

సంపూర్ణంగా మేల్కొన్న ఈ మనీషి జన్మస్థలమైన మదనపల్లె ప్రాంతంలో, ఆయన ఎంతగానో అభిమానించిన ఋషిలోయ స్కూలులో మొదటిసారిగా తెనుగువారు విడిగా సమావేశమవుతున్నారు. కృష్ణమూర్తి ఫౌండేషన్ వారి పరిభాషలో దానిని 'గాదరింగ్' (Gathering) అని వ్యవహరిస్తున్నారు. ఈ మాటకు తెనుగులో అర్థం పదిమంది ఒకచోట పోగవడం. జిజ్ఞాసువులు ఒక ప్రదేశానికి వచ్చినప్పుడు అక్కడ ఉన్న ఆ మూడు రోజుల పాటు, ప్రకటితమయ్యే విషయాన్ని అధ్యయనం చేస్తారని ఆశించదగును. ప్రాసంగికులు చెప్పే మాటలు వినడమే కాక, సౌందర్యంలో తొణికిసలాడే ఈ లోయలోని పక్షుల కుహూ కుహూరావాలు అదే ఉత్సాహంతో చెవిని వేసుకుంటారనీ, అలా శ్రవణం చేస్తూ చేస్తూ, ఆ మూడు రోజుల పాటైనా మనస్సును పక్కకు పెట్టి, హృదయ కవాటాలు తెరచి, తమ జీవితాన్ని తాము అర్థం చేసుకుంటారని అనుకోవచ్చు.

*ఉవాచ, సంచిక 4 1999*



# దైవం ప్రస్తావన అనవసరం : ఉన్నది చూడు

'ఉన్నది చూడు' (సీ వాట్ ఈజ్) అని జిడ్డు కృష్ణమూర్తిగారు తరచూ అంటూండే వారు. ఎట్టెదుట కనిపించేదంతా అందరమూ చూస్తున్నదే కదా, ఇప్పుడు కొత్తగా చెప్తున్నదేమిటి? అయితే మన పరిధిలో ఉన్నది యావత్తూ చూస్తున్నామా, లేక మనకు ఉపకరించేవి, మనకు లాభదాయకమైనవి మన ఆసక్తిని రేకెత్తించే వాటిని మాత్రమే చూస్తున్నామా? అనేది ఒకటి గమనించాలి. మొత్తాన్ని గనక చూస్తున్నట్లైతే, అవి మనలోపల ఏ విధమైన స్పందనలు కలగజేస్తున్నవనే విషయాన్ని, లోన చూడాలి. ఒక దాని యెడల ఇష్టము, మరొకదాని యెడల అయిష్టము, అలాగే మరెన్నో రకాల పరస్పర విరుద్ధమైన భావాలు ప్రకోపిస్తున్నాయా అనేది గమనించాలి. ఈ ద్వంద్వాలకు అతీతంగా, ఏ రకమైన ప్రతిచర్య, ప్రతిక్రియా తలపెట్టకుండా, ఏ పూర్వాభిప్రాయాలకు పూర్వజ్ఞానానికి లోను గాకుండా చూడగలిగి ఉండాలి. ఇంతటి స్వచ్ఛమైన చూపు సిద్ధిస్తేనే, 'ఉన్నది ఉన్నట్లు' చూడగలం. లేని పక్షంలో అభిప్రాయాలు, ఆలోచనలు, లాభనష్టాల బేరీజుతో, మనం చూడదలుచు కున్నవే ఎన్నుకొని చూస్తున్నామన్నమాట. ఈ పాక్షికమైన చూపుకు పరిమితమైన ప్రయోజనమే ఉంటుంది; విముక్తి కలిగించే 'చూపు' కాదు. ఇదొక నిజం.

బాహ్య విషయాల ఎడల మనకొకసారి కోపం జనిస్తుంది; మరోసారి లోభం జనిస్తుంది. ఇంకోసారి అసూయ పుట్టుకొస్తుంది. నాలోని, నా మనసులోని పరిస్థితి 'ఇది'. 'ఇది ఇలా ఉండరాదు, ఆదర్శప్రాయంగా ఉండాలి', అని ప్రారంభిస్తే, దీనిని మార్చడానికి ఈ జీవిత కాలం సరిపోకపోవచ్చు. కాలగతి మీద ఆధారపడుతున్నాను కాబట్టి, చేసే ప్రయత్నం నెరవేరక మునుపే, ఎన్నో ఆటంకాలు, పరిస్థితుల్లో మార్పులు చేర్పులు సంభవించి, ఆదర్శాన్ని మరింత అవతలకు నెట్టి, ఎప్పటికీ అందుకునే అవకాశం లేకుండా పోవచ్చు. లేదా, ఆదర్శాన్నే నాకు సరిపడేట్లు సవరించుకోవచ్చు. ఈ 'ఆదర్శం' అనే పేరిట నా 'స్థితి' నుండి నేను తప్పించుకో చూచే బదులు 'ఉన్నదా'నిని, అనగా 'కనిపిస్తున్నదాని'కి ఏ పేరూ పెట్టకుండా, సమర్థించడం

నిందించడం అనేవి లేకుండా, చలన రహితంగా అలానే ఉండిపోయి 'చూడు' అంటారు శ్రీ కృష్ణమూర్తి.

ఆ 'స్థితి' అంటే, ఆ ఆగ్రహం కానీ, ఆ ద్వేషం కానీ, ఆ ఈర్ష్య కానీ, అది 'నీవే' నంటారు ఆయన. ఇది మరొక 'నిజం', ఓ 'ఫాక్ట్'. ఇప్పటి ఈ నిజాన్ని నువ్వు సంపూర్ణంగా గ్రహిస్తే, దానిని తొలగించడానికి ఈ 'నీవు' అశక్తుడివని కూడా తెలుస్తుంది. నీలో నుండి, 'నీవే అయిన ఈ ఈర్ష్యను' ఎలా నెట్టగలవు ? యత్నిస్తున్నదెవరు? ఆ 'ఈర్ష్య' నుండి విడివడిన ఓ శకలం, ఒక తునక, చేసే ప్రయత్నం ఎలా ఫలిస్తుంది?

ఈ విషయంలో నీవు నిస్సహాయుడివి. నీ వల్ల అయేది కాదు. అందుచేత ఉపాయశాలి అయినవాడు, కుశలబుద్ధి కలవాడు, యత్నించడం మానేసి, దానిని సంపూర్ణంగా తిలకించాలి అంటారు శ్రీ కృష్ణమూర్తి. ఆ 'ఈర్ష్య' లేక ' ఆ నీవు' నిన్ను ఎలా పురికొల్పుతున్నదో, నీ చేత ఏమేమి చేయిస్తున్నదో, చేయించనున్నదో, అది ఏమిటో, ఎవరో తెలియని స్థితిలో ఏ పూర్వాభిప్రాయంతో నిమిత్తం లేకుండా, దీనిని ఎలాగోలా వదిలించుకోవాలనే కాంక్ష లేకుండా, ప్రశాంతంగా తిన్నగా ఏ అలజడీ లేకుండా చూడాలి; ఒక్కొక్క రేకే విచ్చుకుంటూ వస్తుంది. మనసులో ఏ పూర్వజ్ఞానమూ, ఏ ద్వంద్వమూ కదలడం లేదు కాబట్టి, నిశ్చలమైన ఆ చూపుకు దాని సంపూర్ణ స్వరూపంతో అది దర్శనమిస్తుంది. దాని విస్తృత వినాశకర భూతాకారం ఈ 'చూపు'కు కనిపించి కరిగిపోతుంది, మాయమవుతుంది. చూపు సారించిన మనిషి విముక్త స్థితికి చేరాడు.

ఈ 'దృష్టి' నీలో ఉన్నది. కానీ నీది కాదు. ఎవరిదీ కాదు. కానీ ఇది నిన్నా విముక్త స్థితికే చేర్చగలదు. విముక్తి మనిషికి కరుణ, మైత్రీ భావాలను ప్రసాదిస్తుంది. కారుణ్యమూర్తిగా రూపొందిన విముక్త జీవి, ఏ దేవుణ్ణి ప్రార్థించాలి?

దేవుడున్నాడా లేడా అనే చర్చ అప్రస్తుతం. ఉన్నాడనే వారూ లేడనేవారూ కూడా స్వయంగా ఏమీ తెలిసి అంటున్న మాటలు కావవి. ఇద్దరి అజ్ఞానమూ ఒకే రకమైనదే. నీవు 'చూపును' గనక కనుగొంటే 'ఉన్నదేదో' కనిపిస్తుంది. దాని విశ్వరూపం

దర్శనమిస్తుంది. సరిగా కళ్ళు తెఱచి చూడనందువల్లనే ఇన్నాళ్ళుగా, ఇన్నేళ్ళుగా, నీ 'స్థితి'కి దాసుడవై చరిస్తూ వచ్చావు. ఇప్పుడు తిన్నగా చూడనేర్చావు కాబట్టి, బాహ్య పరిస్థితుల నుండి, నీ మనః ప్రవృత్తి నుండి విముక్తుడవయ్యావు. ఏది ఉన్నదో ఏది లేదో సర్వం నీకే తెలుస్తూ ఉంటుంది.

కృష్ణమూర్తిగారు ఎక్కడో ఒకసారి, 'అయ్యా' ఉన్నదండీ, ఉండనే ఉంది; లేదని మేమనడం లేదు' ('There is', Sir, we are not saying, 'There is not') అన్నారు. ఏమి ఉన్నదో ఏమి లేదో, అలనాటి గౌతమ బుద్ధుడూ ప్రవచించలేదు; జిడ్డు కృష్ణమూర్తిగారూ ప్రకటించలేదు. లక్షల కోట్ల సంవత్సరాలుగా ఎవరో 'ఉన్నది' అన్న మాటను విశ్వసిస్తూ స్వయంగా ఏదీ కనుగొనకుండా, ఏ మాధుర్యమూ ఎఱుగని, ఎండిపోయిన బ్రతుకులు గడుపుతూ వచ్చాం.

కనీసం ఇప్పుడైనా 'కనుగొనడానికై' తన జీవితాన్ని అంకితం చేసిన, ఈ ఇరవైయవ శతాబ్దపు మహామనీషి శ్రీ జిడ్డు కృష్ణమూర్తిని చూచి, అతడికి స్పష్టంగా కలిగిన ఆ నిశ్చయ జ్ఞానం, ఆనందానుభూతిని గమనించి, ప్రేరణ పొంది, ప్రవాహజీవులుగా మనం బ్రతుకుతున్న తీరును విడనాడి, మనమూ ఆయన సూచించే ప్రయత్నం ప్రారంభించవచ్చు నేమో !

*ఉవాచ సంచిక 7, 2001*



# ఈ బోధను జీవించి చూడండి

కృష్ణమూర్తి గారిని చదవాల్సిన అవసరమేమున్నది? నీకు నువ్వు ఇప్పటికే బాగా పరిచయమై వుంటే చదవాల్సిన అవసరం లేదు. నీకీ లోకంలో ఎందరితోనో పరిచయమున్నమాట వాస్తవమే. ఎందరినో అర్థం చేసుకున్నానంటావ్: వారిని గురించి ఏదో తీర్పులు చెప్తుంటావ్. కానీ నీతో మాత్రం నీకింకా పరిచయమేర్పడి వుండదు. నిన్ను నీకు పరిచయం చేయడానికే. నిన్ను నువ్వు అర్థం చేసుకోడానికే కృష్ణమూర్తి తన జీవితం పొడుగుతా కృషి సల్పారు. నీకు నువ్వు అర్థమైన రోజున విముక్తుడి వవుతావు.

కృష్ణమూర్తి పుస్తకాల్లో సత్యం నిక్షిప్తమై వున్నదనుకోకు. సత్యం ఏ పుస్తకంలోనూ; ఏ అక్షర సముదాయంలోనూ వుండదు. సత్యం సజీవమైనది; ఎక్కడా స్థాణువుగా వుండ జాలదు. అందువల్ల కృష్ణమూర్తి పుస్తకాల్లోనే కాదు, ఏ గ్రంథంలోనూ సత్యం నీకు లభించదు. సజీవ సత్యాన్ని ప్రాణమున్న నువ్వే, నీ అంతర్నేత్రమే దర్శించాలి. అయితే ఆ దర్శనం సాధ్యపడాలంటే నీలోని ఆటంకాలు తొలగాలి. ఈ అవరోధాలు ఎవరో ఏర్పరచినవి కావు. నువ్వు నిర్మించుకున్నవే. నీ కామమూ, క్రోధమూ, నీ ఆకాంక్షాపరత్వమూ, ఇవన్నీ నీలోనే పుట్టినై: నువ్వే వాటిని పెంచి పోషించావు. మొక్కగా వున్న రోజుల్లో తుంచలేక పోయావు. ఇప్పుడు మానై కూచున్నాయి. పొంగదీయగలిగి లేవు. ఈ అన్ని గుణాలనూ లోలోన అణగత్రొక్కి, సంఘం మెచ్చుకునే ఏవో కొన్ని పనులుచేసి గౌరవనీయుడిగా చలామణి అవడం నేర్చుకున్నావ్. సంఘంలో చెల్లిపోతున్నావ్ అనే మాట నిజమైనప్పటికీ, నీ ప్రాచీన వాసనల నుండి నువ్వు విముక్తి సాధించలేకుండా వున్నావు. కృష్ణమూర్తి ప్రస్తావించే ఇతర బాహ్య "కండీషనింగ్"లకన్నా, ఈ 'కండీషనింగ్' మరీ బలీయమైనది. ఏనాడు ప్రారంభమైనదో ఎవరికీ తెలియదు. ఉన్న మతాన్ని విసర్జించి, మరో మతాన్ని స్వీకరించడం, చొక్కా మార్చుకున్నంత సులభం. మన మనసుకు నచ్చిన ఏ ఆదర్శాన్నైనా ఇట్లే ఔదల దాల్చవచ్చు. కానీ మన మనసుకు ఏదైనా అసలు ఎందుకు నచ్చుతున్నది అనే విషయం తటిస్తే కానీ, మూలకారణం నుండి విముక్తి చెందలేవు.

ధనాన్ని త్యజించవచ్చు. సన్యాసం పుచ్చుకున్నాననవచ్చు. సేవా కార్యక్రమాలకు అంకితం కావచ్చు. అయినప్పటికీ నిన్ను నువ్వు తెలుసుకోలేకపోతే భ్రమైక జీవితమే గడుపుతుంటావు. ఇదే మాట కృష్ణమూర్తిగారు మళ్ళీ మళ్ళీ నొక్కి చెప్తుంటారు. నిన్ను నువ్వు తెలుసుకోకపోతే, నువ్వు చేసే ఏ పనికైనా పునాది అంటూ వుండదు. ఆ పని వెనకాల ఏదో ఉద్దేశం మాత్రం ఉంటుంది. ధనార్జన, కీర్తి గడించడం, నలుగురిలో మంచివాడుగా పరిగణింప బడాలనుకోవడం. ఇలాంటి కారణమేదో ఉండి తీరుతుంది. ఉద్దేశపూర్వకంగా చేసే ఇలాంటి పనులకు పరిమిత ప్రయోజనం ఉన్నప్పటికీ, చిట్టచివరకు దీనిలో నుండి అనర్థమే బయలుదేరుతుంది. ఉద్దేశం వెనకాల ఏదో ఆశించడం కూడా ఉంటుంది కదా? ఆశించింది నెరవేరవచ్చు, నెరవేరకపోవచ్చు. తాను ఇంత శ్రమకోర్చి చేసినదంతా చివరకు తనకే ఫలితాన్నీ ఇవ్వలేదనీ, తన సేవను ఎవరూ గుర్తించలేదనీ వాపోవ నారంభిస్తాడు. ఇలాంటి వైఫల్యాన్ని అనుభవించనవాడు 'సినిక్'గా మారిపోతాడు. కఠినుడైపోతాడు; ఇదీ అనర్థమంటే.

కాబట్టి కర్మాచరణ, లేక కృష్ణమూర్తి భాషలో action విముక్తిదాయకంగా ఉండాలి. ఉద్దేశపూర్వకమైన కర్మనెరిగున్నాం కానీ, ఉద్దేశరహితమైన కర్మ మనమెరుగుదుమా? ఎట్టి పరిస్థితుల్లో అలాంటి కర్మ మనలో నుండి సహజంగా, అప్రయత్నంగా ఉదయిస్తుంది? ఇలాంటి విషయాలన్నీ కృష్ణమూర్తి తన పుస్తకాల్లో, ప్రసంగాల్లో తఋస్తుంటాడు. నీలోకి నువ్వు ఎలా వెళ్ళాలో విశదీకరిస్తుంటాడు. నీ కంటి ముందర తన మాటల్లో ఒక అద్దం నిలపెడతాడు. ఆ అద్దంలో నీ మనసు ప్రవర్తిల్లే తీరు నీకు కనిపించనారంభిస్తుంది.

విముక్తినిచ్చేది కృష్ణమూర్తి కాదు. నిన్ను నువ్వే విముక్తుణ్ణి చేసుకుంటావు. అయితే కృష్ణమూర్తి నీకొక ఆప్తమిత్రుడిగా సహాయ పడుతుంటాడు. తన అనుభవాన్ని నీ ముందర పరుస్తుంటాడు. ఈ కృష్ణమూర్తి ఎవరో 'సకల సద్గుణ సంపన్నుడుగా' నీ ముందర వచ్చి నుంచోడం లేదు: కుడి ఎడంగా నీ బాధ ఎటువంటిదో, ఒకప్పుడు ఆయన బాధా అటువంటిదే. దుఃఖం కలిగినప్పుడు నువ్వెంత అలమటించావో, తన తమ్ముడు నిత్యానంద మరణించినప్పుడు, ఆయానా అంత తల్లడిల్లిపోయాడు.

ఈ మానవులంతా ఒకటే. వీరు ఏ దేశంలో ఏ సమాజంలో జీవిస్తున్నా, వీరి బాధా, వేదనా ఒకటేనంటాడు కృష్ణమూర్తి. ప్రపంచంలోని పలుదేశాలు పోటీపడి, అణ్వాయుధాలు నిర్మించుకుంటున్న నేటి తరుణంలో మానవాళిని, మతాలవారీగా, జాతుల వారీగా వీక్షించడంలో వివేకం లేదు. ఎవరికి ఎక్కడ ఆగ్రహముదయించినా స్వపర భేదం లేకుండా మానవాళి మొత్తం తుడిచిపెట్టుకుపోయే ప్రమాదం ఏర్పడింది. పొంచి వున్న ఈ ముప్పును గ్రహించుకున్న మానవుడెవరైనా, మతాన్ని జాతిని పరిగణించకుండా తనని తాను మార్చుకోడానికి ప్రయత్నించాలి. మనిషి తనలోనికి తాను చూచుకొని తన ఈర్ష్య, ద్వేషం, క్రోధం నుండి విడివడడం ఒక్కటే తరుణోపాయం.

అందువల్లనే కృష్ణమూర్తి సంఘటిత మతాలు, జాత్యహంకారాలు, భాషా దురభిమానాలూ మానవుని విడదీస్తాయనీ, పోరుకు దారితీస్తాయనీ, చివరకు వినాశాన్నే మిగులుస్తాయనీ సుమారు ఏడు దశాబ్దాలపాటు చెప్తూ వచ్చాడు. మీరు విన్నారా? ఆచరించేంతగా అర్థమయిందా?

*ఉవాచ (జి.కృ. కేంద్రం హైదరాబాద్) జనవరి 2002*



# ఆదర్శం ద్వారా హింస తొలగదు

మనిషి ఎక్కడైనా ఎప్పుడైనా, దౌర్జన్యపరుడే, హింస అనే లక్షణం అతడిలో చాలా లోతుగా పాతుకుపోయివుంది. స్వార్థం వుంటే, మనిషిలో ఏదోరకమైన హింసవున్నట్లే హింసను క్రియా రూపంలో ప్రదర్శించకపోయినా మనసులోనూ మాటలోనూ మనిషి దీనిని ఒక పట్టాన వదలించుకో గలిగిలేడు.

మనిషిలో, బహుశా మృగాంశం అధిక పాళ్ళలో వుండడమే ఇందుకు కారణమై వుండవచ్చునంటారు శ్రీ జిడ్డు కృష్ణమూర్తిగారు. పరిణామక్రమంలో మనిషి ఎలా రూపొందాడనే ప్రస్తావనతో నిమిత్తం లేకుండానే మనలోకి మనం జాగ్రత్తగా చూచుకుంటే అన్ని మృగాల లక్షణాలు మనలో కనిపిస్తై. మానవుడికి వుండదగిన ప్రత్యేక, విశిష్ట లక్షణాలు అతి కొద్దిమందిలోనే ద్యోతకమవుతాయి. సంఘంలో పెద్దలుగా చలామణి అయ్యేవారు కూడా మానవుల్లాగా నటించగలరేకానీ, హింసా ప్రవృత్తిని పూర్తిగా వదిలించుకోగలిగి వుండరు. అలా నటించేవారిని మినహాయిస్తే, మిగతావారంతా తరచూ తమ హింసనూ, దౌర్జన్యాన్ని ప్రకటిస్తూనే వుంటారు.

మనలో ఇంత లోతుగా వ్రేళ్ళూనిన ఈ హింస మనల్ని ఇప్పుడు ఏమిచేస్తున్నదో మొదట గమనించాలి. ప్రారంభంలోనే దానిని గురించి ఒక అభిప్రాయం ఏర్పరచుకుంటే ఆ అభిప్రాయానుసారంగానే అది చెడ్డదని, గర్హ్యనీయమైనదనీ వదలించుకోవలసినదనీ, ఆలోచించనారంభిస్తాం. ఆలోచన, దాని వంక తిన్నగా చూడనివ్వదు. ఇలాంటి ఆలోచనలో నుండే, అహింస పరమధర్మమంటూ వారూ వీరూ చెప్పిన వాక్యాలేవో ఉదహరిస్తాం. అహింస అనే ఆదర్శాన్ని మనసులో ఏర్పరచుకొని, దాని ప్రకారం మన నడవడిని సరిదిద్దుకునే ప్రయత్నం చేస్తాం. ఈ సందర్భంలో మనలోని హింసను ఏనాటికానాడు అణగత్రొక్కి, ఆ విధంగా దాని నుండి విముక్తులమవగలమని భావిస్తాం. కానీ ఇది ఎక్కువ కాలం కొనసాగదు. చిన్న విషయాలలో కొంత విజయం సాధించినట్లుగా కనిపించినా ఏదో ఒక దశలో ఆ ఆదర్శం, మన ఆలోచనకు మించిన విషయం మనకు ఎదురైనప్పుడు, కుప్పకూలుతుంది. అణచిపెట్టబడిన ఈ దౌర్జన్య

లక్షణం ఒక్కసారిగా పెల్లుబికి మనల్ని హింసకు పురికొల్పుతుంది. కాబట్టి ఆదర్శాన్ని సృష్టించుకొని, ఆలోచనాత్మకంగా హింసను వర్జించగలిగిలేము.

మన ఆలోచన, హింసను కొన్ని సందర్భాల్లో సమర్థిస్తుంది. ఈ పరిస్థితిలో హింస అనివార్యమని సలహా ఇస్తుంది. ఇలా సమర్థించడం ప్రారంభమయ్యేసరికి, దాదాపు అన్ని పరిస్థితుల్లోనూ పెద్దవీ, చిన్నవీ తేడా లేకుండా, సర్వే సర్వత్రా, హింస సమర్థనీయమేనని తోచి, అలవాటుగా మారిపోతుంది. అందుచేత హింసను సమర్థింప బూనుకోడం, మనిషిని మరోగతిలోకి తోసేస్తుంది.

లోపలి నుండి బయలుదేరుతున్న ఈ దౌర్జన్య ప్రవర్తనకు, "హింస" అని పేరు పెట్టగానే భాష అందించిన ఆ పేరుతో దానిని గుర్తించగానే, హింస చాలా చెడ్డదనీ, అది వర్జనీయమనీ మనం భావించనారంభిస్తాం. సంఘం మన మెదడులో ఈ మాటలను ఎంతో కాలంగా నూరిపోసి వుంటుంది. అందుచేత సంఘం దీనిని మెచ్చదు అనే ఉద్దేశంతో వెంటనే దానికీ మనకీ ఎడం కల్పించుకోచూస్తాం. ఇలా దానిని దూరంచేస్తే దాని స్వరూపస్వభావాలు మనకెలా తెలుస్తై? వారు వీరు చెప్పడం, రాయడం ద్వారా తెలియడంకాదు. మనకే స్వయంగా తెలిసిరావాలి. అలా తెలియాలి అంటే దానిని దగ్గరగా సమీపంగా జాగ్రత్తగా చూడాలి. ఏదో పేరుపెట్టి ముందే దాని యెడల వైముఖ్యం ఏర్పరచుకుంటే దగ్గరకు తీసుకొని చూచే అవకాశమేముంటుంది?

అందుచేత, ఈ జ్వలిస్తున్న దానికి ఏ పేరూ పెట్టకండి, అంటే దానిని మీ పూర్వ జ్ఞానంతో, మీరు ఒకప్పుడు సేకరించిన అనుభవంతో సంఘం చెప్పిన నీతితో, దేని ఆధారంతోనూ దానిని గుర్తుపట్టకండి. అంటే గతానికి సంబంధించిన జ్ఞానమూ, జ్ఞాపకాలు, ఏవీలేకుండా ఓంప్రథమంగా, మొదటిసారన్నట్లు తాజాగా దానివంక చూస్తున్నారన్నమాట. అలాంటి చూపులో గతానికి స్థానంలేదు. గతం చొచ్చుకు వచ్చిందంటే, ఒకరకమైన పరిష్కారాలు చేసిన ఆనాటి మనసు ఇప్పుడు కూడా ఆనవాయితీగా అదే విధమైన పరిష్కారం సూచిస్తుంది. అప్పటి పరిష్కారాలు ఆ సమస్యకు సరియైన పరిష్కారమయ్యేవుంటే, ఇప్పుడా సమస్య మళ్ళీ తల ఎత్తేది కాదు. ఆనాటి ఆ పరిష్కారం అసంపూర్ణమై వుంటంచేతనే ఈ సమస్య మళ్ళీ ఎదురౌతున్నది. గతాన్ని

తెంచేసి, నూతనమైన, నిర్మలినమైన నేత్రాలతో దీనివంక చూచారంటే, సంపూర్ణమైన పరిష్కారం సంభవించే అవకాశమున్నది.

తన ప్రయోజనం సాధించుకో నివ్వకుండా ఎవరో ఆటంకమేర్పరిచారు. అలా అడ్డం నిలచిన వారిపై తనకు కోపం వచ్చింది. ద్వేషం రగిలింది. తనకూ తన ప్రయోజన సాఫల్యానికి మధ్యనున్న వారిని నాశనం చేయాలనిపిస్తున్నది. సభ్యసమాజంలో ఆ ఆగ్రహాన్ని, ద్వేషాన్ని వెలిగ్రక్కలేక, ఆటంకాన్ని తొలగించుకోడానికి పలురకాల ఎత్తులు, పన్నాగాలు ప్రారంభిస్తాడు, అవేవీ ఉపయోగ పడకపోయినప్పుడు, ఈ ఆటంకం తొలగడానికి ఒక్కటే మార్గం. దీనిని పూర్తిగా నిర్మూలించాలి. అని నిశ్చయించుకుంటాడు. లోపల సెగలు గక్కుతున్న లక్షణానికి ఇది పరాకాష్ఠ.

ఇది తన మనసులో మొదట చిన్నదిగా, అల్పంగా ప్రారంభమై, చివరకు తనకు అడ్డమొచ్చిన వారిని నిర్మూలించాలనేంతవరకూ తీసుకువెళ్ళింది. తన కంటితో తాను దాని విస్తృత భూతాకారాన్ని స్వయంగా చూచాడు. తన మనోవీధిలో పూర్తిగా దర్శించాడు. అమ్మో, తనలోని ఈ లక్షణం నిద్రాణమై వున్న వేయిపడగల పాము. ఇంతకాలంగా పసిగట్ట కుండా, తాను దీనిని పోషిస్తున్నాడు! దీనిని గనక తిన్నగా గమనించక వుండి పోయివుంటే ఈ హింసాప్రవృత్తి ఆఖరికి తన భార్యా బిడ్డల్ని కూడా సంహరింపజేయగలదన్న మాట.

ఇది ఇంత సర్వనాశనకారి అని స్వయంగా చూచి కనుగొన్న తదుపరి, ఇది తనను ఇక ఇష్టమొచ్చినట్లు ఆడించలేదు. అది చెప్పినట్లు ఇతడు చేయడని తెలిసిన తర్వాత, అది ఇక్కడ వుండి సాధించగలిగినది ఏమీలేదు కాబట్టి, సెలవుగైకొని వెళ్ళిపోతుంది.

తాను "హింస" అని పేరుపెట్టుకున్న దానినుండి ఇప్పుడు సంపూర్ణంగా విముక్తుడు. ఇక అతడి మనసు, మాట, చర్య, వీటి వేటిల్లోనూ ఈ హింసాగుణం వుండదు. తాను అహింసావాదినని చెప్పుకోనవసరంలేదు. తనని చూచినవారు ఆ విషయాన్ని తమంతట తామే గ్రహిస్తారు. తననిచూచి నేర్చుకోగలిగినంత మేరకు నేర్చుకుంటారు.

ఈ నూతన జీవితంలో తనకు ఆటంకాలు ఎదురవవనికాదు, అవి ఎప్పుడూ ఉంటూనే వుంటై. అయితే ఆ ఆటంకాలను, కేవలం ఆటంకాలుగానే పరిగణిస్తాడు. వాటి విషయంలో ఏ భావోద్వేగమూ వుండదు. హింసను ఆశ్రయించి ఎవరినీ నిర్మూలించాల నేంతటి ఉద్రేకం కలగదు. సరికదా, ఆఖరికి ద్వేషమూ కోపమూ కూడా ఉండవు. వేగంగా ప్రవహించే నదికి చాలా పెద్ద బండరాయి అడ్డంవస్తే ఏమిచేస్తుంది? దాని పక్కనుండి ప్రవహిస్తూ వెళ్ళిపోతుంది. అలాగే తను కూడా ఒక పక్కకుండా వెళ్ళిపోతాడు. అయినప్పటికీ అడ్డగిస్తే న్యాయసమ్మతమైన విధానాల ద్వారా పరిష్కరింపజేస్తాడు.

ఈ క్రోధమూ, హింస, ద్వేషమూ, తొలగిన తర్వాత తానెలా చరిస్తాడో, తన ఉద్దేశాలు ప్రేరణలు ఎలా వుంటాయో, స్వానుభవంతో తెలుసుకోవలసిందే కానీ, మరొకరు చెప్పగలిగిలేరు.

*'ఉవాచ' జి.కృ. కేంద్రం, హైదరాబాద్, జనవరి 2002*



# జీవిత గ్రంథం

జీవితమనే పుస్తకాన్ని చదవడం అతి ముఖ్యం. మనుష్యజాతి గాథ యావత్తూ నీలో నున్నది. దాని విస్తారమైన అనుభవం, లోతుగా పాతుకుపోయిన భయాలు, అది పడే వేదన, దుఃఖం, సుఖం, వేలాది ఏళ్లుగా మనిషి పోగేసుకున్న నమ్మకాలు, విశ్వాసాలు, ఇవన్నీ నీలోనే ఉన్నాయి. నీవే ఆ చరిత్ర గ్రంథానివి. ఈ పుస్తకాన్ని ఏ ప్రచురణకర్తా ప్రచురించలేదు. ఈ పుస్తకాన్ని విక్రయించేవారు లేరు. నిన్ను గురించి తెలుసుకోడానికి నువ్వు ఏ సైకోఎనలిస్టు (మనస్తత్వవేత్త) వద్దకు వెళ్ళి ప్రయోజనం లేదు. అతడి జీవిత గ్రంథం నీ జీవిత గ్రంథమే. ఈ జీవిత గ్రంథాన్ని నువ్వు జాగ్రత్తగా, ఓర్పుగా, పూర్వాపరాలు గమనిస్తూ చదివితే తప్పితే, మనం ఇప్పుడు జీవిస్తున్న ఈ నీతి బాహ్యమైన, కుళ్లిపోయిన, అక్రమమైన సమాజాన్ని నువ్వు ఏనాటికీ మార్చలేవు. సమాజంలో దుర్భర దారిద్ర్యమూ, ఎంతో అన్యాయమూ, దర్శనమిస్తుంటై, నేటి ప్రపంచపు ఈ అధ్వాన్న పరిస్థితి, ఈ దుర్నీతి, యుద్ధాలు – యుద్ధం అన్నిటికన్నా మరీ భయంకర నేరమనేది గుర్తుంచుకో – ఇదంతా చూచినప్పుడు, లోతుగా చింతించే ఏ మనిషైనా ఈ పరిస్థితిని ఎలా సరిదిద్దాలా అని ఆలోచించకుండా ఉండలేడు. మనం జీవిస్తున్న ఈ సమాజాన్ని మనమే, అనగా మనలో ప్రతి ఒక్కరమూ, మన తల్లిదండ్రులు, వారి పూర్వీకులు, అందరమూ కలిసి తయారు చేసుకున్నాం.

మనం స్వయంగా నిర్మించుకున్న ఈ సమాజంలో సమూలమైన మార్పు తీసుకురావడానికి, దీని రూపాన్నే మార్చివేయడానికి, నీ జీవితగ్రంథాన్ని నువ్వు జాగ్రత్తగా పఠించాలి. మానవ నిర్మితమైన ఈ సమాజాన్ని మార్చకుండా వదిలేస్తే, ఇది మరింత కుళ్ళిపోతుంది. మరిన్ని యుద్ధాలు చెలరేగుతాయి. మానవ మేధ మరింతగా ధ్వంసమైపోతుంది. నువ్వే ఈ పుస్తకం అనుకున్నాం కదా, మరి ఈ పుస్తకాన్ని చదవాలంటే, ఇది ఏమి తెలియజేస్తున్నదో నువ్వు జాగ్రత్తగా ఆలకించాలి. ఈ వినడమనేది ఒక కళ. 'వినడం' అన్నప్పుడు, పుస్తకం ఏమి చెప్తున్నదో ఆ చెప్పింది చెప్పినట్లుగా వింటే, విన్నట్లు అవుతుందిగానీ, దాని అర్థతాత్పర్యాలు ఇవి అని అనుకోడం కాదు. ఆకాశ

వీధిన వెళ్తున్న ఓ మేఘాన్ని ఎలా దర్శిస్తూ ఉండిపోతావో, అలాగే ఆ పుస్తకం చెప్తున్న దానిని ఆలకించు. అంబరంలోని ఆ మేఘాన్ని గాలిలో ఊగులాడుతున్న ఆ తాటి ఆకుల్ని ఆ సూర్యాస్తమయ సౌందర్యాన్ని చూస్తూ ఉండిపోగలవేకానీ, వాటి విషయంలో నువ్వేమీ చేయలేవు కదా? వాటి వేటినీ, ప్రయత్న పూర్వకంగా నువ్వు మార్చగలిగి లేవు. అదేవిధంగా నీ జీవిత గ్రంథం ఏమి తెలుపుతున్నదో స్పష్టంగా తెలుసుకోడానికి, నీకీ ఆలకించే కళ చేతనయి ఉండాలి. పుస్తకం నువ్వే సుమా ! అదే సమస్తమూ బయట పెడుతుంది.

గమనించడం, చూడడం అనే ఇంకో కళ ఒకటున్నది. నీవే అయిన ఈ పుస్తకాన్ని పఠించేటప్పుడు, నువ్వు వేరుగానూ, పుస్తకం వేరుగానూ ఉండవు. నీకు వేరుగా పాఠకుడొకడూ, పుస్తకమొకటీ, అనేవి ఉండవు. పుస్తకం నువ్వే.

ఇవికాక నేర్చుకునే కళ అని మరొకటి ఉన్నది. కంప్యూటర్లు కూడా నేర్చుకుంటాయి సుమా! ఆ యంత్రాలను గనక 'ప్రోగ్రాం' చేస్తే వాటికి మనం తెలియజేసిన విషయాలన్నిటినీ, అవి మనకు మళ్లీ తెలియజేయగలిగి ఉంటాయి. మనుషులమైన మనం కొంత అనుభవాన్ని గడిస్తాం. కొంత విషయ జ్ఞానం పోగేసుకుంటాం; దానినంతా సంగ్రహించి మెదడులో ఉంచుకుంటాం. ఆ స్మృతిలో నుండి ఆలోచనలు వెలికి వచ్చినందువల్ల, జీవితంలో అనేక కర్మ లాచరిస్తుంటాం. ఆ రకమైన కర్మాచరణ ద్వారానే మీరు 'నేర్చు' కుంటూ ఉంటారు. అటువంటి 'నేర్చుకోడం' ద్వారా మరింత విషయ జ్ఞానం పోగుచేసుకోడం సంభవిస్తూ ఉంటుంది. మేల్కొని ఉన్న మనిషి నేటి కంప్యూటర్ యంత్రం లాగా పొడుగుతా చేస్తుండేది ఇదే. అనుభవం, తద్వారా జనించే జ్ఞానం, స్మృతి, ఆలోచన, తదనుగుణమైన కర్మాచరణ – పొడుగూతా మనం చేసేదల్లా ఇదే. దీనినే మనం నేర్చుకోడం, 'అనుభవం ద్వారా నేర్చుకోడం' అని పేర్లు పెట్టుకుంటాం. మనిషి జీవిత గాథ ఇదే – జీవితం నిరంతరం 'ఇప్పుడేమంటావ్'? అని మనపై ఒక సవాల్ విసరడం, ఆ సవాల్‌కు మనిషి ఇచ్చే ప్రత్యుత్తరం, ఇదే మన జీవిత గాథ. మానవాళిని గురించిన మొత్తం జ్ఞానమే ఈ పుస్తకం; ఆ పుస్తకానివి నువ్వు.

నేనింతకుముందే అన్నట్లు, చూడడం ఒక కళ, వినడం ఒక కళ, నేర్చుకోడం మరో కళ. తనకు తెలిసిన దాని నుండి, తత్సంబంధ జ్ఞానం నుండి, మామూలు మనిషి ఎప్పటికీ విముక్తుడు కాలేడు. అందువల్ల ఇప్పటి మన 'నేర్చుకోడం' యావత్తూ యాంత్రికమైన ఓ ప్రక్రియ. కానీ నిజంగా నేర్చుకునే కళ యొక్క భావార్థమే వేరు. నేర్చుకోడం అంటే మనమెరిగున్న విషయజ్ఞానం పొలిమేరల వరకూ విచారణ సలిపి, ఆ పైకి సాగిపోవడం. మరిప్పుడు ఈ వినడం, గమనించడం, నేర్చుకోడం అనే మూడు ప్రక్రియలతో, ఇద్దరమూ కలిసి జీవితం అనే ఈ గ్రంథాన్ని పఠిద్దాం రండి.

మనసు పెట్టి వినండి. మన జీవితమే అయిన ఈ పుస్తకాన్ని ఎలా చదవాలో తెలిస్తే ఇప్పుడు మనం అనుభవించే పలురకాల సంఘర్షణలూ, ఈ పడుతున్న ప్రయాస, బాధ, దుఃఖం అంతమవుతాయి. ఇలా యీ దుఃఖం అంతమైన మనసే ధార్మికమైన మనస్సు. ఇదే స్వేచ్ఛగల మనసు; అంతేగానీ నమ్మకాలతో విశ్వాసాలతో నిండిపోయిన మనసు, నిత్యానుష్ఠానం అనే అలవాటుకు అంకితమయిన మనసూ, ధార్మికమైన మనసు కాదు. గ్రంథమంతా చదివిన తర్వాత, ఇటువంటి స్వేచ్ఛాయుతమైన ధార్మికమైన మనస్సునే, సత్యం అనుగ్రహిస్తుంది అనే విషయం అర్థమవుతుంది.

గ్రంథంలోని ప్రథమ ప్రకరణమేమిటి? ఇది నిన్ను గురించిన గ్రంథమే. మరి అందులోని మొదటి ప్రకరణంలో ఏమున్నదో చూడండి.

మన జీవితమంతా వైరుధ్యాలతో నిండి ఉన్నదనేది మనం గమనించే విషయాల్లో మొదటిది. మనలో ఒక సరియైన క్రమం (order) లేదు. క్రమమంటే, ఏదైనా నిర్మించబోయే ముందు తయారు చేసే ఓ నమూనా చిత్రపటం (blue print) ననుసరించి సృష్టించిన క్రమం గురించి కాదు, నే చెప్తున్నది. ప్రతిదానినీ, దాని యొక్క యథాస్థానంలో ఉంచడమే ఆర్డర్. విధివిధాయకంగా ఒక కర్తవ్యాన్ని పాలించడం, ఒక ప్రత్యేకమైన అలవాటు ప్రకారం యాంత్రికమైన క్రమాన్ని పాటించడం, మొదలైన పద్ధతులను మించినది ఈ ఆర్డర్.

మన జీవితమంతా క్రమం తప్పి అత్యంత గందరగోళంగా గడుస్తున్నట్లుందని ఆ పుస్తకంలోని మొదటి ప్రకరణంలోనే తెలుస్తుంది. లోలోన మనకేదో కావాలని

ఉంటుంది. కాని బయటికి మాత్రం అది మనకక్కరలేదని అంటుంటాం; చెప్పేదొకటి చేసేదొకటిగా ఉంటుంది. లోని ఆలోచన ఒక విధంగా ఉంటే, వెలుపలి చర్య మరో విధంగా ఉంటుంది. ఎప్పుడూ వైరుధ్యమే, అన్నిటిలోనూ అసంగతమే. ఆలోచనకూ, ఆచరణకూ ఇలాంటి వ్యత్యాస మున్నప్పుడు సంఘర్షణ తప్పదు. ఈ పుస్తకమనే 'నీ' పుటలనే విప్పి పఠిస్తున్నావ్. అందులో నీ అకటావికటమైన జీవితం కనిపిస్తున్నది. నీవు సతతమూ ఎడతెగని సంఘర్షణకు లోనవుతుంటావని తెలుసుకుంటున్నావు. ఆ సంఘర్షణే, నువ్వేదో గొప్ప స్థితి నందుకోవాలనీ, ఏదో నెరవేర్చాలనే వాంఛగా వ్యాపిస్తున్నది; ఎవరో ఒక వ్యక్తితోనో, ఏదో దేశంతోనో, ఏ భావంతోనో మమేకమై విస్తరిల్లుతున్నది. ఎట్ట ఎదుట వాస్తవంగా కనిపిస్తున్న దానితో, ఇది నిన్ను జీవించనివ్వడం లేదు. ఈ కారణం చేతనే మన జీవితం రాజకీయంగా, మతపరంగా, ఆఖరికి మన కుటుంబీకులతో వ్యవహరించే తరుణంలో కూడా కకావికంగా రూపొందుతున్నది.

ఆర్డర్ అంటే ఏమిటో మనం కనుగొనాలి. ఈ పుస్తకం చదువుతున్నప్పుడు, దీనిని సరిగా చదవనేర్చుకుంటే, ఆ కనుకొనడమెలా సాధ్యమో అది చెప్తుంది. నువ్విప్పుడు గడుపుతున్న జీవితం తారుమారుగా ఉన్నదని అది అంటున్నది. పుస్తకాన్నే అంటిపెట్టుకొని ఉండు, పక్క పుటలు త్రిప్పి చూడు. తారుమారుగా జీవించడమంటే ఏమిటో నీకు తెలుస్తుంది. ఈ తారుమారుగా ఉన్నస్థితిని మాటల రూపంలో, మేధాపరంగా అర్థం చేసుకొని ప్రయోజనం లేదు. ఉన్నదున్నట్లుగా వాస్తవాన్ని అర్థం చేసుకోవాలి. పుస్తకంలో ఉన్నదే తిన్నగా పఠించు కానీ, అక్కడున్న దానిని నీ భావాల్లోకి అనువదించడం కానీ, మేధాపరమైన ఒక భావన (concept) గా మలచుకోడం గానీ చేయవద్దంటున్నది పుస్తకం. అలా జాగ్రత్తగా చదివితే, నీలో సంఘర్షణలనేక మున్నవనీ, వాటి స్వరూప స్వభావాలు అర్థం చేసుకుంటేనే అవి అంతమవుతవనీ అది తెలియజేస్తున్నది. హిందువులు, ముస్లింలు, యూదులు, అరబ్బులు, హిందూ క్రైస్తవ, బౌద్ధ మతాల్లోనే పలుశాఖలు, ఇలాంటి భేదాలున్నంతకాలం, విరుద్ధమూ, వ్యత్యాసమూ తప్పవు; ఈ తేడాలున్నంత కాలం ఈ కలత తప్పదు. ఈ కలత యొక్క స్వభావం అర్థమైనప్పుడు ఆ అవగాహనలో నుండి, ఈ గత్తరను అర్థం చేసుకున్న ఆలోతుల్లో నుండి సహజంగా ఆర్డర్ పుట్టుకొస్తుంది.

క్రమత అనేది దానంతట అదే సహజంగా పుట్టుకొచ్చే ఒక పుష్పంలాంటిది. అటువంటి ఆ ఆర్డర్, ఆ పుష్పం ఎన్నటికీ వాడిపోదు. ఎక్కడైతే విభజన అనేది ఉంటుందో, అక్కడ సంఘర్షణ తప్పదని నా పుస్తకంలో నేనే స్వయంగా చదివి గ్రహిస్తున్నాను. కాబట్టి, ఇక నా జీవితంలో 'ఆర్డర్' అనేది ఎన్నటికీ చెక్కు చెదరకుండా నిలుస్తుంది.

ఇకరెండో ప్రకరణం చూద్దాం. ఇందులో నువ్వు గనక ఒక కేంద్ర బిందువును దృష్టిలో ఉంచుకొని కైవారం దిశగా పనిచేస్తూ ఉంటే సంఘర్షణ తప్పదని రాసి ఉన్నది. అనగా, నీ స్వార్థమనే కేంద్రాన్ని నువ్వు ముఖ్యంగా ఎంచి, అహంకారపూరితంగా, వ్యక్తిపరంగా, ఈ బ్రహ్మాండమైన, అపారమైన, జీవితాన్ని 'నేను–నాది' అనే నీ చిన్న కేంద్రంలోకి సంకోచింపజేసి వ్యవహరించావంటే, నువ్వు నిస్సందేహంగా అపక్రమాన్ని సృష్టించి తీరుతావు. ఈ 'నాది' అనేది నీ ఆలోచన నిర్మించిన అమిత చిన్న వ్యవహారం. నా నామ రూపాలు, నాలోని చిత్తవృత్తి, తద్వారా నన్ను గురించి నాకు నేనై నిర్మించుకున్న ఓ మనో చిత్రం, నేను ఏదో గొప్పవాణ్ణి అనే భావం, ఇవన్నీ నాలోని ఆలోచనా తరంగాలే. ఈ కేంద్రాన్ని ఆధారం చేసుకొని స్వార్థపూరితమైన పనులు చేస్తున్నంతకాలం, భావాల్లోనూ చేతల్లోనూ వైరుధ్యముండి తీరుతుంది; తద్వారా అపక్రమం తప్పదు. పుస్తకం ఏమంటున్నదంటే, 'ఈ స్వార్థం లేకుండా ఎలా ఉండాలి? ' అనే ప్రశ్న మాత్రం అడగవద్దు. అంటున్నది 'ఎలా?' అని అడిగేసరికల్లా. ఏదో పద్ధతి చెప్పమని అడుగుతున్నావు సుమా అని పుస్తకం హెచ్చరిస్తున్నది. ఆ పద్ధతిని వెంటాడావంటే అది మరో స్వార్థపూరిత చర్య అవుతుంది. ఇదంతా ఆ పుస్తకం చెప్తున్నది, నే చెప్తున్నది కాదు. ఆ పుస్తకాన్ని వక్త అనువదించి చెప్తున్నాడనుకోవద్దు.

మీరూ నేనూ కలిసి ఆ పుస్తకాన్ని పఠిస్తున్నాం. మీరు ఏ శాఖ, కూటమి, మతం అనే వాటికి చెందినప్పటికీ సంఘర్షణ సృష్టించి తీరుతారు. మనం ఏదో ఒక దానిలో గట్టి నమ్మకం కలిగుంటాం కాబట్టి, ఈ వాస్తవం ఒక పట్టాన మింగుడు పడదు. మీకు భగవంతుడిపై విశ్వాస ముందనుకుందాం; మరొకరికి ఇది ఉండదు. ఒకరికి బుద్ధుడిపై గురి; మరొకరికి జీసస్ పైన; మరేదో ఉన్నదంటుంది ఇస్లాం మతం. అందువల్ల మనిషీ

మనిషీ మధ్య సంబంధాల్లో ఈ విశ్వాసం అనేది విభజనను సృష్టిస్తుంది. మిగతా వాటి జోలికి పోకుండా మీ జీవిత గ్రంథంలో సంభవిస్తున్న వాస్తవాలతో మాత్రమే మీకు నిమిత్తమని గ్రహించి వ్యవహరిస్తే, అప్పుడు విశ్వాసంతో పనిలేదు.

ఇక ఇప్పుడు ఈ పుస్తకాన్ని ఎలా చదువుతారు అనే సమస్య ఒకటున్నది. మీరూ, ఈ పుస్తకమూ వేర్వేరా అనేది పరిశీలించాలి. ఏదైనా ఒక నవలో, మరేదో కథల పుస్తకమో చేతిలోనికి తీసుకున్నప్పుడు బాహ్యంగా మీరు ఇవతల ఉండిపోయి, ఆ పుస్తకంలోని పుటలు ఒకొక్కటిగా తిరగేస్తూ, సంచలనాత్మకమైన ఆ కథా సంవిధానమంతా ఆసక్తితో చదువుతూ ఉంటారు. కానీ ఇక్కడేమో పఠితే, పఠించే పుస్తకం కూడాను. తనని గురించి చదువుతున్నట్లే ఆ పుస్తకాన్ని చదవాలి; చదువరి ఇవతల ఉండి, అవతలి పుస్తకం చదవడం కాదు.

పుస్తకం ఇంకా ఏమి చెప్తున్నదంటే, మనిషి మొదటి నుండి మరొకరి ఆధిపత్యం, పెత్తనం క్రింద జీవిస్తున్నాడని చెప్తున్నది. ఈ ఆధిపత్యం, ఈ అథారిటీ అనేది ఎవరిదైనా కావచ్చు; ఎవరో రాజకీయ నాయకుడు, మత గురువు, విషయ మెరిగిన జ్ఞాని, మేధావి, తత్త్వవేత్త, ఇలానే మరెన్నో రకాలు. మనిషి ఎల్లప్పుడూ ఏదో ఒక ప్రామాణిక నమూనాకు అనుకూలవర్తియై బ్రతుకుతూ వచ్చాడు అంటున్నది పుస్తకం; అది ఏమి చెప్తున్నదో జాగ్రత్తగా ఆలకించండి.

పరిపాలనా చట్టాలకు సంబంధించిన అథారిటీ అయితే, అదొకటున్న మాట వాస్తవమే. మీరా చట్టాలు ఆమోదించినా, ఆమోదించకపోయినా ఆ చట్టాలు అమలు జరిపేటందుకై, అక్కడ లిఖింపబడి ఉన్నాయి. పోలీస్ యంత్రాంగం అథారిటీ ఒకటున్నది. ఎన్నుకున్న ప్రభుత్వం లేక నియంత యొక్క అథారిటీ ఉన్నది. మన ప్రస్తావన ఆ అథారిటీలను గురించి కాదు. మన పుస్తకంలో మనం చదువుతున్నది, మన మనసు భద్రంగా ఉంటానికని తనకో సరియైన అథారిటీని వెతుక్కునే లక్షణాన్ని గురించి; మనసు ఎప్పుడూ సురక్షితంగా భద్రంగా ఉంటానికి చూస్తుంటుంది. మానసికమైన భద్రతకై వెతుకులాడినంతకాలం, మీరు అథారిటీని సృష్టించక ఉండజాలరు అంటున్నది పుస్తకం. మతాచార్యుడిలోనో, మనసు సృష్టించుకున్న ఏదో రూపంలోనో, లేక ఎవరో

'నేను జ్ఞానిని, నే చెప్తాను ఇట్లారా' అనేటువంటి గురువులోనో, ఈ అథారిటీని దర్శిస్తుంది. మనసు లక్షణం ఇలా ఉంటం మూలాన, "ఇటువంటి అథారిటీ నుండి విముక్తి సాధించు" అంటున్నది పుస్తకం. అంటే నీకు నువ్వే వెలుగై జీవించు అంటున్నది. ఈ పుస్తకాన్ని అర్థం చేసుకోడానికి, అంటే నీ జీవితాన్ని నువ్వు అర్థం చేసుకోడానికి మరొకరిపై ఆధారపడ వద్దంటున్నది. ఈ నీ పుస్తకాన్ని చదవడానికి, నీకూ దానికీ మధ్య ఎవరూ అవసరం లేదు. ఏ తత్త్వవేత్తా, ఏ ప్రీస్టూ, ఏ గురువూ, ఏ దేవుడూ, మీ మధ్య నిలవనక్కరలేదు. పుస్తకం నీవే; నీవే నీ పుస్తకాన్ని చదువుతున్నావు. అందువల్ల అథారిటీ – భార్య భర్త, అది ఎవరిదైనా కానీ – అన్నిరకాల అథారిటీ నుండి విముక్తి చెందాలి. అంటే నీకు నీవు, కేవలం ఏకాంతంగా నీకు నువ్వే ఆధారంగా నిలబడగలిగి ఉండాలి.

క్రమం, అపక్రమం, అథారిటీని వర్ణించిన మొదటి ప్రకరణం జాగ్రత్తగా తర్కించుకుంటూ చదివావు అంటున్నది పుస్తకం. ఇక రెండో ప్రకరణానికి వెళదాం; ఇక్కడ జీవితం అంటే బాంధవ్య మంటున్నది. జీవితం అంటే కేవలం నీ అంతరంగికులు, సమీపస్థులతోనే కాక, మొత్తం మానవాళితో నీ బాంధవ్యం ఎటువంటిది, ఆచరణలో అందరి యెడలా ఎలా ప్రవర్తిస్తున్నావు అనే విషయం. మానవులు ఎక్కడ ఏ ప్రాంతంలో ఏ దేశంలో నివసిస్తున్నప్పటికీ, నువ్వూ వారందరిలాంటివాడివే. వాళ్లూ నీ లాగే బాధపడుతుంటారు. నీ జీవితమూ బాధామయమే. మానసికంగా నువ్వెంతో, మిగతా ప్రపంచంలోని మానవులందరూ అంతే. ఈ విషయంలో నీవూ వారూ వేర్వేరు కాదు. మానసికంగా నువ్వూ ఈ ప్రపంచమూ ఒకటే. బాహ్యంగా కనిపించే ప్రపంచమూ, నువ్వూ ఒకటే. అందుచేత నీ బాధ్యత బృహత్తరమైనది.

ఇక పై ప్రకరణంలో మనిషి యుగయుగాల నుండి భయంతో జీవిస్తూ వచ్చాడంటున్నది పుస్తకం. ప్రకృతిని చూస్తే భయం. పర్యావరణం చూచినప్పుడు భయం, వ్యాధి భయం, ప్రమాదం ఘటిల్లుతుందేమోననే భయం. ఇలా ఎన్నో భయాలు. బాహ్యంగా కనిపించే ఈ భయాలేకాక, మనసులోని పొరల్లో ఏనాడూ సంచరించని స్థలాల్లో అట్టడుగు వరసల్లో, అలలు అలలుగా తోసుకు వచ్చే భయాలెన్నో; ఆ భయాలన్నిటినీ గమనించు, అవి అంతమవుతై' అనే వాక్యంతో ముగిసే ఆ ప్రకరణాన్ని ఇద్దరమూ

జతగా ఆ పుస్తకంలో చదవనున్నాము. తర్వాతి పుటలో, పుస్తకం 'భయమంటే ఏమిటి?' అని అడుగుతున్నది. భయం అసలు ఎలా ప్రారంభమవుతుంది? దాని స్వభావమేమిటి? మనిషి ఈ సమస్యను ఎందుకని పరిష్కరించలేకపోయాడు? భయంతో అలాగే ఎందుకు బ్రతకవలసి వచ్చింది? దానికి అలవాటు పడిపోయినందువల్లనా ? మనిషి జీవన సరళిలో అదొక భాగమని సమ్మతించి ఉండిపోయాడా? తరతరాలుగా మనిషి, అనగా మానవజాతికి చెందిన ఈ జీవి, నువ్వు, ఈ భయమనే సమస్యను పరిష్కరించి, నీ మనసును భయం నుండి సంపూర్తిగా ఎందుకు విముక్తి కలిగించలేకుండా ఉన్నావు? నీలో భయమున్నంత సేపూ నువు గాఢాంధకారంలో ఉన్నట్లే లెక్క. ఆ అంధకారంలో నుండే నువ్వు ప్రార్థనలు పూజలు సల్పుతుంటావ్. అలాంటి ఆరాధన యావత్తూ అర్థరహితం.

భయం యొక్క స్వరూప స్వభావాల గురించి మరికాస్త చదవడం చాలా ముఖ్యం. అసలీ భయం ఎలా జనిస్తున్నది? ఏనాడో సంభవించి కాలగతిలో కలసిపోయిన పాత సంగతులు, వాటికి సంబంధించిన బాధ గుర్తుకు రావడం, చేయకూడని పని ఏదో చేశాననే చింతా, ఏదో అబద్ధం చెప్పి, ఆ అబద్ధ మెవరూ కనుక్కోకూడదనీ, కనుక్కుంటారేమోననే బెదురూ, వీటన్నిటివల్లా భయం కలుగుతున్నదా? ఏదో అకృత్యం చేసినందువల్ల మనస్సు పాడైపోవడం. ఇప్పుడది తలపుకు వచ్చినప్పుడల్లా భీతి కలుగుతున్నదేమో? లేక రేపు మర్నాటికి నా గతేమవుతుందో ననో, దేశంలోని ఏ మారుమూల ప్రాంతంలోనో నేను ప్రముఖ వ్యక్తిగా చలామణి అవుతున్నానా లేదా ననో, ఏదో ఒక భయం. ఎన్నో రకాల భయాలు. చీకటిని చూచి భయపడేవారు, లోకం ఏమనుకుంటున్నదోనని భయం. చావంటే భయం, కడతేరనేమో – దాని అర్థమేమైనప్పటికి – అనే భయం కూడా ఉంటుంది. కొందరికి వ్యాధి భయం; శరీర బాధ అమితంగా ఉంటుంది; ఆ నొప్పి మళ్లీ వస్తుందేమోనని భయం. ఇదంతా ఆ పుస్తకంలో ఉంది, చదువుతూ ముందుకు సాగండి.

భయం అంటే ఏమిటి? ఆలోచన వల్లనే భయం పుట్టుకు వస్తున్నదా? కాలం భయాన్ని సృష్టిస్తున్నదా? ఇప్పుడు ఆరోగ్యంగానే ఉన్నాను కానీ, పెద్దయ్యే కొద్దీ జబ్బున

పడతాను సుమా, అని నన్ను భయపెడుతున్నది – కాలం అనేది భయపెట్టడమంటే అది. లేక, నాకే నిమిషాన్నైనా ఏదో ఒకటి సంభవించవచ్చు, ఉద్యోగం ఊడిపోవచ్చు. కళ్లు కనిపించకుండా పోవచ్చు. భార్య గతించిపోవచ్చు. ఏదైనా జరగవచ్చు అనే తలపు నాకు భయాన్ని జనింప జేస్తున్నదా? భయం యొక్క మూలం అదేనా ? నువ్వు చదువుతున్న పుస్తకం నిన్ను ప్రశ్నిస్తున్నది. పుటను తిప్పి నీలోకి నీవు చూచుకుంటే సమాధానం అక్కడే దొరుకుతుంది. ఈ వక్త నీకు చెప్పడం లేదు. నీలోని తలపులూ, కాలగతీ ఈ రెండూ నీ భయం యొక్క భాగాలే అంటున్నది. తలపే కాలమంటున్నది పుస్తకం.

ఇక ఇప్పుడు ప్రశ్న ఏమిటంటే – పేజీ తిప్పండి, తెలుస్తుంది. ఈ పుస్తకం చదువుతున్న మనషి మనస్సు, ఏ మనస్సునైతే పుస్తక రూపంలో చదువుతాన్నామో, ఆ మనస్సే, భయం నుండి సంపూర్ణంగా, అంటే ఏ ఒక్క రవ్వ కూడా భయమనేది మిగలకుండా, విడివడగలదా అనేదే ప్రశ్న. ఎలా విడివడాలో, అందుకో పద్ధతి చెప్పమని అడుగ కూడదు అంటున్నది పుస్తకం. పద్ధతులు అనే సరికల్లా, చేసిందే మళ్ళీ మళ్ళీ చేయడం, అది ఒక విధానంగా రూపొందుతుంది. మీరు సృష్టించే విధానం భయాన్ని పరిష్కరించదు; భయం యొక్క స్వరూపం అర్థం చేసుకునే బదులు, ఏదో ఒక విధానాన్ని అనుసరించడం ఒక్కటే జరుగుతుంది. అందువల్ల విధానం కోసం చూడకండి, మీ భయమేమిటో అర్థం చేసుకోండి. అర్థం చేసుకోవడమంటే ఏమిటి? కేవలం పదాలతో నిర్మించిన ఒక వర్ణన, తత్సంబంధంగా జరిగిన మేధాపరమైన ప్రక్రియ ద్వారా భయం అర్థమయింది అంటున్నారా లేక భయం యొక్క నిజస్వరూపం తెలుసుకున్నందువల్ల అర్థమయిన దంటున్నారా? అసలు సత్యం తెలుసుకుంటే భయం మటు మాయమవుతుంది.

భయంలో ఉండేదల్లా కాలమూ, తలంపూ అనే విషయం నోటి మాటగా కాకుండా మీ అంతట మీరు స్పష్టంగా మీలో ఒక భాగంగా అనగా మీ మనసులో, మీ హృదయంలో మీ శరీరంలో, మీ రక్తంలో భాగంగా – ఈ కాలమే భయం యొక్క ఆకృతి దాల్చిందని మీరు గ్రహిస్తే, అప్పుడిక భయానికి మీలో తావుండదు; ఉండేదల్లా కాలమొక్కటే. భయానికి మూలం ఈ కాలమూ, తలంపులే కాబట్టి, ఇక భయానికి ప్రాధాన్యత లేదు.

కాలానికే ప్రాధాన్యముంటుంది. మూడో నాటికి ఏమి జరగనున్నదోననే భయం. నా ఒంటరి తనాన్ని ఎలా ఓర్చుకోవాలి అనే భయం; నా ఒంటరి తనం అర్థమేమిటో పరిశీలించ నొల్లనుకానీ, దానిని గురించి సతతమూ భయపడుతుంటాను. అంటే దాని నుండి పరుగిడుతుంటా నన్నమాట. కానీ ఈ ఒంటరి తనం నా నీడే. నాతో బాటు అదీ జంటగా పరిగెడుతూ, నా వెంటబడుతూ వస్తుంటుంది. నా నీడ నుండి నేనెలా తప్పించుకోగలను? జాగ్రత్తగా గమనించే ఓర్పు ఉండాలి; దాని నుండి పరిగెట్టడం కాదు. దాని వంక పరిశీలనగా చూడడం, వినడం. ఇవి ముఖ్యం అంటున్నది పుస్తకం; నన్ను వేధిస్తున్నది కాలమే కాని, భయం కాదు అని తెలియజేస్తున్నది. అందువల్ల నువ్వు అర్థం చేసుకోవలసింది కాలాన్నే; బహుశ నీవు కాలాన్ని గనక తిన్నగా అర్థం చేసుకున్నావంటే, భయం అంతమవచ్చు.

కాలానికీ ఆలోచనకీ ఉన్న సంబంధమేమిటో కనుక్కోమంటున్నది పుస్తకం. ఆలోచన అనేది మనిషికి తెలిసిన దాని నుండి 'జ్ఞాత' మయన దాని నుండి, మరో తెలిసిన విషయం మధ్య ఉండే గమనం (movement). గత స్మృతులు వర్తమానాన్ని వచ్చి కలుస్తున్నై; తమ రూపాన్ని కొద్దిగా మార్చుకుంటున్నై, ముందరికి సాగిపోతున్నై. నిన్నటి రోజున బయలుదేరి, ఇవాళ ప్రత్యక్షమై రేపటి దిశగా వెళ్తున్న ఈ గమనం, రేయి పగలుతో కూడుకున్న ఈ కాలం యొక్క గమనమే, ఇప్పుడు చెప్పుకున్న ఈ కాలం కాక, మానసిక కాలమనేది ఒకటున్నది. అంటే, 'ఒకప్పుడు నేను బాధపడ్డాను, ఆ బాధ ఇక ముందు సంభవించరాదని ఆశిస్తున్నాను. కానీ మళ్ళీ ఆ బాధ ప్రత్యక్షమవుతుందేమో ననిపిస్తుంది.' ఇదే గతం యొక్క గమనం; వర్తమానంలోకి వచ్చి, మార్పు చెందుతూ భవిష్యత్తులోనికి పయనిస్తున్నది.

బాహ్యంగా కనిపించే గడియారం కాలాన్ని సూచిస్తుంటుంది. కానీ మనసులో కూడా కాలగణన అనేది ఒకటున్నది. భవిష్యత్తులో ఏదో అవాలని ఆశిస్తుంటాను. ఇప్పుడు కాను, కాలేదు; ముందు ముందు ఎప్పటికో అవుతాను. ఇప్పుడు దౌర్జన్యపరుణ్ణి; కానీ ఏ నాటికో దౌర్జన్యం విడనాడి అహింసను ఆచరిస్తాను. ప్రస్తుతం నేను పేరాశతో, అసూయతో కొట్టుమిట్టాడుతున్నాను; కానీ కాలక్రమేణా, పరిణామ క్రియలో, ఈ

దురాశనూ, అసూయనూ వదిలించుకోగలనని ఎదురుచూస్తున్నాను. అందుచేత కాలమనేది గతం నుండి వస్తున్న ఒక గమనం (movement). ఇవాళ ఇక్కడ తారసిల్లి రేపటి దిశగా పయనిస్తున్నది. ఆలోచన కూడా గతం నుండి వస్తున్నదే; తెలిసినది (జ్ఞాతం), స్మృతి, ఇవి కూడా అదే గతం నుండి వస్తున్నవే. అందుచేత కాలమే ఆలోచన.

ఇక తర్వాతి ప్రశ్నకు సమాధానం చెప్పడం మరింత కష్టం. అసలు ఇంత దూరం ప్రయాణం చేయడానికి మీకు ఎంతో ఓర్పు కావలసి ఉంది. ఈ ఓర్పు, ఓరిమి అనే పదాన్ని ఒక అర్థంలో వాడుతున్నాను. ఓర్పు అంటే నే సూచిస్తున్నది కాలరాహిత్యాన్ని. ఓర్పు అంటే సామాన్యంగా ఓర్పు కోల్పోకుండా, నెమ్మదిగా, నిదానంగా, వేగిర పడకుండా, అవతలి మనిషిని కూడా తన ఉద్దేశమేమిటో చెప్పనిచ్చి, వ్యవహరించడం, అని అర్థం చెప్పుకుంటాం. నేను ఓర్పును ఆ అర్థంలో వాడడం లేదు. ఇక్కడ, ఈ సందర్భంలో 'కాలాన్ని విస్మరించి, కాలంతో నిమిత్తం లేకుండా చూడడం, గమనించడం' అనే అర్థంలో ఆ పదం వాడుతున్నాను. కానీ కాలమనేది మనసులో ఉంచుకొని గమనిస్తామనుకోండి, మీకు ఓర్పు నశిస్తుంది. ఈ ప్రకరణాన్ని చదవడానికి మీకు ఓర్పు ఎంతైనా అవసరం. భయంలో ఉండేది కాలమే; ఆలోచనే కాలం. ఈ ఆలోచన ప్రవర్తిల్లుతున్నంత కాలం, మీకు భయం ఉండే తీరుతుంది.

ఇక తర్వాతి ప్రకరణంలో ఉండేదేమిటంటే, 'ఈ భయమనేది ఆగేనా? ఈ భయమనే దానికి అంత్యమున్నదా' అనే ప్రశ్న. మన జీవితాల్లో ఈ కాలమనేది అతి ముఖ్యమైన భాగం. "ఇప్పుడిలా ఉన్నాను. కానీ ఎప్పటికో ఏదో అవుతాను, ఏదో ఉన్నత స్థితి నందుకుంటాను. ఇప్పుడైతే నాకు 'తెలియని' మాట నిజమే; కానీ ఏదో నాటికి 'తెలుసు కుంటాను'. ఇప్పటికి ఈ భాష నాకు రాకపోవచ్చు; కానీ నేర్చుకుంటాను, టైమ్ ఇప్పించండి. ఈ కాలం నా గాయాలను మాన్పుతుంది. కానీ ఈ కాలం మన కోమలమైన స్పృహను, సున్నితత్వాన్ని మొద్దుబారేట్లు చేస్తుంది. ఈ కాలం, సంబంధాన్ని నాశనం చేస్తుంది. కాలం మనిషి అవగాహనను ధ్వంస పరుస్తుంది; కారణం, అవగాహన అనేది ఆ క్షణాన అకస్మాత్తుగా సంభవించవలసినది కాబట్టి. 'అవగాహన చేసుకోవడం నేర్చుకుంటాను' అనే మాటకు అర్థం లేదు.

కాలమనేది మన జీవితాల్లో అత్యంత ముఖ్యమైన పాత్ర ధరిస్తున్నదని పుస్తకమంటున్నది. మన మెదడు ఈ కాలగతిలోనే పరిణామం చెందుతూ వస్తున్నది. ఈ మేధ 'నీది, నాది' కాదు. ఇది మానవ మేధ, మనిషి మనస్సు; అది నీ మేధ అనీ, నీ మనస్సనీ నువ్వనుకుంటున్నావు. కానీ ఇవి నీవీ, నావీ కావు; ఇది మొత్తం మానవాళికి చెందినది. ఇది లక్షలాది కోట్లాది ఏళ్లగా పరిణామం చెందుతూ వస్తున్నది. కాలం చేత నిబద్ధింపబడిన మెదడు ఆ కాలగతిలోనే ప్రవర్తిల్లగలదు. మన మీ మేధను అలాకాక పూర్తిగా మరో విధంగా ప్రవర్తిల్లమని చెప్తున్నాం. నీ మేధ, నీ మనస్సు కాలబద్ధమై ప్రవర్తిల్లుతున్నవని పుస్తకం అంటున్నది. కాలం నీ జీవితంలో ముఖ్యమైన పాత్ర నిర్వహిస్తూ వచ్చింది. కానీ కాలం సాంకేతిక సమస్యలకు తప్పితే, మరే సమస్యకూ పరిష్కారం చూపించ గలిగిలేదు. మాట వరసకు మీ దంపతుల మధ్యగానీ, మీకూ మీ వృత్తికీ నడుమ ఒక సమస్య తలెత్తినప్పుడు, దానిని పరిష్కరించడానికి కాలాన్ని వినియోగించకండి. అనగా సజీవమైన ఏ సంబంధంలో నైనా, సమస్య ఏర్పడినప్పుడు, 'కాలగతిలో అది పరిష్కారమవుతుందిలే', అనుకునే వీలులేదు. ఇది అర్థమవడం చాలా కష్టం. మీ మనసును దీనిపై లగ్నం చేసి పుస్తకాన్ని జాగ్రత్తగా పఠించండి.

మరి ఈ కాలం అంతమొందగలదా? అని ప్రశ్నిస్తున్నది పుస్తకం. కాలాన్ని మీరు అంతం చేయకపోయినట్లయితే, భయమూ, తత్ఫలితంగా ఏర్పడే పరిణామాలన్నీ అలా సాగిపోతూనే ఉంటై. పైపెచ్చు కాలాన్ని ఎలా అంతమొందించాలి? అని అడగవద్దంటున్నది పుస్తకం. అలాంటి ప్రశ్న నీవెవరినైనా అడిగావంటే, అతడు పుస్తకం చదవలేదు కాబట్టి, నీకేదో సిద్ధాంతాన్ని మాత్రమే అందించగలడు. ఇంతకీ నే చెప్పేది మీ కర్థమవుతున్నదా అని నాకో అనుమానం.

ఇదే నిజమైన ధ్యానం; కాలమనేది ఎప్పటికైనా అంతమవగలదా అని తఱచి చూడడం. 'అంత మవగలదు, అంతమవుతుంది' అంటున్నాడు ఈ వక్త. ఆ మాట ఈ వక్త అంటున్నాడే కానీ, మీ పుస్తకం అనడం లేదు. కాలం అంతమయి తీరుతుంది అంటున్నాడు ఈ వక్త. కానీ మీరు ఆ మాటను నమ్మినట్లయితే, మీ పుస్తకం చదవడం లేదన్న మాట; కేవలం చెప్పుడు మాటల నాశ్రయించి బ్రతుకుతున్నారన్నమాట. పదాల

మీద ఆధారపడి జీవిస్తే మీలోని భయం నిర్మూలం కాదు. అందువల్ల కాలమనే ఈ గ్రంథాన్ని అధ్యయనం చేయాలి – తఱచాలి, కాల స్వభావమేమిటో పరిశోధించాలి, కాలానికి మీరు ఎలా స్పందిస్తున్నారో, మీ ప్రతిక్రియాత్మక చర్య లేమిటో, మీ సంబంధాలన్నీ ఎలా కాలబద్ధమై ఉన్నాయో స్వయంగా గమనించాలి. లోనికి చొచ్చుకు వెళ్లండి. ఇప్పుడు మీకున్న జ్ఞానమంతా కాలమేనని మీకు తెలిసి వస్తుంది. జ్ఞానాన్ని గనక మీ 'అభివృద్ధికై' వినియోగిస్తున్నట్లయితే మీరు కాలం వలలో చిక్కుకున్నారన్నమాట; ఇక భయమూ, ఆదుర్దా మొదలైనవన్నీ అలాగే కొనసాగుతుంటై.

కాలాన్ని అంతం చేసే దాని స్వభావమేమిటో తఱచడానికి నిశ్శబ్దమైన మనసు కావాలి. ఈ మనసుకు గమనించే స్వేచ్ఛ ఉండాలంటే దీనికి ఏ బెదురూ ఉండరాదు. ఈ కాల గమనం నీలో ఎలా సాగిపోతున్నదో, దానిపై నువ్వు ఎలా ఆధారపడి ఉన్నావో, దీని నంతా గమనించగల్గిన విముక్తమైన మనసుండాలి.

ఒక్కటి ఆలోచించండి. మీతో ఎవరైనా ' ఈ జీవితంలో ఆశ అనేది లేదు' అని అంటారనుకోండి. మీకా మాట ఎంతో దారుణంగా భయానకంగా వినిపిస్తుంది కదూ? నేనంటున్నదేమిటో అర్థమవుతున్నదా? ఆశ అంటే కాలం. అందుచేత ఈ కాలస్వభావ మేమిటో తఱచి చూడాలి; మీ మనసూ, మెదడూ, హృదయమూ, అన్నీ కూడా ఏకంగా కాల పరిధిలో ప్రవర్తిల్లుతున్నాయి. ఇవన్నీ కాల ప్రభావానికి గురియై, దానిచే నిబద్ధింపబడి ఉన్నాయి. అందువల్ల దీనికంతటికీ పూర్తిగా భిన్నమైన ప్రశ్న మనం వేసుకుంటున్నాం. మీ మేధనీ, మనసునీ మరో విధంగా ప్రవర్తిల్లమని మీరు అంటున్నారు; మరి ఇది జరగాలంటే, 'మీరు' అనే మీ పుస్తకాన్ని, ఎంతో సావధానచిత్తులై, ధ్యానయుతంగా పఠించాలి.

(1980 లో శ్రీలంక దేశం, కొలంబోలో చేసిన కృష్ణమూర్తి ప్రసంగ అనువాదం)

***ఉవాచ సంచిక 12, 2003***

# ఆనందమాల

సత్యాన్వేషణ సంస్థాపరంగా సాధించేది కాదనీ, దానికి నిర్దిష్టమైన బాట అంటూ ఏదీ లేదనీ, ఎవరికి వారే ఏకాంతంలో కనుగొనవలసి ఉంటుందనీ ప్రకటిస్తూ జిడ్డు కృష్ణమూర్తిగారు థియోసాఫికల్ సొసైటీ నుండి విడివడక ముందు స్టార్ బులెటిన్‌లో ఆయన వ్రాతల నుండి సంకలనం చేసిన ఈ 'ఆనందమాల' సూక్తుల్ని గమనిస్తే, కృష్ణమూర్తి హృదయంలో ఆ దర్శనం అప్పటికే జరిగిన సూచనలు కనిపిస్తై.

'ఆనందమాల'

నిజమైన సన్యాసే శిష్టుడు, కులీనుడు.

ఆహార్యం మనిషి యొక్క మానసిక స్థితిని తెలియజేస్తుంది.

సౌందర్యాన్ని గ్రహించే శక్తి లేకపోతే నువు ఆధ్యాత్మికుడివి కావు.

అట్టడుగు వర్గాలకు చెందినవారైనప్పటికీ, జీవితం యొక్క సౌందర్యం, ఆనందంలో పాలుపంచుకోవలసిందే.

ఏది జరిగినప్పటికీ, దానిని గురించి తీర్పులు, తీర్మానాలు చేయకు (అంటే 'విధి లిఖితం కాబట్టి' అని మనం అర్థం చెప్పుకోవచ్చు).

మనం మారాలనుకుంటే, మార్చగలిగిన శక్తి మనలోనే వున్నది. బాహ్యంగా ఎంత బలవంతం చేసినా ప్రయోజనం లేదు.

మన అనుభవం ద్వారానే కాకుండా, ఇతర్ల అనుభవాల ద్వారానూ, మనం ప్రగతి సాధిస్తాం అని గుర్తుంచుకోండి.

మరో మనిషిని అనుసరించడం మూఢ నమ్మకాన్ని ప్రోది చేస్తుంది. అవగాహన అనేది జీవితంలో అన్నిటికన్నా గొప్పది.

మనం ఈ భూమి మీద వున్నది ఒక్కందుకే: మనం స్వయంగా ఆనందించడమే కాక, ముందు మనం 'దానిని' పొంది, చుట్టూ వున్నవారికి పంచి పెట్టడానికి ఉన్నాం. మనకు కలిగిన ఆనందాన్ని ఇతర్లకు పంచాలనే బాధ్యత గుర్తెరగాలి.

మానవ స్వభావాన్ని అర్థం చేసుకోవడమే, కరుణ అంటే.

నీ హృదయంలో నిజమైన పూజ్య భావముంటే, ఎవరి యెడలా నిర్దయగా వుండజాలవు.

లోపల వున్న గురువు తప్పితే వేరే గురువు లేడు.

లోకం నుండి విడివడడం విముక్తి కాదు; లోకంలోని అన్నిటి యెడలా నిరపేక్షతో నుండడం విముక్తి.

నిజమైన ప్రగతి అడ్డంగా సాగదు; నిట్టనిలువుగా ఉంటుంది.

నీకా రాజ్యం సొంతమైతే, లోకంలో ఏమీ కోరవు.

మనందరం ఆ సర్వేశ్వరుడి సేవకులం కాబట్టి మనం జీవించే ప్రతిరోజూ ఒక రకమైన తీవ్రానందంతో వెల్లివిరియాలి.

నిరంతర విప్లవం నుండి పుట్టుకొచ్చేదే పరిణామం.

నీ వెలుపల దేవుడంటూ లేడు; నీ అనుభవం, అనుభూతుల ద్వారా సాధించిన పరిపూర్ణతే దేవుడుగా రూపొందుతాడు.

స్వయంగానే కాక, అందుకు ప్రత్యామ్నాయంగా మరొకరి అనుభవాన్ని నీ సొంతం చేసుకునే సామర్థ్యం నీకుంటే, ఆధ్యాత్మికత సాధించడానికి మరేదీ అవసరం లేదు.

మన భావోద్వేగాలను అదుపులో పెట్టవలసిన అవసరమెంతైనా ఉన్నదనే మాట నిజమే అయినప్పటికీ, ఇది జరిగేటప్పుడు, వాటిని అసలే తల ఎత్తకుండా చితకకొట్టరాదు.

మనమీ భౌతిక స్థాయిలో జీవించడానికి ఒక నిర్దిష్టమైన ప్రయోజనాత్మక లక్ష్యమున్నది. కేవలం భౌతిక పదార్థాన్ని లోబరుచుకొనడమే గాక భౌతిక సౌందర్యాన్ని సృష్టించి, రూపొందించడానికి వున్నాం.

మానసికంగా గాయపడడం, మనప్రగతికి అనుకూలమే.

అనుభూతి చెందడమేకాక అర్థం చేసుకోవడం అత్యంతావశ్యకం. ఆ అవగాహన ఎంత స్వల్పమైనదైనప్పటికీ దానిని విశ్వసించు. సత్యం నీ వద్దకు వస్తుంది.

భూతలం మీద, జన్మ తర్వాత జన్మ ఎత్తుతూ, విముక్తికై విలపిస్తూ భిక్షుకుడిలా నిన్ను ఇంటింటికీ తిరిగేట్లు చేసేది ఆ 'స్వ' యే.

కలిగి వున్నావంటే, ఇవ్వకుండా వుండలేవు.



# వృద్ధిచెందిన మేధ: సంకుచితపడిన హృదయం

శ్రీ జిడ్డు కృష్ణమూర్తిగారిని అధ్యయనం చేయటానికి వేదాంత పరిభాష ఏదీ నేర్వ వలసిన అవసరంలేదు ఆయన చిన్నతనం నుండి పాశ్చాత్యుల మధ్య పెరిగినందువల్ల భారతీయ భాషలేవీ నేర్వలేదు. మాతృభాష అయిన తెనుగులో మాట్లాడే అవకాశాలు సన్నగిల్లినందువల్ల. కాలక్రమేణా ఆయన స్మృతిపథం నుండి అది తొలగిపోయింది. జీవితం పొడుగూతా సర్వసాధారణంగా ఆయన ఆంగ్లంలోనే ప్రసంగించడం, వ్యవహరిస్తూ వుండే వాడు కాబట్టి. ఆయన 'టీచింగ్' యావత్తూ ఇంగ్లీష్‌లోనే లభ్యమవుతుంది. భారతీయ భాషల్లో, తెనుగుతో సహా అనువాదాల రూపంలో కొంతమేరకు దొరుకుతుంది.

ఆయన టీచింగ్ ఏ భాషలో చదివినా, మీకూ నాకూ తెలియని, ఏ ప్రత్యేక పదజాలం వుండదు. మనందరం నిత్యం వాడుకునే పదాలే అందులో కనిపిస్తాయి. కానీ ఆ సామాన్య పదాలకే ఆయన, అసామాన్యమైన అర్థాన్ని సూచిస్తూ వుండవచ్చు; ఆ ప్రాధాన్యాన్ని, ప్రాముఖ్యాన్ని, మహత్వాన్ని అని కూడా పేర్కొనవచ్చు – గ్రహించడం మన కర్తవ్యం. ఈ గ్రహింపు కొరకై. మనం కొంత ఎదగాల్సి వుంటుంది.

ఎదగడానికి మనిషికి ఓంప్రథమంగా ఎఱుకవుండాలి; దేనిని గురించి అంటే, ప్రత్యేకంగా దేనిని గురించీ కాదు. మనం సాగించే జీవితం మొత్తం ఎఱుకతో సాగాలి. ముందు మన పరిసరాలు ఎలా వున్నాయో చూడాలి. మనం ఎలాంటి ప్రభావాలకు లోనవుతున్నామనేది తెలుసుకుంటూ వుండాలి. సంఘం యొక్క కృత్రిమ మర్యాదలు, భేషజాలు మనమెందుకు ఔదలదాల్చుతున్నామో విచారించాలి. నలుగురూ నడిచేబాటలోనే మనమెందుకు పయనిస్తున్నామో ప్రశ్నించుకోవాలి. ఇవన్నీ మనకు సుఖమూ, భద్రత, ఇస్తున్నై కాబట్టి, మనమీ పద్ధతుల నవలంబిస్తుండవచ్చు. నిజానికి ఈ జీవన విధానంలో ఎంతో కాఠిన్యమూ, కాపట్యమూ వుండి వుండవచ్చు. ఇవి మన నిద్రావస్థకు భంగం కలిగించకుండా వున్నంతకాలం, మనకు వీటియెడల ఏ అభ్యంతరమూ వుండదు.

సంఘం, పోటీని ప్రోత్సహిస్తుంది; గౌరవిస్తుంది. పోటీ గుణం మనిషిలో పెరిగితే అతడిలో ఇతర్లయెడల స్పర్థ, ఈర్ష్య, నిర్దాక్షిణ్యత మొదలైన లక్షణాలు చోటుచేసుకుంటై.

తోటి మనిషిని ప్రేమించడం అసాధ్యమవుతుంది. పోటీపడకుండా బ్రతకడం సాధ్యమా? అనేది ఎవరికి వారు తెలుసుకోవాలి.

సంఘం, మనిషిని కీర్తిమంతుడివవ్వాలని అంటుంది. కీర్తికై మనిషి చేసే పనులు అతడి అహాన్ని పెంచడమేకాక, ఎన్నో అఘాయిత్యాలు చేయిస్తుంది. అలాంటి బ్రతుకు సుఖదాయకమా! అనేది తెలుసుకోవాల్సి వుంది.

సంఘం, నీ సొంత కుటుంబీకుల్ని ప్రేమించడం సబబు అంటుంది కానీ, వ్యాపార రంగంలో ఎవరి మీద నెగ్గడానికి ఎవర్ని ధ్వంసంచేసినా, చూడనట్లు వూరుకుంటుంది. ఇలా జీవించడం ధర్మమోకాదో తమకితాము నిర్ణయించుకోవలసి వుంటుంది.

ఇలా మనిషి సంఘంలో భాగంగా జీవిస్తూ కూడా, అడుగడుగునా సంఘ విలువలను ప్రశ్నిస్తూనే వుండాల్సి వుంటుంది. లేకపోతే, మనిషి 'ప్రవాహ జీవి' అయిపోతాడు. సంఘంలో కనిపించే అవినీతి యావత్తూ అతడిలో ప్రవేశిస్తుంది.

సంఘం, మనిషి 'ఆలోచన'కు పెద్దపీట వేస్తుంది. జంతుజాలానికి, మనిషికీ వుండే తేడా ఈ 'ఆలోచన' విషయంలోనే కాబట్టి, దానికి పట్టంగట్టి పూజిస్తుంది. హేతుబద్ధంగా ఆలోచించ గల్గినవాడే వందనీయుడు, అతడే నాగరీకుడు అంటుంది సంఘం! 'ఆలోచన' అనేది శాస్త్ర విజ్ఞాన రంగాల్లో అద్భుతమైన ఫలితాలు సాధించింది. ఆరోగ్యానికి సంబంధించిన ఔషధాలు, శస్త్రచికిత్సలు, వీటిలో మున్నెన్నడూ ఎరుగనంత అభివృద్ధిని గాంచుతున్నాం. కానీ అదే సమయంలో, 'ఆలోచన' అతి పెద్ద మారణా యుధాలు, విధ్వంసక యంత్రాలను కూడా నిర్మించి మనిషి కందించింది.

మనిషిమేధ అభివృద్ధి చెందినంతగా హృదయం వికసించలేదు. మనుషుల మధ్య చీలికలు, ద్వేషాలు, వైషమ్యాలు పెరుగుతున్నాయే కానీ తరగడంలేదు. యుద్ధాల మూలంగా పూర్వకాలంలో 'రణభూమి'లోని యోధులు, సైనికులు మాత్రమే మరణిస్తే, నేటి రణరంగం యుద్ధభూమికే పరిమితమవడంలేదు. సామాన్య పౌరులూ పిల్లలూ, దేశంలోని వారందరూ ప్రాణాలు కోల్పోతున్నారు. పంటపొలాలు, మరికొన్ని దశాబ్దాల వరకూ పండకుండా

నాశనం చేయగలిగిన బాంబులు అందుబాటులో వున్నాయి. విషవాయువులతో నగర ప్రజానీకం మొత్తాన్నీ తుడిచిపెట్టే వీలుంది. 'ఆలోచనకు' ఎంత పదును పెట్టినా, ఈ వినాశనాన్ని అరికట్టలేము. ఒకవంక శాస్త్ర విజ్ఞానాభివృద్ధి ద్వారా అద్భుతసృష్టి; వేరొక వంక కనీవినీ ఎరుగని నష్టి!

ఈ దయనీయమైన పరిస్థితిని ఏ దేవత సృష్టించింది? మనిషి యొక్క 'ఆలోచన'. పరిష్కారమేమిటి? ఈ మానవ నిర్మితమైన సమస్యను పరిమితమైన ఆలోచన పరిష్కరించ గలిగిలేదు. తాత్కాలికంగా ఒక పరిష్కారం అమలు జరిపినా, అందులో నుండి మరికొన్ని సమస్యలు ఉత్పన్నమవుతై. మళ్ళీ వాటిని పరిష్కరించుకుంటూ కూచోవాలి; ఇది అంతు లేకుండా ఇలా సాగిపోతూనే వుంటుంది.

మానవ మేధ కులాలను సృష్టిస్తుంది; తానే ఆ కులాలను నిర్మూలించాలంటుంది. మతాలు స్థాపిస్తుంది; ఆ వివిధ మతాలు సామరస్యంతో మెలగాలంటుంది. మనుషు లందరూ ఒక జాతివారని గుర్తించే బదులు, అనేక జాతులకు చెందిన వారంటుంది; మళ్ళీ జాతికి ద్వేషం మంచిది కాదంటుంది. ఏక మొత్తాన్ని పలు భాగాలుగా విభజించడం ఆలోచనకుండే లక్షణం; అటు తర్వాత ఆ తునకలన్నీ ఒకటవాలని ప్రతిపాదించడం దాని 'ఆదర్శం'. ఈ మొత్తం ఒకటేననేది చూడదు; అందుకు ప్రత్యామ్నాయంగా ఆదర్శాలను వల్లిస్తుంటుంది.

సృష్టిలో పశుపక్ష్యాదులకు భిన్నంగా జన్మించిన మానవులందరూ ఒకటేననేది గుర్తించాలంటారు కృష్ణమూర్తిగారు, రంగూ, రూపూ, భాషా, సంస్కృతీ, ఆచారాలు వేర్వేరైనప్పటికీ, మనిషి ఏ దేశంలో నివసిస్తున్నా, ఏ పరిస్థితులలో జీవిస్తున్నా, అతడి అవస్థ ఒకటేనంటారు ఆయన, తరతమ భేదాలతో ఈ మానవ వర్గానికి వుండే దుఃఖమొకటే; ఆ దుఃఖం, ఆ అంతస్సంఘర్షణ ఒక్కోచోట ఒక్కో రూపం ధరించవచ్చు. కానీ శోకమనేది వారి జీవితాన్ని వెన్నాడుతూనే వుంటుంది. ఒకింత సుఖం తళుక్కున మెరిసి, మాయమవు తుంది. ఆ వెంటనే దుఃఖమూ, బాధా మళ్ళీ ప్రవేశిస్తాయి.

తిండి, బట్ట, వసతి దొరకక బాధపడే వారు అనేకులు, తాము ఊహించుకున్నవి దక్కలేదని బాధపడేవారు మరికొందరు. కానీ మనుషులంతా ఒకటేననేది ముందు

హృదయంలో అర్థమైతే, నేటి సాంకేతిక నైపుణ్యంతో, రవాణా సౌకర్యాలతో, ప్రపంచంలోని మనుషులందరికీ ఆహారం సమకూర్చడం అసాధ్యమైన విషయం కాదు. అయితే 'ఇది నా వర్గానికి జరగాలి. కాదు నా వర్గానికి ముందు జరగాలి' అనే వివాదపడే రాజకీయా లుండరాదు.

ఇక ఈ కనీసావసరాలు తీరినవారు, ఊహాజనితమైన తమ విపరీత కోర్కెలను ప్రక్కకునెట్టి, మానవ జన్మ యొక్క సార్థకత ఎలా ఒనగూరుతుందో దానివైపు మళ్ళాల్సి వుంటుంది. అందుకు అవసరమైన తెలివిని తమలో కనుగొనాలి. ఇందుకు నేటి సంఘటిత మతాలు ఉపయోగపడవనేది తేలిపోయింది; అవి మనిషిని సత్యశోధనకు పురికొల్పే బదులు, సంఖ్యాబలం పెంచుకోడానికన్నట్లు ప్రచార యంత్రాలయి పోయినై. సత్యమనేది అవిభాజ్య మైన వ్యక్తికి దర్శనమివ్వగలదే కానీ, సమూహాలకు అందేదికాదు. పరిపూర్ణమయిన సత్యం పరిపూర్ణమైన వ్యక్తికి మాత్రమే కనిపిస్తుంది అందుకు మనిషి ధర్మబద్ధమైన జీవనం గడప గలిగిన స్వేచ్ఛ, సాహసం కలిగుండాలి. సత్యదర్శనం ధ్యానయుతమైన జీవనం నుండి, ధర్మనిరతి నుండి పుట్టుకు రావలసిందే కానీ, మరేరకమైన పద్ధతిలోనూ జరగదు, అంటారు కృష్ణమూర్తిగారు.

ఈ 'తెలివి' లేకుండా మనిషి తన చదువుతో, చురుకుదనంతో, తోటి మానవుణ్ణి దోపిడీచేస్తూ, పేదలను పీడిస్తూ, బ్రతుకుతూవుంటే మానవాళి నేటి పరిస్థితిలోనే వుంటుంది. కలవారు తమ జీవితాలను ధర్మబద్ధం చేసుకుంటే, లేనివారు వారిని చూచి, అటు మళ్ళే అవకాశముంటుంది.

ఉనికి మనకిచ్చిన ఈ మానవ జన్మను సద్వినియోగం జేసుకోడం మన చేతుల్లోని పని. కృష్ణమూర్తిని చదివి తమ జీవితాలలో సుఖశాంతులు పొందినవారు ప్రపంచవ్యాప్తంగా ఎందరో వున్నారు. అతి సునిశితమైన, నాజూకైన ఈ విద్యను, ఇది అందించే కోమలమైన స్పృహను, మీరూ పొందే వీలుంది. చదవడానికి ఆయన గ్రంథాలున్నై; వినడానికి ఆడియోలు, చూడడానికి వీడియోలున్నై. ఆసక్తి మనకుండాలి.

*ఆంధ్ర సాంస్కృతిక సంఘం, కొచ్చి, కేరళ రాష్ట్రం, 2003*
*వార్షిక సంచిక*

# ధనికుల సరసన జ్ఞానులు

'ఈ కృష్ణమూర్తి గారు ధనికుల మధ్య తిరుగాడుతాడే గానీ, పేదల మధ్య కనిపించడే? ఈయనకు ధనికులంటేనే ప్రీతి కాబోలు, పేదలు పనికిరారనుకోనుండవచ్చు' అని అనేవారు కొంతమంది ఆయన బ్రతికున్న రోజుల్లో. కానీ బాల్యంలోనే ఆయన్ని, దివ్యజ్ఞాన సమాజ సభ్యులు తమ చెంతకు చేరదీశారు: వారు స్వయంగా ధనికులు కాకపోయినా, తమ సానుభూతిపరులైన ధనికవర్గాల నుండి ధనాన్ని సేకరించగల్గి ఉండేవారు. తాము జగద్గురువుగా రూపొందించ నిశ్చయించిన ఈ కృష్ణమూర్తి అనే బాలుణ్ణి తర్ఫీదు చేయాల్సి ఉంది: మంచి బలవర్ధకమైన ఆహారం పెట్టాలి. పరిశుభ్రమైన దుస్తులు ధరింపజేయాలి. పాలన పోషణా సరిగా లేకుండా పెరుగుతున్న ఈ పిల్లవాణ్ని, చదువు వొంటబట్టకుండా ఏదోగా తిరుగుతున్న ఇతణ్ణి, సభ్య సమాజం ఆమోదించేట్లుగా రూపొందించాలి. పలు విద్యలు గరపడానికి ఆయా రంగాల్లో నిష్ణాతులైన వారిని ట్యూటర్లుగా నియమించాలి. వారి ద్వారా ప్రపంచంలోని విజ్ఞానసార సంగ్రహం ఇతడికి అందించాలి. ఇతడు మంచి వాతావరణంలో, చక్కని పరిసరాల్లో పెరిగి పెద్దవాలి. ఇతడికేలోపం జరుగకూడదు. ఏది నేర్చుకోవాలనుకున్నా, ఏ ఆటంకమూ, ఏ అవరోధమూ ఉండరాదు. ఇదీ దివ్యజ్ఞాన సమాజ ప్రధాన కార్యకర్తల దృష్టి.

అందుకని అతడికి అన్ని సదుపాయాలూ కలగజేశారు; ఏ కొదవా లేకుండా జాగ్రత్తపడ్డారు. అయితే ఇతడీరకమైన జీవనశైలికి అలవాటుపడి, దీనినే కోరుకునే వాడా, దీనికి భిన్నమైన పద్ధతిలో బ్రతకలేకపోయేవాడా అంటే, అదేమీ లేదు. కాలిఫోర్నియాలోని ఒహై ప్రాంతంలో వుండేప్పుడు, కూరలు పండించేవాడు. పాలు పితికేవాడు. అక్కడి కొండల్లో గుట్టల్లో మైళ్ళకు మైళ్ళు గంటల తరబడి నడిచేవాడు. అడపాదడపా ఆ కొండల్లో ఎక్కడో ఒక గుడిసె వేసుకొని అక్కడ ఒంటరిగా నివసించేవాడు. ఒకసారి క్రైస్తవ మొనాస్టరీలో జీవనం ఎలా ఉంటుందో చూద్దామని వారితోబాటు ఒక సభ్యుడుగా అందులో కొన్నాళ్ళు జీవనం సాగించాడు. ప్రథమ ప్రపంచ సంగ్రామ కాలంలో, గాయపడిన సైనికుల సహాయార్థం 'స్ట్రెచర్ బేరర్'గా పనిచేశాడు. ఇండియాలో

రైలుప్రయాణం చేసే యవ్వనంలో తన బూట్లు పాలీష్ చేసుకోవడంతో ఆగకుండా, అక్కడే పెట్టి వున్న తన తోటివారి బూట్లను కూడ నిగనిగలాడేట్లు పాలీష్‌చేసేవాడు. రిషీవాలీ స్కూలు స్థాపించిన కొత్తల్లో, ఆయనా, ఆ స్కూలుకు ప్రథమ ప్రిన్సిపలైన శ్రీ జి.వి. సుబ్బారావు నేలమీద చాపలు వేసుకొని శయనించేవారు. దోమతెరలు, కిటికీలు 'వైర్‌మెష్‌లు' లేనందువల్ల, దోమల బాధను ఓర్చుకుంటూ, అలాగే మాట్లాడుతూ, మాట్లాడుతూ నిద్రించేవారు.

ధనిక జీవనశైలి, కృష్ణమూర్తిని ఎప్పుడూ తన వశం చేసుకోలేదు. అన్నీ కూడా అతడి వశంలోనే వుండేవి. అంతర్ భాగ్యం ఎరిగిన ఈ మానవునికి బాహ్యంగా భాగ్యముంటే ఎంత, ఉండకపోతే ఎంత?

ఈ దివ్యజ్ఞాన సమాజ సభ్యులు మిమ్మల్ని గుర్తించి తమ వద్దకు తీసుకోకపోయి వున్నట్టయితే, మీరేమై వుండేవారు? అని ఆయన్ని అడిగిన సందర్భాలున్నై. 'ఏమై వుండేవాణ్ణో? బహుశా ఏ గుడికో పూజారిగా బ్రతికి వుండేవాణ్ణనుకుంటాను...కానీ ఈ లోన నుండి పెల్లుబికివచ్చిన 'టీచింగ్' మాత్రం ఏదోవిధంగా వెలికివచ్చి ఉండేది. ఏ భాషలో మాట్లాడినా, ఎలా మాట్లాడినా, ఇది ప్రకటితం కాకుండా మాత్రం ఆగేది కాదు' అని సమాధానమిచ్చాడు. గుడి పూజారిగా జీవించి ఉండేవాడో లేక మరేమై ఉండేవాడో తనకు మాత్రం ఎలా తెలుసు? ఏదో తోచిన మాట అన్నాడు అనేది అలా ఉంచి, తనలోని 'సహజసిద్ధమైన జ్ఞానం' లోపలి నుండి 'తొందర' చేస్తూ వుండేది అనేది మాత్రం ఆయనకు స్పష్టంగా తెలుస్తుండేది.

ఆధ్యాత్మిక రంగంలో దివ్యజ్ఞాన సమాజ సభ్యుల దృష్టిని అంగీకరించనొల్లని కృష్ణమూర్తి, ఆ సమాజంతో తెంచేసుకొని వెలికి వచ్చేస్తే, అతడి అసాధారణ తేజస్సుచే ప్రభావితులై అతడి అండన నిలిచిన కొందరు మిత్రులు, ధనికులే. తమకున్న భాగ్యంతోనూ, పలుకుబడితోనూ, కృష్ణమూర్తి నలుగురికీ చెప్పదలచుకున్న దానికి తాము దోహదం చేయడానికి సిద్ధపడ్డారు. 'వనరులు ఏదో విధంగా సేకరించి నీ పనిని కొనసాగించేట్లు చూస్తాము. ఈ పనికి ఆటంకం కలగనీయం' అని దీక్ష పూనారు. అలాంటి వారి సహకారం, తోడ్పాటు తీసుకోవడంలో దోషమేముంది? అయితే ఈ ధనికుల 'సహవాసం'

వల్ల ఆయన చెప్పదలచుకున్నది నీరుకారిపోయిందా అని అడిగితే అది ఏనాడూ పల్చనవలేదు అని చెప్పవలసి ఉంటుంది. తాను కనుగొన్న విషయాన్ని ప్రకటించడంలో ఆయన ఏనాడూ 'సమాధాన'పడలేదు. పైపెచ్చు వారందరి నడుమా, అవసరమని తోచినప్పుడు అమిత నిష్కర్షగా మాట్లాడేవాడు. ఒక ఢిల్లీ సమావేశంలో తన ఎట్టఎదుట కూచున్న ధనికులు, అధికారులు, పుర ప్రముఖుల మధ్య, కాస్త వెనుకగా నుంచున్న వేలాది సామాన్య సాధారణ పౌరులతో, 'అదృష్టవశాత్తూ మీరు ధనికులూ కాదు, పలుకుబడీ హోదా కలవారూ కాదు. అందుచేత 'నేర్చుకోడానికి' మీకింకా అవకాశమున్నది,' అనేశాడు!

యదార్థవాదీ లోక విరోధీ అంటే అర్థమిదే. కొందరి నోటి మీది నుండి యథార్థం తోసుకువస్తుంది. అమాయకపు పిల్లల నాలుకమీది నుండి కూడా ఇలానే తోసుకువస్తుంది. 'బాలవాక్కు బ్రహ్మవాక్కు' అంటే అర్థమిదే. వారిలో కపటమింకా చోటుచేసుకొని ఉండదు. అందువల్ల ఉన్నదున్నట్లు, అంటే సత్యం నోటి నుండి దానంతట అదే వచ్చేస్తుంది: లోకం యొక్క ప్రభావం ఇంకా వారిమీద పడలేదు, అందుచేత లౌక్యముండదు.

మరి అక్కడ ప్రముఖులు ఎలా స్పందించారు? మింగి వూరుకున్నారు. పలుకబడేది సత్యమైనప్పుడు దానిని ఎదుర్కోడానికి ధైర్యం వుండదు. అంతేకాదు. ఆయన మళ్ళీ ప్రసంగించిన రోజున నిస్సంకోచంగా వారు అందరూ హాజరయ్యారు. 'నేర్చుకునే' గుణమున్న ధనికుల్ని సామాన్యుల నుండి వేరుచేసి, వారిని వెలివేయాలని కృష్ణమూర్తి గానీ మనం మనం కానీ భావించడంలేదు. ధనికుడైనా దరిద్రుడైనా, తన అంతర్ భాగ్యాన్ని దర్శించేంత వరకూ, నిర్భాగ్యుడే. 'నేర్చుకోడం' ప్రతి మానవుడి జన్మహక్కు. కాదనడం ఎవరితరమూ కాదు. ధనమూ పలుకుబడీ, హోదా అనే వ్యామోహంలో పడినవాణ్ణి మాత్రం ఎవరూ రక్షించలేరు.

 

జ్ఞానులు, భాగ్యవంతులను ఆదరించవచ్చా అనే ప్రశ్న ఈనాటిది కాదు. పూర్వం యూదు జాతికి చెందిన మహా గురువు బాల్‌షెమ్ తోవ్‌ను ఎవరో ఒకాయన ఇలా ప్రశ్నించాడు: 'దేనికెక్కువ ప్రాధాన్య ముందంటారు? భాగ్యమా? పరాజ్ఞానమా? ఏది

ఎక్కువ విలువైనది?' ఈ మనిషి తనని ఇలా ఎందుకు అడుగుతున్నాడో బాల్‌షెమ్‌కు తెలియక పోలేదు. అందువల్ల నవ్వేసి 'పరాజ్ఞానమే విలువైనది; దానికే ప్రాధాన్యమున్నది. అందుకు సందేహమేముంది?' అన్నాడు. వెంటనే తన రెండో ప్రశ్న సంధించాడు ఇవతలి మనిషి. 'మరి జ్ఞానులైన మీరు భాగ్యవంతుల వద్ద వేచి ఉండడం చూశాను. మీరు అప్పుడప్పుడు వారి గృహాలకు వెళ్తూ వుండడం కూడా గమనించాను. ఆ భాగ్యవంతులు ఇంతటి జ్ఞానమున్న మీ వద్దకు వచ్చినట్లు కానీ మీకై కాచుకొని ఉన్నట్లుగానీ ఎన్నడూ చూడలేదు. అటువంటప్పుడు పరాజ్ఞానమే విలువైనదని, ప్రాధాన్యమున్నదనీ, మీరెలా సెలవిస్తున్నారు?' అని కపట వినయంతో అడిగాడు.

బాల్‌షెమ్ చాలా తెలివైనవాడు, చమత్కారి కూడాను. 'అవును, నిజమే. జ్ఞానులైన వారు తమకు జ్ఞానమున్నది కాబట్టి, ధనంయొక్క విలువ తెలుసుకాబట్టీన్నీ, ధనవంతుల వద్దకు వెళ్తుంటారు. కానీ ధనవంతులు కేవలం ధనికులు మాత్రమే అయి ఉంటారు. అందువల్ల వారికి పరాజ్ఞానం యొక్క విలువ తెలియదు. ఆ కారణంచేత నేను వారి వద్దకు వెళ్తుంటాను. వారి అజ్ఞాన కారణంవల్ల వారు నా వద్దకు ఎప్పుడూ రారు. నాకై నిరీక్షించరు' అని మృదువుగా సమాధానమిచ్చాడు.

 

జ్ఞాని భాగ్యవంతులతో కూచున్నాడా, భాగ్యహీనుల మధ్య కూచున్నాడా అనే చర్చ, మనకు భాగ్యవంతులపైనుండే అసూయను, ఈర్ష్యను సూచిస్తుంది. ఆత్మజ్ఞాన సాధనలో భాగ్యమనే అవరోధాన్ని దాటవచ్చు. కానీ, ఈర్ష్యాసూయలను దాటడం దుర్లభం. కాబట్టి జ్ఞాన ఎవరి సరసన వున్నా, మనం నేర్చుకోగలిగింది అక్కడేమైనా లభ్యమవుతుందా, దానిని మనం గ్రహిస్తున్నామా అనేది ఒక్కటే చర్చనీయాంశం.

*ఆంధ్రభూమి, ఫిబ్రవరి, 2003*

# స్వలాభం తగ్గింది...నిజలాభం సిద్ధించింది

'ఫలానా వ్యక్తి చాలా 'రెలిజియస్ మనిషండీ' అని ఎవరైనా అన్నారంటే, ఏకాదశి వ్రతాలు పాటిస్తుంటాడనీ, శివరాత్రి జాగరణ – సినిమాలు చూస్తూనైనా జరుపుతుంటాడనీ, పుణ్యదినాల నాడు శ్రీశైల శిఖరం చూసివస్తాడనీ, నదీ స్నానాలు చేస్తాడనీ, చెప్తున్నారన్న మాట.

తాను చేసే బిజినెస్ వ్యవహారాల్లో నీతి నిజాయితీలతో వ్యవహరిస్తుంటాడా? అనే ప్రశ్న మీరు వేయకూడదు; వారు సమాధానమివ్వకూడదు. కానీ శరీరధారణ చాలించిన ఆత్మల్ని భగవంతుడి సమక్షంలోకి తీసుకు వచ్చినప్పుడు భగవంతుడి మొదటి ప్రశ్న. 'నన్ను నువ్వు విశ్వసిస్తూ భూలోక జీవితం గడిపావా?' అని కాదు. నీ మత విధులన్నీ తు.చ. తప్పకుండా పాటించావా? అని కూడా కాదు. ఆయన అడిగే ప్రశ్న 'నీవు నీ వృత్తి సంబంధమైన విషయాల్లో నిజాయితీతో వ్యవహరించావా?' అని అడుగుతాడు అంటుంది హీబ్రూ జాతివారు అనుసరించే బాబిలోనియన్ టాల్మూడ్' అని ప్రారంభించాడు మిత్రశ్రీ.

సంఘటిత మతానుయాయులందరూ దాదాపు ఇదే స్థితిలో వుంటారు. 'ఆయనకు మత నిష్ఠ. దేవునిపై విశ్వాసం మెండు' అంటే అర్థం, స్నానం చేయనిదే పూజ పూర్తయి దేవునికి హారతి పట్టనిదే కాఫీ కూడా తాగడనీ, ఇంట్లో ఆడవాళ్ళు పట్టని నోములేదనీ, కొన్ని నోముల్లో, ఆహ్వానించిన ముత్తైదువలకందరికీ చీరే, జాకెట్టు పెట్టిగానీ పంపించరనీ అర్థం.

'అమ్మో, అంత ధనవంతులా ఏమిటి? ఆయన ఉద్యోగంలో అంత జీతమొస్తుందా?' అని ఎవరైనా అడిగితే, 'జీతమో, సాతమో, ఆవిడకదేమీ పట్టదు – నోము పట్టిందంటే, ఖర్చుకు వెరచేది లేదు. ఆవిడ ఎంత ఇవ్వమంటే, అతడు అంతా చేతిలో పెడ్తాడు. 'భార్య ఏది కోరితే అది కొనగలిగినవాడే భర్త' అంటుంటాడు తరచూ.

'వృత్తి నిర్వహణలో కాస్త కుడి ఎడంగా వ్యవహరిస్తాడేమో?' అని ఎవరైనా అంటే, 'ఎడమే కాస్త ఎక్కువనుకోవాలి. మనకేమి తెలుసు? కానీ నువ్వీ ప్రస్తావన వదిలెయ్. వారిది రెలిజియస్ ఫామిలీ అని చెప్పానా?' అంటాడు.

మత విధులు అన్నీ జాగ్రత్తగా పాటించే వారికి సంఘంలో ఎంతైనా గౌరవ ముంటుంది. కానీ మనిషి తన చుట్టూ వున్న వారితో నెఱపే సంబంధం, వారితో జరిపే లావాదేవీలు సక్రమంగా ఉన్నయా లేవా అనేదే ముఖ్యమంటున్నది టాల్మూడ్ శాస్త్రం.

మన శాస్త్రాల్లో కూడా 'న్యాయంగా ఆర్జించాలి, ఆ విధంగానే పొట్టపోసుకోవాలి' అని లేకపోలేదు. కానీ మత విశ్వాసపరులు దీనినంత ప్రధానంగా ఎంచరు. ఈ సూత్రాన్నే సీరియస్‌గా తీసుకుంటే, 'గోవిందా, గోవింద', పిచ్చివాడిగా పరిగణింపబడతాడు. చచ్చిన తర్వాత దేవుడి మన్నన ఎలా వున్నా, ఇక్కడ ఈ లోకంలో మాత్రం నిత్యమూ 'చావే'!

ఆయన కాలంలో, ఆ జిడ్డు కృష్ణమూర్తి గారి మాటల్ని చెవిన వేసుకున్న వజ్రాల వర్తకుడు హేరీ వుల్ఫ్ పరిస్థితి ఎలా రూపొందిందో చూద్దాం. హేరీ ఇలా చెప్పుకొస్తాడు. '1930 ప్రాంతంలో కృష్ణమూర్తి ప్రసంగాలు, సంభాషణలు (అప్పుడు కృష్ణమూర్తి వయసు ముప్ఫై అయిదు సంవత్సరాలు) నా జీవితాన్ని ఒక మలుపు తిప్పాయి. కృతజ్ఞతా పూర్వకంగా నాకు అతడు చేసిన మేలుకుగాను అతడికి ఐదువందల డాలర్లు స్వీకరించమని కోరాను. ఆ రోజుల్లో ఆ మొత్తం ఈనాటికన్నా, చాలా విలువైనది.

'హేరీ, నేను ఎవరికీ ఏ మేలు చేయగలిగి లేను: అదేదో నీకు నువ్వే చేసుకోనుంటావ్' అన్నాడు.

'నిజానికి అతడి మాటలాలకించి నందువల్లనే, నా ఆలోచనాసరళి మారిపోయింది. నా క్రియా కలాపమంతా మరోవిధంగా రూపొందింది. నేను మనుష్యుల యెడల స్పందించే తీరులోనూ తేడా ఏర్పడింది. మనుషులంతా తాము పుట్టి పెరిగిన పరిస్థితులకూ, తమ పరిసరాల ప్రభావాలకు దాసులై తిరుగుతున్నారని గ్రహించాను. వాళ్ళు అనే మాటలకు, చేసే చర్యలకు, వాళ్ళు పూర్తిగా బాధ్యులు కారని అర్థం

చేసుకున్నాను. టేప్ రికార్డర్ ఒక రకమైన రాగమాలపిస్తూ వుంటే, ఆ టేప్ రికార్డర్‌ని అని ఏమి ప్రయోజనం? అలాగే మనుషులు తమకు తోచిన రీతిగా నన్ను వినియోగించుకొని లాభం పొందుదామని అనుకుంటే, వారిని తప్పుపట్టి ఏమి సాధిస్తాను? అందుచేత వారి యెడల మరింత సహనం వహించడం నేర్చుకున్నాను. ఆనాటి మిగతా వారంతా ఎలా జీవిస్తున్నారో, నా చుట్టూ వున్నవారు కూడా అదే విధంగా జీవిస్తున్నారు అని తెలుసుకున్నాను.

'ఇక నా వ్యాపారం గతి ఏమైందంటారా? క్షీణించింది. అంతకుముందు జరిపే అమ్మకాలు తగ్గిపోయాయి. నేనూ, మిగతా అందరిలాగే నీతి, నిజాయితీలు కొరవడిన వాణ్ణని గ్రహించాను. కాస్త తక్కువ గ్రేడ్ వజ్రాలను కూడా మేలిమి వజ్రాలతో కలిపేసి, అవీ నాణ్యమైనవేనని దబాయించి, కస్టమర్లను నమ్మించి, విక్రయించేవాణ్ని. ఈ కృష్ణమూర్తి సత్ప్రభావం ధర్మమా అని, అలా చేయడానికి నా మనసు సమ్మతించడం మానేసింది. సహజంగా తక్కువ పాలిష్ పెట్టిన ఆ 'సెకండ్ గ్రేడ్' వజ్రాలను తక్కువ ధరకే అమ్మాల్సి వచ్చింది. మేలిమి సరుకుకు మాత్రమే ఎక్కువ ధర తీసుకునేవాణ్ని. చేసే బిజినెస్‌లో నిజాయితీ పెరిగింది: లాభార్జన తరిగింది.

'నేను పడే కష్టానికి నాకు తగిన ఆర్జన వుండేది: అధిక లాభార్జన మాత్రం లేకుండా పోయింది. కానీ నాకెందుకో సంతోషంగా ఉండేది: ప్రోద్బలంతో ఎవర్నీ ఏదీ కొనిపించాల్సి వుండేది కాదు – మనుష్యులు తమంతట తామే కొనుక్కునేవారు. ఈ రెంటికీ చాలా తేడా వుంది. మనసు తేలిక పడింది. చింత వుండేది కాదు. ప్రశాంతంగా బ్రతకడమంటే ఏమిటో మొదటిసారి అనుభవించ నారంభించాను' అంటాడు హేరీ వుల్ఫ్.

మనిషికి ఈ ప్రశాంత చిత్తం, కీలకమైనది. అకటా వికటంగా, పలురకాల ఆకాంక్షలతో, ఆదర్శాలతో, ఆలోచనలతో బ్రతికే మన బ్రతుకులకు కొరవడింది ఈ ప్రశాంతతే. శాంతి క్షేత్రంలోనే ఆధ్యాత్మిక బీజం మొలకెత్తి మహా వృక్షమయే వీలుంటుంది. ఆ విషయం స్వానుభవంలో గ్రహించినందువల్లనే ఆనాటి ఆ మహారుషులు 'ఓం శాంతిః ఓం శాంతిః' అని ముమ్మారు తమ అభీష్టాన్ని ప్రకటించారు. వీరు కోరిన

శాంతి, మన తెలివితక్కువలో మనం కోరే, రెండు యుద్ధాల మధ్య ఏర్పడే విరామం వంటిది కాదు. ఈ 'విరామ శాంతి'లో పోరుకు సంఘర్షణకు సంబంధించిన బీజాలు వుండనే వుంటై. ఒక యుద్ధం అంతమయ్యే రోజునే తర్వాతి యుద్ధానికి సన్నాహాలు ప్రారంభమవుతాయి.

మహామునులు ఆశించిన శాంతి పరమ శాంతి. ఆ శాంతిలో సంఘర్షించే గుణం పూర్తిగా తొలగిపోతుంది. అట్టి శాంతిలోనే త్యాగరాజు సూచించిన సౌఖ్యం. మనమెరిగిన సుఖానికి, దుఃఖమనే వ్యతిరిక్త భావం ఎప్పుడూ వెన్నంటి ఉంటుంది. పరమశాంతి ద్వారా లభించే మహా సుఖానికి, వ్యతిరిక్తమనేది ఉండదు. ఆ మహాసుఖం నీ నిత్య జీవితంలో, నీ తోటివారితో, చుట్టూ వున్న సృష్టితో, నీవు వ్యవహరించే తీరులో ప్రకటితమవాలి. మనమీనాడు తలచుకుంటున్న ఆ జిడ్డు కృష్ణమూర్తిగారు, ఇలాంటి ఆధ్యాత్మికతను మన జీవితాల్లో నెలకొల్పుకోండని ప్రవచించి తరలిపోయాడు.

***ఆంధ్రభూమి, మే 11, 2003***


కరుణ, వికసించే పుష్పం లాంటిది. కరుణను ప్రయత్న పూర్వకంగా కలిగించుకోలేవు. కరుణను భావనాత్మకంగా తెచ్చుకోలేవు. ప్రేమనెలానైతే 'సాధించ'లేవో,అలాగే కరుణను కూడా సాధించలేవు.

# యౌవనంలో కృష్ణమూర్తి

మే మాసం పదకొండవ తారీఖు శ్రీ జిడ్డు కృష్ణమూర్తి జన్మదినం. 1895లో మదనపల్లిలో ఆయన జన్మించిన గృహాన్ని ప్రభుత్వం అప్పటి సొంతదారుల నుండి క్రయం చేసి నిర్వహణకుగాను కృష్ణమూర్తి ఫౌండేషన్ ఆఫ్ ఇండియా సంస్థకు అప్పగించింది. సమీపాన వున్న రిషీవాలీ స్కూలు అధికారులు ఆ బాధ్యతను స్వీకరించారు. ఒకప్పుడు కృష్ణమూర్తి తండ్రి తాశీల్దార్ శ్రీ నారాయణయ్య కట్టిన ఆ మేడను బాగుచేసి కృష్ణమూర్తి పేరుతో ఒక స్టడీ సెంటర్ తెరిచారు. అక్కడ కృష్ణమూర్తి వీడియో క్యాసెట్లు చూడడానికి వినడానికి, ఆయన పుస్తకాలు పఠించడానికి తగిన ఏర్పాట్లన్నీ గావించారు. స్టడీసెంటర్‌ను వారంలో నాలుగు రోజులపాటు కొన్ని గంటలు తెరచివుంచడం, చూచిపోవడానికి వచ్చే వారికి అక్కడి ఫోటోలు మొదలైనవి చూపించడం, విజిటర్లు అడిగే ప్రశ్నలకు సమాధానా లివ్వడం డాక్టరేటుకు గాని ఇతర విధాలగానీ పరిశోధన చేయదలచుకున్న వారికి సదు పాయాలు కలుగచేయడం వంటి కార్యనిర్వహణ స్థానిక జర్నలిస్టు, రచయిత శ్రీ పురాణం త్యాగమూర్తి శర్మ చేస్తుంటారు.

అడపా దడపా ఈ వ్యాసకర్త కూడా వెళ్ళి తడవకో ఐదారు ప్రసంగాలు చేసి వస్తుంటాడు. మదనపల్లిలోని రాఘవేంద్రరావు వీధి అనే సన్నటి సందులో కృష్ణమూర్తి పుట్టిన ఇంట్లో ఆయన బాల్యం గడిచిన చోటుకు వెళ్ళి తెనుగులో అక్కడివారితో మాట్లాడటం, వ్యాసకర్త తన భాగ్యంగా ఎంచుకుంటూ వుంటాడు.

తత్వాన్ని పక్కనబెట్టి ఆయన యౌవనప్రాయంలోని కొన్ని ఘట్టాలను వివరిస్తాను. కృష్ణమూర్తిగారి ముప్ఫయ్యవ ఏట ఆయన అమెరికన్ మిత్రుడు సిడ్నీఫీల్డ్ ఇలా అంటాడు. 'నా తండ్రిన్నీ, మిగతా మరికొందరు పెద్దతరంవారు భారతీయ యువ టీచర్‌ను 'కృష్ణజీ' అని సంబోధించడం గమనించాను. కానీ నేనిలా పిలవడంలోని ఉచితానుచితాలు నాకు సరిగా తెలియనందువల్ల, అతడు మా ఇంటికి వచ్చి వెళ్తున్నప్పుడు ఇద్దరమూ కలసి బయటికారు వద్దకు నడిచివెళ్ళే సమయాన "మిమ్మల్ని మిస్టర్ కృష్ణమూర్తి అని పిలవనా, లేక మిస్టర్ కృష్ణజీ అని పిలవాలా?"

అని అడిగాను. అతడికా ప్రశ్న కాస్త వినోదంగా కనిపించినట్టుంది. చిరునవ్వుతో "సింపుల్‌గా కృష్ణా అని పిలువు" అన్నాడు.

కృష్ణమూర్తి కారు దిగి మా ఇంట్లోకి వస్తూ, ఇంటిలోని వారందరికీ అభివందనం చేస్తున్నప్పుడు ఆయన తన కుడిచేయి శరీరానికి కాస్త ఎడంగా వుంచుకొని ముందుకు నడుస్తున్నట్లు కనిపించింది. "బాత్‌రూమ్ ఎక్కడుంది?" అని నన్ను అడిగాడు. "చేయినలా ఎందుకని ఎడంగా పెట్టుకు వస్తున్నారు. ఏమైనా గాయమైందా?" అని అడిగాను. "లేదు, ఈ చేతికి నార్మాటాల్ మడ్జ్ (సినిమా నటి) వాడే సుగంధ ప్రత్యేక వాసన అంటుకున్నది" అన్నాడు.

మా ఇంటికి వచ్చేముందు జాన్ బారీమూర్ అనే ప్రఖ్యాత హాలీవుడ్ నటుడు కృష్ణమూర్తిని నార్మా అనే నటి ఇంటికి తీసుకు వెళ్ళాడట. ఆవిడ కృష్ణమూర్తితో చేసిన కరచాలనం తదుపరి ఆ సుగంధ ద్రవ్య వాసనను తన చేతి నుండి తొలగించలేక నీటి కోసం వెతుకుతున్నాడు!

మనిషిలో సకారాత్మక (పాజిటివ్) గుణాన్ని మెచ్చుకోవడం కృష్ణమూర్తికి అలవాటుగా వుండేది. సినిమా నటుడు జాన్ బారీమూర్ పెద్ద తాగుబోతు. కానీ చిన్న కుమారుడితో కలసి, శని ఆదివారాల్లో కృష్ణమూర్తి వద్దకు వచ్చినప్పుడల్లా ఆ సమయంలో మాత్రం తాగ కుండా వచ్చేవాడట. అలవాటుగా పీకల వరకూ తాగే జాన్ బారీమూర్ కొడుకును వెంట బెట్టుకొని వచ్చినప్పుడు మాత్రం తాగకుండా రావడం కృష్ణమూర్తిగారికి 'ప్రేమకొద్దీ జాన్ చేసిన త్యాగం'గా కనిపించేది; జాన్‌లో అది గౌరవించదగ్గ గుణంగా పరిగణించాడు.

హాలీవుడ్‌లో కృష్ణమూర్తిని ఇంగిల్‌మాన్ ఇంటికి కారులో తీసుకువెళ్తూ అంతకు ముందు మరో ఇంట్లో, కృష్ణమూర్తిని ఆరాధిస్తున్న అమెరికన్ ఆడపిల్లలు ఒక గదిలో ఆయనతో కొంతసేపు సమావేశమయిన ఘట్టాన్ని గురించి ప్రస్తావించి, "అక్కడి లివింగ్ రూమ్‌లో సెక్స్ భావన ఎంత బలంగా ముసురు కుంటున్నట్లున్నదో గమనించారా?" అని సిడ్నీ, కృష్ణమూర్తిని అడిగాడు.

"అఫ్‌కోర్స్" అన్నాడు కృష్ణమూర్తి. "అట్టి పరిస్థితిలో మనసు పరిపరివిధాల ప్రవర్తిల్లదూ? అలాంటప్పుడు ఏం చేయాలి?" అని అడిగాను, అంటాడు సిడ్నీ. "సెక్స్ శక్తిని బ్యాంకులో వేసి వుంచాలి. అది నీ మనసును చిందరవందర చేయనివ్వరాదు" అన్నాడు కృష్ణమూర్తి.

"మీరు వేరు. నా మట్టుకు నాకు ఆలోచనలను కంట్రోల్ చేయడం చాలా కష్టం. అవి ఎటు వెళ్ళదలచుకుంటే అటే వెళ్తయ్. అక్కడున్న ప్రతి ఆడపిల్లా శారీరకంగా మిమ్మల్ని బలీయంగా వాంఛిస్తున్నదని నాకనిపించింది"

"ఓ మైగాడ్" అన్నాడు కృష్ణమూర్తి.

మరోసారి సిడ్నీ ఫీల్డ్ కృష్ణమూర్తిని కలిసినప్పుడు "సెక్స్‌ను గురించి మీ అభిప్రాయాలు ఎన్నో రకాలుగా నాకు వినవచ్చినై" అన్నాడు.

"నువ్వేమి విన్నావో, వారూ వీరూ ఏమన్నారో వదిలెయ్. సెక్స్ ఒక ఎనర్జీ (శక్తి) అని సింపుల్‌గా అర్థం చేసుకో. ఒక లక్ష్యాన్ని సాధించడానికి ఆ శక్తిని వినియోగించాల్సి వుంటుంది" అన్నారు.

నేను అధికంగా టెన్నిస్ ఆడుతుంటానని ఆయనకు తెలుసు. అందుకని 'టెన్నిస్ మాచ్ వుందనగా అంతకుముందు సెక్స్‌లో పాల్గొంటావా?" అని అడిగాడు కృష్ణమూర్తి.

"ఊహూ, గెలవాలని వుంటే పాల్గొనను"

"నే చెప్పేది అదే, కొండమీదికి ఎక్కాలనుకున్నప్పుడు ప్రతి ఔన్సుశక్తినీ సురక్షితంగా కాపాడుకుంటావ్"

"అంటే ఉత్కృష్టమైన దానిని సాధించాలనుకున్నవాడు కఠిన సన్యాసి అయి వుండాలనా మీ అభిప్రాయం?"

"కానే కాదు, కాఠిన్యంతో కూడిన సన్యాసిత్వం అనే ధ్యేయం ఒక రకమైన విధ్వంసానికి దారితీస్తుంది. శారీరకంగా సెక్స్ అవసరాన్ని గుర్తించక తప్పదు. అలాగే ఒక లక్ష్యసాధనకై సెక్స్ ఎనర్జీని సంరక్షించుకునే అవసరమూ గుర్తించాలి"

కృష్ణమూర్తి, సుప్రసిద్ధ బ్రిటిష్ రచయిత డి. హెచ్. లారెన్స్‌ను కలిశాడని నాకు తెలుసు. లారెన్స్ ఆ మధ్య ఒక ఇంటర్వ్యూలో "సెక్స్ ద్వారానే ఓ క్షణకాలం లిబరేషన్ (విముక్తి) సాధించే వీలుంది" అని అన్నాడు. అది కృష్ణమూర్తికి చెప్తే ఆయన నవ్వాడు. అటు తర్వాత కాసేపు సంపూర్ణమైన నిశ్శబ్దం నలువైపులా వ్యాపిస్తున్నట్లు నిపించింది.

"లిబరేషన్ అనేది 'సెక్స్ ఇన్వర్టెడ్' తలకిందులుచేయడం' అన్నాడు కృష్ణమూర్తి. చకితుణ్ణై  అదేమిటో అర్థంగాక "ఏమిటి మీరనేది?" అన్నాను.

"ఆలోచించు" అన్నాడు కృష్ణమూర్తి చిరు మందహాసంతో.

"ఇప్పటికీ ఆలోచిస్తూనే వున్నాను" అంటాడు సిడ్నీ ఫీల్డ్.

*నవ్య **18-5-2005***



# తెలివి, ముందే, ప్రవర్తిల్లితే

"ఎన్నేళ్ళుగానో మీ మాటలు వింటూ వచ్చాను. మీ ఆడియో టేపులూ విన్నాను. అయినప్పటికీ ప్రారంభదశలో నేనెక్కడన్నానో, ఇప్పటికీ అక్కడే వున్నాను. ఈ విషయాన్ని మీరు ఒకింత సీరియస్‌గా తీసుకొని, వివరించడం ముఖ్యమనిపిస్తున్నది. బహుశా మాలో చాలామందిమి ఈ పరిస్థితిలోనే వున్నామనుకుంటాను. బహుశః అన్నాను సుమండీ!" అని నిన్నటి రోజున ప్రశ్నించాడు, అదుగో అటు కూచోనున్న పెద్దమనిషి, అని ప్రారంభించాడు శ్రీ జిడ్డు కృష్ణమూర్తిగారు ఒకనాటి తన ప్రసంగాన్ని.

"మనిషి అంతరాంతరాళాల్లో మార్పు ఎలా సంభవించాలి? మనిషి పరివర్తనం చెందాలి అనే విషయంపై దృష్టి కేంద్రీకరించిన వారికి ఇదో పెద్ద సమస్య. మనల్ని మార్చేదేది? ఈ ప్రశ్నను మీ లోతుల్లో నుండల్లా వేసుకుంటే, మిమ్మల్ని ఏది నిజంగా మార్చగలుగుతుందంటారు? బాహ్యంగా సంభవించే ఏదైనా సంఘటన, మీ జీవితంలో ఏదో పెద్ద సంకటావస్థ, క్లిష్టపరిస్థితి తీసుకువచ్చి పడేసి, ఆ విధంగా మీ ఆలోచనలో మౌలికమైన మార్పును ప్రవేశపెడుతుందా? కుటుంబంలోని ఆప్తుల మరణం, ఏదో తీవ్రమైన విపత్తు, లేక భౌతికంగానో, మానసికంగానో వినాశకరమైనదేదో సంభవించడం, ఇలాంటిదేదైనా లోతైన మార్పును తెస్తుందా?

'తీవ్రమైన బాధకు, పెను దుఃఖానికి గొప్ప క్షోభకు, గురైతేనే మనిషి మారుతాడు; అప్పుడు గానీ అతడి సహజమైన కాంక్షలు, స్వార్థం, క్రౌర్యంతో కూడిన అతడి తలపులు దారి మళ్ళవు కాబట్టి, అలాంటిదేదో అతడి జీవితంలో సంభవించాలంటారా? మనలో చాలామందిమి అనేక యుద్ధాలు – రెండు ప్రపంచ యుద్ధాలు మన కాలంలోనే సంభవించడం చూశాము. లక్షలాదిమంది మరణించారు, అనేకమంది తమ ఆస్తిపాస్తులన్నీ కోల్పోయారు. తనయుల్ని పోగొట్టుకున్నారు. ఆ గందరగోళం, ఆ భీభత్సం, వీటన్నిటినీ ఒకసారి ఆలోచించండి. బాహ్యంగా జరిగిన ఈ భయంకర సంఘటనలు ఎంత పెద్దవైనప్పటికీ, మనిషిలో మార్పుతెచ్చినట్టుగానీ, 'స్వేచ్ఛ' వైపు అడుగు వేయించినట్లుగానీ, ఎక్కడైనా చూశారా? 'ఇలా ఇకముందు జరగడానికి వీల్లేదు' అని మనస్సుల్లో తీర్మానం చేసుకున్నట్లు ఎక్కడా కనిపించదు.

అందుచేత మిమ్మల్ని నేనడిగే ప్రశ్న: – ఈ ప్రశ్న ఇప్పటికి చాలాసార్లు వేసుకున్నటు వంటిదే– బాహ్య సంఘటనలు మనిషిని మార్చగలవా? అది ఒక సమస్య – ఇక్కడ 'మార్పు' అంటే వర్గంతో, జాతితో, విశ్వాసాలతో, సిద్ధాంతాలతో, మతాలతో మమేకమై వ్యవహరించే మనిషిలోని ఈ స్వార్థ చింతలో రావలసిన మార్పు అని అర్థంచేసుకోవాలి – ఇలాంటి లోతైన మార్పు సంభవించినట్లు దాఖలాలు లేవు.

ఇకపోతే మనిషి జీవితంలో తన సమీపస్థులు అనగా భర్త, భార్య, సంతానం మరణించినప్పుడు, చాలా పెద్ద బాధ, దుఃఖం అనుభవిస్తున్నందువల్ల, మనిషిలో ఒకింత మార్పు వచ్చిందేమోననిపిస్తుంది. అంటే, దీని అర్థం, మనిషిలో మార్పు రావాలంటే, మనిషి బాహ్యంగా ఎవరో ఒక దగ్గరి వారిని కోల్పోయినప్పుడే, సంభవిస్తుందా? మరణం, యుద్ధం, ఎవరో మనల్ని వదిలేసి వెళ్ళిపోవడం, వెలుపలివైపు జరిగే ఏదో వినాశకర ఘట్టమే, మనల్ని మార్చాల్సి వుంటుందా? బాహ్యంగా ఏదో ఒక వ్యక్తిగత ఆపద సంభవిస్తే తప్పితే, అత్యంత దుఃఖం అనుభవంలోకి వస్తే తప్పితే, మార్పురాదు అనడం, అతి భయంకరంగా తోస్తున్నది. మార్పు రావడానికి ఇదొక్కటే మార్గం అనేమాట అత్యంత బాధాకరం; కాని జరుగుతున్న దిదేనోమో ననిపిస్తుంది. అజాగ్రత్తగా కారును తోలే ఓ మనిషి, దారిలో కొందరి మృతికి కారకుడై, తను బ్రతికి బయటపడి, "ఇకముందు కారు తోలేప్పుడు, నేను ఎంతైనా జాతరూకుడినై వుండాలి సుమా' అన్నట్లుంటుంది. అంటే దుస్సంఘటన జరిగిన తదుపరి, తెలివిగా మెసలుకుంటాను అంటున్నాడన్న మాట.

ఇలాంటిది సంభవించక ముందే తెలివిగా బ్రతికే వీలుందా, అనేది ఆలోచించండి. తెలివంటే, స్వార్థచింతలో చురుకుగా వుండటం కోరికలు సఫలం చేసుకోడంలో నేర్పు ప్రదర్శించడం మొదలైనవి కాదు. బాహ్య సంఘటనలు మనిషిలో నిజమైన మార్పు తీసుకు రాగలిగిలేవు, మార్పు అనేది, లోపలి నుండి ఏ వత్తిడీ లేకుండా పుట్టుకురావాలి; అదే తెలివి. మార్పుకై బాహ్యవిపత్తులు, తద్వారా కలిగే పెనుదుఃఖం మీద ఆధారపడితే, మనసును నైరాశ్యం ఆక్రమించవచ్చు. లేదా ఆ బాధను విస్మరించడానికి ఏదైనా వినోదం వెంబడి పడవచ్చు. అది 'మార్పు' అనిపించుకోదు. ఈ విషయం అర్థమవడం

తెలివి. భౌతికవాదులూ, నియంతృత్వ సైద్ధాంతికులూ, 'బాహ్య సమాజాన్ని మార్చండి, అప్పుడు మనుషులు మారుతారు' అని ఘోషిస్తుంటారు. కానీ శతాబ్దాలుగా ఆ ప్రయోగమూ చేసి చూశారు; అయినప్పటికీ మనుషులు మారలేదు.

"ఏళ్ళ తరబడి మీ మాటలు వింటూ వచ్చాను. కానీ ప్రారంభంలో ఎక్కడున్నానో ఇప్పటికీ అక్కడే వున్నాను' అని ఆయన అన్నమాలు వింటున్నప్పుడు లోపలి నుండి ఏడుపు పుట్టుకొస్తున్నదండీ, మీలో ఎందరు లోలోన ఏడుస్తారో నాకు తెలియదు.

ఆయన్నిగానీ, మిమ్మల్నిగానీ, మరెవరినైనా గానీ, ఏది మారుస్తుందండీ? విపత్కర మైన బాహ్య సంఘటన, దానిననుసరించి ఏర్పడే దుఃఖమేనా మనిషిని మార్చగలిగింది? ఇక ఆ దుఃఖం గనక లోతుగా సంభవిస్తే, మిమ్మల్ని అది తునాతునకలు చేసేస్తుంది. అప్పుడు బహుశా 'ఇహ నేను ఈ దుఃఖంతో బతకలేను' అంటుంటే, 'నా మీద విశ్వాస ముంచు. అన్నీ నాకు వదిలెయ్' అని 'సమర్పణ' భావాన్ని బోధించే గురువులున్నారు. కాని ఈ ప్రక్రియలో బయటి వొత్తిడి బదులు ఏదో లోని వొత్తిడికి లొంగి దుఃఖోపశమనానికి ప్రయత్నిస్తున్నారే కాని, దుఃఖానికి మూలమైన మీ స్వార్థచింతన, తత్సంబంధిత కోర్కె నిర్మూలమవడం లేదు కదా?

బాహ్య సంఘటనల ద్వారా సంభవించే దుఃఖం, వొత్తిడివల్లగానీ, మీ నుంచి మీరు తప్పించుకోడానికి తీసుకొచ్చే వొత్తిడి ద్వారాగానీ, మార్పురానేరదని గ్రహిస్తున్నారా? ఇది స్పష్టంగా చూడగలిగితే, అది 'తెలివి' అనిపించుకుంటుంది. ఆ తెలివి బాహ్యం మీద గానీ, లోని ఆలోచన మీద గానీ, ఆధారపడకుండా, వున్న స్థితి నుండి అవతలికి కదిలిస్తుంది. ఆ తెలివి, సంఘటన జరగక ముందే, ప్రవర్తిల్లుతుంది. అప్పుడిక దుఃఖం యొక్క ఆవశ్యకత వుండదు. ఇది గనక మీరు స్వయంగా కనుగొంటే, ఇదో అద్భుతమైన బ్రహ్మాండమైన వరమని గ్రహిస్తారు"

ఈ ప్రసంగంపై వ్యాఖ్యానిస్తూ "లోకంలో తమ సొంత దుఃఖాన్ని తలచుకొని ఏడ్చేవారెందరైనా వుంటారుగానీ, మరొకరి వైఫల్యాన్ని చూచి తాను ఏడ్వడం ఒక్క కృష్ణమూర్తికే చెల్లింది' అన్నాడు మిత్రశ్రీ.

*నవ్య* ***22-2-2006***

# నేను వాస్తవాన్ని కనుగొన్నాను

జిడ్డు కృష్ణమూర్తిగారు 1933 ప్రాంతంలో ఉత్తర హిందూస్థానంలో అంబాలాల్ సారాభాయి కుటుంబ అతిథిగా వుంటుండేవారు. శ్రీ అంబాలాల్ కూతురు, లీనా, 'లీవ్స్ ఫ్రమ్ ఎ డైరీ' అనే పుస్తకం రాసింది. అందులో ఆమె కృష్ణమూర్తిగారితో తాను సలిపిన సంభాషణలు కొన్ని రాసి పెట్టింది. ఆయన జీవనశైలిని కూడా వర్ణించింది. అప్పటికి కృష్ణమూర్తిగారి వయసు ముప్ఫై ఎనిమిది. అరమరికలు లేకుండా ఆవిడ ప్రశ్నలు అడిగిన తీరు, ఆయన సమాధానం చెప్పిన తీరు పాఠకులకు ఆసక్తిదాయకంగా వుండవచ్చు.

***లీనా :*** మీరు అహ్మదాబాద్ నగరంలో 'నేను వాస్తవాన్ని తెలుసుకున్నాను (ఐ హావ్ రియలైజ్డ్)' అన్నారు. మీరు తెలుసుకున్నదేమిటి? అందుకు అవలంబించిన విధానమేమిటి? ఆ తెలుసుకోవడంలోని వివిధ దశలేమిటి?"

***కృష్ణమూర్తి :*** నేను వాస్తవాన్ని కనుగొన్నాను. ఏమి తెలుసుకున్నానో చెప్పమని మీరడిగితే, ఒక దృఢమైన వస్తువుని వర్ణించినట్టు వర్ణించగలిగిలేను. ఓ సూర్యాస్తమయాని కుండే సౌందర్యం, లేక చక్కెరకుండే తీపిదనం, మీరు స్వయంగా అనుభవించి వుంటే తప్పితే, నేను మీకు ఆ భావాన్ని ఎలా అందజేయగలను? మీరు ఆ అనుభవాన్ని ఎరిగి వుంటేనే తెలుస్తుంది.

***లీనా :*** అయితే అది మీ సెల్ఫ్ (స్వయం, స్వతః) యేనా? లేక మీకు భిన్నమైనటు వంటిదా?

***కృష్ణ :*** అవును, కాదు అని చెప్పాల్సి వుంటుంది. ఇలా సమాధాన మిస్తున్నందుకు ఏమీ అనుకోవద్దు. కానీ ఇంతకన్నా మరేరకంగానూ చెప్పలేను.

***లీనా :*** మీరు కుండలినీ శక్తికి సంబంధించిన కొన్ని సాధనాలు చేశారు; ఉపవాసాలుండి చూశారు, వాటిని గురించి కొన్ని పుస్తకాలు చదివారు. సన్యాసి యొక్క కఠిన జీవన విధానాన్ని కొంతకాలం అనుసరించారు.

**కృష్ణ :** అవును. 'ఎవరైనా ఇది చేసి చూడు' అని అంటే, అది కొంతకాలంపాటు చేసేవాణ్ణి; ఆ తర్వాత వదిలేసేవాణ్ణి.

అలాగే నా జీవితంలో కొందరు స్త్రీలు తారసిల్లారు; వాళ్ళు నన్ను ప్రేమించారు. కాని నేను పక్కకు తొలగాల్సి వచ్చింది. వాళ్ళకు నా మీద కోపమొచ్చి నావద్దనుండి వెళ్ళిపోయారు.

ఆ ఆధ్యాత్మిక సాధనలన బడేటటువంటివి నాకు ఏవిధంగానూ సహాయపడలేదని నేననుకుంటున్నాను. ఒకవేళ సహాయపడివుంటే,ఎలా సహాయపడ్డాయో నాకు తెలియదు.

'ఇది కాదు, ఇది కాదు' అని తిరస్కరించడమే (నెగేట్) నా జీవన విధానం; ఇదొక్కటే మార్గమని నాకు తోస్తుంది.

***లీనా :*** అలాంటి సాధనలు వ్యర్థమని గ్రహించి మీరు వాటిని వదిలేశారు అనే మాట నిజమే. కానీ అలాంటి జ్ఞానంలేని మాబోంట్ల సంగతేమిటి? వీటిని ఆచరిస్తూ వుండటం తప్పని మీ అభిప్రాయమా?

**కృష్ణ :** మీరు చేయదల్చుకున్నదేదో మీరు చేసే తీరుతారు; ఎవ్వరూ ఆపగలిగి లేరు. కానీ బాల్యంనుండి యౌవనంలోకి అడుగిడే ముందు, తగిన జ్ఞానం కలగడానికి, యావన్మందీ తడపర, ఆటలమ్మ, మశూచి (ఆ కాలంలో ఆ వ్యాధులు ప్రబలంగా వుండేవి). అనుభవించాలని అనలేము కదా. యోగా ఆచరించడం, కొన్ని సిద్ధాంతాలను అనుసరించడం ఇతర సాధనలు చేపట్టడం అవసరమనుకోనక్కరలేదు.

నాకు ఓ లక్ష్యమంటూ లేదు; అంతిమదశ ఎలా వుంటుంది అనే ఓ స్పష్టమైన భావన ఏమీలేదు. ఓ నిర్దేశిత మార్గం, ఓ సిద్ధాంతం, ఓ మత విశ్వాసం వంటివి అనుస రించినందుల్ల సత్యదృష్టి, సత్యదృశ్యం, సంకుచితమై పోతుంది. అప్పుడు ఈ సమస్తాన్ని ఎలా దర్శించడం?

అక్కడికా సంభాషణ ముగిసింది. మరో సందర్భంలో కృష్ణమూర్తిగారు ఈ వాస్తవ దర్శనాన్ని గురించి ప్రస్తావిస్తూ "వాస్తవం అమిత సూక్ష్మమైనది. (Subtle), నేను మీ అజ్ఞానాన్ని విచ్ఛేదం చేయడానికి తోడ్పడగలనేమో కానీ, వాస్తవాన్ని

గురించి నేర్చుకోవడం మాత్రం మీరే చేయాల్సి వుంటుంది; జ్ఞానం అనేదాన్ని మీరు స్వయంగా ఆర్జించాలి.

ఒకరిస్తారు, మరొకరు స్వీకరిస్తారు అనే విధానం దోపిడీకి దారితీస్తుంది. అహం కారమనిపించుకుంటుంది. వాస్తవ దర్శనాన్ని కానీ, ఆ సంపూర్ణత్వాన్ని కానీ, ఎవరూ ఎవరికీ ఇవ్వలేరు. మీ చుట్టూ మీరేర్పరుచుకున్న భ్రమలను నే నెత్తి చూపిస్తున్నాను. వాటిని తొలగించుకుంటేనే మీరా సంపూర్ణత్వాన్ని దర్శించగలరు.

ఈ సంపూర్ణత్వం మీలోనే నెలకొని వుందనే సూత్రం అర్థమైతే, మీ శ్రమతోనే, మీరు పడే ఘర్షణల ద్వారానే, తత్కారణంగా మీలో ఉదయించే అవగాహన వల్లనే, ఆ వాస్తవ దర్శనం జరగగలదు. ఈ విషయం మీకు బోధపడితే, మీరు నిర్మించుకున్న అవరోధాలన్నింటినీ, మీరే తొలగించుకొని వెలికి వస్తారు" అన్నారు.

"సవినయంగా, మనిషి తనకి తాను 'నేను మానవ ధర్మాన్ని' (I am humanity) అని గ్రహిస్తే, అతడు స్వార్థపరుడు కాజాలడు; పైపెచ్చు తనపై ఒక పెద్ద బాధ్యత మోపబడినట్లు అర్థం చేసుకుంటాడు. మనుష్యజాతి ప్రతినిధినని తెలుసుకున్నవాడి కర్మాచరణ యావత్తూ ప్రేమ నుండి పుట్టుకొస్తుంది" అన్నారు కృష్ణమూర్తిగారు.

లీనా సారాభాయి డైరీనుండి మరికొన్ని కృష్ణమూర్తిగారి మాటలు: 'నేను ఎల్లప్పుడూ ఓ ఆనందాబ్ధిలోనే వుంటాను. కోపమూ, అసూయ, ఇతర భావోద్వేగాలు నాలో వుండవు... మనుషుల ముఖాలు అంత గుర్తుపెట్టుకోగలిగిలేను; ఇక మనుషుల పేర్లైతే గుర్తుండటం మరీ కష్టం.

అపేక్ష కారణంగా కొందర్ని ఎక్కువగా పరిగణించడం అంటూ వుండదు. నా అనుచరు లనుకునే వాళ్ళు, నన్ను అర్థం చేసుకున్నవాళ్ళు, వీధిని వెళ్ళేమనిషి, ఎవరైనా నాకు ఒకటే; వారూ వీరూ అనే తేడాలు వుండవు. ఇలాంటి అనుభూతి నాకు మొదట్నుంచీ వుందని అనలేను; కానీ మెల్లమెల్లగా పెరగజొచ్చింది; నేను పెంచి పోషించింది కాదు.

తనకు చిన్న చిన్న పనులు చేసి పెట్టేవారిని 'సర్వెంట్'అనేమాట అంటే, ఆయన ఇష్టపడేవారు కాదు. అలా అన్న మనిషితో, చిన్నపిల్లవాడిలాగా, అభ్యర్థిస్తూ, 'అతడు నా

సర్వెంట్ కాదండీ, నా ఫ్రెండండీ, ఈ 'వేలు' (ఒక వ్యక్తి పేరు) నా సహచరుడు (కంపానియన్) అండీ' అని తన మనసునొప్పిని తెలియజేసేవాడు.

అవతలి మనిషి తన ముందుకు వచ్చినప్పుడు మర్యాదసూచకంగా, అతడు వొంగ బోయేముందే, తాను అతడి యడల వొంగి మర్యాదను ప్రకటించేవాడు; (మర్యాద పురుషోత్తముల లక్షణాలిలా వుంటాయి కాబోలు!)

***నవ్య 17-5-2006***



# కానరాని 'ఆ అంతరిక్షం'

జెన్ మాస్టర్ హోటై విచిత్ర వ్యక్తి. తోటివాళ్ళని ప్రేమాదరాలతో చూచేవాడనే మాట నిజమే అయినప్పటికీ, ఒకింత విపరీతంగా ప్రవర్తించేవాడు; కానీ ఆ కాస్త వైపరీత్యం అతడి జీవితానికి ఓ వింతశోభ చేకూరుస్తుండేది. బాహ్యంగా మనుషులకు ఎలా కనిపించినా, నిజానికి ఆ వైఖరి చాలా అర్థవంతమైనది.

ప్రతిరోజు నిద్రలేవగానే కళ్ళు తెరవకుండా, పక్కమీది నుండి తన పేరుతో తననే పిలుచుకుంటూ, "హోటై, ఇంకా ఇక్కడే వున్నావా?" అనేవాడు. ఆ తర్వాత, తనకు తానే సమాధానం చెప్పుకుంటూ "ఉన్నానండయ్యా" అనేవాడు. అటుపైన, 'అయితే సరే'నని ముగించేవాడు.

ఇదంతా అతడి శిష్యవర్గానికి అర్థమయ్యేదికాదు. 'మీరెందుకిలా చేస్తారండీ?' అని అడిగేవారు. "ఏదో ఒకనాడు నేను నిద్రలేచేసరికి, హోటై ఇక్కడ వుండడు. మరి ఈ హోటై నాకెంత మంచి సేవకుడో తెలుసా? కష్టాల్లో సుఖాల్లో, ఎండల్లో, వానల్లో, శుభా శుభాల్లో అన్నింటా నా తోడునీడగా వుంటూ ఎన్ని సపర్యలు చేశాడో చెప్పగలిగి లేను. అందుకనే, ప్రొద్దున లేచీలేవడంతోటే, ముందు ఈ హోటై హాజరుగా వున్నాడా లేడా అని కనుక్కుంటూ వుంటాను. 'వున్నాను' అని అతడు సమాధానం చెప్పేసరికల్లా, ఇక నా దినచర్య నిర్వహణకు ఎంతో ఉత్సాహం కలుగుతుంది" అనేవాడు హోటై.

"అయితే ఇక్కడ మరొకరెవరూ లేరు కదండీ; మీరే ప్రశ్న అడుగుతారు, మీరే సమాధానమిస్తారు, మరి" అని శిష్యులు తలగోక్కున్నారు.

"బాహ్యంగా అలాగే కనిపిస్తుంది. కానీ నిజానికి బయట అందరికీ కనిపించే ఈ హోటైని నేను నా లోపలి నుంచల్లా 'నువ్వు వున్నావా?' అని అడుగుతుంటాను; 'హాజరు స్వామీ' అని సమాధానమిస్తున్నది నా మనసు. మీకు ఎలా కనిపించినప్పటికీ, నా మటుకు నాకు ప్రశ్నవేసే 'మూలం' వేరు, సమాధానం చెప్పేవారువేరు' అన్నాడు హోటై.

హోతై జీవిత కాలంలో, ఇలాంటి ప్రశ్న ఒక్కసారే వేయకుండా వుండిపోయాడు; సహజంగా సమాధానమూ లేదు. ఆ రోజు అతడి మరణదినం; ప్రొద్దున్నే కళ్ళు తెరిచాడు. కానీ నోటి నుండి ప్రశ్న రాకపోవడం చూచి శిష్యులు ఆశ్చర్యపోయారు. ఏమయింది? నిశ్శబ్దం తాండవిస్తున్నది.

ఆదుర్దాగా ఒక శిష్యుడు "అయ్యా మీ మామూలు పిలుపు వినిపించలేదే; మరచి పోయారా?" అన్నాడు. హోతై నవ్వేసి, "నేను పెద్దవాణ్ణీ అయిపోలేదు; జ్ఞాపకశక్తీ క్షీణించ లేదు. నేను ఎల్లప్పుడూ యౌవనుణ్ణే. ఈనాడు నేను హోతైని ఇబ్బంది పెట్టదలచుకోనందు వల్ల, ఆ ప్రశ్న వేయడం లేదు" అన్నాడు.

అర్థంగాని శిష్యుడు, "ఇబ్బంది పెట్టడమేమిటండీ?" అని అడిగాడు.

"ఇబ్బందేమిటంటే, ఇవాళ నేనీ ప్రశ్న వేసినట్లయితే 'హాజరు స్వామీ' అని హోతై అనగలిగిలేడు. ఇది భూమిపై నా ఆఖరిరోజు. నిజానికి నేను నడిరేయినే పోయుండాల్సింది.

ఎలాగోలా ప్రొద్దుటివరకూ బ్రతికి వుండడానికి నిశ్చయించుకుని శ్వాసక్రియను కొనసాగించాను. ప్రొద్దున్నే మీరంతా వస్తారు కాబట్టి, అందర్నీ ఒకమారు ఆఖరిసారిగా చూచి వెళ్దామనుకున్నాను. మీరూ నన్ను బహుశా మొదటిసారి చూచిన అనుభవం కలుగుతుంది" అని వారికి అర్థంగాని మాటేదో అన్నాడు.

హోతై నేత్రాలు మూతపడుతుండగా, 'హోతై, ఇక వెళ్దాం పద' అన్నాడు. తానే అందుకు సమాధానంగా 'చిత్తంస్వామీ; నేను నడిరేత్రి నుండే సిద్ధంగా వున్నాను. వెళ్ళే వేళయింది' అన్నాడు.

హోతైని వెర్రివాడిగా తోసిపుచ్చవచ్చు; కానీ ఇదే జ్ఞాని లక్షణమని కూడా అనవచ్చు. ఏ మహనీయుడి ఔన్నత్యాన్నైనా, అతడు జీవించి వున్నకాలంలో, స్పష్టంగా గుర్తించగలిగిన వారంకాదు.

"మీకు కానరాకుండా పోయిందేమిటో మీకు తెలియదు; ఆ అంతరిక్షం, ఆ శూన్యం" అంటూ చివరి క్షణాల్లో మరణశయ్య నుండి మెల్లగా పలికాడు శ్రీ జిడ్డు

కృష్ణమూర్తి. అంతకుమునుపు కూడా మద్రాసు వసంత విహార్‌లో తన చుట్టూ కూచోనున్న కొద్దిమందితో 'నేను మీ అందరి చేతుల్లో అమిత విలువైన వస్తువును పెట్టిపోతున్నాను. ఈ టీచింగ్ అమూల్యమైన ఆభరణమండీ. మానవులు ఏమి కోల్పోతున్నారో, ఏది చేయిజారిపోతున్నదో, వారికి తెలియను కూడా తెలియదు.

ఈ టీచింగ్‌ను మీరేమిచేద్దామనుకుంటున్నారండీ? 'కృ' వాక్యాలు వల్లెవేద్దామను కుంటున్నారా? ఆ పనిమాత్రం చేయకండి. ఈ బోధను జీవించండి. అలా జీవిస్తేనే, వ్యుత్పత్తి కల కొత్త పరిజ్ఞానం, తెలివి లభ్యమవుతై. సెకండ్‌హాండ్ మనుష్యులుగా జీవించ కండి" అన్నారు.

ఆయన బ్రతికినంతకాలం, చెవిని ఇల్లుగట్టుకొని, ఎంతో వైవిధ్యంతో, ఎన్నో కోణాల నుండి పవిత్రమైన ఆ విషయాన్ని గురించి ఎంతగా బోధించినా, 'మాకు అర్థం కావడం లేదని' కాసేపూ, మీరు నిశ్చయభావంతో (పాజిటివ్‌గా) కాకుండా, అభావ (నెగటివ్) 'నేతినేతి' దృష్టితో చెప్తారెందుకండీ?' అని కాసేపూ, 'మీరు చెప్పేది ప్రాక్టికల్ లైఫ్‌లో ఆచరించగలిగింది కాదండీ' అని మరి కాసేపూ, ఇలా ఏవో కుంటిసాకులు చెప్తూ తిరుగు తుండేవాళ్ళం. ఆయన బ్రతికున్నప్పుడే అప్పటికప్పుడు నేర్చుకోకపోతే, ఆ తర్వాత అసలు నేర్చుకోగలిగి వుంటామో లేదో, అనే అనుమానం కూడా రాలేదు.

కానీ, మించిపోయిందేమీ లేదు. అదృష్టవశాత్తూ అయిన టీచింగ్ యావత్తూ, చెప్పింది చెప్పినట్లు, పుస్తకాలు, ఆడియో వీడియోల ద్వారా మనకందుబాట్లో వున్నది; దాని స్వచ్ఛతను ఎవరూ రూపుమాపగలిగిలేరు. ఇప్పుడైనా దానిని చదివి, విని, చూచి నేర్చుకోవచ్చు. శ్రద్ధగా అధ్యయనం చేస్తే, ఆ మానవుడి ద్వారా ప్రదర్శితమైన ఆ శక్తిని స్పర్శించే అవకాశం ఈనాటికీ వున్నది; అడిగినప్పుడు ఆ మాట ఆయనే చెప్పారు.

*'నవ్య' ఫిబ్రవరి 2007*

# ఆదర్శాన్ని వీడండి : ఉన్నది చూడండి

"మనుష్యుల్లో ఆనాడు కనిపించిన త్యాగనిరతి, నైతిక ప్రవర్తన, ఆదర్శవాదం, ఇవన్నీ ఈ జాతి ఇంతగా ఎలా కోల్పోయిందో అర్థం కాకుండా వుంది" అని నేను స్వాతంత్ర్య పూర్వ కాలాన్ని తర్వాతి కాలంతో పోల్చి మాట్లాడినప్పుడు, జిడ్డు కృష్ణమూర్తి గారు 'అన్ని దేశాల స్వాతంత్రోద్యమాల కథా అటువంటిదేనండీ. ఆదర్శవాదం లక్షణమే అది' అని తేల్చేశారు.

ఆదర్శవాదం గురించి నాకున్న ఘనమైన అభిప్రాయం ఆయనకు లేదని గ్రహించాను. ఆదర్శాలే మనిషి ప్రవర్తనను తీర్చిదిద్దుతాయనీ, అవిలేనివాడు మృగతుల్యుడనీ మాకో నిశ్చితాభిప్రాయముండేది. అందుకే ఒక్కొక్క భారతదేశ నాయకుని పేరు ఉచ్ఛరిస్తూ, ఒకరి త్యాగం, మరొకరి ధైర్యం, వేరొకరి పట్టుదల, వీటన్నిటిని ఉగ్గడిస్తూ పాటలు పాడుతూ తిరిగే వాళ్ళం. సాధ్యమైనన్ని వ్యాసాలు వ్రాసి పత్రికల్లో ప్రచురిస్తుండే వాళ్ళం.

మరి ఈ మహాజ్ఞాని కృష్ణమూర్తిగారిని మరొక ఆదర్శమూర్తిగా మేము అనుకుంటూ వుంటే, 'ఆదర్శభావమే పొరపాటు, తప్పు' అన్నట్లు ఈయన మాట్లాడడం చెడ్డ ఆశ్చర్యం గొలిపింది. అప్పటికప్పుడు ఆయనతో ఆ విషయమై వాదనకు దిగకపోయినప్పటికీ, ఈ వాస్తవ దార్శనికునికి 'ఆదర్శవాదం' ఎందుకు దోషపూరితమనిపించిందో తెలుసుకోవాలని గాఢంగా తోచింది.

వాస్తవాన్ని చూడనివ్వకుండా, అంటే లోతుగా, దీర్ఘంగా దానిని తిలకించకుండా, మనసు అవలంబించే పలాయన సూత్రమే ఆదర్శమని ఆయన టీచింగ్ పరిశీలించగా తేలింది. ఇప్పుడు మనలో హింసా ప్రవృత్తి, దౌర్జన్యకర ధోరణి ప్రబలుతున్నదనుకుందాం. అనుకోడమెందుకు? మనందరిలోనూ వున్నదే అది. పరిశీలనగా చూడండి. మన లాభం కోసం మన లోభం కోసం, ఏదైనా చేస్తాం. చేతగానితనం, పిరికి లక్షణం, చట్టభయం వల్ల కాస్త వెనక్కు తగ్గుతాం కానీ, నిజానికి లోలోన మనం దౌర్జన్యపరులమే.

అవకాశం లభించినప్పుడు, అవసరం ఏర్పడ్డప్పుడు, దౌర్జన్యానికి హింసాత్మక చర్యలకు పాల్పడతాం. మనిషిలో ఎక్కువ భాగం మృగత్వమే దర్శనమిస్తుంది. భావాలు ప్రకటించడంలో మాత్రమే మంచితనం, సౌశీల్యం, మృదుత్వం, నాజూకు కనిపిస్తాయి. కొందరిలో ఆ కాస్త కూడా వుండదు.

తనలోని మృగతత్వం తనకెప్పుడైనా తటాల్న కనిపించినప్పుడు మనిషికి భయం వేస్తుంది. ఈ మృగ లక్షణాలు అనుకోకుండా సంభవించిన దుష్ట తలపుల వల్లనే కానీ, నిజానికి తాను చాలా మంచివాడినని అతడి దృఢాభిప్రాయం. కానీ ఆ భావం తనని తాను నిశితంగా చూచుకోనివ్వకుండా, కళ్ళను మూసేస్తుంది. తనలో ఆ గుణాలు ప్రదర్శిత మవుతున్నాయంటే, అవి తనలో నుండే వెలికి వస్తున్నాయి. ఆ గుణాలన్నీ తానే, ఆ లక్షణ సముదాయమంతా తానే. కానీ తానీ మృగమని మనసు అంగీకరించనొల్లదు కాబట్టి, తనలో నిజంగా వున్నది స్వార్థమే అయినప్పటికీ, నిస్వార్థాన్ని ఆదర్శంగా ప్రతి పాదిస్తాడు. తనలో కామం ప్రబలంగా వుంటే, అందుకు భిన్నమైన బ్రహ్మచర్యం ప్రతిపాదిస్తాడు. ఆదర్శవాదం తనలోని ఈ కామం, క్రోధం, వీటిని తిన్నగా చూడనివ్వదు. భావనా ప్రపంచమే వాస్తవమన్నట్లు సరిపెట్టుకుంటుంది.

ఈ ఆదర్శాలన్నీ ప్రధానంగా వాక్కులో వ్రాతల్లో ప్రదర్శితమవుతాయి. లోన దాగి వున్న వాస్తవానికి విరుద్ధమైన ఆ ఆదర్శాల నందుకోవడానికి ప్రయత్నిస్తున్నా నంటుంది. ఈ అంతస్సంఘర్షణ ఎల్లకాలం సాగుతూనే వుంటుంది. కొన్ని సందర్భాల్లో కర్మాచరణ ఆదర్శానికి ఎంతో యత్నంతో, చేరువగా రూపొందవచ్చు. కానీ మరికొన్ని సందర్భాల్లో ఆ ప్రయత్నం విఫలమవుతుంది. మరి ఇదేమిటి? అని ఎవరైనా ప్రశ్నిస్తే, 'ప్రయత్నం మరింత బలంగా కొనసాగాలి. టైమ్ పడుతుంది. కానీ ఆదర్శం సాధించి తీరుతాను' అంటుంది. ఆలోచనాత్మకమైన ఆదర్శానికి స్వభావసిద్ధంగా వున్న గుణాలకి వైరుధ్యం కొనసాగుతూనే వుంటుంది. ఇదంతా చాలా కాపట్యానికి దారితీస్తుంది. ఆ మనిషి చెప్పేదొకటి, చేసేదొకటి; ఈ వైరుధ్యం నుండి విషం పుట్టుకొస్తుంది. గట్టిగా, లోతుగా, ఓర్పు కోల్పోకుండా, ఈ లోపలి నుండి తోసుకు వస్తున్న గుణాలను, కదలకుండా, 'అవున'న కుండా, 'కాదన'కుండా సమర్థించుకోకుండా, ఖండించకుండా,

తన స్వరూపం ఎలాంటి దైనా, ఎటువంటి క్రూరమృగాన్ని పోలివున్నా, వున్నది వున్నట్లు చూడగలిగితే, ఆ గుణం వదిలిపోతుంది. మనం కాదు దానిని వదిలించుకునేది; అది మనవల్ల కాదు. మనం చేయగలిగిందల్లా దాని నుండి ఆదర్శాల ద్వారా పలాయనం చిత్తగించకుండా, లోతుగా గాఢంగా దీర్ఘంగా నిశితంగా చూస్తూ వుండటమే. ఆ గుణం 'చూపు' ద్వారా తొలగాల్సిందే. ఆ విధంగా మనిషి తనలోని హింస, దౌర్జన్యం, కాపట్యం నుండి విముక్తుడైతే, అతడి కర్మాచరణ యావత్తూ తదనుగుణంగా హింస లేకుండానూ దౌర్జన్యరహితంగానూ, కాపట్యంతో నిమిత్తం లేకుండానూ సాగిపోతుంది.

కష్టమైనా నిష్ఠురమైనా ఈ 'లో చూపు'తో మనిషి ఈ గుణాల నుండి విముక్తుడ వాల్సిందే కానీ, తన ప్రయత్నంతో, ప్రయాసతో, ఆలోచనలతో, ఆదర్శాలతో విముక్తుడు కాలేడు. ఆలోచన నుండి జన్మించిన ఈ ప్రక్రియలన్నీ తన నుండి పుట్టుకొచ్చినవే. మరి తానేమో, లోభి, కాముకుడు, దౌర్జన్యపరుడు, స్వార్థంతో నిండినవాడు. వీటికి సంతానమైన ఆ ఆదర్శం, వాటిని ఎలా తొలగించగలదు? ఇది 'చూపు'కు మాత్రమే సాధ్యం. నీ వంకర గుణాలతోబాటు, ఈ 'చూపు' కూడా నీకు అందుబాటులోనే వుంది. దానిని మేల్కొల్పడం, ప్రయోగించడమే నీ విధి. దీని బదులు ఈ ఆదర్శాలనేవి చౌకబారు ప్రత్యామ్నాయాలు మాత్రమే. కృష్ణమూర్తిగారు చెప్తున్నదింతే. చేసి చూడండి.

***'నవ్య' మే, 2007***



# లౌక్యం లోపించిన కృష్ణమూర్తి

ఇండియాలో తీసిన 'స్లమ్ డాగ్ మిలియనీర్' అనే సినిమా చాలా గొప్ప అవార్డులు అందుకున్నది. ఆ సినిమా మంచీ చెడూ కాకుండా, స్లమ్‌డాగ్ – అంటే మురికివాడ కుక్క – అనే పదం మురికివాడల్లో నివసించే వారిని కుక్కలుగా పేర్కొనడం సబబుకాదనీ, అది వారి ఆత్మగౌరవానికి భంగకరమని, పాట్నా పట్టణంలోని తపేశ్వర విశ్వకర్మ అనే ఆయన కోర్టులో పిటీషన్ పడేశాడు.

కానీ పాశ్చాత్యులు కుక్కను నీచమైన జంతువుగా పరిగణిస్తున్నట్లు లేదు. కుక్కల్ని పెంచుకోవడమేకాక, వాటి పాలన పోషణకు ఎంతో వెచ్చిస్తుంటారు. ధనిక వర్గాల్లోని మనిషిని, అతి భాగ్యవంతుడైతే, రిచ్‌డాగ్ అని వెక్కిరింపుగా కూడా వ్యవహరిస్తుంటారు. 'ఎవ్రీ డాగ్ హేజ్ ఇట్స్ డే' అనే సామెత వాడినప్పుడు కూడా 'ప్రతి కుక్కకూ దాని రోజు దానికి వస్తుంది; ఆ రోజున అది ఓ వెలుగు వెలుగుతుంది' అనే ఉద్దేశంతో అనేటువంటిదే; ప్రధానంగా దీనిని మనుషుల విషయంలోనే అంటారు.

అమెరికాలోని కాలిఫోర్నియా రాష్ట్రంలో ఉన్న 'ఒహై' గ్రామంలో జిడ్డు కృష్ణమూర్తి గారి ఫౌండేషన్ స్కూలు నడుస్తుంటుంది. సంవత్సరంలో కొంతకాలంపాటు ఆయన ఆ గ్రామంలో విశ్రాంతి తీసుకునేవాడు; మధ్య మధ్యలో అనేక రంగాల్లో కృషి సల్పుతున్న సైంటిస్టులను, కళాకారుల్నీ, మేధావులనూ కలుస్తుండేవాడు, చర్చలు సలుపుతుండేవాడు. ఫౌండేషన్‌కు విరాళమివ్వగలిగిన ఓ అమెరికన్ కోటీశ్వరుడికి విద్యా విషయాలపై చాలా ఆసక్తి వుండేది. కృష్ణమూర్తి ఫౌండేషన్ ఇండియా, బ్రిటన్, అమెరికాల్లో స్కూళ్ళు స్థాపించి, తమదైన విధానంలో విద్య గఱపుతున్నారని తెలిసి, ఈ భాగ్యవంతుడు అదేమిటో తెలుసు కుందామని అనుకున్నాడు. అతణ్ణి ఒహై లోయకు పిలిపించి, కృష్ణమూర్తితో సమావేశపరిచి సంభాషించుకోనిస్తే, ఏదైనా పెద్ద విరాళం అందుతుందనే ఆశతో ఫౌండేషన్ కార్యకర్తలు, ఆయన్ని ఆహ్వానించారు.

ఆయన తన ప్రణాళిక కృష్ణమూర్తికి వివరిస్తూ అమెరికాలోని మరికొందరు ప్రముఖ విద్యావేత్తలను ఒకచోట సమావేశపరచి విద్యా విధానాలను చర్చించడానికి

ఒక గోష్ఠి ఏర్పాటు చేస్తాననీ, అందులో ఒక్కొక్కరూ తమ భావాలను విశదీకరించాలనీ, అలాంటి చర్చావేదికలో కృష్ణమూర్తి కూడా ఉపన్యసించాలనీ తన అభిప్రాయం వెలిబుచ్చాడు.

కృష్ణమూర్తిగారు విద్యను గురించి చాలా చెప్పాడనే మాట నిజమే కానీ, అదంతా మనిషి తనని తాను కనుగొనే విద్యనేరుస్తూ, లోకంలో అందరూ ఉదరపోషణార్థం నేర్చే విద్యలను కూడా ఆర్జిస్తూ ముందుకు సాగాలని ప్రతిపాదిస్తాడు. అందువల్ల ఆయన విద్యను గురించి ఎంత మాట్లాడినా అదంతా ఆయన ధ్యానావస్థలో నుండి వెలువడే పదాలు. విద్యావేత్తలూ, మనవంటివారూ కొంతకాలం విద్యారంగంలో పాటుబడినందువల్ల మనకేర్పడిన అనుభవంతో విద్యను గురించి చదివిన పుస్తకాల ననుసరించి మనంచేసే ఆలోచనల నుండి పుట్టుకొచ్చిన పదజాలం వేరుగా ఉంటుంది. కృష్ణమూర్తిగారి ప్రత్యక్షానుభవ జ్ఞానానికి, మన జ్ఞాపకంమీద ఆధారపడిన జ్ఞానానికి చాలా తేడా వుంటుంది. ఆయనది ఫస్ట్‌హాండ్ జ్ఞానమైతే, మనది సెకండ్ హాండ్ జ్ఞానం. అందుచేత ఒకరుగానీ, పదిమంది కానీ, ఆయనను విడిగా కలిసి ప్రశ్నించాలి, చర్చించాలి; ఎవరి అభిప్రాయాలు వారు ప్రకటించే సెమినార్‌లలో గోష్టులలో ఆయన పాల్గొనే అవకాశంలేదు.

ఈ అవగాహన లేక ఆ కోటీశ్వరుడు కృష్ణమూర్తిగారికి అలాంటి సూచన చేశాడు. కృష్ణమూర్తిగారు ఛట్టున, "అయ్యా, వేదిక మీది నుండి మొరిగేది ఈ ఒక్క కుక్కేనండీ" (దిస్ ఈజ్ ది ఓన్లీ డాగ్ దట్ బార్క్స్) అన్నాడు.

ఖంగుతిన్న ఆ కోటీశ్వరుడు, ఇక ఇతడితో మాట్లాడడం అనవసరమని భావించి, వెనక్కు తగ్గాడు. ఫౌండేషన్‌వారి 'విరాళ ఆశలు' కృష్ణమూర్తి అన్న మాటలతో అంతరించినై.

*ఆంధ్రభూమి దినపత్రిక మార్చి, 2009*

# నీ మనసును నీవే మేల్కొలపాలి

మన జీవితాన్ని గురించి మనం తెలుసుకోడానికి ఏ గురువూ అక్కర లేదంటారు శ్రీ జిడ్డు కృష్ణమూర్తిగారు. ఇది తీవ్రవాదమని కొందరి అభిప్రాయం. "మీకు దీక్ష ఇవ్వడానికి నేను మీ గురువును కాను" అంటారు అరుణాచల శ్రీరమణులు; పైగా 'నీ పరమ గురువు నీలోనే వున్నాడు' అంటారు. తాను గురువాక్యాన్ని తీక్షణంగా తదేక దీక్షతో తలపోసి స్వేచ్ఛనంద గలిగానంటారు శ్రీ నిసర్గదత్త మహారాజ్. "అయితే మీరు గురువుకై వెతుక్కో నక్కరలేదు. శ్రద్ధాసక్తులుంటే చాలు; అవసరమైనప్పుడు అవే మీ బాహ్యగురువును మీ వద్దకు తెస్తై" అంటారు ఆయన.

గురువును గురించి శ్రీ జిడ్డు కృష్ణమూర్తిగారేమన్నారో చూద్దాం.

ప్రశ్న : మనిషికి మార్గదర్శకత్వం ఉండాలనే మాటను మీరు అంగీకరించరా? మీరంటున్నట్లు, 'ఏ సంప్రదాయమూ పాటించనక్కరలేదు, ఏ శాస్త్ర ప్రమాణమూ అక్కర లేదు' అని గనక అంటే, అప్పుడిక ప్రతివారూ తనకుతానై ఒక కొత్త పునాది వేసుకోవలసి వస్తుంది. ఈ భౌతిక శరీరానికి ఒక ప్రారంభమనేది ఉన్నట్లే. మన ఆధ్యాత్మిక మానసిక శరీరాలకు కూడా ఒక ఆరంభమనేది ఉండుంటుంది. అటువంటప్పుడు అవి కూడా ఒక దశ నుండి మరో దశకు ఎదగవలసి వుంటుంది. ఇప్పుడు మిమ్మల్ని వినిన కారణంచేత మా ఆలోచన ఏ విధంగానైతే రగుల్కొల్పబడిందో, అదే విధంగా ప్రాచీన మేధా సంపత్తితో సంధానమొందినపుడు కూడా మా ఆలోచన మేల్కొనాల్సి వుంటుంది. మీరేమంటారు.

జి.కృ. : అయ్యా ఇది మొదట్నించీ వున్న సమస్యే. మనకొక గురువు వుండాలని, మన మనసును మేల్కొల్పడానికి ఒక బోధకుడు అవసరమని మనకనిపిస్తుంటుంది. అయితే, ఈ మొత్తం వ్యవహారంలో ఉన్నదేమిటి? ఒకరికి తెలుసుననీ, మరొకరికి తెలియదనేది ఇందులోని సార సంగ్రహం. ఏరకమైన దురభిప్రాయం పెట్టుకొనకుండా, నెమ్మదిగా ఆలోచిద్దాం పట్టండి. తెలిసినవాడు ప్రామాణికుడు, అధికారి అవుతాడు;

అథారిటీ చెలాయిస్తాడు. తెలియనివాడు శిష్యుడవుతాడు. ఇక ఈ శిష్యుడేమో, పొద్దుగూతా గురువుని అనుసరిస్తూనే వుంటాడు; ఏదో ఒకనాడు ఆయన స్థాయిని అందుకోగలనని ఆశిస్తుంటాడు.

ఇప్పుడిక నే చెప్పేది జాగ్రత్తగా వినండి. 'నాకు తెలుసు' అని గురువు గనక అన్నాడంటే, అతడిక ఈ గురుస్థానాన్ని ఆక్రమించగలిగి లేడు. 'నాకు తెలుసు' అని అన్నవారెవరికైనా, తెలియదు. ఇందుకు కారణమేమిటో జాగ్రత్తగా గమనించండి. 'సత్యం' అనండి, 'వాస్తవ'మనండి, ఆ 'అన్య' వస్తువనండి, దానికి ఒక నిర్ణీతమైన చోటంటూ లేదు. అటువంటప్పుడు దానివద్దకు, ఒక నిర్దేశిత మార్గం ద్వారా చేరగలిగి లేము. దానిని క్షణక్షణమూ కనుగొంటూ వుండాలి. దానికి గనక ఒక నిర్ణీతమైన చోటంటూ వుంటే, ఆ చోటు కాలపరిమితిలో ఉండాల్సి వుంటుంది. ఒక నిర్ణీతమైన చోటుకైతే, మీ ఇంటికి వెళ్ళడానికి ఉన్నట్లు, ఒక మార్గం వుండవచ్చుగాక. కానీ సజీవంగా ఉండే దానికి, నివసించే చోటంటూ లేని దానికి, మొదలూ తుదీ ఉండనిదానికీ, నిర్దేశిత మార్గం ఉండజాలదు.

నీకు సాక్షాత్కారం కలిగేటట్లు తోడ్పడుతాననే గురువు, నీకిప్పటికే తెలిసిన దానినే సాక్షాత్కరింపజేయగలడు. ఎందుకంటే నీకు సాక్షాత్కరించినది, నీ అనుభవం పరిధిలోనికి వచ్చినది, నీవు గుర్తించగలిగి వుండాలి కదా? దానిని గుర్తించగలిగితే, అప్పుడు 'నేను అనుభవించాను' అని అనగలిగి వుంటారు. కానీ మీరు గుర్తించగలిగేది ఆ 'అన్య'మైనది కాదు. పరమూ, అన్యమూ, గుర్తించగలిగి లేము. అది, మీరు ఒకప్పుడు అనుభవించినది కాదు కాబట్టి గుర్తించనలవి కాదు. ఆ 'అన్య'మైనటువంటిది ఎప్పటికప్పుడు, ప్రతి క్షణమూ, పై మూతను తీస్తూ కనుగొంటూ వుండాలి; అలా కనుగొనడానికి మనసు, స్వేచ్ఛ కలిగి వుండాలి.

అయ్యా, చూడండి. దేనికైనా కనుగొనడానికి మనసుకు స్వేచ్ఛ వుండి తీరాలి. సంప్రదాయబద్ధమైన మనసు– అది పురాతనమైన సంప్రదాయమైనా కానీ, ఆధునిక సంప్రదాయమవనీ – నమ్మకాల, సిద్ధాంతాల, ఆచార క్రియల బరువును మోసే మనసు, స్వేచ్ఛ కలిగియుండదనేది స్పష్టమేకదా? మరొకరు మిమ్మల్ని మేల్కొల్పగలరనే ఈ

భావం, పసలేనిదని అంటున్నాను. నే చెప్పేది ఒక అభిప్రాయమనుకోకండి; ఇది వాస్తవం, మరొకరు గనుక మిమ్మల్ని మేల్కొల్పితే, మీరు అతడి ప్రభావంలో వున్నారన్నమాట; అతడిమీద ఆధారపడ్డారన్న మాట. అంటే మీకు స్వేచ్ఛ లేదు. మరి స్వేచ్ఛలో వున్న మనసు మాత్రమే కనుగొనగలదు.

కాబట్టి సమస్య ఇది; మనకా అన్యమైనది కావాలి. కానీ దానినెలా సాధించాలో మనకు తెలియడంలేదు. కాబట్టి తప్పనిసరిగా ఎవరో ఒక గురువుమీదనో, ఒక గ్రంథం మీదనో లేక మన స్వానుభవం మీదనో, ఆధారపడుతాం. అంటే 'ఆధారపడడమనేది' సృష్టింపబడిన తర్వాత, ఏదో ఒక అథారిటీ, పెత్తనం ఉండక తప్పదు. తత్కారణంగా మనసు ఆ అథారిటీకి, సంప్రదాయానికి బానిస అవుతుంది. అలాంటి మనసుకి స్వేచ్ఛ లేదనేది సుస్పష్టమేకదా? స్వేచ్ఛగల మనసే కనుగొనగలదు. మీరు మేల్కొనడానికి మరొకరిపై ఆధారపడడమనేది. ఒక మాదకద్రవ్యం మీద ఆధారపడిన దానితో సమానం. ప్రతిదీ స్పష్టంగా, సమగ్రంగా, విశదంగా చూసేందుకు, మాదకద్రవ్యాన్ని సేవించవచ్చు గాక. ఒక క్షణకాలంపాటు జీవితం, మరింత మిలమిల మెరుస్తూ కానవస్తుంది. చుట్టూ వున్న అన్నీ కూడా కాంతులీనుతున్నట్లుగా వుంటుంది. రోజూ చూసే రంగులు ఈ మాదక ద్రవ్య ప్రభావంచేత అత్యంత సుందరంగా కనిపిస్తై. మనసు మేల్కొనడం అనే దానికి మీ అర్థం అదే అయ్యుండవచ్చు. కానీ ఇందుకై ఇప్పుడు గురువుమీద, గ్రంథంమీద ఆధారపడినట్లే ఆ మాదకద్రవ్యం మీద ఆధారపడుతుంటారు. ఆధారపడిన మరుక్షణం, ఆ మనసు మొద్దుబారిపోతుంది.

ఆధారపడడం, భయాన్ని జనింపజేస్తుంది – సాధించలేనేమోననే భయం, లభించదేమోననే భయం. వేరొకరిపై ఆధారపడగానే – అది 'రక్షకుడి'మీద గానీ, మరెవరి మీదైనా గానీ – దాని అర్థం మనసు జయాన్ని కోరుతున్నది, అభీష్ట సిద్ధిని వాంఛిస్తున్న దన్నమాట. ఆ సిద్ధిని మీరు దేవుడనవచ్చు. సత్యమనవచ్చు. మీ ఇష్టమొచ్చిన పేరు పెట్టుకోవచ్చు; ఏరకంగా అనుకున్నా; దానిని లభింపజేసుకోవాలనే వాంఛ వుంటుంది. ఇక మనసు అందులో చిక్కుకుంటుంది. దాని బానిస అయిపోతుంది. ఆ తర్వాత మనసు ఏదైనా చేయనీ – త్యజించవచ్చు, క్రమశిక్షణతో మెలగవచ్చు. అనేక

విధాలుగా తనని తాను హింసించుకోవచ్చు – ఏమి చేసిననప్పటికీ, అలాంటి మనసు, ఆ 'అన్యత్వం' 'భిన్నత్వం' అయినదాన్ని కనుగొనజాలదు.

కాబట్టి 'ఎవరు సరియైన గురువు?' అనేది కాదు అసలు సమస్య. మనసు మేల్కొన్న స్థితిలో వుండగలదా అనేది ప్రశ్న. ఉండగలదు; కానీ తనకున్న అన్ని సంబంధాలనూ ఒక దర్పణంగా వినియోగించుకుంటూ వుంటేనే, మేల్కొని వుండగలదు. కానీ తాను చూచిన దృశ్యాన్ని ఖండించినా, లేక సమర్థించుకున్నా, లేక దానితో ఏరకంగా మమైక్యం చెందినా, మనసు తనని తా చూచుకోలేదు. ఇవన్నీ కూడా మనసును మందగింపజేస్తై; ఇలా 'మందు'లమై, మనల్ని ఎవరో ఒకరు మేల్కొల్పాలని ఎదురుచూస్తూ వుంటాం, అలాంటి వారికై వెతుకుతుంటాం.

ఎవరో ఒకరొచ్చి మనల్ని మేల్కొల్పాల్సిందేనని నిశ్చయించుకున్నాం కాబట్టి, మనం ఇలా చప్పగా ఎందుకు పడివున్నామో, దీనికి కారణమేమిటో కనుక్కోవాలని తోచదు. అంతటితో మనసు మరింత మందకొడిగా మారుతుంది. దీనినంతా చూసి అర్థం చేసుకుంటేనే, మరెవరో వచ్చి తనకిదంతా వినిపించి చెప్తూ వుండాలి అని అనుకోకుండా వుంటేనే, మనసు చెఱ వీడుతుంది.

కానీ మనం మాటలతో, వివరణలతో ఎంత సంతృప్తిలో పడిపోతుంటామండీ? విశదీకరణలు, మాటలు అనే అవరోధాలను అతిక్రమించి, ఏది నిజమో కనుక్కోడానికి ప్రయత్నించేవారు చాలా కొద్దిమంది. మనసుపెట్టి పనిజేస్తే సామర్థ్యం వస్తుంది, అవునా? కానీ మనసుపెట్టం; అందుకు కారణమేమిటంటే, మనం నేర్చిన మాటలతో ఊహలతో, సంప్రదాయం అందించిన సమాధానాలతో తృప్తిచెందుతూ వుంటాం.

***ఆంధ్రభూమి దినపత్రిక, మే 2009***

# ఈ అద్భుతం నీవే చేయాలి

శ్రీ జిడ్డు కృష్ణమూర్తిగారిని ఎవరో ప్రశ్నిస్తూ, “మీరు అద్భుత కృత్యాలు ఎందుకు చేయరు? మహాపురుషులందరూ అద్భుతాలు ప్రదర్శిస్తూ వుంటారు కదా?” అని అడిగారు.

అందుకు సమాధానంగా ఆయన, “శారీరకంగా రోగ విముక్తులవడం అంత ముఖ్యం కాదు. అంతకన్నా ముఖ్యమైనది చిత్తస్వాస్థ్యం. గతంలో నేను కొందరు మనుష్యుల్ని శారీరకంగా రోగవిముక్తుల్ని చేశాను. కానీ ఇప్పుడు నేను మనిషి అంతరంగానికి ఆరోగ్యం చేకూరాలనే వాంఛిస్తున్నాను. ఇది అత్యంత ముఖ్యమని నా భావన, కాదంటారా? మనసూ హృదయమూ రోగగ్రస్తమై వుంటే. అవి శరీరం మీద తమ ప్రభావం చూపిస్తై; రోగ భూయిష్ఠమైన శరీరం తిరిగి మనసుపై తన ప్రభావం చూపిస్తుంది. బాహ్యమైన దానికి మనం అధిక ప్రాధాన్యమిచ్చి, అంతరంగాన్ని నిర్లక్ష్యం చేస్తే ‘రోగగ్రస్తమైన’ అంతరంగం తప్పనిసరిగా బాహ్యాన్ని (శరీరాన్ని) లొంగదీస్తుంది.

అద్భుతం జరగాలనే నీ వెతుకులాట నిజానికి ఈ అంతరంగం సంపూర్తిగా మారిపోవాలనే. ఇక్కడ ఈ అంతరంగంలో ఏదో అద్భుతం ద్వారా మార్పు సంభవించాలని నీవు ఆశించడం నీ సోమరితనం, బాధ్యతా రాహిత్యాన్ని సూచిస్తున్నై. నీవు చేయాల్సిన పనిని మరెవరో చేసిపెట్టాలని ఎదురు చూస్తున్నావ్. బాహ్యంలో జరిగే రోగవిముక్తి చాలా ప్రజాదరణ పొందుతుంది కానీ, అది ఆనందానికి దారితీయదు. అందుచేత స్వాస్థ్యం లేకుండా ముక్కలుచెక్కలై వున్న మన అంతరంగాన్ని అర్థంచేసుకోవాలి. లోపలి దానిని ఎవరూ నయం చేయగలిగిలేరు; అదే దాని అసలైన అద్భుతం.

వైద్యుడు నీ బాహ్య శరీరాన్ని రోగం లేకుండా చేయవచ్చుగాక. మానసిక వైద్యుడు ఈ కుళ్ళిపోతుండే సమాజంలో ఒదిగి జీవించడానికి వీలుగా నీకు కొన్ని సర్దుబాట్లు నేర్పగలడు. అంతేకానీ వీటన్నిటినీ దాటి, నీలోన నిజాయితీ నెలకొనడానికి, స్పష్టత చేకూరడానికి, అంతరంగం తునాతునకలు కాకుండా ఏకీకృతమవడానికి ఎవరూ ఏమీ చేయగలిగి లేరు. ఇది సాధించడం నీ ఒక్కడి వల్లనే అవుతుంది. ఇదే అన్నిటికన్నా మహాద్భుతం – నీకు నీవుగా సంపూర్ణ స్వస్థత చేకూర్చుకోడం.

ఇక్కడ మనం చేస్తున్నదదే – మనల్ని మనం అర్థం చేసుకోడం, మన వ్యాధులకు, సంఘర్షణలకు, వైరుధ్యాలకు కారణాలు తెలుసుకోడం; ఉన్నవి ఉన్నట్లుగా సరళంగా స్పష్టంగా, వక్రీకరణ లేకుండా చూడగలగడం. ఏదైనా ఒకదానిని తేటతెల్లంగా చూస్తే అప్పుడో అద్భుతం సంభవిస్తుంది; ఏదైతే 'ఉన్నదో' అది ఏ వక్రీకరణ లేకుండా స్పష్టంగా గోచరమయితే, ఆ అవగాహన తెచ్చి ఇచ్చే సత్యం, స్వస్థతను చేకూరుస్తుంది. ఆ అవగాహన యొక్క సత్యం, కేవలం నీ ఎఱుక ద్వారా నీకు కలగగలదే కానీ మరొకరు సంభవింపజేసిన అద్భుత కృత్యం ద్వారా కాదు.

అద్భుతాలు జరుగుతుంటై అనేది నిర్వివాదం. కాకపోతే అవి జరుగుతున్నై. అనేది మనం ఎరిగివుండం. నిన్నటి రోజున ఉన్నట్లుగా నువ్వివాళ లేవు. మనసుయొక్క అంతర్గత స్వభావాన్ని సులువుగా వేగంగా గనక అనుసరించగలిగితే, అద్భుతాలు జరిగి తీరుతై అని నీకు స్వయంగా తెలుస్తుంది; కొత్తదనం అనే అద్భుతం, కొత్త ప్రాణంతో ఒక జీవి భూమి మీదికి రావడం, కొత్త సౌందర్యం గోచరమవడం, సంతోషం వెల్లివిరియడం, ఇలాంటి అద్భుతాలు ఎన్నో జరుగుతుంటై. కానీ మీరు సాధించిన విజయాలు, మీ నమ్మకాలు మొదలైన వాటితో గుంజకు కట్టివేయబడి వుంటే శరవేగంతో కదిలే జీవితాన్ని, సమాన వేగంతో అనుసరించలేరు. 'నాకు తెలుసు' అనుకున్నవాడు ఆ తెలిసిన దానికి కట్టివేయ బడినవాడు. అలాంటి వానికి అద్భుతముండజాలదు. కానీ మనిషి గనక, అనిశ్చితుడై వుంటే, జీవితం నుండి ఏమీ ఆశించకుండా బ్రతక నేరిస్తే, ఎల్లప్పుడూ పునరుజ్జీవం పొందుతుంటే, అంతులేని ఈ నిత్య నూతన జీవితం ఒక మహాద్భుతంగా గోచరిస్తుంది."

*ఆంధ్రభూమి దినపత్రిక **14-2-2010***

# జిడ్డు కృష్ణమూర్తి భావజాలం

మనుష్యశక్తికీ, మహాశక్తికీ నడుమ మధ్యవర్తిని ఒప్పుకోరు, శ్రీ జిడ్డు కృష్ణమూర్తి గారు. సమస్తమూ మనిషిలోనే వుందనీ, ఆ విషయం మనిషి కనుగొనడమే ప్రధానమనీ ఘోషిస్తారు. ఇందుకై పవిత్ర గ్రంథాలు పఠించడంకన్నా, మనిషి తనని తాను పఠించడమే మిన్న అంటారు. మనిషి తనను తా పరిశీలనగా పరిశోధించుకుంటే, అతడి స్వవిషయమే కాక, తనలో నిక్షిప్తమై వున్న మానవాళియొక్క మొత్తం చరిత్ర తెలియ నారంభిస్తుంది. దీనికై ఎవరినీ అనుసరించనక్కరలేదు, అనుకరించనక్కరలేదు. అయితే మనిషి తనని తాను పరిశీలించుకునేప్పుడు, తన మనసులో తోసుకువస్తున్న ఏ భావాన్నీ, ఏ ఆలోచననీ ఖండించకూడదు, సమర్థించుకోకూడదు, ఆచరణ ద్వారా తృప్తిపరిచే ప్రయత్నమూ చేయకూడదు.

తనలో ఆగ్రహమో, అసూయో జనిస్తే, గ్రంథాలు, సంఘమూ, దానిని నిరసిస్తై కాబట్టి, ఈ భావం తనలో ఉండరానిదని అనుకొని, తానూ నిరసిస్తాడు. అది నలుగురికీ కనిపించకుండా దాచేయాలని, అణచేస్తాడు. అలా ఖండించి దానిని అణచివేసినా, అది సమయం చూచుకొని మళ్ళీ విజృంభిస్తుంది. అణచివేయలేకపోయానని గ్రహించినప్పుడు, దానిని సమర్థించుకోజూస్తాడు. 'ఆ పరిస్థితుల్లో ఎవరికైనా కోపం వస్తుంది. అది సబబే' ననేస్తాడు. ఇక మారే ప్రసక్తే వుండదు.

ఖండించకుండా, సమర్థించకుండా, దాని విషయమై ఏ కర్మాచరణ చేయకుండా, మానసికంగా దానిని పెల్లుబుకనిచ్చి, దాని ప్రారంభదశ, ప్రవర్తిల్లుతున్న తీరు, తారాస్థాయికి చేరుతున్నవేళ తనలో ఏ వికృత లక్షణాలు చోటుచేసుకుంటున్నై అనే విషయం, అన్నిటినీ జాగ్రత్తగా గమనించాలి. అయితే ఈ చూడడమంతా తీక్షణంగా, తీవ్రంగా శ్రద్ధగా, నిజాయితీతో చూడాలి. మనసు ఆ మొత్తం దృశ్యంతో నిండిపోవాలి; అప్పుడు కోపం యొక్క సంపూర్ణ స్వరూపం దర్శనమిస్తుంది. ఆలోచన అనే ద్వంద్వంలేని ఆ మనసులో అది సంపూర్ణ దర్శనమివ్వడం, అటుపై రాలిపడిపోవడం సంభవిస్తై.

ప్రతిగుణం విషయం ఇంతే. దానిని వెలికి రానీయాలి. నిశ్చలమైన, నిర్మలమైన చూపు అత్యంత శక్తివంతమైనది. మనిషిలో అన్నిటికన్నా సత్యమైనది, మాయను ఛేదించ గలిగినదీ ఈ చూపే. ఇది భౌతిక నేత్రాల చూపుకాదనీ, హృదయనేత్రం యొక్క దృష్టి అని వేరే చెప్పనక్కరలేదు. ఈ బలమైన పునాది గనకపడితే సున్నితమైన స్పృహ అంటే ఏమిటో తెలిసివస్తుంది. కోమలమైన ఈ స్పృహే ఆధ్యాత్మిక రంగంలో ప్రగతిని సాధించ గలదు.

ఈ రంగంలో గతానికి ఏమాత్రం విలువలేదు. పాత జ్ఞాపకాలు, మన కర్మాచరణను ప్రభావితం చేస్తుంటై. నేటి మన కర్మాచరణ స్వేచ్ఛ నందాలంటే ఈ పాత అనుభవాల జ్ఞాపకాలు వదలిపోవాలి. ఆ ఆవరణ యావత్తూ తొలగిపోవాలి. ఇది సంభవిస్తే కాని మనిషికి విముక్తి వుండదు. అలా విముక్తమైన మనసే పరిశోధనకు అనుకూలమైన పరిశుభ్ర పనిముట్టుగా రూపొందగలదు. ఆ పరికరంలో ఏ మచ్చా, ఏ కల్మషమూ వుండదు. అలాంటి పరికరం, నేరుగా ప్రత్యక్షంగా తెలుసుకోగలిగిన శక్తి సంతరించుకుంటుంది. ఇలాంటి మనసు జ్ఞానాన్ని పోగేసుకోడంగానీ, నిలవ వేసుకోడంగానీ చేయదు. యోగయుక్తుడై, చైతన్య సంబంధిగా, నేరుగా తెలుసుకుంటూ కర్మ నాచరిస్తుంటాడు. ఈ తెలుసుకోడం, నేర్చుకోడం అనంతమని గ్రహిస్తాడు. నిరంతరం జ్ఞానిగా జీవిస్తూ, నేర్చుకుంటూ భూమిపై కరుణాళువుగా, మహాప్రేమికుడిగా బ్రతికి తరిస్తాడు.

***17-2-2010 ఆలిండియా రేడియో వారికి కృతజ్ఞతతో***

# ఆకులో ఆకునై

మనిషి, ఆకులో ఆకునై జీవిస్తున్నట్లు భావించవచ్చు. ఊహ చేయవచ్చు, కవిత్వం రాయవచ్చు. కానీ ఆ చెట్టుకొమ్మమీది ఆకుని, దాని అందాన్ని, ఉన్నది ఉన్నట్లుగా చూడ గలిగి వున్నాడా అనేది గమనించాలి. చూడడమంటే కేవలం ఇది మఱ్ఱి ఆకు. ఇది బాదమాకు, అని గుర్తుతెచ్చుకోడం కాదు; తనకున్న వృక్షశాస్త్ర విజ్ఞానంతో దానిని పేర్కొంటే, చూడడం అంతటితో అయిపోతుంది. దాని సౌందర్యం మన మనసుకు నిజంగా కనిపించా లంటే, దాని పేరు గుర్తురావడం, వైద్యపరంగా దాని ప్రయోజనం తెలిసి వుండడం అనేవి, మన అచ్చమైన చూపుకు ఆటంకంగా పరిణమిస్తై. ఈ రెండు రకాల జ్ఞానానికి మన జీవనంలో వాటి పరిమిత ప్రయోజనాలు వాటికున్నై. కానీ ఈ విజ్ఞానాన్ని తలలోనికి రానివ్వకుండా, కేవలం ఆ ఆకు, దాని రంగు రూపు, దాని లేత ఈనెలు. దాని ఆకారం, గాలిలో కదులాడే తీరు, ఆకుల మధ్యగుండా గాలివీస్తున్నప్పుడు బయలుదేరే ఈలవంటి ధ్వనులు, ఈ నేపథ్యంలో శ్రద్ధ అంతా ఆ ఆకుమీదనే వుంచి, దానిని మనసుతో హృదయంతో, సత్తతో మన సమస్తంతో చూడడం జరుగుతుందా?

ఆ ఆకును గురించి మనకుండే విజ్ఞానం, సమాచారం, తత్సంబంధిత పదాలన్నీ మనల్ని దానిని నేరుగా చూడనివ్వవు. ఆ పదాల ద్వారా మన మనసులో ఏర్పడిన బింబం, మన మెదడులోకి ప్రవేశించినందువల్ల, ఆ బింబాన్ని మాత్రమే చూస్తాం. అంటే ఎదురుగా సజీవమైన అసలు ఆకును చూడడం లేదన్నమాట. విజ్ఞానం తయారుచేసే మానసిక బింబాలతో నిమిత్తం లేకుండా, హృదయంతో చూడగలిగితే, దానియెడల ప్రేమానురాగాలు జనిస్తై. ఆ ఆకు ఎడలనే కాదు, ఆ చెట్టుయొక్క సమస్తమైన ఆకులు, కొమ్మలు, రెమ్మలు, కాండం, అన్నిటి యెడల తాదాత్మ్యం చెంది, ప్రేమ పుట్టుకొస్తుంది. మనిషిలోని ప్రాణశక్తి, ఆ చెట్టు, దాని ఆకులు మొదలైన వాటియొక్క విశ్వ ప్రాణశక్తితో ఒకటై, మనిషి ఆకులో ఆకైపోతాడు. మనస్సంతా ఆ ఆకుతో నిండిపోయినప్పుడు అతడికీ ఆ ఆకుకీ వుండే ఎడం మాయమై పోతుంది.

ఇది స్వయంగా చేసి చూడదగిన ప్రక్రియ. భావమూ కాదు, సిద్ధాంతమూ కాదు. మనిషి, తనని గురించి తలుచుకోకుండా, ఆలోచనను అంతంచేసి, కేవలం పంచేంద్రి యాలతో, ఆకువంకగానీ చెట్టువంక గానీ తదేక దృష్టిసారిస్తే, ప్రేమ జనిస్తుంది.

కానీ మనిషి ఆకునే కాదు, తోటి మనిషిని కూడా ఇలా చూడలేదు. అవతలి వాని జాతి, మతం, హోదా మొదలైన వాటిని గుర్తుంచుకుంటూ చూస్తాడు. అతడివల్ల తనకు కలిగే ప్రయోజనం ద్వారా చూస్తాడు. అలాంటి వేళల్లో ఇష్టా ఇష్టాలు, నిర్లక్ష్య భావం మొదలైనవి పుట్టుకొస్తాయే కానీ ప్రేమ జనించదు.

మనసులో ఏ కాస్త ద్వంద్వమున్నా, ఆకులో ఆకుగా కానీ, మరిదేనితో గానీ మమైక్యం సాధించడం అసాధ్యం. మాటవరసకు మనసులో తాను అది అవాలనీ, ఇది అవాలనే కోరిక బలీయంగా వుంటుందనుకోండి. ఆ కోరికతోబాటు ఆ ఆకునో పూవునో సంపూర్ణంగా చూచి, దానిని తన మనసులో సంపూర్ణంగా నింపుకోగల వనుకుంటే, పొరపాటే అవుతుంది. ఈ ఆకాంక్షాపరత్వంలో 'తాను' దాగి వుంటాడు. అలా ద్వివిధమైన మనస్సుతో, ఈ ఆకువంక ఎంతసేపు చూచినా దానితో తాను ఐక్యమవజాలడు. ఈ లోన వున్న ఆకాంక్షాపరత్వం కానీ, పోల్చేగుణం కానీ, పోటీ పడే తత్వం కానీ, అడ్డం వస్తూనే వుంటుంది. ఇటువంటి గుణాలేవి వున్నా, ఆ చూపు కలుషితమైన చూపే అవుతుంది. స్వచ్ఛమైన సావధానపూర్వకమైన చూపు ఒక్కటే సత్యాన్ని ఆవిష్కరిస్తుంది. అప్పుడే, సమస్తమైన జీవకోటితో తనకున్న విడదీయరాని సంబంధం తెలిసివచ్చి, ప్రేమ కరుణ జనిస్తై.

***ఆలిండియారేడియో వారి సౌజన్యంతో 24-2-2010***

# చైతన్యయాత్ర

శ్రీ జిడ్డు కృష్ణమూర్తిగారు ఆ సాయంత్రం వేదిక నుండి ప్రసంగించాల్సి వుంటే, ఆనాడు తన గదిలో ఏకాంతంగా గడిపేవారు. మిగతా రోజుల్లో బ్రేక్‌ఫాస్ట్‌కూ భోజనానికి మిత్రులతోబాటు డైనింగ్ రూముకు వచ్చి కూచునేవారు. కానీ తాను ప్రసంగించాల్సిన రోజున మాత్రం ఏదో కొద్దిపాటి ఆహారం తానున్న గదికే తెప్పించుకునేవారు. ఆ రోజున ఎవరినీ కలిసేవారు కాదు, ఎవరితోనూ మాట్లాడేవారు కాదు, ఏ వ్యవహారంలోనూ పాల్గొనేవారు కాదు.

సాయంత్రం ఆరుగంట లవుతున్నదనగా పది నిముషాలు ముందుగానే, ఎవరో ఒక ముఖ్య కార్యకర్త ఆయన వద్దకు వెళ్ళి, తయారై సిద్ధంగా వున్న కృష్ణమూర్తి గారిని, వేదిక వద్దకు తోడ్కొని వచ్చేవారు. ఒకరినొకరు ముట్టుకోకుండా, కాస్త ఎడంగా నడుస్తూ (1986 జనవరిలో మద్రాసు 'వసంత విహార్'లో ప్రసంగించిన ఆఖరి మీటింగ్‌తో సహా– అప్పుడు ఆయన వయసు 91) వచ్చేవారు. ఆయన వేదిక వద్దకు వచ్చే సమయంలో, సభికులెవరూ ఆయనకు అభివాదం చేయడం కానీ, పలకరించడం గానీ, ముట్టుకోడం కానీ, ఉండేవి కాదు. ఆయన వేదిక వద్దకు వచ్చి. స్వయంగా రెండు మెట్లెక్కి వేదికపై పద్మాసనంలో ఆసీనులయ్యేంతవరకూ ఎవరి వంకా చూచేవారు కాదు. కూచున్న తర్వాత శ్రోతలనందరినీ కలయజూసేవారు. ఆయన విశాల నయనాల సమీపాన వున్న 'గొప్పవారిని' గుర్తించడంకానీ, దూరదూరాన కూచోనున్న, నుంచోనున్న సామాన్యుల్ని నిర్లక్ష్యంగా చూడడం కానీ వుండేవి కాదు.

"ఇవాల్టి రోజున మనం ఫలాని విషయం గురించి మాట్లాడుకుందామని, గత ప్రసంగంలో అనుకున్నాం" అని, మరో ఉపోద్ఘాతం లేకుండా, ప్రసంగం ప్రారంభించే వారు. అంటే ఆనాటి ప్రాతఃకాలం నుండీ ఆయన హృది, మది, ధ్యాన నిమగ్నమై వున్నాయి; ఆలోచనను చొరనిచ్చేవారు కాదు. అట్టి స్థితిలో ప్రసంగం ప్రారంభమయేది. ఈ ప్రసంగం చేసే సమయాన, 'మీరూ నేనూ కలిసి ప్రయాణిస్తున్నాం అని గుర్తుపెట్టుకోండి. ఒకరికొకరు తోడుగా జతగా' అని నొక్కి వక్కాణిస్తుండేవారు. అంతకన్నా ఆ మర్యాద పురుషోత్తముడు ఆదేశించగలిగి లేదు. ఆదేశించినా పాటించని

వారిని, ఆ పని చేయించగలిగి లేడు. అయితే ఆయనతో కలిసి ఆ 'చైతన్యయాత్ర'లో పాల్గొనకపోతే, నష్టపోయేది శ్రోతలేననేది గ్రహించాలి.

గజ ఈతగాడు మనల్ని చేయి పట్టుకొని ఈత నేర్పుతూ, భయం వదిలి చైతన్య లోతుల్ని పరిశోధించడానికి రమ్మంటున్నాడు. తాను ముందుకు సాగుతూ, నిర్భయంగా తనతోబాటు, లోతుల్లోకి ఆహ్వానిస్తున్నాడు. ఎవరి 'లోనికి' వారు వెళ్ళడమే కావలసింది. ఆయన ప్రసంగ ప్రవాహంలో మనం హృదయ పూర్వకంగా మునిగిపోతే, ఆయన తన'లోనికి' వెళ్తున్నట్లే, ఎవరికివారు తమ'లోనికి' సులభంగా వెళ్ళగలరు. శ్రద్ధగా ఈ క్రియలో పాల్గొంటే, ఆయన తన పదాలతో చూపించేవన్నీ, మన జ్ఞాననేత్రానికీ కనిపిస్తై. ఈ స్థితిలో మనకు ఈ చుట్టూ వున్న ప్రపంచం కనిపించదు, వినిపించదు. ఈ లోకంతో నిండిపోయిన మనమూ, మన మనసూ, మాయమవుతై. మిగిలేదల్లా ఆ శుద్ధ చైతన్యమూ దాని లోతులు, అందులోనుండి ఆయన వెలికితీసి చూపిస్తున్న ముత్యాలు; కలిసి పయనించాం కాబట్టి ఆయన చూసినవన్నీ మనమూ చూడగలిగాం. కాబట్టి కృష్ణమూర్తిగారి ప్రసంగాలు సిద్ధాంత ప్రవచనాలు కావు; అనుగ్రహ భాషణలు కావు. నీతి సూత్రాలూ కావు, సుభాషితాలూ కావు. చమత్కారాలతో నిండిన కాలక్షేపం కబుర్లూ కావు. ఆ ప్రసంగ సన్నివేశం ఒకరకమైన సత్సంగమనవచ్చు. ఆ సమయాన ఆయన పడే శ్రమ, వెచ్చించే ప్రాణశక్తీ అంతా ఇంతా కాదు; తననితాను మీకిచ్చుకుంటున్నాడు. తన శక్తీ, తన సమస్తమూ మీకు సమర్పిస్తున్నాడు. మనమూ అదే తీరుగా ఆయనతోబాటు లోతుల్లోకి తవ్వుకుంటూ వెళ్తే, ఆ శ్రమకు మనమూ అలసిపోతాం. కానీ మనలో చాలామందిమి కళ్ళూ చెవులూ అప్పజెప్పి, కృష్ణమూర్తి వీడియోలు ఉత్తినే చూస్తూ వింటూ వుంటాం. ఆయన సూచించిన 'కలిసి పయనిద్దాం' అనే ప్రక్రియను నిర్లక్ష్యం చేస్తాం. వక్త–శ్రోతలను కలిపే దివ్య సాత్విక గుణం ప్రవర్తిల్లదు; వక్త అనుభవిస్తున్నది శ్రోతకు అందకుండాపోతుంది.

ఆయన పుస్తకం మనం చదువుతున్నప్పుడూ, ఆయన ఆడియో టేప్ వింటున్నప్పుడూ వీడియో చూస్తూ ఆలకిస్తున్నప్పుడూ, ఆ మాటల్లోని జీవశక్తిని నేరుగా మన హృదయంతో స్వీకరించగలిగితే. అది మనలోని జీవశక్తిని మేల్కొల్పగలుగుతుంది.

***ఆంధ్రభూమి 2-5-2010***

# పునర్జన్మ అంటే గతం యొక్క కొనసాగింపు

జాక్కోకార్ల్ కోస్కినెన్ అనే ఫిన్‌లాండ్‌కు చెందని తియాసఫిస్టు శ్రీ జిడ్డు కృష్ణమూర్తి గారిని గురించి రాస్తూ తన వ్యక్తిగత అనుభవాలు ఇలా చెప్పుకొస్తాడు.

ఒకసారి కొందరు యువకులు కృష్ణమూర్తిని ఘాటుగా విమర్శిస్తూ "మీరు ప్రపంచ మంతటా తిరుగుతూ మాట్లాడవలసిన పనేమున్నది?" అని ప్రశ్నించారు. వ్యక్తిగత విమర్శ చేసినప్పటికీ, ఆయన ఉలిక్కిపడక, ప్రశాంతంగా, "ప్రపంచం నాలుగువైపులా దగ్ధమవు తున్నది కాబట్టి" అని సమాధానమిచ్చాడు.

మరో కుర్రాడు "మీరెందుకని సమస్తమైన రాజకీయ, మతపర విద్యా విషయక సంస్థల్ని ఖండిస్తూ మాట్లాడుతారు? మరి మీ పేరు మీద ఒక ఫౌండేషన్ ఎందుకు నడుస్తున్నది? స్వేచ్ఛకై స్వాతంత్రానికై అనేక రకాలుగా మేమందరం విడివిడిగా ప్రయత్నిస్తున్నప్పటికీ, మాలో చాలామందికి సంస్థలుండడం అవసర మనిపిస్తుంటుంది" అని వాదించాడు.

"నేను దేనినీ అవునని ఆమోదించడం లేదు, కాదని ఖండించడమూ లేదు. కానీ కమ్యూనిస్టు సిద్ధాంతాన్ని అనుసరిస్తూ ఏదైనా సాధించగలం అనుకుంటేనూ, లేదా రోమన్ కథాలసిజమ్ ద్వారానే ఏదైనా సాధ్యమవుతుంది అనుకుంటేనూ. మీ పద్ధతిని మీరు నిరభ్యంతరంగా కొనసాగించండి; మిమ్మల్ని ఎవరూ ఆటంకపరచజాలరు. కానీ ఏదో ఆదర్శవంతమైన ఒక సంస్థకు ఒక సిద్ధాంతానికి కట్టుబడి కృషిసల్పుతున్నందువల్ల మీరు మరొకరికన్నా ఉత్తములమని అనుకోకండి."

కృష్ణమూర్తి నుండి సహజంగా పుట్టుకొచ్చే సమాధాన చాతుర్యం, హాస్యం చిందించే చమత్కార భాషణ, ఆ సమయానికి అక్కడ ప్రత్యక్షమయ్యే ఆయన అంతర్గత చైతన్య ప్రవాహంయొక్క తాకిడినీ, ఏ కృష్ణమూర్తి పుస్తకమూ అందించగలిగి లేదు. అక్కడి పరిస్థితిని పునరావృతం చేయనలవి కాదు. కేవలం అక్కడ ఏమి సంభవించింది అనేది మాత్రమే చెప్పగలం.

సమావేశం జరుగుతున్న సమయాన, స్విస్ ఆడపిల్లల స్కౌట్ బృందమొకటి ఉచ్ఛై స్వరంతో పాడుకుంటూ ఆ పక్కగా వెళ్ళారు. కృష్ణమూర్తిగారు నవ్వుతూ "ఇక్కడికి వచ్చి పాడమని వారిని అడుగుదామంటారా?" అని అన్నారు. మరొక చికాకు ఏమిటంటే సమావేశం జరుగుతున్నవేళ, అవతలి పక్క వచ్చిపోయే రైళ్ళ శబ్దం. "అదుగో మళ్ళీ వస్తున్నది రైలు" అని ఆగిపోయేవారు. మరోసారి సీరియస్‌గా అడిగారు, "ఆ రైలు సృష్టించే శబ్దాన్ని వింటూ, దానిని ప్రతిఘటించకుండా తలవొగ్గి, కేవలం ఆ శబ్దం మాత్రమే గ్రహిస్తూ ఉండిపోగలరా?"

(ఇదేమీ చిన్న ప్రశ్న కాదు. ఇందులో చాలా ధ్యానం ఇమిడి వున్నది. రైళ్ళ శబ్దం, ఏరోప్లేన్ల శబ్ధం, సమీపాన వున్న గుడి గంటల శబ్దం, దూరాన ఎక్కడో ఒక జన సమ్మేళనం నుండి వినవచ్చే శబ్దం, ఇలాంటివన్నీ లేనిచోటును ఎన్నుకొని దట్టమైన అడవిలో సమావేశ మవాలి. దాని బాధలు, భయాలు దానికుండవచ్చు. అందువల్ల జీవితంలో మనం ఎంత శ్రద్ధతో ఎంత ప్రశాంతంగా జీవించాలని అనుకున్నా, పురుషార్థం సాధించడమే మన ప్రధాన కర్తవ్యమని భావించినా, ప్రశాంతతను కల్లోల పరిచే ఘట్టాలు ఎప్పుడూ ఉంటూనే వుంటై. అలా తోసుకువచ్చే శబ్దతరంగాలకు తల వొంచి మనసుయొక్క దృష్టిని ఆ శబ్దంమీదనే ఉంచితే, ఆ ప్రవాహంతో ఒకటై ప్రవహిస్తే, ఏమవుతుందో చూడనేర్వాలి. జగత్తులో జీవించడానికి ఇది ఎంతో అవసరం. అప్పుడు మన లక్ష్యం దెబ్బతినకుండా సాగిపోవచ్చు.)

మరోసారి ఆయన ప్రసంగిస్తున్నప్పుడు ఒక కుక్క గట్టిగా మొఱగడం వినిపించింది. చేసేదేమీ లేక, కృష్ణజీ ఆగిపోయారు. సమావేశంలోనున్న ఒక వనిత, ఇదే అదనుగా భావించి, అకస్మాత్తుగా లేచి నుంచొని గబగబా ఏదో మాట్లాడింది; కానీ ఆవిడ మాట మాత్రం ఎవరికీ సరిగ్గా వినరాలేదు. అర్థమూ అవలేదు. కృష్ణమూర్తి నిట్టూర్చి, 'క్షమించాలి, మేడమ్, శునకమే గెలుస్తున్నది' అన్నాడు. మళ్ళీ ఒకసారి బయటి నుండి పెద్దగా మొఱుగుడు వినిపించింది. ఇక ఊరుకోలేక 'క్షమించాలి, కానీ ఆ కుక్క ఎవరిదండి? అని అడిగారు.

మనలోని సత్త నిశ్చలంగా వుండాల్సిన అవసరాన్ని గురించి ప్రస్తావిస్తూ గాఢాను భవాలు, లోతైన అనుభవాలు వేగిరంగా మనకు సిద్ధించాలని కోరుకోవడమే, జీవితంయొక్క

మృదువైన లేత రంగుల్ని మాడకుండా అడ్డం పడుతున్నదని చెప్పారు. కేవలం నిశ్చలంగా వుండి మనలోతుల్లోకి ప్రవేశిస్తే, అనుభవంకోసం వెంపరలాడడం తీరిపోతుందని అన్నారు. జీవితంలో సంభవించే ప్రతి సంఘటననూ సంపూర్తిగా, మొత్తంగా గమనించడం నేర్వాలన్నారు. సంపూర్ణమైన మానవుడే సాధుపురుషుడు కూడాను అన్నారు కృష్ణమూర్తిగారు.

మన పూర్వజన్మల గురించి మనకు తెలిసినట్లయితే ఈ జన్మలోని ఇప్పటి సమస్యలను పరిష్కరించుకోగలమా అని ఒకావిడ అడిగింది. ఇటువంటి ప్రశ్న అంత ముఖ్యమైనదిగా పరిగణించక, 'కృ'గారు దీనిని తేలికగా తీసిపారేస్తారని చాలామంది శ్రోతలు అనుకుంటారు. కానీ ఈ సందర్భంలో ఆయన ఈ ప్రశ్నకు తిన్నగా సమాధానం చెప్తూ, 'పునర్జన్మను గురించి మన భావాలు సరైనవి కావనీ, ఈ మొత్తం వ్యవహారాన్ని మరో దృష్టితో చూడాలనీ' అన్నారు. 'ఆసియా ఖండం యావత్తూ పునర్జన్మ సిద్ధాంతాన్ని విశ్వసిస్తుంది. అందువల్ల అనేక సందర్భాల్లో ముఖ్యమైన పలు విషయాలను "మరుసటి జన్మకు చూద్దాంలే' అని వాయిదా వేయడం అలవాటైపోతుంది. ఆ జన్మలో జ్ఞానవంతుల మవుతామనీ అప్పుడే సమస్యలన్నీ సుఖంగా పరిష్కరించుకోవచ్చనీ నమ్ముతుంటారు. పునర్జన్మలో విశ్వాసం పెట్టుకునేవారు, జన్మ తర్వాత జన్మలో కాస్త కాస్త ప్రగతి సాధిస్తామనీ, ఆఖరి జన్మలో తాము ఏమికానున్నామో ఊహించుకొని, ఆ ఆదర్శంతోనే సంతృప్తిచెంది నందువల్ల, ఇప్పుడు ఈ జన్మలోని చర్యలు స్వేచ్ఛగా వుండజాలవనీ, వాయిదావేయడంలో వున్న ప్రమాదాన్ని వివరించారు. 'మళ్ళీ జన్మ ఎత్తేదేమిటో మీరెన్నడూ గమనించలేదు. గతానికి చెందిన జ్ఞాపకాలలో మీరు చిక్కుకొని వుంటారు. అవన్నీ కాలంతో ముడిపడి వున్నటువంటివి. గతం అనే సంకెల మిమ్మల్ని బందీకృతుణ్ణి చేసింది. పునర్జన్మ అంటే నిజానికి గతంయొక్క పొడిగింపు, కొనసాగడమే అవుతుంది. కాలాతీతమైన శాశ్వతత్వంలో పునర్జన్మ వుండదు' అన్నారు.

మన కర్మ(అనగా నిత్యజీవనంలో మన చర్యలు) సంపూర్ణమైన స్వేచ్ఛ నుండి జన్మిస్తున్నాయా లేక ఎల్లకాలం గతంతోనూ, స్మృతులతోనూ ముడిపడి వుండాల్సిందేనా? అని అడుగుతారు 'కృ'. 'మీరు గాంధ్రుపులుల లోకంలో నివసిస్తుంటారు. ఆ పులులన్నీ మీ మనోసృష్టే. మీరు ఏ బాటను ఎన్నుకున్నా, ఆ బాటలో విషసర్పాలు బుసలుకొడుతూ

వుంటై. మిమ్మల్ని నేడుగుతున్నదీ, నాకు నేను వేసుకుంటున్న ప్రశ్న ఏమిటంటే, ఆ శరభాలనీ, ఈ సర్పాల్నీ ఒక్క వేటుతో అప్పటికప్పుడు తెగటార్చగల ఉపాయం కనుగొన గలనా? అని. ఇది నాకు సాధ్యంకాకపోతే, ఏదో నటిస్తూ తిరుగుతుంటాను. వాటిని దాచేసి, నా అసలు స్వరూపం కనిపించకుండా, మరేదోగా కనిపించపూనుకుంటాను. మళ్ళీ పుట్టినప్పుడు, ఇదే రకమైన అరాచక పరిస్థితుల్లోనే పుడతాను. నా మనసు, మళ్ళీ పూర్వంలాగానే ఆ పులుల్నీ, సర్పాల్నీ, కోతుల్నీ పెంచి పోషించనారంభిస్తుంది. ఏ జంతువునీ ఓనాడు కొంతదూరం తరిమేసి, మర్నాడు మరికొంత దూరం తరుముదాములే, అని వెనుదిరగడానికి వీల్లేదు – అలాగైతే ఆ జంతువును నువ్వేనాటికీ పట్టుకోలేవు. పులిని గానీ, కోతినిగానీ చూసీచూడడంతోటే, అక్కడికక్కడే నిలదీయి. రేపటికని వాయిదావేస్తే ఆ పులి మరింత పెద్దదవచ్చు, లేదా తనకన్నా పెద్దదైన మరొక పులిని జత కలుపుకు రావచ్చు. తన స్వేచ్చను పదిలంగా భద్రపరచుకోడానికి, ఇంతకన్నా తక్కువ హాని కలిగించే చిన్న చిన్న జంతువులను పట్టుకోమని సన్నగా సలహా ఇవ్వవచ్చు."

సమావేశంలో కృష్ణమూర్తిగారి ఎదురుగా కూచోనున్న ఒక శ్రోత ఆకస్మాత్తుగా లేచి నుంచొని, ఆయన ప్రసంగానికి అడ్డుతగులుతూ, ఏదో విషయాన్ని గురించి గాఢంగా ఎవరికీ సరిగా అర్థంకాని ఏదో వివరణ చేయనారంభించాడు; ఆయన్ని ఏదో అడుగు తున్నాడు. 'కృ'గారు అతడివంక నవ్వుతూ చూస్తూ 'గట్టిగా లోపలికి శ్వాస తీసుకోండి. అలా దీర్ఘంగా శ్వాస తీసుకుంటే, మీ ప్రశ్నకు సమాధానం బహుశా మీకే దొరక వచ్చు అని, అటు తర్వాత మరింత సీరియస్‌గా "ప్రశ్నలో వుండే అందమే అదండీ. మనిషి గనక సరైన ప్రశ్న అడగ నేరిస్తే, సమాధానం తన ప్రశ్నలోనే వున్నదని గ్రహించడం సంభవిస్తుంది' అన్నారు.

"అచ్చం కృష్ణమూర్తి చెప్పినట్లే బ్రతకనక్కరలేదండీ, 'నాన్–కృష్ణమూర్తి స్పిరిట్'తో కూడా బ్రతకవచ్చండీ" అని అందర్నీ ఆశ్చర్యపరుస్తూ, 'కృ'గారు ఇలా అన్నారు. 'మీరు ఆధ్యాత్మిక జీవనమనేది గడపాలనుకుంటే, పరిశుభ్రమైన సరియైన ఆహారం గైకొనాల్సి వుంటుంది'. తానొక రెండుగంటలపాటు యోగాసనాలు వేస్తుంటానని చెప్తూ, యోగ వ్యాయామం ఎవరికైనా ఆరోగ్యరీత్యా ఉపకరిస్తుందని అన్నారు; 'రక్తానికి ఆక్సిజన్

అందించి శరీరాన్ని శుభ్రపరుస్తుంది. కానీ ఆహార నియమాలు, యోగా వ్యాయామాలను ఓ పెద్ద మతపరమైన విషయంగా చేసి కూచోకండి. ఆమాటకొస్తే హిట్లర్, ముసోలినీ వంటి నియంతలు శాకాహారులే మరి' అన్నారు.

తనని గురించి కానీ, సభికుల్ని గురించి కానీ, మరీ సీరియస్‌గా వ్యవహరించే వారు కాదు. కానీ ఆయన చుట్టూ భాగ్యవంతుల బరువు ఒకటుండేది. 'కృ'గారి పేరు ప్రఖ్యాతులు తెలిసిన కారణాన, ఈ చిన్న గుంపు ఆయన ప్రపంచంలో ఎక్కడికి వెళ్తే అక్కడికల్లా ఆయనతోటే వెళ్తుండేవారు. వారు ప్రధానంగా ఆయన ప్రసంగాలను టేప్ రికార్డ్ చేసుకుంటూ వుండడం, ఆయన ప్రసంగించేచోట ముందువరసలో వున్న స్థలాన్ని ఆక్రమించుకొని, ఆయన పాదాల చెంతనే బైఠాయించడం చేస్తుండేవారు. ఆయన చెప్పినది, శ్రద్ధగా విని ఆచరించడంకన్నా, ఆయన దృష్టిని తమవైపు మరలించుకుందామని ప్రయత్నించడం, ఇతరులకు చికాకు కలిగించే విధంగా ప్రవర్తించడం, చేస్తుండేవారు. 'కృ' గారు సున్నితంగా ఈ మొత్తం వ్యవహారాన్ని తిరస్కరిస్తూనే వుండేవారు. "నన్ను మీరు అనుసరించవద్దండీ! మిమ్మల్ని మీరు ధ్వంసం చేసుకుంటారు; నన్నూ ధ్వంసం చేస్తారు" అంటుండేవారు. తన మాటల్నే తనకు అప్పజెప్పినట్లుగా ఎవరైనా మాట్లాడితే 'నా మాటల్ని మళ్ళీ మీరు ఉచ్చరించడంవల్ల ప్రయోజనమేముంటుంది? ప్రపంచంలో ఎటు చూసినా వారి మాటలు వీరు, వీరి మాటలు వారూ పునశ్చరణ చేస్తూ కాలం గడుపు తుంటారు. మరొకరి మాటలను అనుకరించినందువల్ల మీకేమాత్ర జ్ఞానముదయి స్తుందండీ?" అని అడిగేవారు.

 

ఇరవైయవ శతాబ్దపు మూడవ దశకంలో శ్రీ కృష్ణమూర్తి, ఇటలీ దేశంలోని రోమ్ నగరానికి వెళ్ళినప్పుడు, ఒకసారి సైంట్ పీటర్ స్క్వయర్‌లో నుంచోనుండగా, క్రిస్టియన్ మతాధిపతి పోప్‌ను కుర్చీవంటి పల్లకీలో అటుగా తీసుకువెళ్తూ వున్నారు. మధ్యలో పోప్ తన పల్లకీని ఆపించి, కృష్ణమూర్తితో, "మీరు ఇండియనులా?" అని ప్రశ్నించాడు. "నేను ఇండియాలో జన్మించాను నన్ను ఇండియా దేశస్తుణ్ణిగానే భావించాలి" అని సమాధానమిచ్చాడు కృష్ణమూర్తి.

పోప్ కృష్ణమూర్తితో "మీ ముఖం చూసి ముచ్చటపడ్డాను" అని అనేసి, ముందుకు సాగిపోయాడు. ఇక్కడ కృష్ణమూర్తిగారి సమాధానాన్ని కొద్దిగా వివరించాల్సి వున్నది. ఆయన మన యౌవనం నుండే తననితాను మానవ జాతికి చెందిన వాడిగా తలపోస్తుండేవాడు గానీ, ఫలాని దేశానికి చెందిన వాడినని అనేవాడు కాదు.

తాను పుట్టిన భారతదేశాన్ని గురించి, ఒకనాటి రుషుల గురించి ఎంతైనా గౌరవాభి మానాలు వుండేవి కానీ, తాను భారతదేశానికి చెందిన వాణ్ణని 'సగర్వంగా' ప్రకటించుకోడం ఉండేది కాదు. ఆయన జీవితం, బోధ, జాతి మతాలకు అతీతం- మానవుణ్ణి విముక్తుణ్ణి చేయడం ఒక్కటే దాని లక్ష్యం.

*ఆంధ్రభూమి దినపత్రిక* ***25-7-2010***



# మనిషి నిజస్వభావం

శ్రీ జిడ్డు కృష్ణమూర్తిగారు యత్న రహితంగా (effortless) ఎంపిక లేని ఎఱుకతో (choiceless awareness) జీవించమని ఎంతగా చెప్పినా, విన్నవారికి ఈ రెంటిని గురించీ సందేహాలు తీరేవికాదు. ప్రయత్నం చేయకుండా ఇప్పటివరకూ ఏ పనయినా అయిందా? అలాగే పదింటి మధ్య కానీ, రెండిటి మధ్య కానీ ఎంపిక చేయకుండా ఎలా వుండగలం? ఎఱుక అంటే చూడడం, శ్రద్ధతో గమనించడం అనేది అర్థమవుతున్నది కానీ, ఎంపిక వద్దంటే ఎలాగండీ? ఎబ్బే, ఈ బోధ యావత్తూ మనకు అర్థంకానిది; బహుశా అర్థంలేనిదీయేనేమో, అని తప్పించుకున్నవారున్నారు.

కానీ ఆర్థర్ ఆస్‌బోర్న్ అనే, శ్రీరమణుల అంతేవాసి ఎడిట్‌చేసిన పుస్తకంలో, అరుణాచల రమణులవారు ఇలా అన్నట్లు కనిపించింది. "యత్నరహితమూ, ఎంపిక లేని ఎఱుకా నిజానికి మన అసలు స్వభావం" అని వున్నది. ఇదే మన అసలు (నిజ) స్వభావమైనప్పుడు మనుష్యుల్ని ఆ స్వభావాన్ని గుర్తించేట్లు చేయాలని కృష్ణమూర్తిగారు, ఉన్న మాటని తెలియజేస్తూ మనుషుల్ని అటు మళ్ళించ చూడడంలో అసందర్భ మేమున్నది? అర్థంకానిదేమిటి?

శ్రీ రమణులవారు, నామ జపం చేయమంటారా? అని ఎవరైనా అడిగితే 'అలాగే కానివ్వండి' అని అంటూ కూడా, హృదయము, మనస్సూ 'అజప' స్థాయికి చేరాలని కూడా చెప్తూనే వుండేవారు కదా? అంటే, మనిషి తాను ప్రయత్నించి ఏదిచేసినా, అందులో తాను వున్నంతకాలం అది నిర్మూలన మవనట్లే కదా? ప్రయత్నముంటే, తానున్నట్లే. మానసిక ప్రయత్నం లేకుండా సాధన సాగాలి.

అలాగే 'ఎంపిక'లోనూ 'తానే' వుంటాడు. మనిషి కేవలం 'ఎఱుక'లో వున్నప్పుడు ఒక్కొక్క వస్తువూ కనిపిస్తుంటుంది. దాని స్వరూప స్వభావాలేమిటి అని తెలుస్తూ వుంటుంది. ఆ వస్తువు ఎలా జనిస్తుంది, ఎలా పరిణమిస్తుంది అనేది ప్రకటిత మవుతుంటుంది. తటస్థంగా చూసి అర్థం చేసుకుంటూ వుంటాడు. ఎంపిక చేసేటప్పటికల్లా 'తాను'

ప్రవేశిస్తాడు. 'తాను' ఇవాళ్టివాడు కాదు. 'తనకు' కోట్లాది సంవత్సరాల చరిత్ర వున్నది. ఎంపిక చేస్తూ వచ్చినందువల్లనే తానీ దుఃఖిత స్థితికి చేరుకున్నాడు. ద్వంద్వ తొలగదు.

ఎంపిక అసలు లేకుండా జరుగుతుందా? అంటే, రెండు ఇళ్ళ విషయంలో ఏది అద్దెకు తీసుకోవాలి అనే ఎంపికచేయడంలో తప్పులేదు. అలాగే ఏ షర్టు, ఏ చీరె కొనుక్కోవాలనే దానిలో ఎంపిక తప్పుకాదు. కానీ సతతం 'తీర్పులు' చెప్పే మనసు, తనలో కలిగిన కోపం చెడ్డదనీ, – ఖండించదగిందనీ, లేక మంచిదేననీ – కాబట్టి సమర్థనీయమనీ, అలాగే మిగతా అనేక గుణాల విషయంలో జరిగే ఎంపిక 'తాను' చేసేటువంటిది. ఆ ఎంపిక సరైనది కాకపోవచ్చు.

తాను లేని ఎంపిక ఎలా జరుగుతుందంటే, రెండిటిని సంపూర్తిగా చూచినప్పుడు, ఆ విధంగా ఎఱుక కలిగినప్పుడు – నీ ఇష్టాఇష్టాలతో నిమిత్తంలేని, నిజానికి 'నీవు లేని' ఎఱుక కలిగినప్పుడు, ఆరోగ్యవంతమైనదీ, అభ్యుదయకరమైనదీ, అభివృద్ధివైపు మళ్ళించేది. అందరి క్షేమాన్ని కాపాడేది, విచ్ఛిన్నం బదులు సమగ్రతకు దోహదం చేసేది, దానంతట అదే ఎన్నుకోబడుతుంది. చూడడం, ఎఱుక దీనికి కీలకం. ఇది సంపూర్తిగావుంటే, ఎంపిక దానంతట అదే లోకకళ్యాణానికే దారితీస్తుంది.

**ఎఱుక**

మేఘాలు లేని పరిశుద్ధ ఆకాశం అంతులేనిది, అనంతమైనది, అత్యంత విశాలమైనది. ఎఱుక పెరుగుతూ వుంటే ప్రేమ పెరుగుతూ వుంటుంది. ఇలాంటి మనిషికి ఏ దేవాలయమూ, ఏ ప్రార్థనా మందిరమూ అవసరంలేదు; మనిషే ప్రార్థనగా రూపొందు తాడు. సంఘటిత మతాలు, ఈరకమైన పెరుగుదలకు వ్యతిరేకం.

*శ్రీ రజనీష్*

సాధారణంగా జీవితం ఎఱుక లేకుండానే వెళ్లిపోతుంది. మొత్తం జీవితంలో ఎఱుకగల క్షణాలు లెక్కవేస్తే ఐదు నిమిషాలు వుంటాయేమోనంటాడు గుర్జీఫ్. అదైనా అడపాదడపా– మహాప్రమాదం యేదో సంభవించ నున్నప్పుడూ, జీవితంలో ఏదో క్లిష్ట పరిస్థితి ఏర్పడినప్పుడు మాత్రమే.

*ఆంధ్రభూమి దినపత్రిక 13-2-2011*

# స్వశక్తిపై ఆధారపడండి

శ్రీ జిడ్డు కృష్ణమూర్తిగారు మహాదార్శనికుడు, గొప్ప వైతాళికుడు. మీలో ఆసక్తి వుంటే మిమ్మల్ని మేల్కొల్పి, మిమ్మల్నీ దర్శింపజేయగలడు. ఆయన వినూత్న బోధను అర్థం చేసుకుందాం.

ఆధ్యాత్మిక సాధనకు, మోక్షం లేక స్వేచ్ఛ అంతిమ లక్ష్యం. కానీ ఈయన దృష్టిలో, 'స్వేచ్ఛ' సాధన యొక్క ప్రారంభంలోనే వుండాలి. మనుషులందరిలోనూ, పరమ పవిత్రంగా ఎంచబడేది వున్నదనీ, దానిని ఎల్లరూ కనుగొనగల సామర్థ్యం కలిగున్నారనీ, ఆయన ఉద్భోధ. ఇందుకు అధికార అనధికార భేదం లేదు; శ్రద్ధ నిజాయితీలు మాత్రమే అవసరం. దేవుడు, ధర్మం అనే పదాలకు మనుషులు పలు రకాల అర్థాలు కల్పించి వాటిని ఎంతో కలుషితం చేశారని, ఆయన ఆ పదాలు వాడరాదని నిశ్చయించుకొని, వాటి బదులు జీవితమనే పదాన్ని ఎంచుకున్నాడు. నిజానికి మనకు దైవమనేది జీవిత రూపంలోనే ప్రత్యక్షమవుతున్నది.

పూజలూ పునస్కారాలూ, ఆలయాలూ, అనుష్ఠానాలూ, ఈ జీవిత దర్శనానికి ఉపయోగపడవు. కృష్ణమూర్తిగారి దృష్టిలో ఇవన్నీ అప్రధానమైన విషయాలు; నిజానికివన్నీ మనిషిని సత్యానికి దూరం చేస్తున్నై. జీవితంలో నిజమైన ఆనందాన్నీ స్వేచ్ఛనూ అందుకోడానికి ఇవి ఆటంకాలు మాత్రమే. ఆయన నోటి నుండి తరచూ వినవచ్చే పదాలు 'ఆనందం, విముక్తి, జీవితం' వీటికిన్నీ మతాలు చెప్పే ప్రార్థన, దేవుడు, అనే పదాలకు ఏ సంబంధమూ లేదు.

జీవితాన్ని ప్రేమించు అంటాడు ఆయన. అందులో భాగంగా నిన్ను నువ్వు ప్రేమించ నేర్చుకో. ఇన్నాళ్ళూ మనం గుర్వాజ్ఞ జవదాటకు, మేము చెప్పినట్లు ధర్మాన్ని ఆచరించు, పవిత్ర గ్రంథాలు పఠించు అనే నిర్దేశ సూత్రాలను వింటూ వచ్చాము. జీవితాన్నే ప్రేమించు అనే కృష్ణమూర్తి మాట ముందర ఇవన్నీ పేలవంగా కనిపిస్తై. ఇప్పుడు మనం ఆధారపడుతున్న ఊతకోలల్ని అవతల పారెయ్యమంటున్నాడు కృష్ణమూర్తి.

అందుకు ఆయన చెప్పే కారణం "నేనూ ఒకప్పుడు ఈ ఊతకోలల మీద ఆధారపడిన వాడినే. కానీ అవి ఎంత నిరుపయోగమైనవో గ్రహించాను. మీ ఊరటలు, ఉపశమనాలూ మిమ్మల్ని బలహీన పరుస్తాయి, అని నాకు తెలుసు కాబట్టే, ఆ కర్రల్ని అవతల పారేయమంటున్నాను. సూటిగా, సుగమంగా వెళ్ళదగిన మార్గమొకటి కనుగొన్నాను కాబట్టి మీకిది తెలియ జేస్తున్నాను" అన్నారు.

ఏమిటీ సూటి మార్గం? జీవితం సిద్ధంపజేసే ఏ కష్టనిష్ఠూరాలను కూడా తప్పించుకో చూడకుండా వాటిని ఎదుర్కొంటూ, వీటి వేటితో నిమిత్తం లేని ఒక స్థితిని అందుకోడమే ఆయన చెప్పే మార్గం. 'బాధ ఘర్షణ, దుఃఖం నొప్పి తప్పించుకోడానికే మీరు ఈ దేవుళ్ళు, ఆలయాలు, మతాలు మరెన్నో ఉపశమనాలను సృష్టించుకున్నారు' అంటున్నారాయన.

'నా అంతట నేను మీకు స్వేచ్ఛను అనుగ్రహించలేను. ఈ స్వేచ్ఛను, విముక్తినీ మీరే సాధించుకోవాలి. మిమ్మల్ని మేల్కొల్పి, ఆ స్వేచ్ఛవైపు మీ దృష్టిని మరల్చడంవరకే చేయగలను. ఇక అటు తర్వాత మీ స్వశక్తితో మీరే పెనగులాడి, ఆ స్వేచ్ఛను సాధించుకో వలసి వుంటుంది" అంటారు ఆయన.

మీ స్వశక్తిమీదే ఆధారపడండి అంటూ, జీవితమనే తుఫాను తాకిడికి మిమ్మల్ని గురిచేసినప్పటికీ, ఆయన మీవద్ద నుండి తీసేసిన పనికిరాని ఊతకోతల స్థానంలో బలీయమైన ఆత్మ విశ్వాసాన్ని నెలకొల్పుతున్నాడు. ఎక్కడో బాహ్యంలో వున్నదనుకున్న దైవాన్ని, మీలోనే వున్నాడని, మీరు సర్వశక్తిమంతులని మీకు నిరూపిస్తున్నాడు. అనేక జన్మల్లో మీరు దేనికైతే తపించారో, ఏ మహదవకాశాన్ని అందుకోలేక అలమటించారో, దానిని ప్రయత్నపూర్వకంగా ఇలా పొందండి అని సూచిస్తున్నాడు.

***ఆంధ్రభూమి దినపత్రిక 15-5-2011***

# ఆధ్యాత్మికతను విక్రయించడమా?

తన ప్రసంగాలు, సంవాదాలు మొదలైనవి వినడానికి వచ్చే వారి నుండి గాని, తాను ప్రైవేట్‌గా పబ్లిక్‌గా ఇచ్చే ఇంటర్వ్యూలకు గాని ఏ రకంగానూ డబ్బు వసూలు చేయడానికి వీల్లేదని జిడ్డు కృష్ణమూర్తిగారు ఖరాఖండిగా చెప్తుండేవారు.

ఆధ్యాత్మికతను అమ్ముకోవడం కన్నా ఘోరమైన విషయం మరేదైనా ఉంటుందా" అని కృష్ణమూర్తిగారు ఏనాటినుండో అంటూ వచ్చారు.

ఆయన ప్రసంగానికి 'కృష్ణమూర్తి ఫౌండేషన్' వారు డబ్బు వసూలు చేయడం ఒక ప్రత్యేక సందర్భంలో జరిగింది. 'మసానిక్ టెంపుల్, శాంతా మోనికా సినిక్ ఆడిటోరియం, కార్నిగీ హాల్‌లను ఆయా పట్టణాల్లో అద్దెకు తీసుకున్నప్పుడు (అమెరికాలో) ఆ వ్యయాన్ని టిక్కెట్ల ద్వారా శ్రోతల నుండి వసూలు చేయడం జరిగింది. ఫౌండేషన్ తనకు సంబంధించిన గ్రౌండ్స్‌లో గానీ, హాళ్ళల్లో గానీ ప్రసంగాలు జరిపిస్తే వాటికి ఏనాడూ డబ్బు వసూలు చేయలేదు.

చివరకు 'టిక్కెట్లు అమ్మాల్సిందే. మన వద్ద తగినన్ని ఫండ్స్ లేవు' అని ఫౌండేషన్ 1986 మే మాసంలో ఏర్పాటు చేస్తున్న ప్రసంగాలకు ప్రవేశ రుసుము అనేది వసూలు చేయడానికి నిశ్చయించి, టెక్కెట్లు ప్రింటు చేసి, రిజర్వేషన్లు చేసింది. ఈలోగా కృష్ణమూర్తిగారు 1986 ఫిబ్రవరి 17న గతించేసరికి డబ్బు పంపిన వారందరికీ తిరిగి చెల్లించవలసి వచ్చింది.

అంటే, 'ఆధ్యాత్మిక ప్రసంగాలను ధనానికెలా విక్రయిస్తామండీ' అని క్షోభిల్లిన శ్రీ కృష్ణమూర్తి పంతం, చివరిలోనూ నెగ్గిందనే భావించాలి అని తెలియజేస్తాడు మైకేల్ క్రోహ్నేన్, తన 'కిచ్చెన్ క్రానికల్స్' అనే పుస్తకంలో.

అదే పుస్తకంలో, కృష్ణమూర్తిగారు చేసిన ఆఖరి రికార్డెడ్ స్టేట్‌మెంట్ కూడా ఉన్నది. తన (కృ) దృష్టిలో సంభవించిన ఈ బ్రహ్మాండమైన విషయం (immensity) తన ద్వారా వెలువడిన ఈ టీచింగ్ గురించి ఏ ఒక్కరికీ, తన చుట్టూ వున్న వారిలో

ఏ ఒక్కరికీ కూడా, ప్రపంచంలో ఎవరికీ కూడా, తాను ఏమి మాట్లాడుతున్నదీ, ఏమాత్రం అంతుపట్ట లేదని అన్నారు. ఇలాంటి ప్రకటన ఆయన చుట్టూ వున్న ఆయన సహచరులకు, అత్యంత సన్నిహితులకు చాలా పెద్ద షాక్‌గా పరిణమించింది.

'తన గీతను గురించి కూడా శ్రీకృష్ణుడు ఇలానే అనుకున్నాడు. ఆనాటి నుండి ఈనాటి వరకు వ్యాఖ్యానాలు ఎన్ని వచ్చినా, భాష్యకారులు తాము అర్థం చేసుకున్న తీరును వివరించారే గానీ, తమదే 'ఆఖరిమాట' అనగలిగిలేరు. అలాగే కృష్ణమూర్తి గారిని, ఇకముందు కూడా అధ్యయనం చేస్తూ ఉండాల్సిందే. లోతుల్ని అర్థం చేసుకున్న కొద్దీ కలిగే ఆనందం ఇంకాస్త పరిశోధనకు పురికొల్పుతుంది. ఆనందం బ్రహ్మానందం వైపు తీసుకువెళ్ళనారంభిస్తుంది. బ్రహ్మానందం సిద్ధిస్తే, అన్నీ అర్థమైనట్లే' అన్నాడు మిత్రశ్రీ.

 

తాను జీవితంలో ప్రసంగించనారంభించినప్పుడు, తాను దివ్య జ్ఞాన సమాజం (థియోసాఫికల్ సొసైటీ) వారి భాషను (అంటే వారి భావజాలానికి అనుకూలమైన భాషను) వాడేవాణ్ణని, అయితే 1922 నుండి (అమెరికాలో 'ఒహై' అనే గ్రామంలో తనకు కలిగిన వినూత్నానుభవం అనంతరం) 'తన భాషను తాను కనుగొన్నానని' అన్నాడు శ్రీ జిడ్డు కృష్ణమూర్తి.

 

**జి.కృ. సూక్తులు**

దేవాలయం వెలుపల పెనుగులాట, పోరు ఎంత సాగితేనేం, లోపలి దేవుడికి ఏమి లెక్క?

నీ హృదయంలో పూజ్యభావముంటే, ఎవరి యెడలా నిర్దయగా ఉండజాలవు.

మానవ స్వభావాన్ని అర్థం చేసుకోడమే కరుణ అంటే

మనసు శూన్యంగా ఉండెనని, ఆ శూన్యం తొలగిన తర్వాత మనసుకు తెలుస్తుంది.

***ఆంధ్రభూమి 17-3-2013***



















1) మదనపల్లిలోని రాఘవేంద్రరావు వీధిలో కృష్ణమూర్తి జన్మించిన గృహం.
2) తమ్ముడు నిత్యానందతో కృష్ణమూర్తి 3) సి.డబ్ల్యు లెడ్ బీటర్ 4) డాక్టర్ ఏనీబిసెంట్
5) రిషీవాలీ స్కూల్ ప్రథమ ప్రిన్సిపల్ జి.వి. సుబ్బారావు 6) శ్రీమతి పుపుల్ జయకర్

# జిడ్డు కృష్ణమూర్తి సూక్తులు

1 ‘ఈ ‘టీచింగ్’ను మీరేమి చేద్దామనుకుంటున్నారండీ? కృష్ణమూర్తి వాక్యాలు వల్లె వేద్దామనుకుంటున్నారా? ఆ పని మాత్రం చేయకండి. ఈ బోధను జీవించండి. అలా జీవిస్తేనే వ్యుత్పత్తిగల కొత్త పరిజ్ఞానం, తెలివి లభ్యమవుతై. సెకండ్‌హాండ్ మనుష్యులుగా జీవించకండి.’

2 ‘పరమూ’, ‘అన్యమూ’ గుర్తించగలిగిలేము. ‘అది’ మీరు ఒకప్పుడు అనుభవించినది కాదు కాబట్టి, ‘గుర్తించ’నలవి కాదు. ఆ ‘అన్య’మైనటువంటిది, ఎప్పటికప్పుడు ప్రతి క్షణమూ, పై మూత తీస్తూ కనుగొంటూ వుండాలి.

3 ‘సజీవంగా’ వుండేదానికి, నివసించే చోటంటూ లేనిదానికీ, నిర్దేశిత మార్గం ఉండజాలదు.

4 గురువు, గ్రంథం, స్వానుభవం – దేనిమీద ఆధారపడిన మనసైనా, మొద్దుబారి పోతుంది. ఆధారపడడం, భయాన్ని జనింపజేస్తుంది.

5 నీలో నిజాయితీ నెలకొనడానికి, స్పష్టత చేకూరడానికి, అంతరంగం తునాతునకలు కాకుండా ఏకీకృతమవడానికి, ఎవరూ ఏమిచేయగలిగిలేరు. ఇది సాధించడం, నీ ఒక్కడివల్లనే అవుతుంది. అదే అన్నిటికన్నా మహాద్భుతం–నీవు నీవుగా సంపూర్ణ స్వస్థత చేకూర్చుకోడం. ఇక్కడ మనం చేస్తున్నదదే మనల్ని మనం అర్థం చేసుకోడం.

6 ఈ వినూత్న మనసు సత్యాన్ని అన్వేషించదు. ఆహ్వానించదు. దర్శనానికై ఆతురత చెందదు. తనకు సత్యమెలా వుంటుందో తెలియదు కాబట్టి, ఆ విషయమై ఊహ చేయదు. తనకు ఖాయంగా తెలిసిన దాని నుండి, అనగా తన కామక్రోధాదుల నుండి విముక్తి పొందనారంభిస్తుంది. ‘తెలిసినదాని’ చెఱ నుండి విడివడ నారంభించిన కొలదీ, జీవితంలో వెలుగు ప్రసరింపనారంభిస్తుంది.

7 'ప్రేమను' గనక నిజంగా కనుగొన్నావంటే, అది నీలో చెదరకుండా ఉండిపోతుంది. ఆ తర్వాత 'ప్రేమరహిత'మైన స్థితి సంభవించడమనేది ఉండదు.

8 సత్యమనేది అవిభాజ్యమైన వ్యక్తికి దర్శనమిస్తుందేకానీ, సమూహాలకు అందేది కాదు. పరిపూర్ణమయిన సత్యం పరిపూర్ణమైన వ్యక్తికి మాత్రమే కనిపిస్తుంది. అందుకు మనిషి ధర్మబద్ధమైన జీవనం గడపగలిగిన స్వేచ్ఛ, సాహసం కలిగుండాలి. సత్యదర్శనం ధ్యానయుతమైన జీవనం నుండి, ధర్మనిరతి నుండి రావవలసి వున్నది కానీ మరేరకమైన పద్ధతిలోనూ జరుగదు.

9 ఆ 'తెలివి' బాహ్యం మీద కానీ, లోని ఆలోచన మీద గానీ ఆధారపడకుండా వున్న స్థితి నుండి, వెలికి వస్తుంది. అనుకోని 'సంఘటన' జరగకముందే ఆ 'తెలివి' ప్రవర్తిల్లుతుంది. అప్పుడిక దుఃఖం యొక్క ఆవశ్యకత ఉండదు. ఇది గనక మీరు స్వయంగా కనుగొంటే, ఇదో అద్భుతమైన బ్రహ్మాండమైన వరమని గ్రహిస్తారు.

10 ఏదైనా ఒక దానిని తేటతెల్లంగా చూస్తే, అప్పుడో అద్భుతం జరుగుతుంది. ఏదైతే 'ఉన్నదో' అది ఏ వక్రీకరణ లేకుండా స్పష్టంగా గోచరమయితే, ఆ అవగాహన అందించే సత్యం, స్వస్థతను చేకూరుస్తుంది.

11 'నాకు తెలుసు' అనుకున్నవాడు ఆ తెలిసిన దానికి కట్టివేయబడ్డవాడు. అలాంటి వానికి అద్భుతముండజాలదు. కానీ మనిషి గనక అనిశ్చితుడై వుంటే, జీవితం నుంచి ఏమీ ఆశించకుండా బ్రతకనేరిస్తే, ఎల్లప్పుడూ పునరుజ్జీవం పొందుతుంటే, అంతులేని ఈ నిత్య నూతన జీవితం ఒక మహాద్భుతంగా గోచరిస్తుంది.

12 మనిషి సంఘంలో భాగంగా జీవిస్తూ కూడా, అడుగడుగునా సంఘ విలువలను ప్రశ్నిస్తూనే వుండాలి. లేకపోతే మనిషి 'ప్రవాహజీవి' అయిపోతాడు. సంఘంలో కనిపించే అవినీతి యావత్తూ అతడిలో ప్రవేశిస్తుంది.

13 ఒక నిర్దేశిత మార్గం, ఓ సిద్ధాంతం, ఓ మత విశ్వాసం వంటివి అనుసరించినందు వల్ల, సత్యదృష్టి, సత్యదర్శనం, సంకుచితమైపోతుంది. అప్పుడు ఈ సమస్తాన్ని ఎలా దర్శించడం?

14 నేను మీ అజ్ఞానాన్ని విచ్ఛేదం చేయడానికి తోడ్పడగలనేమో కానీ, వాస్తవాన్ని గురించి నేర్చుకోవడం మాత్రం, మీరే చేయాల్సి వుంటుంది. జ్ఞానమనే దాన్ని మీరు స్వయంగా సాధించాలి.

ఒకరిస్తారు మరొకరు స్వీకరిస్తారు అనే విధానం దోపిడీకి దారితీస్తుంది.

15 ఈ 'సంపూర్ణత్వం' మీలోనే నెలకొని వుందనే సూత్రం అర్థమైతే, మీ భ్రమతోనే మీరు పడే ఘర్షణ ద్వారానే – తత్కారణంగా మీలో ఉదయించే అవగాహనవల్లనే, వాస్తవ దర్శనం జరగగలదు.

16 మీ స్వశక్తి మీదే ఆధారపడి వుంటూ మీ వద్ద నుండి తీసేసిన ఊత కోలల స్థానంలో బలీయమైన ఆత్మవిశ్వాసాన్ని నెలకొల్పుతున్నాడు 'కృ'. ఎక్కడో బాహ్యంలో ఉన్నదనుకున్న దైవాన్ని, మీలోనే వున్నాడనీ, మీరు సర్వశక్తిమంతులని మీకు నిరూపిస్తున్నాడు.

17 'నేను ఎల్లప్పుడూ ఒక ఆనందాబ్ధిలోనే వుంటాను. కోపమూ, అసూయ, ఇతర భావోద్వేగాలు నాలో వుండవు.

'అపేక్ష కారణంగా కొందర్ని ఎక్కువగా పరిగణించడమంటూ ఉండదు. నా అనుచరులనుకునేవారు, నన్ను అర్థం చేసుకున్నవారు, వీధిన వెళ్లే మనిషి, ఎవరైనా నాకు ఒకటే!

18 శ్రీ రామ్‌నాథ్ గోయెంకా (ఇండియన్ ఎక్స్‌ప్రెస్ గ్రూప్ ప్రొప్రయిటర్) దేశ దుస్థితిని తలుచుకుంటూ, కృష్ణమూర్తి గారితో, "ఈ లెక్కన ఈ దేశం గతి ఏమి కావాలి?' అని అన్నప్పుడు కృష్ణమూర్తి గారు ఆయనతో "మహా పురుషులు జన్మించిన ఈ దేశపు మట్టిలో ఏదో పుణ్య విశేషమున్నది. ఈ దేశాన్ని సరైన మార్గంలో నడిపే వాడు ఈ మట్టిలో నుండి పుట్టుకు రాకమానడు. నిరాశపడవలసింది లేదు' అని తన ప్రగాఢ విశ్వాసం ప్రకటించాడు.

# రచయిత ఇతర గ్రంథాలు

| | | |
|---|---|---|
| 1. | ఇతి స్మరణీయం అతి రమణీయం<br>(రమణ మహర్షి వృత్తాంతము) | 60/– |
| 2. | చరిత్రలో ఈ పేరు మిగిలేనా?<br>(ఆధ్యాత్మిక ఇతివృత్తాలు) | 60/– |
| 3. | స్వేచ్ఛకై తపించిన జగద్గురువు<br>(ఆధ్యాత్మిక ఇతివృత్తాలు) | 70/– |
| 4. | నైమిశం (ఆధ్యాత్మిక ఇతివృత్తాలు) | 70/– |
| 5. | Conversations with J. Krishnamurti | 150/– |
| 6. | Under the Bodhi Tree | 100/– |
| 7. | మూడు ముద్రణలు | 80/– |
| 8. | అమృతధార – ఖడ్గధార | 80/– |
| 9. | నీలంరాజు వేంకటశేషయ్య జీవితం<br>(మా తండ్రి శేషయ్యగారు) | 100/– |

# ఇతర పబ్లిషర్స్ ప్రచురించిన
# ఈ రచయిత గ్రంథాలు

| | |
|---|---|
| 1. జిడ్డు కృష్ణమూర్తి జీవితం<br>2. గురువూ నీవే, శిష్యుడూ నీవే<br>3. స్వరూప దర్శనం | పబ్లిషర్స్ :<br>జిడ్డు కృష్ణమూర్తి సెంటర్<br>6-3-347/5,<br>ద్వారకాపురి కాలనీ,<br>పంజాగుట్ట,<br>హైదరాబాద్-500082.<br>ఫోన్ : 23357889 |
| 4. సత్యాన్వేషణ (ఓషో అనువాదం) | పిరమిడ్ గ్రాఫిక్స్<br>16-11-477/బి/3<br>సి.యన్. రెడ్డి కాంప్లెక్స్,<br>దిల్‌సుఖ్‌నగర్,<br>హైదరాబాద్-60. |
| 5. పట్టుదలతో సాధించలేనిదేముంది? | ప్రగతి పబ్లిషర్స్<br>33-11-275/1,<br>శ్రీశంకర్ కాలనీ,<br>ఎల్.బి. నగర్,<br>హైదరాబాద్-500074. |
| 6. చైనాబజార్ నుండి అబీద్ సర్కిల్ వరకు<br>(తెలుగరవం కథలు) - (ఏడుమళ్లై)<br>నీలంరాజు లక్ష్మీప్రసాద్ | ద్రావిడ విశ్వవిద్యాలయం<br>శ్రీనివాసవనం<br>కుప్పం (517425) |

కృష్ణమూర్తి అర్థం కాదండీ అనే వారున్నారు.
ఈ పుస్తకాన్ని చదివి చూస్తే అలా అనరేమో

# జిడ్డు కృష్ణమూర్తి నాకు తెలుసా ?

ఉద్దేశపూర్వకమైన కర్మను మనమెరిగున్నాం. ఉద్దేశరహితమైన కర్మ మనమెరుగుదుమా? ఎటువంటి పరిస్థితుల్లో అలాంటి కర్మ మనలో నుండి సహజంగా, అప్రయత్నంగా ఉదయిస్తుంది? ఇలాంటి విషయాలన్నీ కృష్ణమూర్తి  పుస్తకాల్లో, ప్రసంగాల్లో తరుస్తుంటారు. నీలోకి నీవెలా వెళ్ళాలో విశదీకరిస్తుంటారు. తన మాటలతో నీ ముందర ఒక అద్దం నిలబెడతారు. ఆ అద్దంలో నీ మనసు ప్రవర్తిల్లే తీరు నీకు కనిపించనారంభిస్తుంది. విముక్తినిచ్చేది, కృష్ణమూర్తి కాదు. నిన్ను నువ్వే విముక్తుణ్ణి చేసుకుంటావు. అయితే కృష్ణమూర్తి నీకొక అప్పుడిగా, కళ్యాణ మిత్రుడిగా సహాయపడుతుంటాడు

చాలాకాలం అనేక తెలుగు దిన, వార పత్రికల్లో వీక్లీ కాలమ్ రైటర్‌గా రచనలు చేశారు. కొంతకాలం పాటు A.P.TIMES అనే



నీలంరాజు లక్ష్మీప్రసాద్

ఇంగ్లీష్ డైలీలో కాలమ్ రైటర్‌గా రచనలు చేశారు. దశాబ్దాలుగా రేడియో ప్రాసంగికులుగా అనేక మంది వేదాంతుల గురించి ప్రసంగించారు. సొంతంగా10 పుస్తకాలు తెలుగులోనూ, ఇంగ్లీష్ లోనూ ప్రచురించారు. ఇతర పబ్లిషర్స్  వీరి పుస్తకాలు అయిదు ప్రచురించారు. వీరు ప్రధానంగా శ్రీ జిడ్డు కృష్ణమూర్తి, రమణ మహర్షి, నిసర్గదత్త మహరాజ్, సూఫీ, పాశ్చాత్య వేదాంతుల గురించి రాశారు. ప్రస్తుతం, నాలుగేళ్లుగా ఆంధ్రభూమి డైలీలో ఆదివారాలు 'నీలంరాజు నోట్‌బుక్' కాలమ్ రాస్తున్నారు.

